# మన జీవితాలు



## జిడ్డు కృష్ణమూర్తి
వ్యాఖ్యానాలు

ప్రగతి పబ్లిషర్స్
హైదరాబాద్ (ఆం.ప్ర.)

MANA JEEVITHALU - JIDDU KRISHNAMURTI VYAKHYANALU
Telugu translation of Commentaries On Living - First Series
Translated into Telugu by: Abburi Chaya Devi
(Authorised by Krishnamurti Foundation India)
First Telugu Edition by KFI, Chennai: 1997



Published under licence by: PRAGATHI PUBLISHERS, Hyderabad.

No. of Copies : 1000
Pragathi First Edition : January, 2001.

**PRICE: Rs.125/-**

*Sole Distributors :* **Visalaandhra Publishing House**
Abids, Hyderabad - 500 001.

**Visalaandhra Book House,**
Abids/Sultan Bazar, Hyderabad,
Vijayawada, Visakhapatnam,
Kakinada, Guntur, Anantapur,
Hanmakonda, Tirupathi.

*Composed by:* Monica Graphics, M.I.G. 50, K.P.H.B. Colony, Hyd-72.
*Printed by:* Kalanjali Graphics, Hyderabad.

# ప్రస్తావన

ఈ సంవత్సరం రెండు కొత్త పుస్తకాలను విడుదల చేస్తున్నాం. అందులో మొదటిది "మన జీవితాలు – జిడ్డు కృష్ణమూర్తి వ్యాఖ్యానాలు" అన్న యీ ప్రస్తుత గ్రంథం. ఇది కామెంటరీస్ ఆన్ లివింగ్ (ఫస్ట్ సిరీస్) అనే ఆంగ్ల రచనకు శ్రీమతి అబ్బూరి ఛాయాదేవి గారు తేట తెలుగులోనికి చేసిన యథాతథ అనువాదం.

తక్కిన పుస్తకాల కంటె కామెంటరీస్ ఆన్ లివింగ్‌కు ఒక ప్రత్యేకత ఉన్నది. కృష్ణమూర్తి ప్రచురణలలో ఎక్కువ భాగం వివిధ సందర్భాల్లో, వివిధ ప్రదేశాల్లో చేసిన ప్రసంగాలు కాగా యీ ప్రస్తుత గ్రంథం ఆయన స్వయంగా చేసిన లిఖిత రచన. వివిధ దేశాలలో పర్యటిస్తున్నప్పుడు సామాన్యులూ, ప్రముఖులూ కూడా ఎంతోమంది తమ సమస్యలను, ఆవేదనలను వెల్లడించుకునేవారు. ఆంగ్లంలో వ్రాసి పెట్టుకున్న యీ ఉదంతాలను చదవడం వల్ల ఎందరికో ఉపయోగంగా ఉంటుందనే ఉద్దేశ్యంతో మూడు భాగాలుగా వీటిని ప్రచురించడం జరిగింది. ప్రస్తుతం మీ చేతిలో ఉన్నది మొదటి సంపుటానికి తెలుగు అనువాదం.

జిడ్డు కృష్ణమూర్తి 1895లో మే 11వ తేదిన మదనపల్లిలో జన్మించారు. 14వ ఏట దివ్యజ్ఞాన సమాజం వారు చేరదీయగా, అనీబిసెంట్ సంరక్షణలో పెరిగారు. భావికాలంలో జగద్గురువుగా భాసిల్లాలని కృష్ణమూర్తికి శిక్షణనిచ్చారు. అయితే 1929లో హాలెండులో జరిగిన సమావేశంలో జగద్గురువు అనే యీ అత్యున్నతమైన పదవినీ, తమ చుట్టూ ఏర్పడిన సంస్థలనూ, అశేషమైన ఐశ్వర్యాన్నీ అవలీలగా పరిత్యజించి వేసి, ఒంటరిగా నిలబడ్డారు. ఏ సంస్థల ఆధ్వర్యమూ లేకుండానే ప్రపంచమంతా పర్యటించి, మానవుడిని దుఃఖాల నుండి, సమస్త బంధనాల నుండి విముక్తం చేయడమే ప్రధానాంశంగా ప్రసంగించారు. సత్యం అనేది బాటలు లేని సీమ అనీ, దానిని చేరుకోవడానికి మతాలుగానీ, సంస్థలుగానీ, గురువుగానీ అవసరంలేదనీ నొక్కి చెప్పారు.

మత ధర్మమూ, తాత్వికతా, మనోతత్వ విచారణా కలిసి అపూర్వమైన తీరులో సమ్మేళవించుకున్న కృష్ణమూర్తి బోధనలు సమగ్రమైన సంపూర్ణ జీవిత దర్శనాన్ని నిర్దుష్టశైలిలో మనకు అందిస్తాయి.

1986లో ఫిబ్రవరి 17న అమెరికాలోని ఒహాయిలో తుదిశ్వాస వదిలేవరకు, 60 సం॥ల పాటు యూరప్, అమెరికా, లాటిన్ అమెరికా, శ్రీలంక, భారతదేశాలలో నిర్విరామంగా పర్యటించి ప్రసంగించారు. అసంఖ్యాకమైన ప్రజలను ప్రభావితం చేశారు.

ద్వేషాలూ, అసూయలూ, సంఘర్షణలూ, జాతి మత విభజనలూ లేని ఒక నూతన ప్రపంచాన్ని నిర్మించాలంటే విద్యావిధానంలోనే మార్పురావాలనే దృక్పథంతో ఇండియా, అమెరికా, ఇంగ్లాండ్, కెనడాలలో విద్యాసంస్థలను స్థాపించారు.

దర్పణంలా మనల్ని మనమే పరిశీలించుకునే అవకాశం కల్పించే ఈ జీవిత వ్యాఖ్యానాలు తెలుగు పాఠకులలో నవ్య నూతనమైన జీవనదృష్టిని వెలిగిస్తాయని ఆశిస్తున్నాము.

వసంత విహార్
చెన్నై - 600 028.

డా. గజానన రావు
సమన్వయ కర్త
దక్షిణ భాషల అనువాద విభాగం
కృష్ణమూర్తి ఫౌండేషన్, ఇండియా.

# విషయసూచిక

★ ★ ★

ఇంతవరకు తెలుగులో వెలువడిన

# జిడ్డు కృష్ణమూర్తి రచనలు

1. కృష్ణమూర్తి తత్వం - పరిచయ సంపుటి
2. శ్రీలంక సంభాషణలు
3. గతంనుండి విముక్తి
4. ఈ విషయమై ఆలోచించండి
5. ముందున్న జీవితం
6. ధ్యానం
7. విద్య అందు జీవితమునకు గల ప్రాధాన్యత
8. మన జీవితాలు - జిడ్డు కృష్ణమూర్తి వ్యాఖ్యానాలు

ప్రతులకు:

కృష్ణమూర్తి ఫౌండేషన్, ఇండియా
చెన్నై - 600 028.

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
హైదరాబాద్ - 500 001.

# 1. అహంకారులైన ముగ్గురు ధర్మపరాయణులు

ఈమధ్య ఒకరోజున అహంకారులైన ముగ్గురు ధర్మపరాయణులు నన్ను చూడటానికి వచ్చారు. మొదటాయన సన్యాసి. ప్రాపంచిక సుఖాల్ని త్యజించిన వాడు. రెండో ఆయన ప్రాచ్య సిద్ధాంతి. సౌభ్రాతృత్వంలో గొప్ప నమ్మకం ఉన్నవాడు. మూడో ఆయన అద్భుతమైన ఆదర్శ భావిసమాజం కోసం పాటుపడుతున్నవాడు. వారు ముగ్గురూ ఎవరికి వారు ఎంతో కష్టపడి తమతమ పనులను నిర్వహిస్తున్నారు. ఎదుటివారి అభిప్రాయాల్నీ, చర్యల్నీ చిన్నచూపు చూస్తూ తమకున్న విశ్వాసంతో ఎవరికి వారు శక్తిమంత మవుతున్నారు. ప్రతిఒక్కరూ తమతమ నమ్మకాల్ని గాఢంగా హత్తుకుంటూ, విచిత్రమైన నిర్దాక్షిణ్యంతో ఉన్నారు.

వాళ్ళునాతో, ముఖ్యంగా ఆదర్శ నమాజం కోనం పాటు పడుతున్నాయన, తాము నమ్మిన దానికోసం తమనీ, తమ స్నేహితుల్నీ కూడా త్యాగం చేయడానికి సిద్ధంగా ఉన్నామని చెప్పారు. పైకి మాత్రం బిడియంగా, సౌమ్యంగా కనిపిస్తున్నారు, ముఖ్యంగా సౌభ్రాతృత్వాన్ని కోరే ఆయన. కాని, వారి హృదయంలో కాఠిన్యం ఉంది. అది పై అధికారికి ఉండే విచిత్రమైన అసహన లక్షణం. వాళ్ళు కారణజన్ములు, ధర్మాలను వివరించగలవారు. వారికి అన్నీ తెలుసునని వారి నమ్మకం.

ఆ సన్యాసి గంభీరంగా మాట్లాడుతూ, తను వచ్చే జన్మకోసం సంసిద్ధుడనవుతున్నానని చెప్పాడు. ఈ జీవితంలో పొందగలిగినదేమీ లేదట. ఈ ఐహిక సుఖాలన్నీ మిథ్య అని తెలుసుకుని సంసార మార్గాన్ని వదిలి పెట్టేశాడట. అయితే, ఆయనలో కొన్ని బలహీనతలున్నాయిట. ధ్యానం కేంద్రీకృతం కావటం కష్టమవుతోందిట. వచ్చే జన్మలోనైనా తప్పకుండా తన ఆదర్శం ప్రకారం సిద్ధి పొందగలడుట.

ఆయన ఆనక్తీ, శక్తీ అన్నీకూడా వచ్చేజన్మ కోనమే అంకిత మైనట్లున్నాయి. మేము చాలాసేపు మాట్లాడుకున్నాం. ఆయన ధోరణి ఎంతసేపూ రేపటిగురించీ, భవిష్యత్తు గురించీ. గతం ఉంది గాని, అది భవిష్యత్తుకి సంబంధించినంతవరకే అన్నాడాయన. ప్రస్తుతం అనేది కేవలం

భవిష్యత్తుకి సోపానం వంటిది మాత్రమేనట. ఈనాటిలో ఉన్న ఆసక్తి రేపటి వల్లనేట.

రేపు అనేది లేకపోతే ఈ ప్రయాస అంతా దేనికి అని అడిగాడాయన. లేకపోతే పనిపాటల్లేకుండా ఎద్దుమొద్దు స్వరూపంలా ఉండిపోవచ్చునట.

జీవితమంతా గతం నుంచి ప్రస్తుతం ద్వారా భావిలోనికి కొనసాగించే ప్రయాణమేనట. భవిష్యత్తులో ఏదో అవటానికి ప్రస్తుతాన్ని వినియోగించుకోవాలన్నాడాయన. వివేకం కలిగి ఉండటం, శక్తి పొందటం, కారుణ్యం చూపించటం అందుకేనట. ప్రస్తుతం, భావీ కూడా అశాశ్వతాలే, కాని, ఫలితం లభించేది రేపే. ఇవాళ అనేది దాటవలసిన ఒక మెట్టు మాత్రమేననీ, దాన్ని గురించి అంతగా కంగారు పడకూడదనీ అన్నాడాయన. రేపటి ఆదర్శాన్ని స్పష్టంగా పెట్టుకొని దాన్ని విజయవంతంగా చేరుకోవటానికి ప్రయాణం సాగించాలని చెబుతూ, ప్రస్తుతం అంటే అసహనం కనబరిచాడాయన.

సౌభ్రాతృత్వాన్ని కోరే ఆయన మరింత పండితుడు. ఆయన మాట్లాడే భాష కవితా ధోరణిలో ఉంది. శబ్ద ప్రయోగంలో ప్రతిభాశాలి. మొత్తం మీద చమత్కారి. ఒప్పించగల సమర్థుడు. ఆయన కూడా తన భవిష్యత్తులో ఒక దివ్య హర్మ్యాన్ని నిర్మించుకున్నాడు. ఏదో అవుతానను కుంటున్నాడు. ఈ భావంతో ఆయన హృదయం నిండి ఉంది. ఆ భవిష్యత్తు కోసం కొందరు శిష్యుల్ని పోగుచేశాడు. మరణం ఎంతో సుందరమైన దన్నాడు. ఎందువల్లనంటే, అది తన దివ్యహర్మ్యం చేరువకి తీసుకుపోతుందట. ఆ ఆశతోనే ఈ దుఃఖమయమైన, అసహ్యకరమైన ప్రపంచంలో జీవించటం సాధ్యమవుతున్నదన్నాడు.

ఈ ప్రపంచాన్ని మార్చటానికీ, సౌందర్యమయం చేయటానికీ ఆయన సిద్ధమే. మానవ సౌభ్రాతృత్వం కోసం ఉత్సుకతతో పని చేస్తున్నాడు. ఆయన ఉద్దేశంలో, ఈ ప్రపంచంలో ఏ పని కావాలనుకున్నా వృద్ధిలోకి రావాలనే ఆకాంక్ష తప్పనిసరిగా ఉండాలిట; దానితో బాటు హింసాత్మక చర్యలూ, అక్రమప్రవర్తనా ఉన్నప్పటికీ ఆకాంక్ష ఉండి తీరాలిట. ఏవైనా కొన్ని కార్యక్రమాలు నిర్వహించాలనుకుంటే కొంచెం కఠినంగా ఉండవలసి వస్తుందిట. మానవాళికి ఉపయోగకరమైన పని చేయటం చాలాముఖ్యం.

అటువంటి పనికి ఎవరైనా వ్యతిరేకంగా ఉంటే, వాళ్ళని పక్కకి తొలగించి వెయ్యాలి, మర్యాదగానే అనుకోండి; ఆ పనిని నిర్వహించటం అత్యంత ముఖ్యం, దాన్ని ఆపటానికి వీల్లేదుట. "ఇతరులకు వేరే మార్గాలుండవచ్చు, కాని మేము చేసేపని అత్యవసర మైనది. దానికి అడ్డు తగిలే వాళ్ళెవరూ మాతో ఉండడానికి వీలులేదు," అన్నాడాయన.

ఆదర్శ సమాజవాది మొదటి ఆదర్శవాదికీ, రెండవ వ్యవహార పరుడికీ మధ్యరకం. ఆయనకి పాత బైబిల్ అంటే కిట్టదుట. కొత్తదంటేనే ఇష్టంట. ఆయనకి కొత్తదాంట్లోనే అచంచల విశ్వాసం. ముందు ఏమి రానున్నదో ఆయనకు తెలుసుట. కొత్త బైబిల్‌లో ముందు ఏమి జరుగనున్నదో అంతా రాసి ఉందట. ఆయన పథకం ఏమిటంటే, అంతా గందరగోళం చేసేసి, మళ్ళీ అన్నీ సరిగా సమకూర్చి కొత్తగా కొనసాగించటం. ప్రస్తుతం ఉన్నదంతా అవినీతే. దీన్ని సర్వనాశనం చేశాక, ఆ వినాశం నుంచి నూతన నిర్మాణం జరుగుతుందిట. భవిష్యత్తు కోసం ప్రస్తుతాన్ని త్యాగం చెయ్యవలసి ఉందిట. భావి మానవుడు అత్యంత ముఖ్యంగాని ఈనాటి మనిషి కాదుట. "ఆ భావి మానవుణ్ణి ఎలా సృష్టించాలో నాకు తెలుసును" అన్నాడాయన. "అతడి మనస్సునీ, హృదయాన్నీ ఎలా మలచాలో మాకు తెలుసును. కాని, ఏదైనా మంచి చేయాలంటే అధికారంలో ఉండాలి. ఆ నూతనస్థితిని తీసుకు రావటానికి మాతో బాటు ఇతరుల్ని కూడా త్యాగం చేస్తాం. ఎవరు అడ్డొచ్చినా చంపేస్తాం. మనం అనుసరించే మార్గం ముఖ్యం కాదు, లక్ష్యమే ప్రధానం".

చివరికి లభించే శాంతి కోసం ఎటువంటి హింసనయినా తలపెట్ట వచ్చునట. చివరికి లభించే వ్యక్తి స్వాతంత్ర్యం కోసం ప్రస్తుతం రాక్షసకృత్యాలు అనివార్యమట. "మా చేతుల్లోకి అధికారం వచ్చినపుడు ఈ వర్గవిభేదాలూ, మతబోధకులూ లేని నూతన ప్రపంచాన్ని రూపొందించటానికి అన్ని రకాల ఒత్తిడులూ తెస్తాం. మా ముఖ్య సిద్ధాంతాన్ని మేము వదలం. సిద్ధాంతం మీద మేము స్థిరంగా నిలిచి, పరిస్థితులకనుగుణంగా మా వ్యూహాలూ, ఎత్తు గడలూ మారుస్తూ ఉంటాం. భావి మానవుడి కోసమై నేటి మనిషిని నాశనం చేయటానికి మేము పథకం తయారుచేసి, కార్యరంగంలోకి దూకుతా"మని ఉద్ఘాటించాడాయన.

ఆ సన్యాసి, సౌభ్రాతృత్వాన్ని కోరే ఆయన, ఆదర్శవాది - అందరూ రేపటి కోసం, భవిష్యత్తుకోసం జీవిస్తున్నవారే. ప్రాపంచికరీత్యా వారు వృద్ధిలోకి రావాలని తాపత్రయ పడటంలేదు. గౌరవాలు జరగాలని గాని, ధనాన్ని గాని కీర్తిని గాని వాంఛించటంలేదు. కాని, వారి లోపల ఉన్నది మరోరకమైన ఆకాంక్ష. ఆదర్శ సమాజవాది ఒకవర్గంతో ఏకమైపోయి, ఆ వర్గానికే ప్రపంచాన్ని మార్చేశక్తి ఉంటుందని అనుకుంటున్నాడు. సౌభ్రాతృత్వాన్ని కోరే ఆయన ఔన్నత్యాన్ని పొందాలని ఆకాంక్షిస్తున్నాడు. సన్యాసి తన లక్ష్యాన్ని సాధించాలనుకుంటున్నాడు. వారంతా తామేదో అవాలనీ, ఏదో సాధించాలనీ, ఎలాగో విస్తరించాలనీ తాపత్రయ పడుతున్నారు. ఈ కోరిక శాంతినీ, సౌభ్రాతృత్వాన్నీ, మహోన్నత ఆనందాన్నీ లేకుండా చేస్తుందని గ్రహించలేక పోతున్నారు.

ఆకాంక్ష ఏరకమైనదైనా, సంఘం కోసంగాని, వ్యక్తిగతమోక్షం కోసంగాని, ఆత్మసిద్ధి కోసంగాని, తక్షణం చర్య తీసుకోకుండా తప్పించు కునేటట్లు చేస్తుంది. కోరిక అనేది ఎప్పుడూ భవిష్యత్తుకి సంబంధించినదే. ఏదో అవాలనీ, ఏదో చెయ్యాలనీ కోరటం అంటే, ప్రస్తుతం దాని గురించి ఏవిధమైనా చర్యా తీసుకోవడంలేదనే. కానీ రేపటి కన్న ఇప్పటికే విలువ ఎక్కువ. ఇప్పుడు అనే దాంట్లోనే కాలమంతా ఉంది. ఇప్పుడు అనే దాన్ని అర్థం చేసుకోవడమే కాలం నుంచి విముక్తి పొందడం. పరిణామమంటే దుఃఖం; అంటే కాలం మరొక రూపంలో కొనసాగడం. పరిణామంలో అస్తిత్వానికి తావు లేదు. అస్తిత్వం అనేది ప్రస్తుతంలోనే ఉంది. అస్తిత్వంలో ఉండటమే అత్యున్నతమైన పరివర్తన. పరిణామం అంటే కొద్ది మార్పులు మాత్రమే ఉన్న కొనసాగింపు. వర్తమానంలోనే - ఉన్న స్థితిలోనే సమూల పరివర్తనం ఉంటుంది.

## 2. తాదాత్మ్య భావన

మీరు ఇంకొక వ్యక్తితోగాని, ఒక వర్గంతోగాని, ఒక దేశంతో గాని ఎందుకు తాదాత్మ్యం చెందుతారు? మిమ్మల్ని క్రిస్టియన్ అనీ, హిందువు అనీ

బౌద్ధుడనీ ఎందుకు చెప్పుకుంటారు? ఏదో ఒక మతశాఖకి ఎందుకు చెందుతారు? మతంలోనైనా, రాజకీయాల్లోనైనా, ఎవరో వ్యక్తితోనో, ఏదో వర్గంతోనో, సంప్రదాయసిద్ధంగా గాని, అలవాటు ప్రకారం గాని, తాత్కాలికోద్రేకం చేతగాని, దురభిమానం చేతగాని, అనుకరణ ద్వారాగాని, బద్ధకం చేతగాని ఎందుకు మమైక్యం అవుతారు. ఇటువంటి తాదాత్మ్యభావన, సృజనాత్మకమైన అవగాహనని అంతం చేస్తుంది. దాంతో, ఒక 'పార్టీ' అధికారి చేతుల్లోనో, మరోనాయకుడి చేతుల్లోనో, కీలుబొమ్మలవుతారు.

ఆ మధ్య ఎవరో ఒకాయన తాను కృష్ణమూర్తిని అనుసరించే వాడిననీ, మరొకాయన ఇంకేదో వర్గానికి చెందిన వాడిననీ అన్నారు. అలా అంటున్నప్పుడు ఆయనకి ఇటువంటి తాదాత్మ్య భావనలో ఉండే చిక్కులను గురించిన స్పృహ ఏమాత్రం లేదు. అలాగని ఆయన తెలివి తక్కువ వాడేమీ కాదు. బాగా చదువుకున్నవాడు. సంస్కారం అవీ ఉన్నవాడు. ఆయన ఏదో అభిమానంతోనూ, భావోద్వేగంతోనూ అన్న విషయం కాదది. స్పష్టంగా, నిశ్చితంగా అన్నాడాయన.

ఆయన కృష్ణమూర్తిని అనుసరించే వాడిగా ఎలా అయ్యాడు? అంతకు ముందు ఎందరినో అనుసరించాడు. ఎన్నో సంఘాల్లోనూ, సంస్థల్లోనూ చేరి ప్రయాసపడ్డాడు. ఆఖరికి ఈ వ్యక్తితో ఐక్యత చెందేవరకూ వచ్చాడు. ఆయన అన్నదాన్ని బట్టి ఆయన ప్రయాణం పూర్తయింది. ఆయన ఒక స్థిరాభిప్రాయానికి వచ్చాడు. దాంతో ఇంక ఆఖరు. ఆయన ఎంచుకున్న దాన్నుంచి ఎవ్వరూ ఆయన్ని కదపలేరు. ఇప్పుడిక స్తిమితపడి, ఇంతవరకు తనకు చెప్పినదాన్నీ, చెప్పబోయేదాన్నీ ఉత్సాహంగా అనుసరిస్తాడు.

మనం ఎవరితోనైనా మనల్ని ఐక్యం చేసుకున్నప్పుడు అది వారంటే మనకుండే ప్రేమను సూచిస్తుందా? లేదా, ఆ తాదాత్మ్యం చెందడం వట్టి ప్రయోగమేనా? అసలు ఐక్యభావన వల్ల ప్రేమ, ప్రయోగం అంతం కావా? ఐక్యం చేసుకోవడం అంటే సొంతం చేసుకోవటం, తనకు చెందినదని ఉద్ఘాటించటం. ఏదైనా సొంతమైనప్పుడు ప్రేమ పోతుంది. పోదా? సొంతం చేసుకోవటం అంటే సురక్షితంగా ఉండటం, సొంతం చేసుకోవటం అంటే

రక్షణ చేసుకోవటం, అంటే తన్నుతాను అభేద్యమైన వానిగా చేసుకోవడం. ఐక్యం చేసుకోవటంలో ప్రతిఘటన ఉంటుంది - పైకి కనిపించినా, కనిపించకపోయినా. ప్రేమ అనేది ఆత్మరక్షణ కోసం చేసే ఒకరకమైన ప్రతిఘటనా? రక్షణ చేసుకుంటున్నప్పుడు ప్రేమ ఉంటుందా?

ప్రేమ ఇట్టే ప్రమాదానికి లోనవుతుంది; ఎంతో సున్నితంగా దేన్నైనా స్వీకరించటానికి సిద్ధంగా ఉంటుంది; అది అత్యంత సున్నితమైనది. ఐక్య భావన వల్ల సున్నితత్వం లేకుండా పోతుంది. ఐక్యభావనా, ప్రేమా ఒకచోట ఇమడవు. ఒకటి రెండవదాన్ని నాశనం చేస్తుంది. ఐక్యం కావటం అనేది ముఖ్యంగా ఒక మానసిక ప్రక్రియ. దానితో మనస్సు తన్ను తాను సంరక్షించుకుంటూ, తన్ను తాను విస్తరింపచేసుకుంటుంది.. ఏదో అవటానికి ప్రయత్నిస్తున్నప్పుడు మనస్సు ప్రతిఘటించవలసి ఉంటుంది. రక్షించు కోవలసి ఉంటుంది. సొంతం చేసుకోవలసి ఉంటుంది. వదిలిపెట్టవలసి ఉంటుంది. ఏదో అవటానికి ప్రయత్నించటంలో మనస్సు లేదా అహం మరింత మొండిగానూ, శక్తిమంతంగానూ తయారవుతుంది. కాని, ఇది ప్రేమకాదు. ఐక్యం చేసుకోవటం వల్ల స్వేచ్ఛ నాశనమవుతుంది. స్వేచ్ఛ ఉన్నప్పుడే అత్యున్నతమైన సున్నితత్వం ఉంటుంది.

ఏదైనా పరీక్షించి చూడడానికి ఐక్య భావన అవసరమా? తాదాత్మ్యం చెందడంతోనే విచారణ చేయడం, తెలుసుకోవడం అనేవి అంతమైపోవా? తన్ను తాను తెలుసుకోవడం కోసం అన్వేషణ లేకపోతే సత్యం వల్ల పొందే ఆనందానికి ఆస్కారమే ఉండదు. ఐక్యం కావటం వల్ల సత్యాన్ని తెలుసుకోవటం జరగదు. ఐక్యం కావటం ఇంకో రకమైన సోమరితనం. ఐక్యం కావటం స్వయంగా పొందే అనుభవం కాకుండా తెచ్చి పెట్టుకున్న అనుభవం. అందువల్ల అది శుద్ధ అసత్యం.

అనుభవం పొందాలంటే ఐక్యం కావటం అనేది ఆగిపోవాలి. క్రొత్త ప్రయోగం చెయ్యటానికి భయం ఉండకూడదు. భయం అనుభవానికి ఆటంకం. ఈ భయమే ఐక్యం పొందేటట్లు - ఎవరో వ్యక్తితోనో, ఏదో వర్గంతోనో, సిద్ధాంతం మొదలైన వాటితోనో ఐక్యం పొందేటట్లు చేస్తుంది.

భయం దేన్నైనా ప్రతిఘటించి తీరుతుంది, అణచివేస్తుంది. స్వీయ రక్షణలో ఉన్నప్పుడు తెలియని సముద్రంలోకి పోవడానికి ఎలా సంసిద్ధపడతారు? తన స్వభావపు తీరుతెన్నులు తెలుసుకోకుండా సత్యంగాని ఆనందంగాని లభించదు. ఒకేచోట లంగరు వేసుకొని ఉంటే దూరప్రయాణం చేయలేరు. ఐక్యం చేసుకోవటంలో ఆశ్రయం లభిస్తుంది. ఆశ్రయానికి కూడా భద్రత కావాలి. దేన్నైతే రక్షిస్తామో అది ఎప్పుడో ఒకప్పుడు విధ్వంసం కాకమానదు. ఐక్యత తన వినాశాన్ని తానే కొనితెచ్చుకుంటుంది. అందువల్లనే వివిధ ఐక్యతల మధ్య నిరంతర సంఘర్షణ ఉంది.

ఐక్యం కావటానికి గాని, దానికి వ్యతిరేకంగా గాని పోరాటం జరుగుతున్న కొద్దీ అవగాహనకి ప్రతిఘటన ఎక్కువవుతుంది. ఈ ఐక్యం కావటం అనేది ఎలా, ఎందుకు జరుగుతుందో, వ్యక్తంగాగాని - అవ్యక్తంగా గాని - లోపల ఉన్న కోరిక పైకి వ్యక్తమవుతుందని - అంతా తెలుసుకున్నట్లయితే ఏదైనా సాక్షాత్కారం కావటానికీ, ఆనందం కలగటానికీ, అవకాశం ఉంటుంది. తన్ను తాను దేనితోనైనా ఐక్యం చేసుకున్నవారు స్వేచ్ఛ అంటే ఏమిటో తెలుసుకోలేరు. స్వేచ్ఛలోనే సత్యం సాక్షాత్కరిస్తుంది.

# 3. వ్యర్థ ప్రసంగం, వ్యాకులత

వ్యర్థ ప్రసంగం, వ్యాకులత - రెండూ చిత్రంగా ఒకలాంటివే. రెండూ మనస్తిమితం లేకపోవడం వల్ల వచ్చేవే. మనస్తిమితం లేని మనస్సుకి ఏదో ఒక వ్యాపకం, ఎప్పటికప్పుడు వైవిధ్యం ఉండాలి. ఎప్పుడూ ఏదో హడావిడిలో ఉండాలి. ఎన్నో అనుభూతులూ, చిన్న చిన్న సరదాలూ కావాలి. వ్యర్థ ప్రసంగం చెయటంలో ఇవన్నీ ఉంటాయి.

గంభీరతకీ, చిత్తశుద్ధికీ విరుద్ధమైనది ఊరికే కబుర్లు చెప్పటం. ఇంకొకరి గురించి మంచిగా గాని, చెడ్డగాగాని మాట్లాడటం అంటే తన్ను తాను తప్పించుకోవటమే. ఈ తప్పించుకోవటమే వ్యాకులతకి కారణం. తప్పించుకోవటంలోనే ఉంటుంది సహజంగా - అస్తిమితత్వం. ఇతరుల

వ్యవహారాల గురించి.తాపత్రయ పడటమే కొందరి పని. లెక్కలేనన్ని పత్రికలు, పేపర్లూ వాటిలోని కబుర్ల గురించీ, హత్యల గురించీ, విడాకులు లాంటి గొడవల గురించీ చదవటంలో ఆ తాపత్రయం కనిపిస్తుంది.

ఇతరులు మన గురించి ఏమనుకుంటున్నారో అని బాధ పడతాం కాబట్టి వాళ్లందరి గురించీ మనం అన్నీ తెలుసుకోవాలనుకుంటాం. దీన్నుంచే అనేక రకాలుగా, మోటుగా, నాజూగ్గా గొప్పలు పోవటం, అధికారాన్ని ఆరాధించటం జరుగుతుంది. ఈవిధంగా మనకి అంతకంతకి పై పటారం పెరిగి, లోపల శూన్యం మిగులుతుంది. పైడాబు ఎంతగా ఉంటే, అన్ని అనుభూతులూ, అన్ని ఆకర్షణలూ ఉండాలి మనకి. దీనితో మనస్సు ఎప్పుడూ స్తిమితంగా ఉండదు - దేన్నైనా శోధించటానికి గాని, కనుక్కోవటానికి గాని.

వ్యర్థ ప్రసంగం ద్వారా వ్యక్తమయేది స్తిమితంలేని మనస్సు. మౌనంగా ఉన్నంత మాత్రాన ప్రశాంతమైన మనస్సు అని సూచన కాదు. ప్రశాంతత ఏదైనా మానుకున్నందువల్లగానీ, వద్దనుకున్నందువల్లగానీ రాదు. ఉన్నదాన్ని అర్థం చేసుకోవటంతో వస్తుంది. ఉన్నస్థితిని అర్థం చేసుకోవాలంటే చురుకుగా తెలుసుకోగలిగి ఉండాలి, ఎందుచేతనంటే ఉన్నది ఎప్పుడూ స్థిరంగా ఉండదు కనుక.

మనం వ్యాకుల పడకుండా ఉంటే మనం జీవించటం లేదనే అనుకుంటారు మనలో చాలామంది. ఏదో ఒక సమస్యతో సతమతమవుతూ ఉండటమే బ్రతుకు లక్షణం అని చాలా మంది అనుకుంటారు. సమస్యలేని జీవితాన్ని మనం ఊహించలేం. ఏదైనా సమస్యతో ఎంత హడావిడిగా ఉంటే అంత చురుకుగా ఉన్నామనుకుంటూ ఉంటాం. నిత్యం ఏదో ఒక సమస్యతో సతమత మవుతూ ఉండటంవల్ల - ఆలోచనలే సమస్యల్ని పుట్టిస్తాయి కాబట్టి - మనస్సు మొద్దుబారిపోయి, సున్నితత్వాన్ని కోల్పోయి, అలిసి పోతుంది.

ఏదో ఒక సమస్యతో నిత్యం సతమతమవటం ఎందుకు? ఆందోళన పడినంత మాత్రాన సమస్య తీరిపోతుందా? లేక, సమస్యకి పరిష్కారం

మనస్సు ప్రశాంతంగా ఉన్నప్పుడు స్ఫురిస్తుందా? కాని, చాలా మందికి ప్రశాంతమైన మనస్సు భయంకరంగా తోస్తుంది. ప్రశాంతంగా ఉండాలంటేనే భయంవాళ్ళకి. ఏమో, తమలో ఏం కనుక్కుంటారో ఎవరికి తెలుసు. అందుకని ఆందోళన ఆటంకంగా ఉంటుంది. ఏదైనా కనుక్కోవటానికి భయపడే మనస్సు ఎప్పుడూ తన్ను తాను సంరక్షించుకుంటూనే ఉంటుంది. అస్తిమితంగా ఉండటమే దానికి రక్షణ.

నిత్యం పడే శ్రమతో, అలవాట్లతో, పరిస్థితుల ప్రభావంతో మనస్సు యొక్క చైతన్యపు పొరలు ఆందోళనకీ, అస్తిమితతకీ గురి అయివుంటాయి. మనస్సుకి ఒక విధమైన రక్షణ నిచ్చే బాహ్య చర్యల్నీ, చాంచల్యాన్నీ ఆధునిక జీవితం ప్రోత్సహిస్తుంది. రక్షణ ఉంటే ప్రతిఘటన ఉంటుంది. అది అవగాహనశక్తిని నిరోధిస్తుంది.

వ్యర్థ ప్రసంగం చేయటంలో లాగే, వ్యాకులపడటంలో కూడా కొంత తీవ్రమైన, గంభీరమైన పోకడ లేకపోలేదు. కాని, పరీక్షగా చూస్తే తెలుస్తుంది- అది ఆకర్షణ వల్ల ఏర్పడినదేగాని, చిత్తశుద్ధి వల్లకాదని. ఆకర్షణ ఎప్పుడూ మారుతూ ఉంటుంది. అందువల్లనే వ్యాకుల పడే సందర్భాలూ, వ్యర్థ ప్రసంగాల్లోని విషయాలూ మారుతూ ఉంటాయి. కాని, మార్పు అంటే, కొనసాగుతున్న దానికి కొద్దిగా మెరుగులు పెట్టటం మాత్రమే. మనస్సులోని వ్యాకులతని అర్థం చేసుకొన్నప్పుడే, ఊరికే కబుర్లు చెప్పటం, వ్యాకులపడటం అంతమౌతాయి. మానేసినందువల్లా, తగ్గించినందువల్లా ప్రశాంతత రాదు. మనస్సు మరింత మొద్దుబారి, సున్నితత్వాన్ని కోల్పోయి, పరిమితమైపోతుంది.

కుతూహలం కనపరచటం అర్థం చేసుకోవటానికి మార్గం కాదు. స్వీయజ్ఞానంతోనే అవగాహన కలుగుతుంది. బాధపడే వాళ్ళు ఎప్పుడూ కుతూహలం కనపరచరు. ఉత్తి ఊహలతో కూడిన కుతూహలం ఆత్మ జ్ఞానానికి అవరోధం. కుతూహలం కూడా ఊహించటం లాగే వ్యాకులతని సూచిస్తుంది. స్తిమితంగా లేని మనస్సు ఎంత గొప్పదైనప్పటికీ, అవగాహననీ, ఆనందాన్నీ నాశనం చేస్తుంది.

# 4. ఆలోచన, ప్రేమ

ఆలోచన ఆవేశపూరితమైనదీ, ఉద్రిక్తకరమైనదీ కాబట్టి అది ప్రేమ కాదు. ఆలోచన ఉన్నప్పుడు ప్రేమకి తావు లేదు. ఆలోచన జ్ఞాపకాల మీద ఆధారపడి ఉంటుంది. ప్రేమ జ్ఞాపకం కాదు. మీరు ప్రేమించే ఒక వ్యక్తి గురించి మీరు ఆలోచించినప్పుడు ఆ ఆలోచన ప్రేమకాదు. మీ స్నేహితుని అలవాట్లనూ, ప్రవర్తించే లక్షణాలనూ, అవలక్షణాలనూ గుర్తుకి తెచ్చుకోవచ్చు. ఆ వ్యక్తితో మీకున్న సంబంధాన్ని బట్టి జరిగిన మంచి సంఘటనల్నీ చెడు సంఘటనల్నీ గుర్తుకి తెచ్చుకోవచ్చు. కాని, ఆ ఆలోచనలు ప్రేరేపించే మనశ్చిత్రాలు మాత్రం ప్రేమకాదు. విభజన చేయటం ఆలోచన సహజ లక్షణం. సమయాభావం, స్థలాభావం, దూరం, దుఃఖం, అన్నీ ఆలోచన వల్ల పుట్టినవే. ఆలోచనా ప్రక్రియ ఆగిపోయినపుడే ప్రేమ ఉండటానికి సాధ్యమవుతుంది.

ఆలోచన ఎప్పుడైతే ఉందో అప్పుడు తన సొంతం అనే భావం కలగక మానదు. సొంతం చేసుకోవాలనే భావం వ్యక్తంగా కాని, అవ్యక్తంగా కాని, ఈర్ష్యని పెంచుతుంది. ఈర్ష్య ఉన్నప్పుడు ప్రేమ ఉండదనేది స్పష్టమే. అయినా చాలామంది ఈర్ష్య ప్రేమకి చిహ్న మనుకుంటారు. ఈర్ష్య ఆలోచన వల్ల వచ్చేదే. అది ఆలోచనలోని ఆవేశానికి ప్రతిక్రియ. తన సొంతం చేసుకోవాలనే భావానికి గాని, తను ఇంకొకరి సొంతం కావాలనే భావానికి గాని అవరోధం కలగగానే ఎంతో శూన్యత ఏర్పడి, ఆస్థితిలో ప్రేమ స్థానంలో ఈర్ష్య చోటుచేసుకుంటుంది. ఆలోచన ప్రేమ స్వరూపాన్ని దాల్చుతుంది కనుకనే అన్ని చిక్కులూ, దుఃఖాలూ కలుగుతున్నాయి. ఒకరి గురించి ఆలోచించకుండా ఉంటే ఆ వ్యక్తిని ప్రేమించలేదనుకుంటారు. కాని ఒక వ్యక్తిని గురించి ఆలోచించినంత మాత్రాన అది ప్రేమ అవుతుందా? మీరు ప్రేమించే స్నేహితుడెవరి గురించైనా మీరు ఆలోచించకుండా ఉంటే, మీరు దాన్ని ఘోరమైన విషయమనుకుంటారు. అనుకోరా? చచ్చిపోయిన ఒక స్నేహితుణ్ణి తలుచుకోక పోయినట్లయితే మీకు విశ్వాసం లేనట్లూ, ప్రేమ లేనట్లూ, ఇంకా ఎన్నో అనుకుంటారు. అటువంటి స్థితిని లెక్కచేయక

పోవటమనీ, నిర్లక్ష్యమనీ అనుకొని, ఆ వ్యక్తిని గురించి ఆలోచించటం మొదలుపెడతారు. ఫొటోగ్రాఫులూ లిఖితచిత్రాలూ పెట్టుకుంటారు. మానసికంగా చిత్రించుకుంటారు. ఆ విధంగా మానసికమైనవాటితో హృదయాన్ని నింపేసుకుంటే ఇక, ప్రేమకి చోటు లేకుండా చెయ్యటమే అవుతుంది. మీరొక స్నేహితుడితో ఉండగా అతడి గురించి ఆలోచించరు. మనిషి దగ్గర లేనప్పుడే గడిచిపోయిన దృశ్యాలనూ, జరిగిపోయిన అనుభవాలనూ, గతించిన వాటినీ నెమరు వేసుకుంటారు. ఈవిధంగా గతాన్ని స్మరించటమే ప్రేమ, సజీవంగా ఉన్నది కాదు అనుకుంటాం. గతంతోనే బ్రతుకుతాం - గతించి పోయిన వాటితోనే. అందుచేత మనంకూడా గతించి పోయినట్లే, దాన్నే ప్రేమ అన్నప్పటికీ.

ఆలోచనా ప్రక్రియ ప్రేమను త్రోసిపుచ్చుతుంది. ఆలోచనలోనే ఆవేశం తెచ్చే చిక్కులుంటాయి, ప్రేమలో కాదు. ఆలోచన ప్రేమకి పెద్ద అవరోధం. ఉన్నదానికీ, ఉండాలనుకునేదానికి మధ్య భేదం ఆలోచన సృష్టించినదే.

ఈ విభేదం మీదనే నీతి ఆధారపడి ఉంది. నీతిగా ఉన్న వాళ్ళకీ అవినీతిగా ఉన్నవాళ్ళకీ కూడా ప్రేమంటే ఏమిటో తెలియదు. సాంఘిక సంబంధాలను కట్టుదిట్టం చెయ్యటానికే నీతి అనేదాన్ని సృష్టించింది మనస్సు. అది ప్రేమ కాదు. కేవలం సిమెంటులా గట్టి పరిచేది మాత్రమే. ఆలోచన ప్రేమకు దారి తీయదు. ఆలోచన ప్రేమను పెంపొందించదు. ప్రేమ అనేదాన్ని తోటలో మొక్కలా పెంచటానికి వీలుకాదు. ప్రేమను పెంపొందించుకోవాలనే కోరిక కూడా ఆలోచనా ప్రక్రియే.

మీకు తెలుసునో లేదో, మీ జీవితంలో ఆలోచనకి ఎంత ప్రముఖమైన పాత్ర ఉన్నదో మీరే చూస్తారు. ఆలోచనకి దానికుండవలసిన స్థానం దానికుంది. కాని, దానికీ ప్రేమకీ ఏ సంబంధమూ లేదు. ఆలోచనకి సంబంధించిన దానిని ఆలోచనతో అర్థం చేసుకోవచ్చు. కాని ఆలోచనతో సంబంధం లేనిదాన్ని మనస్సుతో పట్టుకోవటం సాధ్యం కాదు. అయితే, ప్రేమంటే ఏమిటి అని అడుగుతారు మీరు. ప్రేమ ఉండే స్థితిలో ఆలోచన ఉండదు. కాని ప్రేమకు నిర్వచనం కూడా ఆలోచించే చెప్పాలి. అందుచేత ఆ నిర్వచనం కూడా ప్రేమ కాదు.

ఆలోచనని అర్థం చేసుకోవాలి. అంతేకాని, ఆలోచనలో ప్రేమని బంధించటానికి ప్రయత్నించటం కాదు. ఆలోచనని కాదన్నంత మాత్రాన ప్రేమ సాధ్యం కాదు. ఆలోచన యొక్క ప్రాముఖ్యాన్ని పూర్తిగా అర్థం చేసుకున్నప్పుడే ఆలోచననుంచి స్వేచ్ఛ లభిస్తుంది. అందుకు అపారమైన ఆత్మజ్ఞానం అవసరం, అంతేగాని, పైపై డాబులూ, దర్పాలూ కాదు. ధ్యానం చేయటం అంటే పునశ్చరణ కాదు, తెలుసుకోవటం అంటే నిర్వచనం కాదు - ఇవే ఆలోచనా రీతుల్ని విశదం చేస్తాయి. ఆలోచనా రీతుల్ని తెలుసుకోకుండా, పరిశోధించ కుండా ప్రేమ సాధ్యం కాదు.

## 5. ఏకాంతం, ఒంటరితనం

సూర్యుడు అస్తమించాడు. చీకట్లు పులుముకుంటున్న ఆకాశం క్రింద చెట్ల ఆకారాలు నల్లగా కనిపిస్తున్నాయి. విశాలంగా ఉధృతంగా ఉండే నది ప్రశాంతంగా, నిశ్చలంగా ఉంది. చంద్రబింబం దూరంగా ఆకాశంలో లీలగా కనిపిస్తోంది. రెండు మహా వృక్షాల మధ్యనుంచి పైకి వస్తోంది. ఇంకా చెట్ల నీడలు పడటం లేదు.

ఎత్తుగా ఉన్న నదిఒడ్డు మీదుగా నడిచి పచ్చని వరిచేల చుట్టూ ఉన్న మార్గం గుండా వెళుతున్నాం. ఈ మార్గం చాలా పురాతనమైనది. దాని మీద ఎన్నో వేలమంది నడిచారు. తరతరాలుగా నిశ్శబ్దంగా అలాగే ఉందది. చేలమధ్య నుంచీ, మామిడి తోపుల్లోంచీ, చింత తోపుల్లోంచీ, పాడుపడిన దేవాలయాల పక్కనుంచీ పోతుందది. మధ్య మధ్య తోటలు; పచ్చ సంపెంగ పువ్వులు సన్నని పరిమళాన్ని వెదజల్లుతున్నాయి. పక్షులు రాత్రి తలదాచు కునేందుకు గూళ్ళకి చేరుకుంటున్నాయి. పెద్ద చెరువులో నక్షత్రాల నిడలు కనిపించటం మొదలుపెట్టాయి. ప్రకృతి భాషించే స్థితిలో లేదు ఆ సాయంకాలం. చెట్లు నిశ్శబ్దంగా చీకట్లోకి తప్పుకుని ఒంటరిగా ఉన్నాయి. ఎవరో కొద్ది మంది గ్రామస్తులు కబుర్లు చెప్పుకుంటూ సైకిళ్లు తొక్కుకుంటూ వెళ్ళిపోయారు. మళ్లీ ఏకాంతంగా ఉన్నప్పుడు ఉండే గంభీర నిశ్శబ్దం, ప్రశాంతతా ఏర్పడ్డాయి.

ఈ ఏకాంతం బాధ కలిగించటం లేదు. ఒంటరితనం భయంకరంగా లేదు. ఇది ఏకాంతంగా ఉండటం. కల్మషం లేకుండా, సమృద్ధిగా, సంపూర్ణంగా ఉంది. ఆ చింతచెట్టు అక్కడ అలాగే ఉండటమే గాని దానికి వేరే జీవనం ఏమీలేదు. ఇదే కదా ఏకాంతం. నిప్పులాగ, పువ్వులాగ ఏకాంతంగా ఉండటం. అందులో ఉన్న పవిత్రతనీ, గంభీరతనీ తెలుసు కోలేరు. ఏకాంతం ఉన్నప్పుడే ఏదైనా తెలుసుకోగలుగుతారు. ఏకాంతంగా ఉండటం అంటే అన్నిటినీ త్రోసిపుచ్చి తన చుట్టూ గూడు కట్టుకుని కూర్చోవటం కాదు. అన్ని ఉద్దేశాలనీ, కోరికలు తీర్చుకునేందుకు చేసే అన్ని ప్రయత్నాలనీ, అన్ని లక్ష్యాలనీ ప్రక్షాళనం చేసుకోవటమే ఏకాంతం అంటే. మనస్సు యొక్క అంతిమ లక్ష్యం కాదు ఏకాంతం. ఏకాంతం కోరుకుంటే వచ్చేది కాదు. ఆ విధమైన కోరిక కేవలం తెలుసుకోవటం చేత కాక, ఆ చేతకాని తనం కల్పించే బాధని తప్పించుకునే మార్గం మాత్రమే.

భయమూ బాధతో కూడిన ఒంటరితనం అంటే ఒక్కరూ ఒంటరిగా మిగిలిపోవడం. స్వార్థంతో చేసే పనులవల్ల కలిగే అనివార్య ఫలితం అది. ఒంటరితనం పరిమాణంలో పెద్దదైనా, చిన్నదయినా గందరగోళం, సంఘర్షణ, దుఃఖం ఎదురవుతాయి. ఒంటరితనంలోంచి ఏకాంతం ఉద్భవించదు. ఒంటరితనం పోతేగాని ఏకాంతం లభించదు. ఏకాంతం అవిభాజ్యమైనది. ఒంటరితనం అంటే ఎడబాటు. ఏకాంతంగా ఉన్నదాంట్లో మార్దవం, ఎంతో సహనం ఉంటాయి. ఏకాంతంగా ఉండేవారే కారణరహితమైన దానితో, అపరిమితమైన దానితో భాషించగలుగుతారు. ఏకాంతంగా ఉన్నదానికి జీవితం అనంతమైనదిగా ఉంటుంది. ఏకాంతంగా ఉన్నదానికి మృత్యువు ఉండదు. ఏకాంతంగా ఉన్నది గతించలేదు.

చంద్రుడు ఇప్పుడిప్పుడే చెట్ల పైకి వస్తున్నాడు. నీడలు దట్టంగా, నల్లగా పడుతున్నాయి. మేము ఆ చిన్న గ్రామందాటి తిరిగి నది పక్కనుంచి నడిచి వెళుతుంటే ఒక కుక్క మొరగటం మొదలుపెట్టింది. నది ఎంత నిశ్చలంగా ఉందంటే, నక్షత్రాలూ, వంతెన మీద ఉన్న దీపాలూ అందులో స్పష్టంగా తెలుతున్నాయి. ఒడ్డు మీద దూరాన పిల్లలు కొందరు నిలబడి నవ్వుతున్నారు. ఒక చంటిపిల్ల ఏడుస్తోంది. చేపలు పట్టేవాళ్ళు వలలన్నీ శుభ్రం చేసుకొని చుట్ట

చుడుతున్నారు. రాత్రిళ్ళు విహరించే ఒక పక్షి నిశ్శబ్దంగా అటు ఎగిరి వెళ్ళింది. ఆ విశాలమైన నదికి అవతల ఒడ్డున ఎవరో పాడటం మొదలుపెట్టారు. అతడి పాటలోని పలుకులు స్పష్టంగా దూసుకు వస్తున్నాయి. మళ్ళీ, జీవితంలోని సర్వవ్యాప్తమైన ఏకాంతం.

## 6. శిష్యుడు, గురువు

"నేను ఫలానా గురువుకి శిష్యుణ్ణని నాతో చెప్పారు" అంటూ ప్రారంభించారాయన. "మీరేమంటారు? దీన్ని గురించి మీ అభిప్రాయం ఏమిటో నిజంగా తెలుసుకోవాలని ఉంది నాకు. నేను ఆ సమాజానికి చెందిన వాణ్ణని మీకు తెలుసును. ప్రవేశ దశలో ఉన్నవారిలో ఉత్తముడిగా అయ్యే అవకాశం నాకు ఈ జన్మలో ఉందని అంతఃప్రభువులకు ప్రతినిధులైన బాహ్య అధికారులు చెప్పారు నాతో." ఆయన దాన్ని చాలా మనః పూర్వకంగా నమ్మాడు. మేము చాలాసేపు మాట్లాడుకున్నాం.

ప్రతిఫలం అనేది ఏ రూపంలో లభించినా అత్యంత సంతోష దాయకమే. ముఖ్యంగా ప్రాపంచిక పదవులను లక్ష్యం చేయని వారికీ, మామూలు ప్రపంచంలో జయం సాధించలేని వారికీ, మహోన్నత స్థితికి పురోగమించిన ఒక ఆధ్యాత్మిక జీవి ప్రత్యేకంగా స్థాపించిన సమాజానికి చెంది ఉండటం అనేది చాలా తృప్తి కలిగించే విషయం. సహజంగా, వారు చెప్పినదంతా చేసినందుకూ, అవసరమైన త్యాగాలన్నీ చేసినందుకూ తగిన ప్రతిఫలం ముట్టవలసిందే. ప్రతిఫలం అంటే మామూలుగా ఏదో ఇచ్చినట్లు కాక, వారి ఆధ్యాత్మిక పురోగతిని ప్రశంసించటమో, లేక బాగా సమర్థవంతంగా నడపబడుతున్న సంస్థలో బాగా పని చేస్తే మరింత బాగా పని చేయటానికి వారి పనిని మెచ్చుకోవటమో లాంటిది.

అభివృద్ధిని ఆరాధించే ప్రపంచంలో ఈ రకమైన ఆత్మపురోభివృద్ధిని ఎవరైనా అర్థం చేసుకుంటారు. ప్రోత్సహిస్తారు. కాని, మీరు ఒక గురువుకి శిష్యుడుఅని ఎవరో చెబితే వినటమో, లేక స్వయంగా అనుకోవటమో ఎన్నో రకాలైన అసహ్యాకరమైన స్వలాభపూరిత ప్రయత్నాలకు దారితీస్తుంది.

దురదృష్టవశాత్తూ, ఇతరుల నుంచి స్వలాభాన్ని ఆశించేవారూ, వారి స్వలాభానికి గురి అయేవారూ కూడా తమ పరస్పర అనుబంధానికి మురిసి పోతూ ఉంటారు. ఈవిధంగా విస్తృతమయ్యే ఆత్మ తృప్తినే ఆధ్యాత్మిక పురోగతి అంటూ ఉంటారు. ముఖ్యంగా, శిష్యుడికీ గురువుకీ మధ్య కొందరు మధ్యవర్తులున్నప్పుడు, అందులోనూ గురువు మరో దూరదేశంలో ఉండి సులభంగా అందుబాటులో లేనప్పుడు పరిస్థితి మరింత అసహ్యకరంగానూ, దుర్భరంగానూ ఉంటుంది. ఈ అందుబాటులో లేకపోవటం, సూటిగా చేరలేకపోవటం ఆత్మ వంచనకూ అమాయకపు భ్రాంతికీ దారితీస్తుంది. ఇటువంటి భ్రాంతిని గడుసువాళ్ళూ, కీర్తికాంక్షా, అధికార కాంక్షా ఉన్నవాళ్ళూ తమ స్వలాభానికీ ఉపయోగించుకుంటారు.

నమ్రత లేనప్పుడే ప్రతిఫలం, శిక్షా ఉంటాయి. ఆధ్యాత్మిక సాధనల వల్లనూ, ప్రాపంచిక విషయాలను త్యజించటం వల్లనూ సాధించే అంతిమ లక్ష్యం కాదు నమ్రత. నమ్రత సాధన చేసి పొందే గుణం కాదు; అభ్యాసంవల్ల సాధించేదీ కాదు. అలవరచుకున్న గుణం సద్గుణం ఏనాటికీ కాదు; అది కేవలం ఒక సాధించిన విజయం అవుతుంది, మీ గొప్పల పట్టికలో మరొక అంశం అవుతుంది. అంతే. సద్గుణాన్ని అలవరచుకోవడం అంటే అహాన్ని త్యజించడం కాదు, అహం ఉన్నదని స్పష్టంగా గ్రహించటం.

నమ్రతకి పైవాడు, క్రిందివాడు, గురువు, శిష్యుడు అనే భేదం తెలియదు. గురువుకీ శిష్యుడికీ మధ్యా, సత్యానికీ మీకూ మధ్యా విభజన ఉంటే అవగాహన అవటం సాధ్యంకాదు. సత్యాన్ని అర్థం చేసుకోవటంలో గురువూ లేడూ, శిష్యుడూ లేడు, పురోగమించినవాడూ లేడు, అధోగతిలో ఉన్నవాడూ లేడు. గతించిన క్షణం యొక్క భారం గాని చిహ్నంగాని లేకుండా ఉన్నదానిని, అంటే వర్తమానాన్ని అనుక్షణమూ అర్థం చేసుకోవటమే సత్యం.

ప్రతిఫలం, శిక్ష అనేవి అహాన్ని శక్తియుతం చేసి నమ్రతను తోసి వేస్తాయి. నమ్రత ప్రస్తుతంలో ఉండాలి, భవిష్యత్తులో కాదు. మీరు నమ్రతగా అవబోవటం అనేది సాధ్యంకాదు. అవబోతున్నారంటేనే అహానికి ప్రాధాన్యాన్ని ఇవ్వటం కొనసాగిస్తున్నారని అర్థం. అంటే సద్గుణాన్ని కలిగి ఉండటాన్ని ప్రస్తుతానికి విరమించుకున్నట్లేకదా. ఎప్పుడో జయం సాధించాలనీ, ఏదో

అవాలనే కాంక్ష ఎంత బలమైనది! విజయం, నమ్రత ఒకచోట ఎలా ఉంటాయి? కాని, ఆధ్యాత్మికంగా స్వలాభం కోసం ఇతరులను ఉపయోగించుకునేవారూ, వినియోగింపబడేవారు కూడా చేస్తున్నదదే. అందులోనే సంఘర్షణ, దుఃఖమూ ఉంటాయి.

"అంటే, గురువు అనేవాడు లేడనీ, నేను శిష్యుణ్ణి అనుకోవటం కేవలం భ్రాంతి అనీ, కల్పన అనీ మీ ఉద్దేశమా?" అని అడిగాడాయన.

గురువు ఉన్నాడా లేడా అన్నది అల్ప విషయం. స్వలాభం కోసం ఇతరులను ఉపయోగించుకొనే వారికీ, రహస్య సంఘాలకీ, శాఖలకీ మాత్రం అది చాలా ముఖ్యమైన విషయం. కాని, పరమానందదాయకమైన సత్యాన్ని అన్వేషించే మనిషికి ఆ ప్రశ్న పూర్తిగా అసందర్భమైనదవుతుంది. గురువూ, శిష్యుడూ ఎంత ముఖ్యమైనవారో ధనవంతుడూ, కూలివాడూ కూడా అంతే ముఖ్యమైనవారు. గురువులున్నారో లేదో, ప్రవేశదశలో ఉన్నవారనీ, శిష్యులనీ తేడాలున్నాయో లేదో ముఖ్యం కాదు. మిమ్మల్ని మీరు అర్థం చేసుకోవటమే ముఖ్యం. స్వీయ జ్ఞానం లేకుండా, సహేతుకంగా ఆలోచించడానికి ఆస్కారం లేదు. ముందు మిమ్మల్ని మీరు తెలుసుకోకుండా సత్యం ఏమిటో ఎలా తెలుసుకోగలరు? స్వీయజ్ఞానం లేకపోతే భ్రాంతి మాత్రమే మిగులుతుంది. మీరు ఇది, మీరు అది అని ఎవరో చెబితే నమ్మటం పసితనం అనిపించు కుంటుంది. ఈలోకంలో గాని, ఇంకోచోట గాని ప్రతిఫలం చూపుతానన్న వాడిని కాస్త జాగ్రత్తగా కనిపెట్టి ఉండండి.

## 7. ధనవంతులు, దరిద్రులు

వేడిగానూ, ఉక్కగానూ ఉంది. పట్నవాసపు చప్పుళ్ళతో గాలి నిండి ఉంది. సముద్రం మీంచి వచ్చే గాలి వెచ్చగా ఉంది. తారువాసన, పెట్రోలు వాసనా వేస్తోంది. దూరాన నీటిలో అస్తమిస్తున్న సూర్యుడు ఎర్రగా ఉన్నాడు. ఇంకా వేడి తగ్గేట్లుగా లేదు. గది నిండా మూగిన జనం అప్పుడే వెళ్ళారు. మేము వీధిలోకి వచ్చాం.

చిలకలు పచ్చని మెరుపుల్లా వస్తున్నాయి గూటికి చేరుకోవటానికి. పొద్దున్నే ఉత్తరం వైపుకి తోటలూ, పొలాలూ బాహాటంగా ఉన్నచోటికి ఎగిరి వెళ్లాయి. సాయంకాలం తిరిగి వస్తున్నాయి పట్నానికి రాత్రిపూట చెట్లల్లో గడపటానికి. అవి ఎప్పుడూ మెల్లిగా ఎగరవు. ఎప్పుడూ, లక్ష్యం లేనట్లు చప్పుడు చేస్తూ కలకల్లాడుతూ ఉంటాయి. తక్కిన పక్షుల్లా అవి ఎప్పుడూ తిన్నగా ఎగరవు. ఎప్పుడూ ఎడమవైపుకో, కుడివైపుకో తిరుగుతూ హఠాత్తుగా ఏ చెట్టులోనో దూరుతాయి. ఎగురుతున్నంత సేపూ స్తిమితంగా ఉండవు. కాని, ఎర్రటి ముక్కులతో మిసమిసలాడే పచ్చదనంతో కాంతి వెదజల్లుతూ ఎంతో అందంగా ఉంటాయి. అసహ్యకరంగా ఉన్న పెద్ద పెద్ద డేగలు చుట్టూ తిరిగి తిరిగి తాటి చెట్లమీద కుదుట పడ్డాయి రాత్రికి.

ఎవడో పిల్లనగ్రోవి వాయించుకుంటూ వస్తున్నాడు. నౌకరులా ఉన్నాడు. వాయించుకుంటూనే కొండమీదకి ఎక్కుతున్నాడు. మేము అతని వెనకాతలే నడుస్తున్నాం. అతను పక్కనున్న వీధుల్లో ఒక దాంట్లోకి మళ్ళాడు. ఇంకా వాయిస్తూనే ఉన్నాడు. గొడవ గొడవగా ఉండే పట్టణంలో ఆ పిల్లనగ్రోవి పాట వినటానికి వింతగా ఉంది. దాని శబ్దం గుండె లోతుల్లోనికి చొచ్చుకొని పోతోంది. ఎంతో బాగుంది. ఆ పిల్లనగ్రోవి పాటగాడి వెనకాలే కొంతదూరం వెళ్ళాం. ఎన్నో వీధులు దాటి చివరి కొక పెద్ద వీధిలోకి వచ్చాం. ఈ వీధిలో దీపాలతో వెలుగు బాగా ఉంది. కొద్ది దూరంలో ఎవరో కొంతమంది గుంపుగా రోడ్డుపక్కని కూర్చుని తీరిగ్గా కబుర్లు చెప్పుకుంటున్నారు. పిల్లనగ్రోవి వాయించేవాడు వాళ్ళదగ్గరికి చేరాడు. మేమూ అదే పని చేశాం. అతను వాయిస్తుంటే మేమూ చుట్టూ కూర్చొని వింటున్నాం. వాళ్ళంతా డ్రైవర్లూ, ఇళ్ళలో పనిచేసే నౌకర్లూ, రాత్రిపూట కాపలా కాసేవాళ్ళూ, కొంతమంది చిన్నపిల్లలూ, ఒకటో రెండో కుక్కలూ. పక్కనుంచి కార్లు పోతున్నాయి. ఒకదాంట్లో అందమైన దుస్తులు వేసుకున్న ఒకావిడ ఒంటరిగా కూర్చునుంది. కారులో దీపాలు వెలుగుతున్నాయి. డ్రైవరు కారు నడుపుతున్నాడు. ఇంకోకారు వచ్చి అక్కడ ఆగిపోయింది. డ్రైవరు దిగివచ్చి మాతోబాటు కూర్చున్నాడు. వాళ్ళంతా కబుర్లు చెప్పుకుంటున్నారు సరదాగా నవ్వుతూ, చేతులూపుతూ. పిల్లనగ్రోవి మీద పాట మాత్రం తొట్రుపడలేదు. ఎంతో

ఆనందదాయకంగా ఉంది.

అంతలో మేము అక్కణ్ణించి లేచి సముద్రం వైపుకి వెళ్ళే రోడ్డు మీదుగా, దీపాలతో వెలుగుతున్న ధనవంతుల ఇళ్ళను దాటుకుంటూ బయలుదేరాం. ధనవంతులు వారి ప్రత్యేక వాతావరణంలో వారు ఉంటారు. ఎంత సంస్కృతి ఉన్నప్పటికీ, ఎంత అసాధారణంగా ఉన్నప్పటికీ, సంప్రదాయం, పై మెరుపూ ఉన్నప్పటకీ, ధనవంతుల్లో, లోతు తెలియనంత విశ్వాసపూరితమైన గాంభీర్యం, చెక్కు చెదరని స్థైర్యం, అభేద్యమైన కాఠిన్యం ఉంటాయి. వారు ధనాన్ని సొంతం చేసుకోవటం కాదు, ధనమే వారిని సొంతం చేసుకుంటుంది. అది మరణం కన్న అధమస్తమైనది. వారి అహంభావమే వారి ధర్మబుద్ధి. తమ సంపదకు తాము రక్షకుల మనుకుంటారు. వారు దానాలు చేస్తూఉంటారు. ధర్మ సంస్థలు స్థాపిస్తూ ఉంటారు. అన్నిటినీ నిర్వహించేదీ, నిర్మించేదీ, ధారపోసేదీ వారే. క్రైస్తవ మందిరాలూ, దేవాలయాలూ నిర్మిస్తారు. కాని వారి దేవుడు బంగారం దేవుడు. ఇంత దారిద్ర్యం, దైన్యం చుట్టూ ఉండగా ధనవంతులుగా ఉండటానికి ఎవరైనా బాగా మోటుతేరి ఉండాలి. వారిలో కొంతమంది ప్రశ్నలు వెయ్యటానికీ, చర్చించటానికీ, సత్య శోధనకీ వస్తూ ఉంటారు. దరిద్రులకు మల్లేనే ధనవంతులకి కూడా సత్యాన్వేషణ అతి కష్టం. దరిద్రులు, ధనం, అధికారం సంపాదించాలని తాపత్రయ పడుతూంటారు. ధనవంతులు తాము పన్నిన వలలో తామే చిక్కుకుని ఉంటారు. కాని వారి నమ్మకాలు వదులుకోకుండా ఆ దారినే సాగిపోతూ ఉంటారు. వర్తక సామగ్రితోనే గాక దైవంతో కూడా వారు వ్యాపారం చేస్తారు. రెండింటితోనూ వినోదిస్తారు. కాని విజయం సాధించేది వారు కోరుకున్న విషయాల్లోనే. వారి నమ్మకాలూ, పూజలూ, వారి ఆశలూ, భయాలూ - వాటికి సత్యంతో ఎలాంటి సంబంధమూ లేదు. వారి హృదయాల్లో శూన్యం తప్ప ఏమీ లేదు. పైకి ఎంత డాబుగా ఉంటే లోపల అంత దారిద్ర్యం ఉంటుంది.

సంపద, సుఖం, హోదా - వీటిని వదిలిపెట్టటం అంతకష్టమేమీ కాదు. కాని, ఏదో ఉండాలనీ, ఏదో అవాలనీ పడే తాపత్రయాన్ని వదిలిపెట్టాలంటే విశేషమైన తెలివీ, అవగాహనా కావలసి ఉంటుంది. సంపదవల్ల వచ్చే అధికారం సత్యాన్ని గ్రహించకుండా ఎలా ఆటంకం కలిగిస్తుందో అలాగే

ప్రతిభా సామర్థ్యాల శక్తి కూడా ఆటంకం కలిగిస్తుంది. ఈ విధమైన ఆత్మ విశ్వాసం స్వార్థచింతన వల్ల ఏర్పడేదే. కష్టమైనప్పటికీ, ఇటువంటి ఆత్మ విశ్వాసాన్నీ, శక్తినీ త్రోసి పుచ్చటం సాధ్యమే. ఇంతకన్న ఎంతో అస్పష్టమైనదీ, పైకి కనిపించనిదీ-ఏదో అవాలన్న తాపత్రయంలో ఉండే శక్తి, ఉత్సాహం. అహాన్ని పెంపొందించుకోవడం - ఏరూపంలోనైనా సరే - సంపదతో గాని, సద్గుణంతో గాని అది సంఘర్షణా ప్రక్రియే. దానివల్ల కలిగేది ద్వేషం, గందరగోళం. ఏదో అవాలనే తాపత్రయంతో నిండిన మనస్సు ఎప్పుడూ ప్రశాంతంగా ఉండలేదు. ప్రశాంతత సాధన వల్ల గాని, సమయానుకూలంగా గాని లభించేది కాదు. అవగాహనలోనే ప్రశాంతత ఉంటుంది. ఏదో అవాలనే కోరిక అవగాహన కానివ్వదు. ఏదో అవాలనుకోవటం సమయాభావాన్ని కలుగచేస్తుంది. అంటే, నిజానికి, తక్షణం అవగాహన చేసుకోకుండా ముందుకి నెట్టటమే. "ఫలానాగా అవుతాను" అనే భ్రాంతి అహానికి ప్రాధాన్యం ఇవ్వటం వల్లనే కలుగుతుంది.

పట్టణంలాగే సముద్రంకూడా అల్లకల్లోలంగా ఉంది. కాని దీని కల్లోలంలో నిగూఢత్వం ఉంది, నిండుతనం ఉంది. ఆకాశంలో నక్షత్రం కనిపిస్తోంది. మేము వెనక్కి మళ్ళి, బస్సులూ, కార్లూ, మనుష్యులతో హడావిడిగా ఉన్న ఒక వీధిలోనుంచి నడుచుకుంటూ వెళ్ళాం. వీధి పక్కని ఒకచోట ఒకడు ఒంటిమీద బట్టలు లేకుండా పడుకున్నాడు. ముష్టివాడు. బాగా అలసిపోయి, బొత్తిగా తిండి లేకుండా ప్రాణావశిష్టంగా ఉన్నాడు. అతణ్ణి లేపటం కష్టం. ముందుకి పోతే పచ్చని గడ్డితో నిండిన ప్రదేశాలూ, పబ్లిక్ గార్డెన్లో రంగు రంగుల పువ్వులూ ఉన్నాయి.

## 8. పూజలూ, మతం మార్చుకోవటం

పెద్ద ఆవరణలో ఎన్నో చెట్ల మధ్యన ఉందా చర్చి. జనం - నల్లవాళ్ళూ తెల్లవాళ్ళూ దాని లోపలికి వెడుతున్నారు. యూరప్‌లో ఉన్న చర్చిలన్నిటిలో కన్నా ఎక్కువ వెలుగుంది దాని లోపల. కాని ఏర్పాట్లు మాత్రం అట్లాగే ఉన్నాయి. ప్రార్థన జరుగుతోంది. అందులో అందం ఉంది. అది అయిపోయిన

తరువాత అక్కడున్న తెల్లవాళ్ళలోనూ, నల్లవాళ్ళలోనూ బహుకొద్ది మంది మాత్రమే ఒకరితో ఒకరు మాట్లాడుకున్నారు. ఎవరిత్రోవన వాళ్ళం వెళ్ళిపోయాం.

మరో భూభాగంలో ఒక దేవాలయం ఉంది. సంస్కృతంలో శ్లోకాలు గానం చేస్తున్నారు. హిందువులు చేసే పూజ జరుగుతోంది. అక్కడ చేరిన సమూహం యొక్క సంస్కృతి వేరు. సంస్కృత పదాల శబ్దం ఛేదించేట్లు చాలా శక్తిమంతంగా ఉంది. అందులో ఏదో చిత్రమైన భారం, గాంభీర్యం ఉన్నాయి.

ఒక నమ్మకం నుంచి మరొక నమ్మకానికీ, ఒక మూఢ సిద్ధాంతం నుంచి మరొక మూఢ సిద్ధాంతానికీ మారగలరు. కాని, సత్యాన్ని గ్రహించే స్థితికి మారలేరు. నమ్మకం సత్యంకాదు. మీ మనస్సుని మార్చుకోవచ్చును. మీ అభిప్రాయాన్ని మార్చుకోవచ్చును, కాని, సత్యం అనేది, దైవం అనేది నమ్మకం కాదు. అది అనుభవంలోకి రావాలి. ఏదో నమ్మకంమీద, మూఢవిశ్వాసం మీద ఆధారపడినది కాదు. మీ అనుభవం ఏదైనా నమ్మకం మీద ఆధారపడినదైతే, మీ అనుభవం మీ నమ్మకం ప్రకారమే పరిమితమై ఉంటుంది. మీకేదైనా అనుభవం హఠాత్తుగా అనాలోచితంగా జరిగి, ఆ అనుభవం మీద మరికొంత అనుభవం అయితే అటువంటి అనుభవం కేవలం కొత్తగా ఎదురైన దాన్ని గుర్తు పట్టిన పాత జ్ఞాపకం మాత్రమే. జ్ఞాపకం అనేది ఎప్పుడూ గతించిపోయినదే. జీవించి ఉన్నదాని స్పర్శతో సజీవమవుతూ ఉంటుంది.

మతం మార్చుకోవటమంటే, ఒక నమ్మకం నుంచి మరొకదానికీ, ఒక మూఢ విశ్వాసం నుంచి మరొక దానికీ, ఒక పూజమాని మరింత తృప్తినిచ్చే మరొక పూజకీ మారటమే. దీనివల్ల సత్యాన్ని కనుక్కునే మార్గం మాత్రం కనిపించదు. పైగా తృప్తి పొందటం అనేది సత్యాన్ని కనిపించనివ్వదు. అయినప్పటికీ, మతసంస్థలూ, మతసంఘాలూ చేసే ప్రయత్నం అదే. మరింత ఒప్పించో, ఒప్పించకనో ఒక సిద్ధాంతం వైపుకో, మూఢవిశ్వాసం వైపుకో, ఆశవైపుకో మిమ్మల్ని మార్చాలని చూస్తారు. అంతకన్న మంచి ఫంజరాన్ని ఇస్తామని ఆశచూపిస్తారు. అందులో మీకు సుఖంగా ఉండొచ్చు, ఉండక పోవచ్చు. అది మీ విశ్వాసాన్ని బట్టి ఉంటుంది. ఏమైనా అది ఒక ఖైదు.

మతంలోనూ, రాజకీయాల్లోనూ వివిధ సాంస్కృతిక స్థాయిల్లో ఈ

మార్పు జరుగుతోంది ఎల్లవేళలా. సంస్థలూ, వాటి అధికారులూ మనుషుల్ని తమ సిద్ధాంతరీతుల్లో-మత సంబంధమైనవి గాని, ఆర్థిక సంబంధమైనవి గాని -వాటిలో ఇరికించి, తాము వర్ధిల్లుతూ ఉంటారు. ఈ తతంగంలోనే ఉంది ఒకరి నొకరు స్వలాభం కోసం వినియోగించుకోవటమనేది. సత్యం ఎప్పుడూ ఇటువంటి విధానాల్లోని భయాలతో, ఆశలతో సంబంధం లేకుండా ఉంటుంది. మీరు సత్యంలోని అత్యున్నత ఆనందాన్ని చవిచూడాలంటే అన్ని రకాల పూజల్నీ, సిద్ధాంతరీతుల్నీ వదిలించుకోవాలి.

మత సంబంధమైన, రాజకీయ సంబంధమైన వ్యవహార రీతుల్లో మనస్సుకి రక్షణ దొరుకుతుంది. అందువల్లనే సంస్థలకీ శక్తి లభిస్తోంది. సంస్థలలో ఎప్పుడూ ఆరితేరినవారూ, కొత్తగా చేరినవారూ కూడా ఉంటారు. వీరు తమ మూలధనాలతో, ఆస్తులతో ఈ సంస్థల్ని పోషిస్తూ ఉండగా, ఈ సంస్థలో లభించే అధికారం, గౌరవం - అటువంటి వాటిని సాధించటాన్నీ, ప్రాపంచిక జ్ఞానాన్నీ ఆరాధించే వారినందరినీ ఆకర్షిస్తాయి. పాతపద్ధతులు ఇంకేవిధంగానూ తృప్తికరమైనవీ, ప్రాణ ప్రదమైనవీ కావని మనసుకి తోచగానే, మరింత సుఖాన్నీ, శక్తినీ ఇచ్చే నమ్మకాలవైపుకీ, మూఢ విశ్వాసాల వైపుకీ మారిపోతుంది. అందుచేత మనస్సు చుట్టుపక్కల ఉండే వాతావరణం నుంచి తయారైనదే-ఎప్పటి కప్పుడు మళ్ళీ రూపొందించుకుంటూ, అనుభూతుల నుంచీ, ఐక్యం చేసుకోవటంనుంచీ, బలం పుంజుకుంటూ ఉంటుంది. అందువల్లనే మనస్సు నీతి నియమాలనూ, ఆలోచనా విధానాలనూ, అటువంటి వాటిని పట్టుకొని వదలదు. మనస్సు గతం నుంచి ఉద్భవిస్తున్నంతకాలం సత్యాన్ని తెలుసుకోలేదు, సత్యాన్ని బయట పడనీయదు. సంస్థల్ని పట్టుకు వ్రేలాడుతూ సత్యాన్వేషణని వదిలి పెట్టేస్తుంది.

పూజాపునస్కారాల్లో పాల్గొనేవారికి. అటువంటి వాటిలో సద్భావం కలగటం సహజం. అందరితో కలిసి చేసినా, వ్యక్తిగతంగా చేసినా, పూజా పునస్కారాల్లో కొంత మనశ్శాంతి లభిస్తుంది, నిత్య కార్యకలాపాలతోనూ, దైనందిన జీవితంతోనూ పోల్చుకుంటే, పూజల్లో కొంత అందమూ, క్రమపద్ధతీ ఉన్నప్పటికీ అవి ప్రధానంగా ఉత్తేజకాలు మాత్రమే. ఉత్తేజకాలు అన్నిటిలాగే అవికూడా మనస్సునీ, హృదయాన్నీ పూర్తిగా బండబారేటట్లు చేస్తాయి.

పూజాపునస్కారాలు అలవాటయిపోతాయి. అవసరమనిపిస్తాయి. అవి లేకుండా ఉండలేమనిపిస్తుంది. ఈ అవసరాన్ని ఆధ్యాత్మిక పునరుద్ధరణ అనీ, జీవితాన్ని ఎదుర్కోవటానికి కావలసిన శక్తి అనీ, దినదినం, వారంవారం చేసే ధ్యానం అనీ పలువిధాలుగా పేర్కొంటారు. కాని, ఈ ప్రక్రియని మరింత పరీక్షగా చూస్తే నిజానికి, పూజలూ అవీ ఆత్మజ్ఞానం కలగకుండా గౌరవప్రదంగా బ్రహ్మాండంగా తప్పించుకోవటానికి చేసే వ్యర్థ ప్రయాసలా కనిపిస్తుంది. తన్ను తాను తెలుసుకోకుండా ఏపని చేసినా అర్థం ఉండదు.

పదేపదే శ్లోకాలు చదవటం, పదాలూ వాక్యాలూ జపించటంవల్ల మనస్సుని నిద్ర పుచ్చటం జరుగుతుంది, తాత్కాలికంగా కొంత ఉత్తేజకరంగా ఉన్నప్పటికీ. ఈ నిద్రావస్థలో కొన్ని అనుభవానికి వస్తాయి. కాని, అవి స్వయం ప్రేరితమైనవే. ఎంత తృప్తినిచ్చినా, ఈ అనుభవాలు ఊహాజనితమైనవే. దేన్ని పదేపదే జపించినా, ఏవిధంగా సాధన చేసినా సత్యం అనుభవంలోకి రాదు. సత్యం ఒక గమ్యంకాదు, ఒక ఫలితం కాదు, ఒక లక్ష్యం కాదు. దాన్ని ఆహ్వానించలేము. అది మనస్సుకి సంబంధించినది కాదు.

## 9. జ్ఞానం

మేము రైలుకోసం ఎదురుచూస్తున్నాం. అది రావటం ఆలస్యం అయింది. ప్లాట్‌ఫామ్ చెత్తగానూ, గొడవగానూ ఉంది. గాలి వెగటు పుట్టించేట్టుగా ఉంది. మాలాగే చాలా మంది నిరీక్షిస్తున్నారు. పిల్లలు ఏడుస్తున్నారు. ఒకావిడ పిల్లకి పాలిస్తోంది. సరుకులమ్మేవాళ్లు టీ, కాఫీ మొదలైన సరుకుల పేర్లు అరుస్తూ అమ్ముతున్నారు. ఆ ప్రదేశమంతా హడావిడిగా గందరగోళంగా ఉంది. మేము ప్లాట్‌ఫామ్ మీద ఇటూ అటూ నడుస్తున్నాం, మా అడుగుల్ని మేమే చూసుకుంటూ, మా చుట్టూ జరుగుతున్నదంతా గమనిస్తున్నాం. ఒకతను మా దగ్గర కొచ్చి వచ్చీరాని ఇంగ్లీషులో మాట్లాడటం మొదలుపెట్టాడు. ఇంతసేపూ అతడు మమ్మల్ని గమనిస్తున్నట్లూ, మాతో మాట్లాడాలనే భావాన్ని అణచుకోలేకపోయినట్లూ చెప్పాడు. ఎంతో మనస్ఫూర్తిగా చెప్పాడు - తను ఇక ముందు నుంచీ ఎంతో

పరిశుద్ధమైన జీవితాన్ని గడపదలుచుకున్నట్లూ, ఆక్షణం నుంచి ఇక ఎప్పుడూ పొగత్రాగ దలచుకోలేదనీ చెప్పాడు. అతడు ఏమీ చదువుకోలేదుట. అతడు రిక్షాలాగేవాడు మాత్రమేనట. అతని కళ్లు చురుగ్గా ఉన్నాయి. అతడు చిరునవ్వు నవ్వితే బాగుంది.

ఇంతలో రైలు వచ్చింది. కంపార్టుమెంట్‌లో ఒకాయన తన్ను తాను పరిచయం చేసుకున్నాడు. ఆయన ఒక ప్రసిద్ధ పండితుడు. ఆయనకి చాలా భాషలు వచ్చు. ఆయునకు ఎంతో అనుభవం, జ్ఞానం ఉన్నాయి. స్థితిమంతుడు, ఇంకా వృద్ధిలోకి రావాలనే ఆకాంక్ష ఉన్నవాడు. ధ్యానం చేయటం గురించి మాట్లాడాడు, కాని స్వానుభవంతో చెబుతున్నట్లుగా అనిపించలేదు, ఆయన చెప్పటాన్ని బట్టి. ఆయన దేవుడు పుస్తకాల్లోని దేవుడు. జీవితం పట్ల ఆయనకున్న అభిప్రాయాలు తరతరాలుగా వస్తున్నవీ, సంప్రదాయ బద్ధమైనవీ. ఆయనకు బాల్య వివాహాల్లోనూ, పెద్దలు కుదిర్చిన వివాహాల్లోనూ, కట్టుబాట్ల ప్రకారం నడిచే జీవితంలోనూ నమ్మకం ఉంది. ఆయన కులమూ, వర్గమూ, వివిధ కులాల మేధా సంపత్తిలో ఉండే హెచ్చుతగ్గులూ, అన్నీ పట్టించుకుంటాడు. తనకున్న జ్ఞానానికీ, హోదాకీ ఆయన ఒకవిధంగా పొంగి పోతున్నాడు.

సూర్యాస్తమయం అవుతోంది. రైలు చక్కని పల్లె ప్రదేశంలోంచి పోతోంది. పశువులు ఇళ్ళకు తిరిగి పోతున్నాయి. బంగారు వన్నెలో దుమ్ము రేగుతోంది. ఆకాశంలో నల్లని పెద్ద పెద్ద మబ్బులు. దూరాన్నుంచి పిడుగు పడ్డట్లు చప్పుడు. పచ్చని పొలాలు ఎంతో ఆహ్లాదకరంగా ఉన్నాయి. మలుపు తిరుగుతున్న ఆ కొండ నడుమ పల్లె చూడముచ్చటగా ఉంది. చీకటి పడుతోంది. నల్లని పెద్ద దుప్పి పొలాల్లో తింటూ తిరుగుతోంది. పక్కనుంచి రైలు అరుస్తూ పోతున్నా కన్నెత్తి అయినా చూడలేదు.

జ్ఞానం అనేది రెండు చీకట్ల మధ్య తళుక్కు మనే మెరుపు. కాని జ్ఞానం ఆ చీకటి పైకిగాని, దానికన్న ముందుకి గాని పోలేదు. సాంకేతిక నైపుణ్యానికి జ్ఞానం అవసరమే, యంత్రంలో బొగ్గు అవసరమైనట్లు. కాని, తెలియని దానిని అది చేరుకోలేదు. తెలియనిది తెలిసిన దానిలో చిక్కుకునేది కాదు. తెలియనిది ఆవిష్కృతం కావటానికి ఉన్న జ్ఞానాన్ని తొలగించుకోవాలి. కాని అది ఎంత కష్టం!

మనం ఉండటం అంతా గతంలోనే. మన ఆలోచనలు గతంమీద ఆధారపడి ఉన్నాయి. గతమే మనకు తెలిసినది. గతం నీడ ప్రస్తుతాన్ని కప్పి వేస్తుంది. ప్రస్తుతం తెలియకుండా ఉండిపోతుంది. అపరిచితమైనది భవిష్యత్తు కాదు, ప్రస్తుతమే. అనిశ్చితమైన ప్రస్తుతాన్ని తప్పించుకుని ముందుకు పోతున్న గతమే భవిష్యత్తు అవుతుంది. ఈమధ్య ఏర్పడే ఖాళీలో, విరామంలో జ్ఞానం అప్పుడప్పుడు తన కాంతిని నింపుతూ ఉంటుంది. ప్రస్తుతంలోని శూన్యం ఆవిధంగా నిండుతుంది. కాని ఈ శూన్యంలోనే జీవితం యొక్క అద్భుత శక్తి ఇమిడి ఉంది.

జ్ఞానానికి అలవాటు పడటంకూడా తక్కిన దురలవాట్ల వంటిదే. ఇది శూన్యత, ఒంటరితనం, నిరుత్సాహం, ఏమీ అవకుండా ఉండిపోవటం - వీటి భయం నుంచి తప్పించుకొనే మార్గాల్లో ఒకటి. జ్ఞానం యొక్క కాంతి మనస్సు ఛేదించలేని చీకటిన్ని సున్నితంగా కప్పే పొర వంటిది. మనస్సు అపరిచితమైన దానికి భయపడుతుంది. ఆ భయాన్ని తప్పించుకోవటానికి జ్ఞానం, సిద్ధాంతాలూ, ఆశలూ, ఊహలూ వీటన్నిటిలోనూ తలదాచుకుంటుంది. తెలియని దాన్ని గ్రహించటానికి ఈ జ్ఞానమే ప్రతిబంధకమౌతుంది. జ్ఞానాన్ని త్రోసి పారవెయ్యటం అంటే భయాన్ని కొనితెచ్చుకోవటమే. దేన్నైనా గ్రహించటానికి వీలైన ఏకైక సాధనం మనస్సు. దాన్ని కాదంటే సుఖ దుఃఖాలకు లోనుకావలసి వస్తుంది. కాని జ్ఞానాన్ని త్రోసి పారవెయ్యటం సులభం కాదు. అజ్ఞానంతో ఉండటం అంటే జ్ఞానం నుంచి స్వేచ్ఛ పొందటం కాదు. అజ్ఞానం అంటే తన్ను తాను తెలుసుకోలేక పోవటమే. తమ స్వార్థచింతనను అర్థం చేసుకోనట్లయితే జ్ఞానం అజ్ఞానమే అవుతుంది. తన్ను తాను అర్థం చేసుకోవటమే జ్ఞానం నుంచి స్వేచ్ఛ లభించటం.

పోగు చేసుకోవటం, కూడబెట్టాలనుకోవటం-వీటి అర్థం తెలిసినప్పుడే జ్ఞానం నుంచి స్వేచ్ఛ లభిస్తుంది. కూడబెట్టి దాచుకోవాలనే కోరికకు మూలం సురక్షితంగా సుస్థిరంగా ఉండాలనే కాంక్ష. ఇది చెడ్డదనీ, ఇది సరియైనదనీ అంటూ ఏదో ఒక దానితో తన్ను ఐక్యం చేసుకోవటం, తద్వారా సుస్థిరతని కోరటం, భయంమూలాన్నే. ఈ భయమే దేన్నీ తెలుసుకోనీయకుండా చేస్తుంది. అన్నీ తెలిసినప్పుడు కూడబెట్టవలసిన అవసరమే ఉండదు.

కూడబెట్టటం అనేది మనల్ని మనం సంకుచితం చేసుకునే చర్య. ఇది మన రక్షణ కోసం ప్రతిఘటించటానికే. జ్ఞానం ఈ చర్యను లేదా ప్రతిఘటనని మరింత శక్తిమంతం చేస్తుంది. జ్ఞానాన్ని ఆరాధించటం కూడా దేవతా విగ్రహాన్ని ఆరాధించటం వంటిదే. అది మన జీవితంలోని సంఘర్షణనీ, దుఃఖాన్నీ రూపుమాపలేదు. అంతకంతకు అధికమయే మన గందరగోళాన్నీ, విచారాన్నీ జ్ఞానవస్త్రం కప్పివుచ్చుతుందే గాని, వాటి నుంచి మనకి విముక్తిని ప్రసాదించదు. మనోరీతులు సత్యానికీ ఆనందానికీ దారితీయవు. తెలిసి ఉండటం అంటే, తెలియని దాన్ని వద్దని అనుకోవడమే.

## 10. మాన్యత

తనకు దురాశ లేదనీ, కొంచెంతోనే తాను తృప్తిపొందుతాననీ, మామూలుగా మనిషికొచ్చే కష్టాలు కొన్నిటిని అనుభవించినా మొత్తం మీద తన జీవితం బాగానే గడిచిందనీ సమర్థించుకుంటూ చెప్పాడాయన. ఆయన నెమ్మదస్తుడు. ముందుకి తోసుకొచ్చే రకంకాదు. తాను పట్టిన మార్గానికెవ్వరూ అడ్డురాకూడదని ఆశిస్తాడుట. తనకేవీ పెద్ద ఆకాంక్షల్లేవన్నాడు, కాని, తనకున్న దానికోసం, తన సంసారం కోసం, జీవితం సాఫీగా సాగిపోవాలని భగవంతుణ్ణి ప్రార్థించాడు. సమస్యల్లోనూ, సంఘర్షణల్లోనూ తన స్నేహితులూ, బంధువులూ మునిగిపోయినట్టు తన్ను ముంచనందుకు దేవుడికి కృతజ్ఞత తెలుపుకున్నాడు. ఆయనకు క్రమంగా మంచి మాన్యత లభిస్తోంది. పై తరగతికి చెందిన వాళ్లలో తానూ ఒకడినయానన్న ఆలోచనతో ఆయన ఆనందంగా ఉన్నాడు. పరస్త్రీ వ్యామోహం లేదుట ఆయనకి. ఆయన సంసార జీవితం ప్రశాంతంగానే సాగిపోతున్నదట, ఏవో సాధారణంగా భార్యాభర్తల మధ్య వచ్చే తగువులు మినహాయించి, ప్రత్యేకమైన దురలవాట్లేమీ లేవుట ఆయనకి. తరుచు ప్రార్థన చేస్తూ ఉంటాడుట. దేవుణ్ణి ఆరాధిస్తూ ఉంటాడుట. "ఇదేమిటంటారు? నాకేవిధమైన సమస్యలూ లేవేం?" అని అడిగాడు. సమాధానం కోసం ఆగకుండానే, తృప్తిపడుతున్నట్లుగానూ, ఏదో దైన్యం ఉట్టిపడుతున్నట్లుగానూ చిరునవ్వు నవ్వుతూ తన గత చరిత్రంతా చెప్పటం మొదలుపెట్టాడు - ఆయన ఏం పనిచేస్తూ ఉండేవాడో,

తన పిల్లలకు ఎటువంటి చదువు చెప్పించాడో - అదంతా. తాను ధారాళంగా దానాలు చెయ్యకపోయినా, కొద్దోగొప్పో ఇక్కడా అక్కడా ఇచ్చాడుట. ప్రతివాడూ ఈ ప్రపంచంలో ఒక విశిష్టస్థానాన్ని సంపాదించుకునేందుకు కష్టపడాలని అయన దృఢాభిప్రాయం.

మాన్యత అనేది ఒక శాపం. మనస్సునీ, హృదయాన్నీ హరించి వేయగలిగేటంత 'చెడ్డది'. మనకు తెలియకుండానే మనలో దూరి మన ప్రేమను ధ్వంసం చేస్తుంది. మాన్యత పొందటం అంటే విజయం సాధించినట్లు భావించటం, ప్రపంచంలో తన కొక స్థానాన్ని ఏర్పరచుకోవటం, తన చుట్టూ సుస్థిరత అనే గోడ కట్టుకోవటం, ధనం, అధికారం, విజయం, సామర్థ్యం, సద్గుణం - వీటన్నిటి మూలంగా వచ్చే ఒక విధమైన ధీమాతో ఉండటం. ఈ ధీమాతో వచ్చే ప్రత్యేకత మూలంగా, సమాజం అనే మానవ సంబంధం పట్ల ద్వేషం, విరోధం బయలుదేరుతాయి. మాన్యత పొందిన వారు ఎప్పుడూ సమాజంలో ముఖ్యులు. సంఘర్షణకీ దుఃఖానికీ వారే ఎప్పుడూ కారకులవుతారు. ద్వేషింపబడేవారిలాగే మాన్యత పొందినవారు కూడా పరిస్థితులకు బానిసలే. తమ చుట్టూ ఉన్న పరిసరాలు పరంపరగా వస్తున్నవి. వాటి ప్రభావాలు వారికెంతో ముఖ్యం. ఇవే వారిలోని లేమిని దాచి ఉంచుతాయి. మాన్యత పొందిన వారెప్పుడూ తమ్ము తాము రక్షించుకుంటూ భయంతోనూ, అనుమానంతోనూ ఉంటారు. వారి హృదయాల్లో ఎప్పుడూ భయమే. అందుచేత ఆగ్రహమే వారి సుగుణం. వారికి రక్షణ నిచ్చేవి వారి సద్గుణమూ, భక్తీ. వారు లోపల శూన్యంగా ఉండి, కొట్టగానే పెద్ద చప్పుడు చేసే మద్దెలవంటివారు. మాన్యత పొందినవారు సత్యాన్ని ఎప్పటికీ ఎదుర్కోలేరు. ద్వేషించబడేవారి లాగే, వీరు కూడా తమ అభివృద్ధి కోసం పడే తాపత్రయంలోనే మునిగి ఉంటారు. వారు సత్యాన్ని తప్పించుకుంటున్నందు వల్ల ఆనందం అనేది లభ్యంకాదు వారికి.

దురాశ లేకుండా ఉండటానికీ, ఔదార్యం లేకుండా ఉండటానికీ దగ్గర సంబంధం ఉంది. రెండూ స్వార్థాన్ని కప్పిపుచ్చే పద్ధతులే - అవి స్వార్థ పరాయణతకు మరో అదృశ్య రూపం. దురాశ ఉంటే చురుకుగా ఉండాలి, నలుగురితో తిరగాలి, శ్రమించాలి, పోటీ చెయ్యాలి, బలంగా ముందుకు తోసుకుపోవాలి. ఈ పట్టుదల లేకుండా ఉంటే మీకు దురాశలేనట్లు కాదు;

స్వార్థాన్ని కప్పి ఉంచటం మాత్రమే. నలుగురితో కలపటం ఇబ్బంది, బాధాకరమైన విషయం. అందుచేత దురాశ లేకుండా ఉండటం అనే మాటలతో స్వార్థపరాయణతని కప్పిపుచ్చటం జరుగుతోంది. చేతితో ఔదార్యం చూపించటం ఒకటి, హృదయంలో ఔదార్యం ఉండటం ఒకటి. చేతితో ఔదార్యం చూపించటం సులభమయిన పనే, మీకున్న సంస్కృతి, సందర్భాలను బట్టి. కాని హృదయంలో ఔదార్యం ఉండటానికి ఎంతో ప్రగాఢమైన అర్థం ఉంది. దానికి విస్తారమైన చైతన్యం, అవగాహనా అవసరం. ఉదారంగా ఉండకపోవటం కూడా సంతోషదాయకంగానే ఉంటుంది. అది కూడా మూఢ స్వార్థతత్పరతే. ఇది బహిరంగంగా వ్యక్తం కాదు. ఈ స్వార్థతత్పరతతో చేసే పనులు వేరు. కలల్లో చేసేవాడి చర్యల్లాగ అవి మెలకువ తెప్పించవు. మెలకువ వస్తే చాలా బాధాకరంగా ఉంటుంది. అందుచేత చిన్నవాళ్లూ, ముసలివాళ్లూ, అందరూ ఎందుకొచ్చిన బాధ ఇదంతా, మామానాన మమ్మల్ని వదిలేసి, గౌరవంగా బ్రతికినన్నాళ్లు బ్రతకనిచ్చి తరువాత చచ్చిపోనివ్వండి అంటారు.

హృదయ ఔదార్యం లాగే చేతి ఔదార్యం కూడా బహిరంగ కార్యక్రమమే. కాని, అది తరుచు బాదాకరంగా, వంచకంగా, స్వార్థం బయటపడిపోయేట్లుగా ఉంటుంది. చేతితో ఔదార్యం చూపించటం సులభంగానే అలవడుతుంది. కాని హృదయ ఔదార్యం అలవరచుకుంటే వచ్చేది కాదు. కూడబెట్టటం అనేది ఎంత మాత్రం లేకుండా ఉన్నప్పుడు ఏర్పడే స్వేచ్ఛ అది. క్షమించాలి అంటే, మనస్సులో మానని గాయం ఏదో ఉన్నట్లే కదా. మనస్సు గాయపడింది అంటే స్వాభిమానం కూడబెట్టి ఉండటం వల్లనేకదా. "నా", "నాది" అని అనుకున్నప్పుడు హృదయంలో ఔదార్యం ఉండదు.

## 11. రాజకీయాలు

అటుపైన కొండల్లో రోజంతా వర్షం కురుస్తూనే ఉంది. సన్నని జల్లుగా కాదు. రోడ్లన్నీ ముంచెత్తి, కొండపక్కల ఉన్న చెట్లుపడిపోయేట్లూ, కొండరాళ్లు దొర్లి క్రింద పడేట్లూ, హోరుమంటూ కొన్ని గంటలసేపు నీరు కొట్టుకొచ్చేట్లు

కురిసే కుంభవృష్టి అది. చిన్నకుర్రాడొకడు ఒళ్లంతా నీటిలో నానుతూ చిన్న నీటిమడుగులో ఆడుకుంటున్నాడు, వాళ్లమ్మ కోపంతో గొంతుచించుకుని అరుస్తున్నా లెక్కచెయ్యకుండా. ఆ బురద రోడ్డు మీద మేము పైకి నడిచి వెడుతూంటే, ఒక ఆవు క్రిందికి వస్తోంది. మబ్బులు విచ్చుకుని నీళ్లన్నీ, క్రిందికి దిమ్మరిస్తున్నట్లుగా ఉంది. మేము పూర్తిగా తడిసిపోయాం. పై బట్టలన్నీ విప్పేశాం. వాన ఒంటికి తగుల్తూంటే ఎంతో బాగుంది. ఇల్లు పైన కొండవైపున ఉంది. కొండ క్రింద చిన్న పట్నం ఉంది. పడమర వైపు నుంచి బలంగా గాలి వీస్తోంది. దానితోబాటే మరింత ఉధృతమైన కారుమబ్బుల్ని వెంటబెట్టుకొస్తోంది.

గదిలో చలిమంట మండుతోంది. గదిలో చాలామంది వేచి ఉన్నారు ఎన్నో మాట్లాడాలని. వానజల్లు కిటికీల మీద కొట్టి లోపల గదిలో మడుగులా చేసింది. చిమ్నీలోంచి కూడా నీళ్లు క్రిందికి కారి, మంటలకి తగిలి చిటపట మంటున్నాయి.

ఆయన చాలా ప్రఖ్యాతి గాంచిన రాజకీయవేత్త. వాస్తవ దృక్పథం ఉన్నవాడు. ఆయన ఎంతో మనఃపూర్వకంగానూ, హృదయపూర్వకంగానూ దేశాన్ని అభిమానించే మనిషి. సంకుచిత స్వభావంలేదు. స్వలాభాపేక్ష లేదు. ఆయన ఆకాంక్షించేది తన కోసం కాదు, ఆదర్శం కోసం, ప్రజల కోసం. ఊరికే బల్లగుద్ది ఉపన్యాసాలిచ్చి ఓట్లు సంపాదించేరకం కాదాయన. తన ఆదర్శంకోసం కష్టాలనుభవించాడు. అయినా చిత్రం, ఆయనేమీ విచారించటం లేదు. పండితుడులా ఉన్నాడు గాని రాజకీయవేత్తలా అంతగా లేడు. కాని, రాజకీయాలాయనకి ప్రాణం. ఆయన పార్టీకి ఆయన ఎంత చెబితే అంత - కొంత భయభక్తులతోనే. ఆయన కూడా ఎన్నో కలలు కన్నాడు. కాని వాటన్నిటినీ వదిలేసుకున్నాడు రాజకీయాల కోసం. ఆయన స్నేహితుడొకాయన, ప్రముఖ ఆర్థికవేత్త. ఆయన కూడా ఈయనతో పాటు ఉన్నాడు. అపారమైన ప్రభుత్వ ఆదాయపు వివరాలూ, విపులమైన సిద్ధాంతాలూ ఆయనకి తెలుసును. వామపక్షం, దక్షిణపక్షం - ఇరుపక్షాల ఆర్థిక వేత్తలతోనూ ఆయనకు పరిచయం ఉంది. మానవాళి ఆర్థిక విమోచన గురించి ఆయనవి కొన్ని సిద్ధాంతాలు ఉన్నాయి. సునాయాసంగా

మాట్లాడతాడు. మాటలకోసం తడుముకోవటం లేదు. వారిద్దరి ఉపన్యాసాలకూ జనం బాగా పోగవుతూ ఉంటారు.

దినపత్రికల్లోనూ, తక్కిన పత్రికల్లోనూ రాజకీయాలకూ, రాజకీయ వేత్తల భాషణలకూ, వారి కార్యక్రమాలకూ ఎంత చోటు కేటాయిస్తారో మీరు గమనించారా? ఇతర వార్తలు కూడా ఉంటాయి. నిజమే, కాని రాజకీయ వార్తలకే ప్రాముఖ్యం ఎక్కువ. ఆర్థిక, రాజకీయ జీవితమే అతి ముఖ్యమై పోయింది. బాహ్య పరిస్థితులు - సుఖం, డబ్బు, హోదా, అధికారం - ఇవే ప్రధాన స్థానం ఆక్రమించి మన బ్రతుకుని తీర్చిదిద్దుతున్నాయి. పై ఆడంబరం, పేరు, వేషం, సలామూ, జండా - వీటికి ప్రాముఖ్యం ఎక్కువవుతోంది. జీవిత పరమార్థాన్ని పూర్తిగా మరిచి పోయారు. కావాలనే అడుక్కి తోసేశారు. సాంఘిక, రాజకీయ కార్య రంగంలో పడిపోవటం ఎంతో సులభం - జీవితాన్ని సాకల్యంగా అర్థం చేసుకోవటం కన్న. ఏదో సిద్ధాంతంతో గాని, రాజకీయ కార్యక్రమంతోగాని, మత సంబంధమైన కార్యక్రమంతో గాని సంబంధం పెట్టుకోవటం వల్ల దైనందిన జీవితంలోని అల్పత్వం నుంచీ, ఆవేదన నుంచీ తప్పించుకోవటానికొక మార్గం లభిస్తుంది. హృదయం సంకుచితమైనదైనా, గొప్ప గొప్ప విషయాల గురించీ, ప్రజాప్రియులైన నాయకుల గురించీ మాట్లాడవచ్చు. మీలోని వెలితిని ప్రపంచ వ్యవహారాల చిలుకపలుకులతో కప్పిపుచ్చుకోవచ్చును. మీ అస్తిమితమైన మనస్సు హాయిగా ఉండొచ్చును. ప్రజల ప్రోత్సాహంతో ఒక పాత మతాన్నో, కొత్త మతాన్నో ప్రచారం చేస్తూ స్థిరపడిపోవచ్చును.

ఫలితాలతో రాజీపడటమే రాజకీయాలు. మనలో చాలామంది తాపత్రయ పడేది ఫలితాల కోసమే. ఫలితాలను సాధించి శాంతి భద్రతలను నెలకొల్పాలని ఆశిస్తాం. కాని, దురదృష్టవశాత్తూ అది అంత సులభంకాదు. జీవితం సర్వతోముఖమైన ప్రక్రియ - అంతర్ముఖమైన దానితోనూ, బహిర్ముఖమైన దానితోనూ కూడిన ప్రక్రియ. బాహ్యంగా వున్నదాని ప్రభావం తప్పనిసరిగా అంతర్గతంగా ఉన్నదానిపైన ఉంటుంది. కాని అంతర్గతమైనది ఎప్పటికైనా బాహ్యంగా ఉన్నదాన్ని లోబరుచుకుంటుంది. మీలోపల ఉన్నదే బయట పడుతుంది. బయటిదాన్నీ, లోపలిదాన్నీ విడదీసి ఒకదానితో

మరొకదానికి సంబంధం లేకుండా ప్రత్యేకమైన స్థానాల్లో బిగించి ఉంచలేము. ఎందువల్లనంటే, అవి నిరంతరం ఒకదానిపై మరొకటి ప్రభావం చూపుతూ ఉంటాయి. కాని, ఎప్పుడూ అంతర్గతంగా ఉన్న తృష్ణ, దాగి ఉన్న వాంఛలూ, ఉద్దేశాలూ శక్తిమంతంగా ఉంటాయి. జీవితం రాజకీయ, ఆర్థిక కార్యకలాపాల మీదే ఆధారపడినది కాదు. జీవితం అంటే పైకి కనిపించేది మాత్రమే కాదు - చెట్టు అంటే ఆకుగాని, కొమ్మగాని మాత్రమే కానట్లు. జీవితం ఒక సంపూర్ణ ప్రక్రియ. దాని సమైక్యతలోనే ఉంటుంది దాని అందం. పైకి రాజకీయ, ఆర్థిక వ్యవహారాలతో సమాధానపడినంత మాత్రాన సమైక్యత సిద్ధించదు. ఆ సమైక్యత కారణాలకీ, ఫలితాలకీ అతీతమైనట్టిది.

మనం ఎంతసేపూ కారణాలతోనూ ఫలితాలతోనూ ఆటలాడతాం తప్ప, వాటికి అతీతంగా పోలేము, మాటల్లో తప్ప. మన బ్రతుకులు శూన్యమైనవి, అర్థరహితమైనవి. అందువల్లనే రాజకీయ ఉద్రేకానికీ, మతాభిమానానికీ బానిసలమైపోయాం. మన జీవితాలను తీర్చిదిద్దే వివిధ ప్రక్రియలన్నీ సమైక్యం కావటంలోనే ఏదైనా ఆశ ఉంటుంది. మత సంబంధమైనది గానీ, రాజకీయమైనది గానీ, మరే సిద్ధాంతాన్ని గానీ అనుసరించి నందువల్ల సమైక్యత సిద్ధించదు. విస్తృతమైన ప్రగాఢమైన ఎరుక, చైతన్యం ఉన్నప్పుడే అది సాధ్యమవుతుంది. ఈ ఎరుక చైతన్యపు లోతుల్లోకి కూడా పోవాలి. ఊరికే పైపై ఫలితాలతో తృప్తిపడితే చాలదు.

## 12. అనుభవం పొందటం

ఆ లోయ మీద నీడ పడుతోంది. అస్తమిస్తున్న సూర్యుడు దూరాన ఉన్న కొండ శిఖరాలను తాకుతున్నాడు. ఆ సంధ్యా కాంతి కొండల లోపల నుంచి వస్తున్నట్లుగా కనబడుతోంది. ఆ సుదీర్ఘ మార్గానికి ఉత్తరం వైపు కొండలు బోడిగా, గొడ్డుగా ఉన్నాయి అగ్నిప్రభావానికి గురియై. దక్షిణం వైపు కొండలు పువ్వుల పొదలతో, చెట్లతో నిండి పచ్చగా ఉన్నాయి. సుదీర్ఘమైన, సుందరమైన లోయ మధ్యనుంచి తిన్నగా పోతోంది ఆ మార్గం. ఆ సాయం

సమయంలో కొండలు ఎంతో దగ్గరగా, కలలో వలె, తేలిగ్గా సున్నితంగా ఉన్నట్లనిపిస్తోంది. పెద్దపెద్ద పక్షులు ఎంతో తేలిగ్గా చుట్టూ తిరుగుతున్నాయి ఆకాశంలో. నేలమీద పాకే ఉడతలు బద్ధకంగా రోడ్డుకడ్డంగా పోతున్నాయి. దూరం నుంచి విమానాల మోత వినిపిస్తోంది. దారికిరుప్రక్కలా నారింజ తోటలు తీరుగా పరిశుభ్రంగా ఉన్నాయి. రోజంతా ఎండలో ఊదారంగు సబ్జా ఆకుల వాసన ఘాటుగా వస్తోంది. ఎండిన నేల వాసన, ఎండుగడ్డి వాసనా కూడా అలాగే ఉంది. కొట్టొచ్చే రంగులో ఉన్న నారింజ పళ్లతో చెట్లు ముదురురంగులో కనిపిస్తున్నాయి. కోలంకి పిట్టలు అరుస్తున్నాయి. ఒక వీధి కుక్క పొదల మాటున దూరింది. కుక్కచేసిన శబ్దానికి పొడుగాటి తొండ ఒకటి ఎండుకొమ్మల్లోకి తుర్రుమని పారిపోయింది. సాయంకాలపు నిశ్చలత భూమినిండా పరుచుకుంటోంది.

అనుభవం ఒకటి, అనుభవం పొందటం వేరొకటి. గతానుభవం అనేది అనుభవించడానికి ప్రతిబంధకం. గతానుభవం ఎంత ఆహ్లాదకరమైనదైనా, ఎంత అసహ్యకరమైనదైనా, ప్రస్తుతం 'అనుభవిస్తూ ఉండటం' అనేదాన్ని వికసించనియ్యదు. అనుభవం అప్పటికే గతకాలంలో కలిసిపోయినట్టిది. అప్పటికే గతంలో చేరిపోయినట్టిది, అది జ్ఞాపకంగా మిగిలిపోయి, ప్రస్తుతంలో జరిగే దానికి ప్రతిక్రియగా మాత్రమే సజీవమవుతుంది. జీవితం అంటే వర్తమానం. అనుభవం వర్తమానం కాదు; గతానుభవం యొక్క భారమూ, బలమూ ప్రస్తుతాన్ని మరుగుపరుస్తాయి. దానివల్ల ప్రస్తుతం అనుభవిస్తూ ఉన్నది కూడా గతానుభవంగా మారుతుంది. మనస్సే గతానుభవం, అది తెలిసినదే. అది ఎప్పటికీ అనుభవం పొందుతూ ఉన్న స్థితిలో ఉండదు. ఎందుకంటే మనసు అనుభవం పొందుతూ ఉండటం అన్నది గతానుభవం కొనసాగటం మాత్రమే. మనస్సుకి అవిచ్ఛిన్నంగా కొనసాగటం మాత్రమే చేతనవును. అది కొనసాగుతున్నంత కాలం కొత్తదాన్ని దేన్నీ గ్రహించలేదు. కొనసాగుతున్నదానికి కొత్త అనుభవం పొందే స్థితిలోకి రావటం కుదరదు. అనుభవం పొందటానికి గతానుభవం ఒక సాధనం కాదు, గతానుభవం లేకుండా ఉన్నప్పుడే అనుభవం పొందటం సాధ్యమవుతుంది. ప్రస్తుతం

అనుభవం పొందుతూ ఉండటానికి గతానుభవం ఉండకూడదు.

మనస్సు తన స్వీయరూపాన్నీ, తనకు తెలిసిన దాన్నీ మాత్రమే ఆహ్వానించగలదు. మనస్సు అనుభవం పొందటం ఆగిపోయేంతవరకు తెలియని దాన్ని అనుభవం పొందటం సాధ్యం కాదు. అనుభవం వ్యక్తం కావటమే ఆలోచన. ఆలోచన జ్ఞాపకానికి ప్రతిక్రియ. ఆలోచన అడ్డు వస్తున్నంత వరకూ అనుభవం పొందటం అనేది సాధ్యం కాదు. అనుభవాన్ని అంతమొందించే మార్గంగాని పద్ధతిగాని లేదు. ఆ మార్గమే అనుభవం పొందకుండా ఆటంకపరుస్తుంది. గమ్యాన్ని తెలుసుకొని ఉండటం అంటే కొనసాగుతున్న దాన్ని తెలుసుకోవటమే. గమ్యానికొక మార్గం ఉండటమంటే తెలిసిన దాన్ని కాపాడుకోవటమే. సాధించాలనే కోరిక సమసిపోవాలి. ఈ కోరికే గమ్యాన్నీ, మార్గాన్నీ కూడా సృష్టిస్తోంది. అనుభవం పొందటానికి నమ్రత అవసరం. కాని అనుభవం పొందటాన్ని కూడా అనుభవంలోకి ఇముడ్చుకోవాలని మనస్సుకి ఎంత ఆతురత! కొత్త దాన్ని పాతదిగా చేసెయ్యాలని ఎంత వెంటనే ఆలోచిస్తుంది! దాంతో అనుభోక్త (అనుభవం పొందేది) అనీ, అనుభూతమూ (అనుభవింపబడినది) అనీ వేరుచేసి, వాటి రెండింటికీ మధ్య సంఘర్షణ బయలుదేరతీస్తుంది.

అనుభవం పొందేస్థితిలో అనుభోక్త (అనుభవించేది) అనిగాని, అనుభూతము (అనుభవింపబడినది) అనిగాని ఉండదు. చెట్టు, కుక్క, సాయంకాలపు నక్షత్రం - వీటికి అనుభోక్త, అనుభవించడం అని ఏమీ లేదు. అనుభవం పొందుతూ ఉండటం మాత్రమే ఉంది. ద్రష్టకీ, దృశ్యాలకీ మధ్య అంతరం లేదు, వ్యవధి లేదు, విరామ స్థలంలేదు, ఆలోచనకి తావులేదు. ఆలోచనకు తనకు తాను వ్యక్తిత్వాన్నిచ్చుకునే సావకాశం లేదు. ఆలోచన అనేదే ఉండదు. కాని అస్తిత్వం ఉంటుంది. ఆవిధంగా అస్తిత్వం ఉండే స్థితిని ఊహించటంగాని ధ్యానించటం గాని సాధ్యమవదు. అది సాధించగల విషయం కాదు. అనుభవించేది (అనుభోక్త) అనుభవించటం మానుకోవాలి. అప్పుడే అస్తిత్వం ఉంటుంది. దాని సంచలనంలోని ప్రశాంతతలోనే కాలరహితమైనది ఉంటుంది.

# 13. సద్గుణం

సముద్రం ప్రశాంతంగా ఉంది. తెల్లని ఇసుక మీద ఒక్క అల అయినా లేదు. ఆ విశాలాఖాతానికి ఉత్తరం వైపు చుట్టూ పట్టణం ఉంది. దక్షిణం వైపు కొబ్బరి చెట్లున్నాయి దాదాపు నీటికి తగుల్తూ. ఇసుప కమ్మీకి అవతల ఉన్న పెద్ద చేపల్లో మొదటిది కొద్దిగా కనిపిస్తోంది. వాటికవతల చేపలవాళ్ల పడవలూ, లావాటి తాళ్లతో కట్టేసిన కొన్ని దుంగలూ ఉన్నాయి. కొబ్బరి చెట్లకు దక్షిణంగా ఉన్న గ్రామానికి వెడుతున్నారు వాళ్లు. సూర్యాస్తమయం దేదీప్యమానంగా ఉంది - మామూలుగా ఉంటుందనుకునే చోట కాక తూర్పువైపున. అది సూర్యాస్తమయపు ప్రతిబింబం మాత్రమే. అందమైన ఆకృతుల్లో ఉన్న పెద్ద పెద్ద మేఘాలు సూర్యకిరణం ప్రతిఫలించే రంగు లన్నిటితోనూ వెలుగుతున్నాయి. అది నిజంగా అద్భుతంగా, భరించలేమన్నట్లుగా ఉంది. నీటిపైన కూడా ఆ కాంతివంతమైన రంగులు పడి అనంతాకాశానికి కాంతిపథాన్ని సృష్టించాయి.

పట్నం నుంచి పల్లెలకి తిరిగి వెడుతున్న కొంతమంది చేపలవాళ్ళు మినహా, ఆ సముద్రపు ఒడ్డు దాదాపు నిర్మానుష్యంగా, నిశ్శబ్దంగా ఉంది. మేఘాలకు పైన ఒకే ఒక్క నక్షత్రం కనిపిస్తోంది. మేము తిరిగి వస్తూంటే ఒక స్త్రీ మాతో బాటు చేరి గంభీరమైన విషయాలు మాట్లాడటం మొదలు పెట్టింది. ఆవిడ ఒక సంఘంలో చేరిందిట. ఆ సంఘ సభ్యులు ధ్యానం చేస్తారుట. ముఖ్యమైన సద్గుణాలన్నిటినీ అలవరచుకుంటారుట. ప్రతినెలా ఒక సద్గుణాన్ని ఎంచుకుని, ఆ నెలంతా దాన్ని సాధన చేసి ఆచరణలో పెట్టటం జరుగుతుందిట. ఆవిడ ధోరణిని బట్టీ, మాట్లాడిన దాన్ని బట్టీ, ఆత్మశిక్షణలో ఆవిడ బాగా తర్ఫీదు పొందిన దానిలాగ, ఆవిడ మనోభావాలకీ, ఉద్దేశాలకీ వ్యతిరేకంగా ఉన్నవారిపట్ల కొంత అసహనం ఉన్నదానిలాగ కనిపించింది.

సద్గుణం హృదయానికి సంబంధించినది; మనస్సుకి చెందినది కాదు. మనస్సు ఒక సద్గుణాన్ని అలవరచుకుంటున్నదంటే బాగా కపటంగా ఆలోచిస్తున్నట్లే. అదొక ఆత్మరక్షణ - పరిసరాల కనుగుణంగా, తెలివిగా సర్దుకుపోవటమే. స్వీయపరిపక్వత కోసం ప్రయత్నించటం అంటే సద్గుణాన్ని

వదులుకోవటమే. భయం ఉంటే సద్గుణం ఎలా ఉంటుంది? భయం ఎప్పుడూ మనస్సులో ఉంటుంది, హృదయంలో కాదు. భయం అనేక రూపాల్లో - సద్గుణం, మాన్యత, సర్దుకుపోవటం, సేవ మొదలైన వాటిలో దాక్కుంటుంది. మానసిక సంబంధాల్లోనూ, మానసిక కార్యకలాపాల్లోనూ భయం ఎప్పుడూ ఉంటుంది. మనస్సూ, దాని చర్యలూ వేరువేరు కావు. కాని అదే వేరు చేస్తుంది - తను కొనసాగుతూ ఉండటానికీ, స్థిరత్వం పొందటానికీ. కుర్రవాడు పియానో మీద సాధన చేసినట్లు మనస్సు కూడా నైపుణ్యంతో సద్గుణాన్ని సాధన చేస్తుంది - తన్ను తాను సుస్థిరం చేసుకోవటానికీ, జీవితాన్ని ఎదుర్కోవటంలో ఆధిక్యం పొందటానికీ, లేదా, తాను మహోన్నత మనుకుంటున్న దాన్ని సాధించటానికీ. జీవితాన్ని ఎదుర్కోవటానికి సంసిద్ధత ఉండాలి. అంతేగాని, తన చుట్టూ తాను గీత గీసుకున్నట్లు సద్గుణమనే గౌరవ ప్రదమైన గోడ కట్టుకోవటం కాదు కావలసినది. మహోన్నతమైన దాన్ని ప్రయత్నించి సాధించలేము. దానికి మార్గంలేదు. లెక్క ప్రకారం క్రమంగా అభివృద్ధి చెందటమంటూ లేదు. సత్యం దానంతట అదే రావాలి. మీరు దాని దగ్గరకు పోలేరు. మీరు అలవరచుకుంటున్న సద్గుణం మిమ్మల్ని అక్కడికి చేర్చలేదు. మీరు సాధించేది సత్యంకాదు. కేవలం మీ స్వయం సంకల్పిత వాంఛ మాత్రమే. ఒక్క సత్యంలోనే ఆనందం ఉంటుంది.

తను సుస్థిరంగా ఉండాలని, మనస్సు గడుసుగా సర్దుకుపోవటంలోనే భయాన్ని పోషిస్తూ ఉంటుంది. ఈ భయాన్నే పూర్తిగా అవగాహన చేసుకోవాలి గాని, సద్గుణంతో ఉండటం ఎలాగా అని కాదు. అల్పమనస్సు సద్గుణాన్ని అవలంబించినా దాని అల్పత్వం పోదు. దాని అల్పత్వాన్ని తప్పించుకోవటానికి చేసే ప్రయత్నమే అవుతుంది సద్గుణం. అటువంటి సద్గుణం కూడా అల్పమైనదే అవుతుంది. ఈ అల్పత్వాన్ని అర్థం చేసుకోనట్లయితే సత్యాన్ని అనుభవం పొందటం ఎలా సాధ్యమవుతుంది? అల్పమైన మనస్సు సద్గుణాలు అవలంబించినా పరిమితులు లేని దానిని ఎలా ఆహ్వానించ కలుగుతుంది?

మానసిక ప్రవృత్తిని, అంటే, తనని తాను అర్థం చేసుకోవటంలోనే సద్గుణం కలుగుతుంది. సద్గుణం అంటే కూడబెట్టిన నిరోధక శక్తి కాదు.

సద్గుణం అంటే ఉన్నస్థితిని అప్రయత్నంగా తెలుసుకోవటమూ, అవగాహన చేసుకోవటమూ. మనస్సు అవగాహన చేసుకోలేదు. అవగాహన అయిన దాన్ని ఆచరణలోకి అనువదించవచ్చు, అంతేగాని, అవగాహన మాత్రం చేసుకోలేదు. అర్థం చేసుకోవటానికి గుర్తించే, గ్రహించే ఆర్ద్రత అవసరం. మనస్సు ప్రశాంతంగా ఉన్నప్పుడు అటువంటి ఆర్ద్రతని హృదయం మాత్రమే అందివ్వ గలుగుతుంది. కాని మానసిక ప్రశాంతత నైపుణ్యంతో, పరిశ్రమతో వచ్చేది కాదు. ప్రశాంతత కావాలనే కోరికే దాన్ని సాధించటానికి ఒక శాపం; దానితో అనంతమైన సంఘర్షణలూ, బాధలూ; ప్రతికూలంగాగాని, అనుకూలంగా గాని ఏదో అవాలని తాపత్రయ పడటం అంటే హృదయంలోకి సద్గుణాన్ని చేరనివ్వకపోవటమే. సద్గుణం సంఘర్షణ కాదు. సాధించవలసిన ఘనత కాదు, సాధన కొనసాగించటం కాదు, ఫలితం పొందడం కాదు. స్వయం సంకల్పిత వాంఛలేని స్థితి అది. మరొక స్థితికోసం ప్రయాసపడుతూ ఉంటే మనం సహజ స్థితిలో లేనట్లే. మరేదో అవాలని కష్టపడుతున్నప్పుడు ఉన్న స్థితిలో లేనట్లే. మరొక స్థితికోసం పడే కష్టంలో ప్రతిఘటన, ఇంద్రియ సంయమనం, శరీర శోషణ, సన్యసించడం ఉంటాయి. వీటిని అధిగమించటం కూడా సద్గుణం కాదు. ఏదో అవాలనే తాపత్రయం లేకుండా స్వేచ్ఛగా ఉన్నప్పుడు ఉండే ప్రశాంతతే సద్గుణం. ఈ ప్రశాంతత హృదయంలో ఏర్పడినది, మనస్సులోనిది కాదు. సాధన చేసి, పట్టుదల పట్టి, ప్రతిఘటించి మనస్సుని ప్రశాంతంగా చెయ్యవచ్చు. కాని, అటువంటి శిక్షణ హృదయం యొక్క సద్గుణాన్ని నాశనం చేస్తుంది. సద్గుణం లేకపోతే శాంతి ఉండదు. ఆనందం ఉండదు. హృదయం యొక్క సద్గుణమే అవగాహన.

## 14. హృదయ నిరాడంబరత

ఆకాశం తెరిపిగా నిండుగా ఉంది. విశాలంగా రెక్కలు తెరుచుకుని ఒక లోయ మీంచి మరొక లోయ మీదికి సునాయాసంగా ఎగిరివెళ్లే పెద్ద పక్షులు లేవు ఎక్కడా ఒక్క మేఘం కూడా కదలటం లేదు. చెట్లు నిశ్చలంగా ఉన్నాయి. నీడలో కొండల మలుపులన్నీ తెలుస్తున్నాయి. ఆత్రుతగా ఉన్న

లేడి ఒకటి పట్టరాని కుతూహలంతో చూస్తోంది. మా రాకతో మెరుపులా మాయమైపోయిందది. మట్టిరంగు పొద క్రింద బోదురు కప్ప ఒకటి వెడల్పాటి కొమ్ములతో పెద్ద కళ్లతో చలనం లేకుండా ఉంది. పశ్చిమం వైపు కొండలు అస్తమిస్తున్న సూర్యకాంతిలో మొనదేలి స్పష్టంగా కనిపిస్తున్నాయి. వాటికి బాగా దిగువున ఒక పెద్ద భవనం ఉంది. దానిలో ఈతలాడే నీటిమడుగు ఉంది. అందులో ఎవరో కొంతమంది ఉన్నారు. ఆ ఇంటి చుట్టూ అందమైన తోట ఉంది. ఆ ప్రదేశం సంపదతో తులతూగుతూ, మిగతావాటికి దూరంగా ఒకవిధమైన ధనిక వాతావరణంలో ఉన్నట్లు కనిపిస్తోంది. ఇంకా దిగువున దుమ్ముతో నిండిన దారి ప్రక్కన ఎండిపోయిన పొలంలో ఒక చిన్న గుడిసె ఉంది. దారిద్ర్యం, అశుభ్రత, కాయకష్టం, అన్నీ అంత దూరం నుంచే కనిపిస్తున్నాయి. అంత ఎత్తునుంచి చూచినప్పుడు ఆ రెండింటికీ అట్టే ఎడం కనిపించలేదు. కురూపితనం, అందం, రెండూ ఒకదాన్ని ఒకటి అంటి పెట్టుకునే ఉన్నాయి.

వస్తు వాహనాలు కలిగి ఉండటంలో నిరాడంబరత కన్న హృదయ నిరాడంబరత చాలా ముఖ్యమైనది, అర్థవంతమైనది. ఏవో కొద్ది వస్తువులతో తృప్తిపడి ఉండటం అంత కష్టం కాదు. సౌఖ్యాన్ని వదులుకోవటం, ధూమపానం మొదలైన అలవాట్లను మానివెయ్యటం - ఇవి హృదయ నిరాడంబరతని సూచించవు. వేషభూషణాలతో, సౌఖ్యాలతో, అనేక ఆకర్షణ లతో నిండి ఉన్న ప్రపంచంలో గోచీగుడ్డ కట్టుకుని తిరిగినంత మాత్రాన స్వేచ్ఛా జీవనాన్ని సూచించదు. సంసారాన్నీ, ప్రాపంచిక ధర్మాల్నీ త్యజించిన మనిషికే లోలోపల కోరికలూ, కాంక్షలూ దహించివేస్తూ ఉంటాయి. పైకి సన్యాసి వేషం వేసినా శాంతి అనేది ఎరుగడు. అతని కన్నులు నిత్యం దేనినో అన్వేషిస్తూనే ఉంటాయి. అతని మనస్సుని సంశయాలూ, ఆశలూ దొలుస్తూ ఉంటాయి. పైకి క్రమశిక్షణ అలవరచుకుంటారు. అన్నిటినీ త్యజిస్తారు. క్రమక్రమంగా మీ లక్ష్యాన్ని చేరుకోవటానికి మీ పథాన్ని మీరు నిర్మించుకుంటారు. మీ అభివృద్ధిని సద్గుణాల కొలమానంతో కొలుచుకుంటారు - ఇది మానేశారో లేదో, అది మానేశారో లేదో, మీ ప్రవర్తనలో ఏ మాత్రం నిగ్రహం చూపిస్తున్నారో, ఎంత సహనం, ఎంత దయ చూపిస్తున్నారో, అంటూ. మనస్సుని కేంద్రీకృతం

చేసే కళను అభ్యసిస్తారు. అడవుల్లోకి గాని, మఠంలోకి గాని, ఏదైనా చీకటి గదిలోకి గాని వెళ్లిపోతారు ధ్యానం చేసుకోవటానికి. పైకి మాత్రం మీ జీవితాన్ని నిరాడంబరంగా చేసుకుంటారు. ఇలా జాగ్రత్తగా ఆలోచించి తయారు చేసుకున్న పథకం ప్రకారం ఈ లౌకిక ప్రపంచానికి అతీతమైన సౌఖ్యాన్ని పొందాలని ఆశిస్తారు.

కాని, వాస్తవికతని బాహ్యానిగ్రహాల ద్వారా, ఆంక్షల ద్వారా చేరుకోగలరా? బాహ్యనిరాడంబరత, సుఖాల్ని వదులుకోవటం అవసరమే అయినా, ఆ మాత్రం చేష్టకే యథార్థం అనేదానికున్న ద్వారం తెరుచుకుంటుందా? సౌఖ్యంతో, విజయంతో మనస్సు, హృదయం భారమైపోతాయి. ప్రయాణం చెయ్యాలంటే స్వేచ్ఛగా ఉండాలి. అయితే, మనం ఈ బాహ్య చేష్టతోనే ఎందుకంత సతమతమైపోతున్నాం? మన ఉద్దేశాన్ని బాహ్య రూపంలో పెట్టటానికి ఎందుకంత ఉత్సుకత, ఎందుకంత పట్టుదల? ఇది ఆత్మవంచన వల్ల కలిగే భయం వల్లనా, మరొక కారణం వల్లనా? మన చిత్త శుద్ధి గురించి మనల్ని మనమే నమ్మించుకోవాలని ఎందుకు కోరుకుంటాం? సుస్థిరంగా ఉండాలనే కోరికలోనూ, ఏదో అయితే మనకి ఘనత ఉంటుందన్న నమ్మకంలోనూ ఈ సమస్యంతా ఇమిడి ఉంది.

ఏదో అవాలనే కోరికతోనే చిక్కులన్నీ ఆరంభమవుతాయి. ఏదో అవాలి అనే కోరిక లోపలా, బయటా కూడా అంతకంతకు పెరిగిపోవటం వల్ల కూడబెట్టు కోవటం, త్యజించటం, అలవరచుకోవటం, లేదా వదులుకోవటం చేస్తూ ఉంటాం. కాలం అన్నింటినీ దోచేస్తుందని తెలిసి కాలరహితమైన దానికోసం ప్రాకులాడతాం. ఏదో అవాలని చేసే ఈ పోరాటం - ఏదైనా చెయ్యటం ద్వారా గాని, మానెయ్యటం ద్వారా గాని, బంధనాలను పెంచుకోవటం ద్వారా గాని వాటిని వదులుకోవడం ద్వారా గాని, బాహ్య చేష్టలతో గాని, క్రమశిక్షణతోగాని, సాధనతో గాని ఎన్నటికీ అంతం కాలేదు. కాని, ఈ పోరాటాన్ని అవగాహన చేసుకోవటంతోనే, ఏ విధమైన, బాహ్య ప్రేరణా లేకుండా దానంతట అదిగా స్వేచ్ఛ కలుగుతుంది. బహిరంగంగానూ, ఆంతరంగికంగానూ జరిగే సేకరణ నుంచీ, అది కలిగించే సంఘర్షణల నుంచీ విముక్తి లభిస్తుంది. కేవలం బంధనాలను తెంచుకోవటం ద్వారా వాస్తవికతని

చేరుకోలేము. ఏమార్గాన్ని అవలంబించినా అది సాధ్యంకాదు. అన్ని మార్గాలూ, లక్ష్యాలూ ఒకే విధమైన బంధనాలు. అవన్నీ వదులుకోవాలి వాస్తవిక స్థితి కోసం.

## 15. వ్యక్తిలోని బహుముఖాలు

ఒకాయన తన శిష్యుల్ని వెంటబెట్టుకుని మమ్మల్ని చూడటానికి వచ్చాడు. వాళ్లలో అన్ని రకాల వాళ్లూ ఉన్నారు - డబ్బున్నవాళ్లూ, బీదవాళ్లూ, ఒక ఉన్నత ప్రభుత్వోద్యోగీ, ఒక వితంతువూ, మత దురభిమాని ఒకడూ, చిరునవ్వుతో ఉన్న ఒక యువకుడూ. వాళ్లంతా సరదాగా, సంతోషంగా ఉన్నారు. ఆ తెల్లటి ఇంటి మీద నీడలు నాట్యం చేస్తున్నాయి. దట్టంగా ఉన్న ఆకుల మధ్య చిలకలు కీచుగా అరుస్తున్నాయి. ఒక లారీ పెద్ద చప్పుడు చేస్తూ వెళ్ళింది. ఆ వచ్చిన వాళ్లలో యువకుడు, గురువుకి, బోధకుడికి ఎంత ప్రాముఖ్యం ఉందో ఎంతో తీవ్రంగా ఉద్ఘాటిస్తున్నాడు. తక్కిన వాళ్లు అతనితో ఏకీభవిస్తున్నారు. అతడు స్పష్టంగా, నిష్పక్షపాతంగా వాదిస్తూంటే ఆనందంతో చిరునవ్వు నవ్వుతున్నారు. ఆకాశం ఎంతో నీలంగా ఉంది. మెడదగ్గర తెల్లగా ఉన్న ఒక దేగ మాపైన చుట్టూ తిరుగుతోంది, రెక్కలు కొంచమైనా విదల్చకుండా. ఆ రోజు ఎంతో చక్కగా ఉంది. మనం ఒకరినొకరు ఎలా నాశనం చేసుకుంటాం - శిష్యుడు గురువునీ, గురువు శిష్యుణ్ణీ! అనుగుణంగా ఎలా వర్తిస్తూ ఉంటాం, విడిపోయి మరోలా ఎలా రూపొందుతూ ఉంటాం! ఒక పక్షి పొడుగాటి పురుగుని తడిమట్టి లోంచి లాగుతోంది.

మనలో ఉన్నవి ఎన్నో; ఒకటి కాదు. ఆ ఉన్నవన్నీ పోతేగాని ఒకటి అవదు. అవన్నీ ఒకటితో ఒకటి పోట్లాడుకుంటూ రోజూ రాత్రీ, పగలూ గొడవ చేస్తూ ఉంటాయి. ఈ పోరాటమే జీవితంలోని బాధ. ఒకదాన్ని నాశనం చేస్తాం. దాని స్థానంలో మరొకటి బయలు దేరుతుంది. ఈ రకంగా అనంతంగా సాగుతూ ఉన్నట్లుండేదే మన జీవితం. వాటిల్లో ఒకదానికి తక్కిన వాటి కన్న ఆధిక్యాన్నిస్తాం. కాని, ఆ ఒకటి త్వరలోనే అనేకం అవుతుంది. అనేకమైన వాటి గొంతు ఒక్కటిగా వినిపిస్తుంది. ఆ ఒక్క గొంతూ అధికారాన్ని చెలాయిస్తుంది.

అయినా, ఆ గొంతు వాగుతూనే ఉంటుంది. మనలో అనేక కంఠాలు, అన్నిటిలోకీ నిశ్శబ్దంగా ఉన్న ఒక కంఠాన్ని వినాలని ప్రయత్నిస్తాం. ఆ ఒక్క కంఠాన్నీ వినటానికి తక్కినవన్నీ నిశ్శబ్దంగా ఉన్నట్లయితే, ఆ ఒక్కదానిలో అనేకం ఉన్నట్లే. కాని, అనేకం ఎన్నటికీ ఆ ఒక్కదాన్ని కనుక్కోలేవు.

ఇప్పుడు మన సమస్య ఆ ఒక్క గొంతునీ ఎలా వినాలా అని కాదు; మొత్తం వాటి కూర్పుని, అనేకమైనవన్నీ కలిసి మనం ఎలా రూపొందామో అర్థం చేసుకోవటమే మన సమస్య. బహుముఖాల్లో ఒకటి అన్నిటినీ అర్థం చేసుకోలేదు. ఒక రూపం తక్కిన రూపాల్ని అధీనంలో ఉంచుకుని వాటికి శిక్షణ నిచ్చి, వాటిని తన పద్ధతిలో రూపొందించటానికి ప్రయత్నించినా, దాని ప్రయత్నాలన్నీ స్వార్థపరమైనవి, సంకుచితమైనవి గానే ఉంటాయి. మొత్తాన్ని దానిలోని ఒక భాగం ద్వారా అర్థం చేసుకోవటం సాధ్యంకాదు. అందువల్లనే మనం ఎప్పుడూ అర్థం చేసుకోలేము. మొత్తమంతా మనకెప్పుడూ కనిపించదు. ఆ మొత్తమంతా ఎలా ఉందో మనకు తెలియదు, ఎందుచేతనంటే, మనం ఎప్పుడూ ఒక భాగంతోనే వ్యవహరిస్తూ, తీరిక లేకుండా ఉంటాం. కాని, ఒక భాగం తన్నుతాను అనేకంగా విభజించుకుంటుంది. మొత్తమంతా తెలుసుకోవటానికీ, అనేకమైన వాటి మధ్య జరిగే సంఘర్షణని తెలుసుకోవటానికీ, కోరికని అర్థం చేసుకోవాలి. కోరికది ఒకే చర్య - అది రకరకాలుగా ఒకదానికొకటి వ్యతిరేకంగా కోరుతూ కృషి చేస్తున్నప్పటికీ, అవన్నీ కోరిక నుంచి పుట్టినవే. కోరికని ఉన్నతమైనదిగా చూడటంగాని అణచి వెయ్యటం గాని చెయ్యకూడదు. దాన్ని అర్థం చేసుకోవాలి, అర్థం చేసుకునేది అనేది లేకుండా. అర్థం చేసుకునే రూపం ఒకటి ఉన్నట్లయితే అది కూడా కోరిక రూపమే. అనుభవం పొందేది లేకుండా అర్థం అయినట్లయితే, అనేకం నుంచీ ఒక్కటినుంచీ కూడా స్వేచ్ఛ లభిస్తుంది.

అన్ని చర్యలూ - అనుగుణమైనవీ, నిరసించేవీ, విశ్లేషించేవీ, అంగీకరించేవీ, అన్నీ అనుభవం పొందే వాడిని, అంటే, అనుభోక్తను మరింత శక్తిమంతంగా చేస్తాయి. అనుభోక్త మొత్తమంతటినీ ఎన్నటికీ అర్థం చేసుకోలేడు. కూడబెట్టుకున్నదంతా కలిసినది అనుభోక్త. గతం నీడలో ఏదీ అర్థం కాదు. గతం మీద ఆధారపడటం వల్ల ఏదైనా మార్గం స్ఫురించవచ్చు.

కాని, ఏదో మార్గాన్ని అవలంబించటం అర్థం చేసుకోవటం కాదు. అర్థం అయేది మనస్సుకి చెందినది కాదు, ఆలోచనతో కూడినది కాదు. ఆలోచనకు నిశ్శబ్దంగా ఉండే శిక్షణ నిచ్చి మనస్సుతో ప్రమేయం లేని దానిని పట్టుకోజూచి నట్లయితే, అప్పుడు అనుభవంలోకి వచ్చేది గతం యొక్క ప్రతిరూపం మాత్రమే; ఈ ప్రక్రియ అంతా తెలుసుకోవటంలోనే అనుభోక్తతో ప్రమేయం లేని నిశ్శబ్దం ఉంటుంది. ఇటువంటి నిశ్శబ్దంలోనే అవగాహన కలుగుతుంది.

## 16. నిద్ర

శీతాకాలం, చలి విపరీతంగా ఉంది. చెట్లు మోడులైపోయాయి. ఆకులన్నీ రాలిపోయి కొమ్మలు బోడిగా ఉన్నాయి. ఎప్పుడూ పచ్చగా ఉండే చెట్లు అక్కడక్కడ ఉన్నాయి. అవి కూడా చల్లగాలులకూ రాత్రిళ్లు కురిసే మంచుకీ గురి అవుతున్నాయి. దూరాన ఎత్తైన కొండల నిండా దట్టంగా మంచు. వాటిపైన తెల్లటి కెరటాల్లాంటి మబ్బులు వ్రేలాడుతున్నాయి. గడ్డి మట్టిరంగులో ఉంది. ఎన్నో నెలల నుంచి వర్షాల్లేవు. వసంతకాలపు వానల కింకా చాలా కాలం పడుతుంది. భూమి నిద్రావస్థలో ఉన్నట్లు, సాగు చేయకుండా పడిఉన్నట్లుగా ఉంది. పచ్చని చెట్లమీద గూళ్లు కట్టుకుని కిలకిలమంటూ ఎగిరే పక్షుల్లేవు. దారులన్నీ గట్టిపడి మట్టికొట్టుకొని ఉన్నాయి. సరస్సులో కొన్నిబాతులు దక్షిణం వైపుకి మధ్యమధ్య ఆగుతూ పోతున్నాయి. కొత్త వసంతం వస్తుందని ఆశపెడుతున్నాయి పర్వతాలు. భూమి దానిగురించి కలగంటోంది.

నిద్ర అనేది లేకపోతే ఏమవుతుంది మనకి? ఇంకా కొట్లాడుకోవడానికీ, కుట్రలుపన్నటానికీ, అల్లరి తలపెట్టటానికీ మరింత సమయం దొరుకుతుందా? మనం మరింత క్రూరంగా, దయాదాక్షిణ్యాలు లేకుండా ఉంటామా? లేక, నమ్రత, దయ, పొదుపు చూపించేందుకు ఎక్కువ సమయం దొరుకుతుందా? మనం మరింత సృజనాత్మకంగా అవుతామా? నిద్ర చాలా చిత్రమైనది. దానికి అసాధారణమైన ప్రాముఖ్యం ఉంది. చాలా మందికి వారి దైనందిన చర్యలన్నీ రాత్రిళ్లు నిద్రలో కూడా కొనసాగుతూ ఉంటాయి. నిద్రలో కూడా వారి జీవితం

కొనసాగుతుంది, మందకొడిగానో, ఉత్సాహభరితంగానో, రుచీపచీలేని అర్థరహితమైన పోరాటం మరోస్థాయిలో విస్తృతమవుతుంది. నిద్ర వల్ల శరీరంలో పునరుత్తేజం కలుగుతుంది. దాని బ్రతుకు అది బ్రతికే లోపలి జీవికి పునరుద్ధరణం కలుగుతుంది. నిద్రలో కోరికలు నిద్రాణంగా ఉంటాయి. అందువల్ల జీవికి అడ్డంరావు. శరీరం పునర్వికాసం పొందిన మీదట కోరిక తన చర్యల్ని ఉత్సాహంతో విస్తృతం చేసుకోవటానికి మరింత అవకాశం కలుగుతుంది. లోపలి జీవి విషయంలో ఎంత తక్కువగా కలుగజేసుకుంటే అంత మంచిది నిజానికి. ఆ జీవి విషయమై మనస్సు ఎంత తక్కువగా వ్యవహరిస్తే దాని పనులు అంత ఆరోగ్యకరంగా, అంత సహజంగా ఉంటాయి. ఆ జీవికి జబ్బులు రావటం అన్నది వేరే విషయం - మనస్సు వల్ల వచ్చినవి గాని, దాని స్వీయ బలహీనత వల్ల వచ్చినవి గాని.

నిద్రకి ఎంతో అర్థం ఉంది. కోరికలు శక్తిమంత మవుతున్న కొద్దీ నిద్రకి అర్థం పోతుంది. కోరికలు పైకి కనిపించేవి అయినా, కనిపించనివి అయినా అన్నీ ప్రధానంగా పైన ఉండేవే. నిద్రా సమయంలో ఇవి పైకి కనిపించకుండా ఉంటాయి, తాత్కాలికంగా. నిద్ర కోరికకి వ్యతిరేకమైనది కాదు. నిద్ర అంటే ఏమీ లేకపోవటం అని కాదు - కోరిక చొరరాని స్థితి అని మాత్రమే. చైతన్యపు పై పొరలు స్తిమిత పడటం జరుగుతుంది నిద్రలో. అందుచేత అవి లోలోపలి పొరలు అందించే సమాచారాన్ని గ్రహించగలుగుతాయి. కాని ఇది సమస్య మొత్తంలో కొద్ది భాగాన్ని అర్థం చేసుకున్నట్లవుతుంది. చైతన్యపు పొరలన్నీ ఒక దాన్నొకటి, పని పాటలు చేసుకుంటున్న సమయంలోనూ, నిద్రపోతున్నప్పుడూ కూడా తెలుసుకోవటం నిస్సంశయంగా సాధ్యమవుతుంది. ఇది అవసరం కూడా. ఈ విధంగా తెలుసుకోవటం వల్ల మనస్సు తనకు తాను ఆపాదించుకున్న స్వీయ ప్రాముఖ్యం నుంచి స్వేచ్ఛ లభిస్తుంది. అందువల్ల ఇక మనస్సు ఆధిక్యం ఉన్న అంశంగా ఉండదు. ఆ విధంగా మనస్సు తన స్వార్థ పూరితమైన ప్రయత్నాలనూ, చర్యలనూ స్వేచ్ఛగా, సహజంగా వదులు కుంటుంది. ఈ ప్రక్రియలో ఏదో అవాలనే వాంఛ పూర్తిగా కరిగిపోతుంది. కూడబెట్టాలనే తొందర ఇక ఉండనే ఉండదు.

నిద్రలో జరిగేదింకా కొంత ఉంది. మన సమస్యలికి పరిష్కారం

దొరుకుతుంది అందులో చైతన్యంతో ఉండే మనస్సు నెమ్మదిగా ఉన్నప్పుడు పరిష్కారాన్ని గ్రహించటానికి వీలవుతుంది. ఇది సులభమే. అంతకన్న అర్థవంతమైనదీ, ముఖ్యమైనదీ ఏమిటంటే, అది పునరుద్ధారణం. అది అలవరచుకునేది కాదు. ఒక సహజ నైపుణ్యాన్నిగాని, సామర్థ్యాన్నిగాని, సాంకేతిక నైపుణ్యాన్నిగాని, ఒక కార్యకలాపాన్నిగాని ప్రవర్తననిగాని ప్రయత్న పూర్వకంగా అలవరచుకోగలరు ఎవరైనా. కాని, ఇది పునరుద్ధారణం కాదు. అలవరచుకోవటం అంటే సృజించటం కాదు. ఏదో అవాలనుకుని ఏదైనా ప్రయత్నించినట్లయితే, ఈ సృజనాత్మక పునరుద్ధారణం సాధ్యమవదు. మనస్సు తనంతట తాను కూడబెట్టాలనే కోరికని వదులుకోవాలి. ఒక అనుభవం ద్వారా మరికొంత అనుభవాన్నీ, విజయాన్నీ సాధించటం కోసం కూడబెట్టటం పోవాలి. ఈ కూడ బెట్టాలనే తపన, స్వీయ రక్షణ చేసుకోవాలనే తపన కాలగతిని పెంపొందిస్తూ, సృజనాత్మక పునరుద్ధారణం కాకుండా చేస్తుంది.

చైతన్యావస్థకి కాలంతో సంబంధం ఉన్నదని మనకి తెలుసును. జరిగిన దాన్ని సుస్థిరం చేసుకోవటం, అనుభవాన్ని దాచుకోవటం - వివిధ స్థాయిల్లో జరిగే ప్రక్రియ అది. చైతన్యావస్థలో ఏం జరిగినా అది దాని ప్రతిరూపం మాత్రమే. దాని లక్షణం దానిది. అది పరిమితమైనది. నిద్ర పోతున్నప్పుడు ఈ చైతన్యావస్థ శక్తిమంతం అవుతుంది. లేదా, పూర్తిగా విరుద్ధంగానైనా జరుగవచ్చు. నిద్ర మనలో అనేక మందికి వారి అనుభవాలను శక్తిమంతం చేస్తుంది. అనుభవాన్ని ముద్రించుకుంటుంది, దాచుకుంటుంది. అయితే, అది విస్తృతమవటమేగాని పునరుద్ధారణం కాదు. విస్తృతమైనప్పుడు ఒకవిధమైన ఉత్తేజం కలుగుతుంది, విజయప్రదంగా ఉంటుంది, అర్థమైనట్లూ, ఇంకా అనేక రకాలుగా ఉంటుంది. కాని అదంతా సృజనాత్మక పునరుద్ధారణం కాదు. ఏదో అవాలనుకునే ప్రక్రియ పూర్తిగా అంతం కావాలి, మరికొంత అనుభవానికి దారితీయటం ద్వారా కాదు. అది అంతం అవటం కోసం మాత్రమే.

నిద్రలోనూ, తరుచు పని చేసుకునే సమయంలోనూ, ఏదో అవాలనుకోవటం పూర్తిగా ఆగిపోయినప్పుడూ, కారణం, దాని ఫలితం అంత మొంది

నప్పుడూ కాలాతీతమైనదీ, కారణ ఫలితాల పరిమితికి అతీతమైనదీ సిద్ధిస్తుంది.

## 17. సంబంధ బాంధవ్యాల్లో ప్రేమ

ఆ దారి, పొలం ప్రక్కనుంచే పోయి, కొండమీదుగా వెడుతుంది. దాని కెదురుగుండా ఇళ్లూ, ఆవులూ, ఆవుదూడలూ, కోళ్లూ, గుర్రాలూ, బోలెడు వ్యవసాయ యంత్రాలూ కనిపిస్తాయి. అడవుల్లోంచి వెళ్లే ఆ దారి ఎంతో బాగుంటుంది. లేళ్లూ, ఇతర వన్యమృగాలూ అటు వెడుతూ ఉంటాయి తరుచుగా. వాటి అడుగుల ఆనవాళ్ళు మెత్తని మట్టి మీద ఇక్కడ, అక్కడ కనిపిస్తున్నాయి. అక్కడ నిశ్శబ్దంగా ఉన్నప్పుడు పొలంలోంచి కంఠధ్వనులూ, నవ్వులూ, రేడియో శబ్దాలూ చాలా దూరం వరకూ వినిపిస్తూ ఉంటాయి. ఆ పొలంలో బాగా పనిసాగుతున్నట్లుంది. తీర్చిదిద్దినట్లు శుభ్రంగా ఉంది. తరచు వాళ్ల గొంతులు కోపంతో అరుస్తున్నట్లు గట్టిగా వినిపిస్తాయి. దాంతో, పిల్లలు చడీచప్పుడు లేకుండా అయిపోతారు. చెట్ల మధ్యనుంచి ఏదో పాట వినిపిస్తోంది. కోపంతో వాళ్లు అరిచిన అరుపులకి పాట శబ్దం అణగిపోయింది. హఠాత్తుగా ఒక స్త్రీ ఇంట్లోంచి బయటికి వచ్చింది; తలుపు ధడాలున వేసి, దూడల పాక దగ్గరికి వెళ్ళి ఒక ఆవుని బెత్తం పుచ్చుకుని కొట్టటం మొదలుపెట్టింది. ఆ బెత్తం చప్పుడు కొండ పైదాకా వినిపిస్తోంది.

మనం ప్రేమించేదాన్ని నాశనం చెయ్యటం ఎంత సులభం! మన మధ్య అవరోధం ఎంత త్వరలో ఏర్పడిపోతుంది, ఒక్కమాటతో, ఒక్క చేష్టతో, ఒక్క చిరునవ్వుతో! ఆరోగ్యం, మనస్థితి, కోరిక - వీటి వెంట వాటి నీడ పడుతుంది. అంతవరకూ ఉత్సాహంగా ఉన్నదే మందకొడిగా, భారంగా తయారవుతుంది. వాడుకుని వాడుకుని మనల్ని మనమే అలిసిపోయేట్లు చేసుకుంటాం. అంతకు ముందు చురుకుగా స్పష్టంగా ఉన్నదే అలసటగా అయోమయంగా అయిపోతుంది. నిరంతరం ఘర్షణ, ఆశ, నిరాశ - వీటితో, ఎంతో అందంగా సరళంగా ఉన్నదే భయంకరంగా, మర్మ గర్భితంగా అయిపోతుంది. సంబంధం క్లిష్టమైనది, కష్టపూరితమైనది. దానిలోంచి ఏ మచ్చా లేకుండా బయటపడగలిగే వాళ్లు చాలా కొద్దిమంది ఉంటారు. మనం

చలనం లేకుండా, శాశ్వతంగా కొనసాగేట్లు ఉండాలనుకున్నా, సంబంధం అనేది ఒక సంచలనం, ఒక ప్రక్రియ. . దాన్ని గాఢంగా, సంపూర్ణంగా అర్థం చేసుకోవాలి, ఏదో అంతరంగికమైన పద్ధతికో, బాహ్య పద్ధతికో అనుగుణంగా ఉండటంతోకాదు. ఉన్న పద్ధతి ప్రకారం నడుచుకోవటం సంఘంలోని కట్టుబాటు. ప్రేమకి ఆ కట్టుబాటుతో పని లేదు. సంబంధ బాంధవ్యంలో ప్రేమ పవిత్రం చేసే ప్రక్రియ. స్వార్థపరమైన మార్గాలన్నిటినీ తేటతెల్లం చేసే ప్రక్రియ అది. ఆ విధమైన ఆవిష్కరణ జరగకుండా సంబంధ బాంధవ్యాలకి అర్థంలేదు.

కాని, అలా ఆవిష్కారం కాకుండా ఎంత పోరాడుతాం! ఈ పోరాటం అనేక రూపాల్లో ఉంటుంది - అధికారం చెలాయించటం గాని, అణగి ఉండటంగాని, భయంగాని, ఆశగాని, అసూయగాని, అనుగ్రహంగాని - ఇలా అనేక రకాలుగా. వచ్చిన చిక్కేమంటే మనం ప్రేమించలేం. ఒకవేళ ప్రేమ చూపించినా, అది మనం చెప్పిన పద్ధతి ప్రకారం నడవాలనుకుంటాం. దానికి స్వేచ్ఛనివ్వం. మనస్సులతో ప్రేమిస్తాం కాని హృదయాలతో కాదు. మనస్సు తన్ను తాను కావలసినట్లు మార్చుకోగలదు. కాని, ప్రేమ అలాకాదు. మనస్సు తన్ను తాను సురక్షితంగా ఉంచుకోగలదు. కాని, ప్రేమ అలా చేయలేదు. మనస్సు వెనక్కి లాక్కోగలదు. విడిగా, ప్రత్యేకంగా ఉండగలదు. ఆత్మీయంగా గాని, అంటీ ముట్టనట్లుగా గాని ఉండగలదు. ప్రేమను పోల్చి చూడటం, దాని చుట్టూ కంచె కట్టటం కుదరదు. అయితే, మనకొచ్చే కష్టమంతా మనం "ప్రేమ" అని అనే దాంట్లో ఉంది. నిజానికి, మనం అనేది మనస్సుకి చెందినదే. మన హృదయాలను మానసికమైన వాటితో నింపి, హృదయాలను శూన్యంగా, దేనికోసమో నిరీక్షిస్తున్నట్లుగా ఉంచుతాం. ప్రాకులాడేదీ, ఈర్ష్యపడేదీ, పదిలపరిచేదీ, నాశనం చేసేదీ, అన్నీ మనస్సే. మన జీవితాన్ని అధీనంలో ఉంచేవి శరీరమూ మనస్సునూ. మనం ప్రేమించటంతో ఊరుకోము. మనం కూడా ప్రేమింపబడాలని ప్రాకులాడుతాం. మనం ఇచ్చేది తీసుకోవటం కోసమే. ఈ ఇవ్వటం మానసికంగానే కాని హృదయ పూర్వకంగా కాదు. మనస్సు ఎప్పుడూ నిశ్చితంగా, సురక్షితంగా ఉండాలని కోరుకుంటుంది. మనస్సుతో ప్రేమని నిశ్చితం చేయటం సాధ్యమేనా?

కాలబద్ధమయే తత్వం గల మనస్సు అనంతమైన ప్రేమను అందుకోగలదా?

హృదయంలోని ప్రేమ కూడా కొన్ని తమాషాలు చేస్తుంది. ఎందుచేతనంటే, మనం మన హృదయాలను సంశయాత్మకంగా, సందిగ్ధమయంగా అయేటంతగా పాడుచేశాం. దీని వల్లనే జీవితం అంత బాధాకరంగానూ కష్టదాయకంగానూ అవుతోంది. ఒక క్షణంలో మనలో ప్రేమ ఉంటుంది, మరుక్షణం పోతుంది. మానసికం కానిది - ఎక్కణ్ణించి వచ్చిందో తెలుసుకోలేని ఒక ఊహాతీత మయిన శక్తి ఉద్భవిస్తుంది. ఆ శక్తిని మనస్సు నాశనం చేస్తుంది. ఆ రెండింటికీ జరిగే యుద్ధంలో మనస్సే ప్రతిసారీ విజేత. మనలో జరిగే ఈ సంఘర్షణకి పరిష్కారం మనసు తన చాతుర్యంతో సాధించేది కాదు, సంకోచించే హృదయం సాధించేది కాదు. ఈ సంఘర్షణని అంతం చేసేందుకు మార్గమంటూ ఏదీ లేదు. ఒక మార్గాన్ని కనిపెట్టాలనుకోవటం కూడా, మనస్సు తన ఆధిక్యాన్ని చూపించుకోవాలనీ, సంఘర్షణని తప్పించుకుని శాంతంగా ఉండాలనీ, ప్రేమని పొందాలనీ, ఇంకేదో అవాలనీ తపించటమే.

మనస్సు కోరదగిన ప్రేమ అనే లక్ష్యంగా, ప్రేమించటానికి ఎటువంటి మార్గమూ లేదని అన్ని విధాలా తెలుసుకోవటమే మన ముఖ్య సమస్య. ఈ విషయాన్ని మనం నిజంగా ప్రగాఢంగా అర్థం చేసుకున్నట్లయితే, ఈ లోకానికి అతీతమైనదేదో అందుకోవటానికి ఆస్కారం ఉంటుంది. అటువంటి దానితో సంపర్కం లేనంతవరకూ మనం ఏం తలపెట్టినా సంబంధ బాంధవ్యాల్లో ఏ నాటికీ ఆనందం లభించదు. మీకు ఆ వరం లభించి, నాకు లభించనట్లయితే, మీకూ నాకు మధ్య సంఘర్షణ రావచ్చు. మీకు సంఘర్షణ లేకపోవచ్చు. నాకు ఉంటుంది. నా బాధలో, నా దుఃఖంలో నాకై నేను తెగతెంపులు చేసుకుంటాను. దుఃఖం కూడా సంతోషం లాగే ప్రత్యేకత నిస్తుంది. స్వయం సిద్ధంకాని ప్రేమ ఉండనంత కాలం సంబంధ బాంధవ్యాలు బాధాకరంగా ఉంటాయి.

ఆ ప్రేమ వరం కనుక పొందినట్లయితే నేనెలాంటి వాడినైనా నన్ను మీరు ప్రేమించక మానరు. అప్పుడు నా ప్రవర్తన బట్టి మీ ప్రేమకు రూపాన్నివ్వరు. అప్పుడు మనస్సు ఎన్ని వేషాలు వేసినా, మీరూ నేనూ వేరైనా, ఏవో కొద్ది విషయాల్లో మాత్రమే మీకు నాకూ కలిసినా, సమైక్యత ఏర్పడేది

మీతోకాదు, నాలోనాకే. ఈ సమైక్యతని మనస్సు ఎట్టి సమయంలోనూ సాధించలేదు. మనస్సు పూర్తిగా, ప్రశాంతంగా ఉన్నప్పుడే, దానంతట అది అంతమైపోయినప్పుడే సమైక్యత సిద్ధిస్తుంది. అటువంటప్పుడే సంబంధ బాంధవ్యంలో బాధ అనేది ఉండదు.

## 18. తెలిసినది, తెలియనిది

నిశ్చలమైన నీటిమీద సాయంకాలపు నీడలు పొడుగ్గా పడుతున్నాయి. పగలు పూర్తి అవుతున్న కొద్దీ నది ప్రశాంతంగా అవుతోంది. చేపలు నీళ్లలోంచి పైకి గెంతుతున్నాయి. పెద్ద పెద్ద పక్షులు చెట్లలో తలదాచుకోవటానికి వస్తున్నాయి. ఆకాశంలో ఒక్క మేఘం కూడా లేదు. నీలంగా మెరుస్తోంది ఆకాశం. మనుషులతో నిండిన పడవ ఒకటి నది మీంచి వస్తోంది. చప్పట్లు కొడుతూ పాడుతున్నారు పడవలో వాళ్లు. కొంచెం దూరంలో ఆవు ఒకటి అరుస్తోంది. సాయంకాలపు సుగంధం పరివ్యాప్తమై ఉంది. బంతి పువ్వుల దండ ఒకటి నీళ్లతో బాటు కొట్టుకుపోతోంది, సూర్యాస్తమయంలో మెరుస్తూ. అంతా ఎంత అందంగా సజీవంగా ఉంది - ఆ నదీ, ఆ పక్షులూ, ఆ వృక్షాలూ, ఆ పల్లెవాళ్లూ.

నదికి ఎదురుగా మేము ఒక చెట్టు క్రింద కూర్చున్నాం. ఆ చెట్టుకి దగ్గరలోనే ఒక చిన్న గుడి ఉంది. బక్క చిక్కిన ఆవులు కొన్ని ఆ చుట్టుపక్కల తిరుగుతున్నాయి. ఆ గుడి ఎంతో శుభ్రంగా బాగా తుడిచి ఉంది. పూలపొదలు నీళ్లు పోసి బాగా పెంచినట్లున్నాయి. ఒకాయన సంధ్యావందనం చేస్తున్నాడు. ఆయన కంఠంలో సహనం, విషాదం ఉన్నాయి. సూర్యుని అంతిమ కిరణాల కాంతితో అప్పుడే వికసించిన పూలరంగులో ఉన్నాయి నీళ్లు. అంతలో ఎవరో ఒకాయన వచ్చి, మాతో బాటు కూర్చుని, తన అనుభవాల గురించి చెప్పటం మొదలుపెట్టాడు. తన జీవితంలో ఎన్నో సంవత్సరాలు దైవాన్ని అన్వేషించటంలోనే గడిచాయన్నాడు. ఎన్నో నిరాడంబర మార్గాలను అనుసరించాడుట. ఎన్నో ప్రీతికరమైన వాటిని త్యజించాడుట. సంఘ సేవలో ఎంతో తోడ్పడ్డాడుట - పాఠశాల నిర్మించటం, మొదలైన వాటిలో ఆయనకి

ఎన్నో విషయాల్లో ఆసక్తి ఉన్నదిట. కాని, దైవాన్ని కనుక్కోవాలనే ఆసక్తే ఆయన్ని దహించి వేస్తున్నదిట. ఇన్నేళ్లకి, ఇప్పుడు ఆ దైవాన్ని వినగలుగుతున్నాడుట. చిన్న చిన్న విషయాల్లోనూ, పెద్ద విషయాల్లోనూ కూడా మార్గదర్శక మవుతున్నదిట. తన సొంత ఉద్దేశమంటూ ఏదీ లేదుట. అంతా ఆ అంతర్వాణి చెప్పినట్లుగానే నడుచుకుంటున్నాడుట. అది ఎప్పుడూ ఆయన్ని భంగపరచలేదుట, అప్పుడప్పుడు దాన్ని స్పష్టంగా, సరిగ్గా గ్రహించలేక పోయినప్పటికీ ఆయన ప్రార్థన అంతా ఈ కాయాన్ని పవిత్రం చేసుకోవటం కోసం, ఆ దైవానుగ్రహానికి పాత్రం కావటం కోసమేనట.

అపరిమితమైనటువంటి దాన్ని మీరూ నేనూ కనుక్కోగలమా? కాలంతో ప్రమేయం లేనట్టి దాన్ని, కాలంతో రూపొందినట్టిదాని సహాయంతో అన్వేషించగలమా? ఎంతో కష్టపడి శ్రద్ధగా సాధన చేసిన శిక్షణ అపరిచితమైనట్టి దానికి దారి చూపుతుందా? అది కాని అంతంకాని లేనట్టి దానికి ఒక మార్గమంటూ ఉంటుందా? అటువంటి సత్యాన్ని మన కోరికల వలలో పట్టుకోగలమా? మనం ఏది పట్టుకోగలిగినా, అది తెలిసినదాని ప్రతిరూపం మాత్రమే. నామకరణం చేయబడినది అనామిక కాలేదు. నామకరణం చేయుటం అంటే నిద్రాణంగా ఉన్న ప్రతిక్రియలను మేలుకొల్పటం మాత్రమే. ఈ ప్రతిక్రియలు ఎంత ఉన్నతమైనవైనా, ఎంత సంతోషకరమైనవైనా, నిజమైనవి కాదు. ఏదైనా ఉత్తేజం కలిగిస్తే మనలో ప్రతిక్రియ ఏర్పడుతుంది. సత్యం ఎటువంటి ఉత్తేజాన్నీ కలిగించదు. అది ఉంటుంది. అంతే.

మనస్సు తెలిసినదాన్నుంచి తెలిసినదానికి కదులుతూ ఉంటుంది. మీకు తెలియని దాన్ని గురించి మీరు ఆలోచించలేరు. అది అసంభవం. మీరు ఆలోచించేదంతా తెలిసిన దాన్నుంచే వస్తుంది, గతం నుంచి, ఆ గతం ఏనాటిదో కావచ్చు, ఒక్క క్షణం క్రిందటిదయినా కావచ్చు. ఈ గతం కూడా ఆలోచనే. అనేక ఆకృతుల్లో, ఎన్నో ప్రభావాలకులోనై, పరిస్థితులకూ, ఒత్తిడికీ లోనవుతూ తన్ను తాను మార్చుకుంటూ, ఎప్పటికీ గత ప్రక్రియగానే మిగిలి పోతుంది. ఆలోచన దేన్నైనా కాదనగలదు, అవునన గలదు, అంతే. దేన్నీ కనుగొనటంగాని, కొత్త దాన్ని వెతకటంగాని చెయ్యలేదు. ఏ కొత్త విషయాన్ని

గురించీ ఆలోచన రాదు. కాని, ఆలోచన మౌనంగా ఉన్నప్పుడు ఏదైనా కొత్తది రావచ్చు. కాని, దాన్ని మళ్లీ పాతదాన్నిగా, అనుభవం అయిన దానిగా చేస్తుంది ఆలోచన. ప్రతి అనుభవానికీ అనుగుణంగా తన్ను తాను రూపొందించుకొని, మార్పులు చేసుకుంటూ రంగులు మార్చుకుంటూ ఉంటుంది ఆలోచన ఎప్పుడు చూసినా. ఆలోచన చేసే పని అనుభవాన్ని వ్యక్త పరచటం మాత్రమే, అంతేకాని, అనుభవం పొందే స్థితిలో ఉండటం కాదు. అనుభవం పొందటం అయిపోగానే ఆలోచన అందుకుని ఆ అనుభవాన్ని తనకు తెలిసిన రకంగా పిలుస్తుంది. ఆలోచన తెలియని దానిలోకి దూరలేదు. అందుచేత సత్యాన్ని కనుగొనటం గాని అనుభవం పొందటం గాని దానికి చేతకాదు.

నిష్ఠలూ, నియమాలూ, త్యజించటాలూ, మమకారాలు త్రెంచు కోవటాలూ, పూజలూ, సద్గుణ సాధనా - ఇవన్నీ ఎంత మహోన్నతమైన వైనా అన్నీ ఆలోచనా ప్రక్రియలే. ఆలోచన ఎప్పుడూ లక్ష్యం వైపూ, విజయసాధన కోసం మాత్రమే పనిచేయగలుగుతుంది. అవన్నీ అది ఎరిగున్నవే. సాధించిన ఘనత రక్షణ కల్పిస్తుంది - తెలిసిన దాని వల్ల వచ్చేది ఆత్మరక్షక విశ్వాసం. ఊరూపేరు లేని దానిలో రక్షణ కోసం వెతకటం వృథా. ఒకవేళ రక్షణ లభించినా, అది గతంలో తెలిసిన దాని ప్రతిరూపమే. అందువల్ల మనస్సు పూర్తిగా గాఢ నిశ్శబ్దంతో ఉండాలి. కాని ఈ నిశ్శబ్దం త్యాగంతోనూ, ఆరాధన తోనూ, అణగ త్రొక్కటంతోనూ కొనగలిగేది కాదు. మనస్సు ఇంక దేనినీ కోరకుండా ఉన్నప్పుడు, ఏదో అవాలనే ప్రక్రియలో ఇక ఏ మాత్రం చిక్కుకుని ఉండనప్పుడూ ఈ నిశ్శబ్దం ఏర్పడుతుంది. ఈ నిశ్శబ్దం కూడబెట్టిన బాపతు కాదు. సాధన వల్ల నిర్మితమైనది కాదు. ఈ నిశ్శబ్దం కాలరహితమైన దానిలాగే మనస్సుకి తెలియనిది. మనస్సు కనుక నిశ్శబ్దాన్ని అనుభవించనట్లయితే, అది గతంలో అనుభవించిన నిశ్శబ్దాన్ని గుర్తుకు తెచ్చుకుంటుంది - ఆ గుర్తుకు తెచ్చుకునేది గత అనుభవాల ఫలితంగా ఏర్పడిన "అనుభవించేది" లేక అనుభోక్త అనేది. అనుభోక్త పొందిన అనుభవం కేవలం స్వయం కల్పితమైనది, పునశ్చరణ మాత్రమే. మనస్సు కొత్తదాన్ని ఎన్నటికీ అనుభవం పొందలేదు. అందువల్ల మనస్సు పూర్తిగా నిశ్చలంగా ఉండాలి.

మనస్సు అనుభవం పొందే స్థితిలో లేనప్పుడే నిశ్చలంగా ఉండగలుగు

తుంది. అంటే, అనుభవంలోకి వస్తున్న దాన్ని ఫలానా అని చెప్పి, పేరుపెట్టి, తక్కిన జ్ఞాపకాలతోబాటు సుస్థిరం చేసుకోవటం, దాచుకోవటం చెయ్యకుండా ఉన్నప్పుడే మనస్సు నిశ్చలంగా ఉంటుంది. ఈ నామకరణం చెయ్యటం, సుస్థిరం చెయ్యటం చైతన్యావస్థలోని వేరువేరు పొరల్లో జరిగే నిరంతర ప్రక్రియ. కాని, మనస్సు పైపైన నిశ్చలంగా ఉన్నప్పుడు లోలోపలి మనస్సు కొన్ని సూచనలను అందివ్వవచ్చు. చైతన్యావస్థ యావత్తూ నిశ్శబ్దంగా ప్రశాంతంగా ఉన్నప్పుడు, ఏదో అవాలని ఏవిధమైన కోరికా లేకుండా స్వేచ్ఛగా ఉన్నప్పుడు, అనాలోచితంగా ఉన్నప్పుడు - అప్పుడు మాత్రమే అపరిమిత మైనది ఉద్భవిస్తుంది. ఈ స్వేచ్ఛను అలాగే ఉంచుకోవాలనే కోరిక, స్వేచ్ఛగా అయిన దాని జ్ఞాపకం కొనసాగేటట్లు చేస్తుంది. దీనివల్ల సత్యానికి ఆటంకం కలుగు తుంది. సత్యం ఒకేవిధంగా కొనసాగదు. అది క్షణక్షణానికీ, ఎప్పుడు చూసినా కొత్తగా, ఎప్పుడు చూసినా స్వచ్ఛంగా ఉంటుంది. కొనసాగేది ఎన్నటికీ సృజనాత్మకం కాదు.

పైపై మనస్సు వ్యక్తపరిచేందుకున్న సాధనం మాత్రమే. అపరిమితమైన దాన్ని కొలిచే శక్తి లేదు దానికి. సత్యం గురించి చెప్పటానికి వీలుకాదు. వీలున్నట్లయితే, అది సత్యమే కాదింక.

ఇదే ధ్యానం చేయటమంటే.

## 19. సత్యాన్వేషణ

ఆయన చాలా దూరం నుంచి వచ్చాడు. ఓడమీదా, విమానం మీదా వేలకొద్దీ మైళ్లు ప్రయాణం చేసి వచ్చాడు. ఆయన తన భాషలోనే మాట్లాడాడు. ఆయన ఎన్నో కష్టాలుపడి ఈ కొత్త వాతావరణంలో సర్దుకుంటున్నాడుట. ఇటువంటి తిండికీ, వాతావరణానికీ, బొత్తిగా అలవాటు పడలేదెప్పుడూ. ఎత్తు ప్రదేశాల్లో పుట్టి పెరిగిన వాడవటం వల్ల ఈ ఉక్క భరించలేకపోతున్నాడుట. ఆయన బాగా చదువుకున్నవాడు. ఏదో శాస్త్రజ్ఞుడు. కొన్ని రచనలు కూడా చేశాడుట. ప్రాక్పశ్చిమ వేదాంతాలు రెండింటితోనూ బాగా పరిచయ ముందాయనకి. ఆయన రోమన్ కాథలిక్. చాలా కాలం నుంచి ఈ

విషయంలో అసంతృప్తిగా ఉన్నాడు. కానీ, సంసారం కోసం గడుపు కొస్తున్నాడుట. ఆయన వివాహం సుఖంగా సాగుతున్నట్లే అనుకోవచ్చు. తన పిల్లలిద్దరి మీదా ఆయనకి ప్రేమ. ఆ దూరదేశంలో కాలేజిలో చదువు కుంటున్నారిప్పుడు. వారికి ఉజ్జ్వలమైన భవిష్యత్తు ఉందిట. కాని ఆయనకి జీవితంలోనూ, కార్య నిర్వహణలోనూ అసంతృప్తి అంతకంతకు ఎక్కువవు తోందిట. ఇంక భరించలేని స్థితికి వచ్చిందిట. సంసారాన్ని వదిలేసి, భార్యకీ, పిల్లలకీ అవసరమైన ఏర్పాట్లన్నీ చేసి ఇక్కడికి వచ్చాడిప్పుడు. ఎలాగోలాగ గడుపుకోవటానికి తగినంత డబ్బుంది చేతిలో. దైవాన్ని అన్వేషించటానికి వచ్చాడుట. తను మతి స్తిమితంలేని వాణ్ణి కాదన్నాడు. తన లక్ష్యం ఏమిటో తనకు స్పష్టంగా తెలుసునన్నాడు.

ఈ స్థిరత్వం అనేది విజయం సాధించినవాళ్లు గాని, సాధించలేక నిరుత్సాహంతో బాధపడుతున్న వాళ్లుగాని నిర్ణయించి తీర్పు చెప్పవలసిన విషయం కాదు. విజయం సాధించిన వాళ్లు కూడా మతి స్థిరంగా లేని వాళ్లు కావచ్చు. సాధించలేక నిరుత్సాహపడిన వాళ్లు కూడా దుస్సహంగా ద్వేషపూరితంగా తయారవచ్చు, లేదా, ఏదో స్వయం కల్పితమైన భ్రమలో పడి తద్వారా విమోచన మార్గాన్ని చూసుకోవచ్చు. స్థిరత్వం అనేది విశ్లేషణ కర్తలు పరీక్షించి తేల్చి చెప్పేది కాదు. ఏదో ఒక సూత్రంలో ఇమిడినంత మాత్రాన అది స్థిరత్వం అని సూచనకాదు. అసలా సూత్రమే అస్థిరమైన సంస్కృతి వల్ల పుట్టినది కావచ్చు. కూడ బెట్టాలనే తత్వం గల సమాజం - దాని పద్ధతులూ, సూత్రాలూ అన్నీ అస్థిరమైనవే. అవి వామపక్షానివైనా, దక్షిణ పక్షానివైనా, ఆ కూడబెట్టే అధికారం ప్రభుత్వానికి ఉన్నా, ప్రజలకి ఉన్నా ఒకటే. స్థిరత్వం అంటే కూడబెట్టక పోవటం. స్థిరత్వం, అస్థిరత్వం అనేవి రెండూ ఆలోచనా రంగానికి చెందినవే. అందుచేత దానికదే న్యాయ నిర్ణేత కాలేదు. ఆలోచన అనేదే పరిమిత ప్రతిక్రియ కాబట్టి, నిర్ణీత సూత్రాలకీ, న్యాయసూత్రాలకీ కట్టు బడినది కాబట్టి అది సత్యం కాదు. సత్యం ఒక భావం కాదు, ఒక నిశ్చితాభిప్రాయం కాదు.

'దైవం' అన్వేషిస్తే దొరికేదా? తెలుసుకోవటం సాధ్యం కాని దాన్ని ఎలా వెతుకుతారు? వెతకటానికి ముందు ఏం వెతకాలో తెలిసి ఉండాలి కదా.

కనిపించాలని వెతికితే, మీకు కనిపించేది మీ స్వీయ ప్రతిరూపమే. మీరు కోరేదే మీకు కనిపిస్తుంది. సత్యం కోరిక సృష్టించినది కాదు. సత్యాన్ని అన్వేషించటం దాన్ని పోగొట్టుకోవటానికే. సత్యానికి స్థిర స్థావరం లేదు. దానికి మార్గంలేదు. మార్గదర్శకమైనది లేదు. మాట సత్యం కాదు. సత్యం ఏదో ప్రత్యేకంగా అమర్చిన స్థలంలోనూ, ఏదో ప్రత్యేక వాతావరణంలోనూ, ఎవరో ప్రత్యేకమైన వారిలోనూ కనిపిస్తుందా? ఇక్కడ ఉంది, అక్కడ లేదనా? సత్యానికి ఒకటి మార్గదర్శకము, మరొకటి కాదు అనా? అసలు మార్గదర్శకమైనది ఉన్నదా? సత్యాన్ని అన్వేషించినప్పుడు కనిపించేది అజ్ఞానం వల్ల ఉద్భవించినదే. ఎందుకంటే, అన్వేషణ అనేదే అజ్ఞానంలో పుట్టినది. సత్యాన్ని అన్వేషించలేరు. 'మీరు' లేనప్పుడే 'సత్యం' ఉంటుంది.

"అయితే ఆ పేరు లేని దాన్ని నేను కనుక్కోలేనా? నేను ఈ దేశానికి వచ్చినదే అందుకు - ఇక్కడ అటువంటి అన్వేషణా భావం ఎక్కువగా ఉంటుందని. భౌతికంగా ఇక్కడ ఎక్కువ స్వేచ్ఛగా ఉండటానికి వీలుంటుంది. అక్కడ కావలసినన్ని వస్తువులు ఇక్కడ అవసరం ఉండదు. ఇతర చోట్లలో లాగ సంపాదించిన వాటన్నిటికీ దాసోహం చెయ్యనక్కరలేదు. కొంతవరకు అదే కారణం అయి ఉంటుంది, కొందరు మఠాల్లో చేరటానికి. కాని మఠానికి వెళ్ళిపోవటంలో మానసికంగా పారిపోవటం లాంటివి ఉంటాయి. అటువంటి క్రమబద్ధమైన ఒంటరితనంలోకి పారిపోవాలని లేదు నాకు. నా బ్రతుకు నేను బ్రతుకుతూ ఆ నామరహితమైన దానిని కనుక్కోవాలనే నేనిక్కడికి వచ్చాను. కనుక్కోగల శక్తి నాలో ఉందంటారా?"

అది శక్తికి సంబంధించిన విషయమా? శక్తి అనగానే ఒక ప్రత్యేక కార్యక్రమాన్ని అనుసరించ గలగటం అని స్ఫురిస్తుంది. ఒక నిర్ణీత మార్గాన్ని అవసరమైన సర్దుబాట్లన్నీ చేసుకుంటూ అవలంబించటమా? మీరు ఆ ప్రశ్న అడుగుతున్నప్పుడు, ఒక సామాన్యవ్యక్తిలా మీరు కోరుకున్నదాన్ని పొందటానికి అవసరమైనవన్నీ మీ వద్ద ఉన్నవా అని అడగటం లేదా? నిజానికి, మీ ప్రశ్నలో ఉద్దేశం, ఎవరో అసాధారణ వ్యక్తులే సత్యాన్ని కనుక్కోగలరనీ, అది సామాన్య మానవుడికి సాధ్యం కాదనీను. సత్యం కొందరికి మాత్రమే, కేవలం అసాధారణమైన మేధావులకు మాత్రమే ప్రాప్తమవుతుందనా? మనకా శక్తి

ఉందా అని ఎందుకు అడుగుతాం? మన దగ్గరొక నమూనా ఉంది. ఆ సత్యాన్ని కనుక్కున్నామనుకునే వారి ఉదాహరణ ఉంది. ఉదాహరణ మనకన్న ఉన్నతస్థితిలో ఉండి మనలో ఒక విధమైన సందిగ్ధతని కలిగిస్తుంది. ఆ విధంగా ఉదాహరణకి ప్రాముఖ్యం హెచ్చిపోతుంది. ఇక ఉదాహరణకీ మనకీ మధ్య పోటీ వస్తుంది. మనం కూడా అదే విధంగా ఎవ్వరూ చెయ్యలేనిపని చేసి నిరూపించాలని ఉంటుంది. చైతన్యావస్థలో గాని, సుప్తచైతన్యస్థితిలో గాని, ఇప్పుడున్న దానిని ఉదాహరణలో మాదిరిగా ఉండే దానితో పోల్చి చూడటం వల్ల కదా "నాకా శక్తి ఉందా?" అనే ప్రశ్న వచ్చింది?

ఒక ఆదర్శంతో మనల్ని మనం ఎందుకు పోల్చుకోవటం? ఈ పోల్చుకోవటం వల్ల అవగాహన కలుగుతుందా? అసలా ఆదర్శానికీ మనకీ తేడా ఉందా? అది మనం స్వయంగా కల్పించుకున్నదే కాదా? మనం తయారుచేసుకున్నది కాదా? మనం ఉన్న స్థితిని యథాతథంగా అర్థం చేసుకోకుండా అది అడ్డు నిలవటం లేదా? అలా పోల్చి చూడటం మనల్ని మనం అవగాహన చేసుకోకుండా తప్పించుకోవటం కాదా? మన నుంచి మనం తప్పించుకోవటానికి అనేక మార్గాలున్నాయి. అందులో పోల్చుకోవటం ఒకటి. నిజానికి ఎవరిని వారు అర్థం చేసుకొనకుండా సత్యాన్ని శోధించాలనుకోవటం మన నుంచి మనం పారిపోవటమే. ఆత్మజ్ఞానం లేకుండా మీరు శోధించే దైవం కేవలం మీ భ్రమ మాత్రమే అవుతుంది. భ్రమ సంఘర్షణకీ, దుఃఖానికీ దారి తీయక తప్పదు. ఆత్మజ్ఞానం లేకుండా సరిగ్గా ఆలోచించటం కూడా సాధ్యం కాదు. అప్పుడు ఉన్న విజ్ఞానమంతా అజ్ఞానమే అయి, గందరగోళానికీ, వినాశానికీ దారి తీస్తుంది. ఆత్మజ్ఞానం అంతిమ లక్ష్యం కాదు. అనంతమైన దాన్ని తెరిచి చూపే ద్వారం మాత్రమే.

"ఆత్మ జ్ఞానం సంపాదించటం చాలా కష్టం కాదా? దానికి ఎంతో కాలం పట్టదా?"

అసలు స్వీయజ్ఞానం సంపాదించటం కష్టం అనే భావమే ఆత్మ జ్ఞానానికి అవరోధం. నా సలహా ఏమిటంటే, అసలది కష్టమనీ, చాలా కాలం పడుతుందనీ అనుకోకండి. అదేమిటో, ఏంకాదో, ముందుగానే నిశ్చయానికి

రాకండి. ఆరంభించండి. ఆత్మజ్ఞానం మీ సంబంధ బాంధవ్యాల్లోనే ఆవిష్కరింపబడుతుంది. కావాలని ఒంటరిగా ఉండటంతోనూ, ఎవ్వరితోనూ కలవకుండా వేరుగా ఉండటంతోనూ ఆత్మజ్ఞానం కలగదు. సంబంధ బాంధవ్యాలను వదులు కోవటం అంటే మరణించటమే. మరణం అంతిమ ప్రతిఘటన. ప్రతిఘటించటం, అణచివేయటం, దాని స్థానంలో మరొకటి ప్రతిష్ఠించటం, ఆరాధించటం, ఏరూపంలోనైనా ఆత్మజ్ఞానానికి ప్రతిబంధకాలే. ప్రతిఘటన కనిపించనిదైనా, కనిపించేదైనా, పోల్చటాలూ, సమర్థింపులూ, ఖండించటాలూ, ఐక్యత వ్యక్తపరచటాలూ - ఇదంతా ఉన్నదాన్ని కాదనటమే. అర్థమంతా ఉన్నదాంట్లోనే ఉంటుంది. అందులో ఉన్న అర్థాన్ని ఏ పక్షమూ వహించకుండా గ్రహించటమే దాని ఆవిష్కరణ. ఈ ఆవిష్కరణే వివేకానికి నాంది. అపరిచితమైనదీ, అనంతమైనదీ సిద్ధించటానికి వివేకం అవసరం.

## 20. సున్నితత్వం

ఆ తోట రమణీయంగా ఉంది. మెత్తని పచ్చగడ్డితో మైదానాలు; నీడ నిచ్చే పురాతన వృక్షాలూ. ఆ ఇల్లు చాలా పెద్దది - విశాలమైన గదులు గాలీ, వెలుతురుతో మంచి తీరుగా ఉన్నాయి. ఆ చెట్లలో ఎన్నో పక్షులు గూళ్లుకట్టుకున్నాయి. బోలెడు ఉడతలున్నాయి. ఫౌంటెన్ చుట్టూ ఎన్నో పక్షులు - పెద్దవీ, చిన్నవీ, గ్రద్దలూ, కాకులూ, పిచుకలూ, గొడవ చేసే చిలకలూ. ఆ ఇల్లూ, తోటా కూడా వేటితోనూ సంబంధం లేకుండా వేరుగా ఉన్నాయి - ముఖ్యంగా, వాటి చుట్టూ ఎత్తైన తెల్లని ప్రహరీ గోడలు ఉండటం వల్ల. ఆ గోడలకు లోపలవైపు బాగుంటుంది. బయట రోడ్డు మీంచీ, పల్లెలోంచీ వచ్చే శబ్దాలు. ఆ ఇంటి గేటు ముందు నుంచే వెడుతుంది రోడ్డు. ఆ రోడ్డమ్మట కొన్ని గజాలు పోతే ఒక పల్లె ఉంది, ఒక పెద్ద పట్టణం శివార్లలో. పల్లె దుర్గంధ భూయిష్టంగా ఉంది. ముఖ్యమైన ఇరుకు సందుకి రెండువైపులా కుళ్లు కాలవలు. అక్కడున్నవి పూరిళ్లు. ఇళ్లముందు ముగ్గులు వేసి ఉన్నాయి. పిల్లలు సందులో ఆడుకుంటున్నారు. సాలెవాళ్లు కొందరు చక్కని

రంగుదారాలు మగ్గాలికి బిగదీసి కట్టారు, బట్టనేయటానికి. వాళ్లు పని చేస్తూంటే గుంపుగా నిలబడి కొంతమంది పిల్లలు చూస్తున్నారు. ఆ దృశ్యం ముచ్చటగా ఉంది, రంగులతో, చప్పుళ్లతో, వాసనలతో. గ్రామస్థులు అప్పుడే స్నానాలు చేశారు. వాళ్ల ఒంటిమీద బట్టలు అతి స్వల్పంగా ఉన్నాయి, వాతావరణం వేడిగా ఉండటం మూలాన్ని. సాయంకాలం అయేసరికి వాళ్లలో కొంతమంది తాగి అరుస్తూ మోటుగా ప్రవర్తిస్తున్నారు.

ఆ రమణీయమైన తోటనీ; ఈ సజీవమైన పల్లెనీ వేరు చేస్తున్న దొక్క పలుచని గోడ మాత్రమే. అందాన్ని పట్టుకుప్రాకులాడుతూ, అనాకారి తనాన్ని వద్దనటం సున్నితత్వం లేకపోవటం వల్లనే. విరుద్ధమైన దానిని అలవాటు చేసుకోవటం వల్ల మనస్సు సంకుచితమవుతుంది. హృదయం పరిమితమవు తుంది. సద్గుణం విరుద్ధమైనది కాదు. దానికి విరుద్ధంగా ఏదైనా ఉన్నదంటే అది సద్గుణం కాదింక. ఆ పల్లె అందాన్ని గ్రహించటానికి అక్కడి పచ్చని పూలతోటని చూసి ఆనందించగలగాలి. అయితే, అందాన్ని మాత్రమే గమనించి, అందంగా లేనిది కనిపించకుండా మూసుక్కూర్చుంటాం. ఈ విధంగా అణచిపెట్టటం వల్ల సున్నితత్వం లేకుండా పోవటం మొదలవు తుంది. అందాన్ని చూసి మెచ్చుకోవటం జరగదు. బాగున్నది ఊరికి దూరంగా ఉన్న తోటలో కాదు. ఆ రెండింటికీ అతీతమైన సున్నితత్వంలో ఉంటుంది. వద్దనటం గాని, కావాలనటం గాని సంకుచితత్వానికి దారితీస్తుంది, అంటే సున్నితత్వం లేకుండా ఉండేటట్లు చేస్తుంది. సున్నితత్వం అనేది మనస్సు జాగ్రత్తగా పోషించుకోవలసినది కాదు. మనస్సుకి చేతనైనది విభజించటం, ఆధిక్యం కనపరచటం. మంచీ, చెడూ రెండూ ఉంటాయి. ఒకదాని వెంటబడి, రెండవదాన్ని తప్పించుకోవటం సున్నితత్వానికి దారి తీయదు. సత్యం ఉనికిని తెలుసుకోవటానికి సున్నితత్వం ముఖ్యంగా అవసరం.

సత్యం భ్రాంతికీ, అబద్ధానికీ విరుద్ధమైనది కాదు. విరుద్ధమైనది అనుకుంటూ దాన్ని చేరటానికి ప్రయత్నిస్తే అది ఎన్నటికీ దర్శనం కాదు. విరుద్ధమైనది నశిస్తేనే సత్యం ఉండటం సాధ్యం. నిరసించటం వల్లా, ఐక్యం చేసుకోవటం వల్లా విరుద్ధమైన వాటి మధ్య సంఘర్షణ పెరుగుతుంది.

సంఘర్షణ మరింత సంఘర్షణని పుట్టిస్తుంది. ఒక నిజాన్ని ఏవిధమైన భావోద్వేగం లేకుండా, కాదనకుండా, అవుననకుండా చూసినట్లయితే సంఘర్షణ అనేది కలగదు. నిజం అనేదానికి విరుద్ధంగా మరింకేదీ ఉండదు. ఇష్టాయిష్టాలతో ఒక పక్షం వహించినప్పుడే విరుద్ధమైనది ఉంటుంది. ఈ పక్షపాత స్వభావమే సున్నితత్వం లేకుండా చేసి మన చర్యని ధ్వంసం చేస్తుంది.

మనం తోటలోనే ఉండిపోవాలనుకుంటే, గ్రామం అంటే విముఖత ఏర్పడుతుంది. ప్రతిఘటన ఉన్నప్పుడు చర్య తీసుకోవటం సాధ్యంకాదు. తోట పట్లగాని గ్రామం పట్లగాని. కార్య సంరంభం ఉండవచ్చు, కాని అది కార్యాచరణ కాదు. కార్య సంరంభానికి ఒక అభిప్రాయం ఆధారం, కార్యాచరణకు అలాకాదు. అభిప్రాయాలు పరస్పర విరుద్ధంగా ఉండొచ్చును. విరుద్ధమైన వాటి మధ్య కలిగే సంచలనం వట్టి కార్యసంరంభం మాత్రమే. ఎంతకాలం ఆగినా, ఎన్ని పరివర్తనలు చేసినా, కార్య సంరంభం వల్ల స్వేచ్ఛ ఎన్నటికీ లభించదు.

కార్య సంరంభానికి గతమూ భవిష్యత్తూ ఉంటాయి. కార్యాచరణకి అటువంటివి లేవు. కార్యాచరణ ఎప్పుడూ వర్తమానమే. అందుచేత తక్షణం జరుగుతుంది. సంస్కరణ అనేది కార్య సంరంభమే, కార్యాచరణ కాదు. సంస్కరణ అయిన దానికి ఇంకా సంస్కరణ అవసరమవుతుంది. సంస్కరణ అంటే అకర్మ. వ్యతిరేకత నుండి పుట్టినది కార్య సంరంభం. కార్యాచరణ క్షణక్షణమూ జరిగేది. సహజంగా కార్యాచరణలో వైరుధ్యం అనేది ఉండదు. కాని కార్య సంరంభం పైకి ఎడతెగకుండా జరుగుతున్నట్లు కనిపించినా దాని నిండా పరస్పర వైరుధ్యమే. విప్లవం అంతా పరస్పర విరుద్ధ శక్తులలో చిక్కుకున్నదే. అది ఎన్నటికీ స్వేచ్ఛను కలుగ జేయలేదు. సంఘర్షణా, ఎంపికా ఎన్నటికీ స్వేచ్ఛాదాయకం కాలేవు. ఎంపిక ఉంటే కార్యసంరంభం ఉంటుంది, క్రియ ఉండదు. ఎంపిక అభిప్రాయం మీద ఆధారపడి ఉంటుంది. మనస్సు కార్యసంరంభంలో మునిగి తేలుతుంది తప్ప కార్యాచరణ జరగదు. కార్యాచరణ జరగటానికి ఘూలం వేరు.

చంద్రుడు పల్లె మీదుగా వచ్చాడు. తోటమీద నీడపడింది.

# 21. వ్యక్తి, సమాజం

రద్దీగా ఉన్న వీధిలో నడుస్తూ వెడుతున్నాం. వీధి కిటువైపూ అటువైపూ దారి జనంతో నిండి ఉంది. కారులూ, బస్సులూ, వదుల్తున్న పొగ వాసనతో మా ముక్కులు నిండి పోయాయి. దుకాణాల్లో ఎన్నో ఖరీదైన వస్తువులూ, చవకబారు వస్తువులూ ప్రదర్శింపబడి ఉన్నాయి. ఆకాశం వెలవెలబోతున్న వెండి రంగులో ఉంది. ఆ రహదారి చప్పుళ్లలోంచి బయటపడి పార్కులోకి వచ్చేసరికి హాయిగా ఉంది. పార్కులో బాగా లోపలిదాకా వెళ్లి కూర్చున్నాం.

ప్రభుత్వం సైనికీకరణంతోనూ, శాసనాలతోనూ, ప్రతిదాంట్లోనూ వ్యక్తిని తనలో లీనం చేసుకుంటోంది అంటున్నాడాయన. దైవాన్ని బదులు ప్రభుత్వాన్ని ఆరాధించటం జరుగుతోందిప్పుడు. చాలవరకు అన్ని దేశాల్లోనూ ప్రభుత్వం ప్రజల ఆంతరంగిక జీవితాల్లోకి కూడా ప్రవేశిస్తోంది. వాళ్లు ఏం చదవాలో, ఏం ఆలోచించాలో కూడా ఆదేశింపబడుతున్నారు. ప్రభుత్వం తన ప్రజలపైన ఒక కన్ను వేసి ఉంచుతోంది. తన దివ్య నేత్రాన్ని వారిపై ప్రసరింప జేస్తోంది - మత సంస్థ చేసే దానికి బదులుగా. ఇదొక కొత్తమతం. మనిషి ఇదివరకు చర్చికి దాసుడుగా ఉండేవాడు. ఇప్పుడు ప్రభుత్వానికి దాసుడు. ఇంతకుముందు చర్చి, ఇప్పుడు ప్రభుత్వం అదుపులోనూ ఉందతని చదువు. మనిషి విమోచన గురించి ఆ రెండూ పట్టించుకోవు.

వ్యక్తికీ, సమాజానికీ మధ్య ఎలాంటి సంబంధం ఉంది? సమాజం వ్యక్తికోసం ఉన్నది గాని వ్యక్తి సమాజంకోసం కాదు నిశ్చయంగా. సమాజం ఉన్నది వ్యక్తికి లాభదాయకంగా ఉండటం కోసం. అది ఉన్నది వ్యక్తికి స్వాతంత్ర్యాన్ని ఇవ్వటం కోసం, తనలోని అత్యున్నతమైన వివేకాన్ని మేలుకొలుపుకునే అవకాశాన్ని వ్యక్తికి కలుగజేయటం కోసం. ఈ వివేకం సాంకేతిక నైపుణ్యాన్నీ, జ్ఞానాన్నీ అలవరచుకోవటం కాదు. ఇది పైపై మనస్సుతో సంబంధం లేని సృజనాత్మక సత్యాన్ని తెలుసుకుంటూ ఉండటం. వివేకం సాధన చేసి పొందే ఫలితం కాదు; క్రమక్రమంగా పెరిగే ఘనతనుంచీ, విజయం నుంచీ పొందే స్వేచ్ఛ. వివేకం స్థిరంగా ఉండేది కాదు. దాన్ని అనుకరించటం, సూత్రబద్ధం చేయటం సాధ్యం కాదు. అందుచేత దాన్ని

నేర్పటం సాధ్యంకాదు. వివేకం స్వేచ్ఛలోనే సాక్షాత్కరిస్తుంది.

సామూహిక ఇచ్ఛ, దాని కార్యాచరణ - ఇదే సమాజం అంటే, సమాజం వ్యక్తికి స్వాతంత్ర్యాన్ని ప్రసాదించదు. అది జీవం, చలనం లేనిది కాబట్టి సమాజం వ్యక్తికి సానుకూల పడేందుకే ఏర్పడింది. దానికి సొంత రూపం అంటూ ఏమీ లేదు. మనుషులు సమాజాన్ని వశం చేసుకుని, దానికి మార్గం చూపించి, దాన్ని రూపొందించి దానిపైన నిరంకుశత్వం వహించవచ్చు, వారి వారి మనస్థితిని బట్టి. కాని సమాజం మనిషికి అధిపతి కాదు. మనిషిని ప్రభావితం చెయ్యవచ్చు, కాని మనిషి దాన్ని ఎప్పుడూ ఖండిస్తాడు. మనిషికీ సమాజానికీ మధ్య సంఘర్షణ ఎందుకున్నదంటే మనిషి తనలో తానే ఘర్షణ పడుతున్నాడు కాబట్టి; స్థిరమైనదానికీ, సజీవమైనదానికీ మధ్య సంఘర్షణ. వ్యక్తి బాహ్యరూపమే సమాజం. అతనికీ, సమాజానికీ మధ్యనున్న సంఘర్షణ అతనిలో అంతర్గతంగా ఉన్న సంఘర్షణే. అత్యున్నతమైన వివేకం మేలు కునేంతవరకూ ఈ సంఘర్షణ అంతర్గతంగానూ బహిరంగంగానూ ఉండి తీరుతుంది.

మనం సంఘజీవులమే కాక వ్యక్తులం కూడా. మనం ప్రజలమే కాక మనుషులం కూడా. సుఖదుఃఖాలకు రెండు విధాలా లోనవుతాం. శాంతి ఉండాలంటే మనిషికీ పౌరుడికీ మధ్య ఉండే సరియైన సంబంధాన్ని అర్థం చేసుకోవాలి. మనం పూర్తిగా పౌరులుగానే ఉండాలని ప్రభుత్వం కోరుతుంది. అది ప్రభుత్వం తెలివితక్కువతనమే. అయితే మనం కూడా మనిషిని పౌరుడి చేతికి అప్పజెప్పడానికి ఇష్టపడతాం. ఎందుచేతనంటే, మనిషిగా ఉండటం కన్న పౌరుడిగా ఉండటం సులభం. మంచి పౌరుడిగా ఉండటమంటే అమలులో ఉన్న సాంఘిక పద్ధతి ప్రకారం సమర్థతతో పనిచెయ్యడమే. సామర్థ్యం, పద్ధతి ప్రకారం నడుచుకోవడం - ఈ రెండూ పౌరుడికి ఉండి తీరాలి. వాటివల్లనే అతడు రాటుదేలి నిర్దయుడిగా తయారై, మనిషిని పౌరుడికోసం, త్యాగం చెయ్యగలుగుతాడు. మంచి పౌరుడు మంచి మనిషి అయి ఉండాలని లేదు. కాని మంచి మనిషి అయి ఉంటే అతడు సరియైన పౌరుడు అయితీరుతాడు, ఒక ప్రత్యేక సమాజానికీ, ఒక ప్రత్యేక దేశానికీ చెందిన వాడుగా కాదు. అతడు ప్రప్రథమంగా మంచి మనిషి కనుక అతని

చర్యలు సంఘవిద్రోహకరంగా ఉండవు. అతడు మరో మనిషికి వ్యతిరేకంగా ఉండడు. మంచి వాళ్ళందరితో సహకరిస్తూ జీవిస్తాడతను. అధికారాన్ని కాంక్షించడు. అతనికి అధికారం ఉండదు. నిర్దాక్షిణ్యత లేకుండా సామర్థ్యం చూపించ గలుగుతాడు. పౌరుడు మనిషిని త్యాగం చెయ్యడానికి ప్రయత్నాలు చేస్తాడు. కాని, అత్యున్నత వివేకాన్ని శోధించే మనిషి సహజంగా ఆ పౌరుడి తెలివి తక్కువతనాన్ని పట్టించుకోడు. అందుచేత ప్రభుత్వం అటువంటి మంచిమనిషికీ, వివేకవంతుడైన మనిషికీ వ్యతిరేకంగా ఉంటుంది. కాని అటువంటి మనిషి అన్ని ప్రభుత్వాలనుంచీ, అన్ని దేశాల నుంచీ స్వేచ్ఛగా ఉంటాడు.

వివేకవంతుడైన మనిషి మంచి సమాజానికి దోహదం చేస్తాడు. కాని మంచి పౌరుడు మనిషి అత్యున్నత వివేకాన్ని పొందగలిగే సమాజాన్ని సృష్టించ లేడు. పౌరుడు ఆధిక్యం ప్రదర్శిస్తున్నప్పుడు పౌరుడికీ, మనిషికీ మధ్య సంఘర్షణ అనివార్యం. మనిషిని కావాలని నిర్లక్ష్యం చేసే ఏ సమాజమైనా నాశనమవుతుంది. మనిషి మానసిక ప్రక్రియ అర్థం చేసుకున్నప్పుడే పౌరుడికీ, మనిషికీ సామరస్యం కుదురుతుంది. ప్రభుత్వం, ప్రస్తుత సమాజం బాహ్య మానవుడిని, అంటే పౌరుడిని తప్ప అంతర్గతమైన మనిషిని గురించి పట్టించుకోదు. అంతర్గతమైన మనిషిని కాదనవచ్చు. కాని అతడే ఎప్పుడూ బాహ్యమానవుడిని ఓడిస్తాడు. పౌరుడికోసం కపటంగా చేసిన పథకాలను ధ్వంసం చేస్తాడు. ప్రభుత్వం భవిష్యత్తు కోసం ప్రస్తుతాన్ని త్యాగం చేస్తుంది. భవిష్యత్తు కోసం తన్ను తాను సదా సంరక్షించుకుంటూ ఉంటుంది. భవిష్యత్తుకే ప్రాధాన్యాన్ని అంతా ఇస్తుంది, ప్రస్తుతానికి కాదు. వివేకవంతుడైన మనిషికి ప్రస్తుతమే అత్యంత ప్రధానం; ఇప్పుడే, రేపు కాదు. రేపు అనేది అదృశ్యమయినప్పుడే ఉన్నదాన్ని అర్థం చేసుకోగలం. ఉన్నదాన్ని అర్థం చేసుకున్నట్లయితే ప్రస్తుతం తక్షణమే పరివర్తన చెందుతుంది. ఈ పరివర్తనే అత్యంత ప్రధానమైనది; అంతేకాని పౌరుడికీ, మనిషికీ మధ్య సామరస్యం కుదర్చడం ఎలాగ అని కాదు. ఈ పరివర్తన జరిగినప్పుడు మనిషికీ, పౌరుడికీ మధ్య సంఘర్షణ అంతమవుతుంది.

# 22. "నేను" (అహం)

ఎదురుగా ఉన్న సీటులో హోదా, అధికారం ఉన్న ఒకాయన కూర్చుని ఉన్నాడు. అవి తనకున్న సంగతి ఆయనకు బాగా తెలుసును. ఆయన చూపులూ, చేష్టలూ, మనోవైఖరీ అన్నీ ఆయన ప్రాముఖ్యాన్ని వెల్లడిస్తున్నాయి. ప్రభుత్వంలో చాలా ఉన్నతస్థితిలో ఉన్నవాడు. ఆయన చుట్టుపక్కల వాళ్లందరూ చాల వినయవిధేయతలతో ఉన్నారు. ఎవరితోనో పెద్ద గొంతుతో చెబుతున్నాడు - అంత చిన్న వ్యవహారం కోసం తనను ఇబ్బంది పెట్టటం దౌర్జన్యం అని. తన క్రింద పనిచేసే వాళ్ల పనుల గురించి సాధిస్తున్నాడు. వింటున్నవాళ్లు భయంతో ఒణుకుతున్నారు. మేము ఆకాశంలో పద్దెనిమిది వేల అడుగుల ఎత్తున మేఘాలకు బాగా పైనుంచి వెడుతున్నాం విమానంలో. మేఘాలమధ్య సందుల్లోంచి క్రింది నీలి సముద్రం కనిపిస్తోంది. మబ్బులు మధ్యమధ్య విడిపోయినప్పుడు మంచుతో నిండిన పర్వతాలూ, ద్వీపాలూ, విశాలమైన సముద్రశాఖలూ, అక్కడక్కడ ఇళ్లూ, చిన్న చిన్న ఊళ్ళూ, ఎంత దూరంగా ఎంత అందంగా కనిపిస్తున్నాయి! కొండల్లోంచి పారుతూ వచ్చిన నది సముద్రంలోకి ప్రవహిస్తోంది. మధ్యలో ఒక పెద్ద పట్టణంలోంచి ప్రవహిస్తూ వచ్చింది. దాని నీళ్లు మురికి కలిసిన చోట మసి బారినట్లు వెలవెలబోయి నట్లుండి, మరికొంత దూరం వచ్చాక, మళ్లీ పరిశుభ్రంగా అయి, తళతళ లాడుతున్నాయి. కొన్ని సీట్లకి అవతల ప్రత్యేకమైన దుస్తుల్లో ఉన్న ఒక ఉన్నతోద్యోగి కూర్చున్నాడు. ఆయన ఛాతీ నిండా రిబ్బన్లు. ఆత్మ విశ్వాసంతో, ఎవ్వరితోనూ కలవకుండా కూర్చున్నాడు. ఆయన వేరే వర్గానికి చెందినవాడు. అటువంటి వర్గంవారు ప్రపంచమంతటా ఉన్నారు.

మనం అందరి చేతా గుర్తింపబడాలనీ, గొప్పగా చెప్పుకోబడాలనీ, ప్రోత్సహింపబడాలనీ ఎందుకు ప్రాకులాడుతాం? అంత డాబూ, దర్పం ఎందుకు ప్రదర్శిస్తాం? ప్రత్యేకమైన పేరునీ, పదవినీ, ఆస్తినీ పట్టుకుని ఎందుకు వ్రేలాడతాం? అనామకులుగా ఉంటే చిన్నతనంగా ఉంటుందా? మనగురించి ఎవరికీ ఏమీ తెలియకుండా ఉంటే నీచంగా ఉంటుందా? పేరు పొందిన వారినీ, ప్రజాదరణ పొందిన వారినీ మనం ఎందుకు అనుసరిస్తాం?

మన మాదిరిగానే ఉండటంలో ఎందుకు తృప్తి పొందం? మనం ఉన్న స్థితికి మనకే భయం, సిగ్గూ కలుగుతున్నాయా? పేరు, పదవి, ఆస్తి - ఇవన్నీ అంత ప్రధానమైనవా? మనం గుర్తింపబడాలనీ, అభినందింపబడాలనే కోరిక ఎంత ప్రబలమైనదో నమ్మశక్యం కాదు. యుద్ధోన్మాదంలో చేసిన దుష్కృత్యాలకు గౌరవింపబడతారు. తోటిమానవుని చంపినందుకు సాహసవీరుడనిపించు కుంటాడు. హక్కులతోనూ, గడుసుతనంతోనూ, సామర్థ్యంతోనూ కొంత పైకొస్తారు- ఈ పైకి అనేది ఒక స్థిరమైన స్థానానికనికాదు. విజయం కలిగించే మత్తులో ఆ ఎత్తు ఇంకా ఇంకా పైకి పెరుగుతుంది. దేశమైనా, వ్యాపారమైనా అంతా మీరే. మీ మీదే సమస్యలన్నీ ఆధారపడి ఉంటాయి. మీరే అధికారం. మత సంస్థలో పదవి, ప్రతిష్ఠ, గౌరవం లభిస్తాయి. అందులో కూడా మీరు ఒక ప్రత్యేకమైన వారు, అందరిలోకీ ప్రముఖులు. లేకపోతే, ఒక గురువుకి శిష్యుడైపోతారు మీరు. వారు చేసే పనిలో సహకరిస్తారు. మీరూ ప్రముఖులవుతారు - వారికి ప్రాతినిధ్యం వహిస్తారు కాబట్టి, వారి బాధ్యతను పంచుకుంటారు కాబట్టి, మీరు ఇచ్చేదాన్ని ఇతరులు స్వీకరిస్తున్నారు కాబట్టి. వారి పేరుతోనే అయినా, మీరే సాధనం. మీరు గోచీ పెట్టుకోవచ్చు, కాషాయ వస్త్రాలు ధరించవచ్చు, కానీ, ఆ చేష్టలు చేసేది "మీరు" - అన్నిటినీ త్యజిస్తున్న "మీరు".

ఏదో ఒక విధంగా, పైకి తెలియకుండా అయితేనేం, బాహాటంగా తెలిసేటట్లయితేనేం, అహాన్ని పెంచిపోషిస్తూ ఉంటారు. సమాజానికి ప్రతికూలమైన, హానికరమైన కార్యకలాపాలతో అహం తన్ను తాను పోషించుకోవలసిన అవసరం ఏమిటి? మనం కష్టాల్లోనూ, దుఃఖాల్లోనూ ఆంతరంగిక సుఖాలకోసం, అఖరుకి వాటి వల్ల బాధ, దుఃఖం తప్పవని తెలిసికూడా ఎందుకు అర్రులు చాస్తుంది? ఈ కష్టపడటమే మనం జీవించటమనీ, మన జీవితానికొక ధ్యేయం ఉన్నదనీ, క్రమంగా మన సంఘర్షణకీ, దుఃఖానికీ కారణభూతమైన వాటిని త్రోసి పారవెయ్యగలుగు తామనీ అనుకునేట్లు చేస్తుంది. మన కార్యకలాపాలన్నీ ఆగిపోతే మనం ఏమీకాము అనీ, మనం తప్పిపోతామనీ, జీవితానికి అర్థం ఉండదనీ అనుకుంటాం. అందుకని అదే సంఘర్షణలో, సందిగ్ధతలో, ప్రతికూలతలో

ముందుకి సాగుతూ ఉంటాం. కాని అంతకన్న ఇంకేదో ఉందనీ, ఈ దుఃఖానికి అతీతమైనది ఇంకేదో ఉన్నదనీ మనం ఎరుగుదుము. అందుకనే మనలో మనకి నిరంతర సంఘర్షణ.

పైడాబుసరి ఎంత ఎక్కువగా ఉంటే లోపలి దారిద్ర్యం అంత ఎక్కువగా ఉంటుంది. కాని, ఈ దారిద్ర్యం నుంచి లభించే స్వేచ్ఛ గోచీ గుడ్డలో లేదు. ఈ అంతర్గత శూన్యతకి కారణం ఏదో అవాలనే కోరికే. మీరేం చేసినాసరే ఆ శూన్యాన్ని నింపలేరు. మోటుగానో, సున్నితంగానో, ఎలాగో దాన్నుంచి తప్పించుకోవచ్చు. కాని అది మీ నీడలా మిమ్మల్ని వెన్నంటి ఉంటుంది. ఈ శూన్యత వైపుకి మీరు చూడదలుచుకోకపోవచ్చు. అయినా అది అక్కడే ఉంటుంది. అహం ఎన్నివిధాల అలంకరించుకున్నా, ఎన్ని త్యజించినా, ఈ అంతరంగిక దారిద్ర్యాన్ని కప్పిపుచ్చలేదు. తన అంతరంగిక కార్యకలాపాల్లోనూ, బాహ్య కార్యకలాపాల్లోనూ "నేను" సంపత్తిని ఆశిస్తుంది. వాటిని అనుభవం అనీ, మరొకటి అనీ, తన విలునీ, తృప్తినీ బట్టి ఏదో ఒక పేరుతో పిలుస్తుంది. "నేను" ఎన్నటికీ అనామికగా ఉండదు. కొత్త వేషం వెయ్యవచ్చు, వేరే పేరు పెట్టుకోవచ్చు, కాని దాని వ్యక్తిత్వమే దాని సారాంశం. దాన్ని గుర్తించే పద్ధతే దాని తత్వాన్ని గ్రహించనీయకుండా చేస్తుంది. ఈ గుర్తించే ప్రక్రియ మొత్తం 'నేను'ని రూపొందిస్తుంది. వ్యక్తంగా ఉన్నా, అవ్యక్తంగా ఉన్నా, దాని కార్యకలాపాలన్నీ స్వార్థపూరితమైనవే - వాటి పరిధి ఎంత పెద్దదైనా. ఏదో అవాలనో, అవకూడదనో 'నేను' చేసే ప్రతి ప్రయత్నమూ ఉన్న దాన్నుంచి దూరంగా జరిగిపోయేటట్లు చేస్తుంది. దాని పేరూ, లక్షణాలూ, మానసిక బలహీనతలూ, ఆస్తులూ - ఇవి కాక 'నేను' అంటే వేరే ఏముంది? ఈ లక్షణాలన్నిటినీ తీసి పారేస్తే, "నేను" అనేది, అహం అనేది ఉంటుందా? ఏమీ ఉండదనే భయమే "నేను"ని ఈ కార్యకలాపాల్లోకి లాగుతుంది, కాని, అది ఏమీ కాదు. అదొక శూన్యత.

ఆ శూన్యతని మనం ఎదుర్కోగలిగినట్లయితే, బాధాకరమైన ఒంటరితనంతో ఉండగలిగినట్లయితే, భయమనేది మాయమవుతుంది. ఒక సమూలమైన పరివర్తన సంభవిస్తుంది. ఇది సంభవించటానికి ఆ శూన్యత అనుభవంలోకి రావాలి. అనుభోక్త (అనుభవించేది) కనుక ఉంటే దీనికి

ఆటంకం కలుగుతుంది. ఆ శూన్యతని అనుభవించాలనే కోరిక ఉన్నప్పుడు, లేదా ఆ శూన్యతని అధిగమించాలని, దానిని దాటి పోవాలనుకున్నప్పుడు, అప్పుడు అనుభవం పొందటం కుదరదు, ఎందుచేతనంటే, అహం ఒక వ్యక్తిత్వంతో కొనసాగుతూనే ఉంటుంది కనుక. అనుభోక్తకి (అనుభవించే దానికి) అనుభవం కలిగినప్పుడు అది అనుభవం పొందటం అనేస్థితి కాదు. ఉన్నదాన్ని ఫలానా అని పేరు పెట్టకుండా అనుభవం పొందటం జరిగితేనే, ఆ ఉన్నదాన్నుంచి స్వేచ్ఛ లభిస్తుంది.

## 23. నమ్మకం

మేము బాగా పైన కొండల్లో ఉన్నాం. చాలా ఎండగా ఉంది. ఎన్నో నెలల నుంచీ వర్షం పడలేదు. చిన్న చిన్న నీటి ప్రవాహాలు నిశ్శబ్దంగా పోతున్నాయి. దేవదారు చెట్లు మట్టి రంగుకి తేలిఉన్నాయి. కొన్ని అప్పటికే చచ్చిపోయాయి. వాటి మధ్య నుంచి గాలి వీస్తోంది. కొండలు మడతలన్నీ విప్పుకుని అనంతంగా విస్తరించినట్లుగా ఉన్నాయి. అడవి జంతువులు చాలావరకు మరింత సౌకర్యవంతమైన చల్లని ప్రదేశాలకు వెళ్లిపోయాయి. కొన్ని ఉడతలూ, పాలపిట్టలూ మాత్రం ఉండిపోయాయి. వేరే కొన్ని చిన్ని పక్షులున్నాయి. కాని, అవి రోజంతా నిశ్శబ్దంగా ఉంట్నున్నాయి. చచ్చిపోయిన దేవదారు చెట్టొకటి ఎండలకి ఎండి ఎండి, తెల్లబడిపోయింది. చచ్చిపోయినా ఎంతో అందంగా ఉందది, ఎటువంటి సంచలనం లేకుండా నాజూగ్గానూ, బలంగానూ ఉంది. నేల గట్టిపడి, నడిచేదారులు రాళ్లతోనూ, మట్టితోనూ నిండి ఉన్నాయి.

ఆవిడ ఎన్నో మత సమాజాల్లో చేరినట్లు చెప్పింది. ఆఖరికి ఒక దాంట్లో స్థిరపడి పోయిందిట. దానికోసం ఆవిడ ఉపన్యాసకురాలిగా, ప్రచారిణిగా పని చేసిందిట దాదాపు ప్రపంచమంతటా. ఆవిడ తన సంసారాన్నీ, సౌఖ్యాన్నీ మరెన్నిటినో ఈ సంస్థకోసం వదులుకున్నదిట. దాని నమ్మకాలనూ, సిద్ధాంతాలనూ, ఉద్దేశాలనూ స్వీకరించి, దాని అధినాయకులను అనుసరించి, ధ్యానం చేయటానికి ప్రయత్నించిందిట. సభ్యులచేతా, అధినాయకులచేతా

కూడా ఎంతో గౌరవింపబడింది. ఇప్పుడు నమ్మకాల గురించీ, సంస్థల గురించీ, ఆత్మవంచన వల్ల కలిగే ప్రమాదాలు, మొదలైన వాటి గురించి నేను చెప్పినదంతా విన్న మీదట ఆ సంస్థనీ, దాని కార్యక్రమాలనీ వదిలిపెట్టేసింది. ప్రపంచాన్ని ఉద్ధరించటంలో ఇంక ఏ మాత్రం ఆసక్తి లేదు. తన చిన్న సంసారంతోనూ, దాని సమస్యలతోనూ కాలక్షేపం చేస్తున్నది. ప్రపంచం గురించి దూరంనుంచే ఆసక్తి తీసుకుంటున్నది. నిష్ఠురంగా మాట్లాడుతున్నట్లు తోచింది - పైకి సానుభూతి, ఔదార్యం ప్రదర్శించినప్పటికీ. ఎందు వల్లనంటే ఆవిడ జీవితమంతా వృథా అయిపోయిందని చెప్పింది. ఇంతకాలం అంత ఉత్సాహంతో శ్రమించినందుకు ఆవిడ సాధించిందేమిటి? ఆవిడకేం ఒరిగింది? ఆవిడ ఎందుకంత అనాసక్తంగా, అలిసిపోయినట్లుగా ఉంది? ఆ వయస్సులో ఆవిడకి స్వల్ప విషయాల గురించి ఎందుకంత ఆత్రుత?

మనలోని సున్నితత్వాన్ని మనం ఎంత సులభంగా నాశనం చేస్తున్నాం! నిరంతర సంఘర్షణతో, అంతులేని పోరాటంతో, వ్యాకులపడి తప్పించుకు పోవటంతో, భయాలతో శీఘ్రమే మనస్సునీ, హృదయాన్నీ మందకొడిగా చేస్తాం. కాని మనస్సు తన నైపుణ్యంతో సత్వరమే సున్నితత్వం స్థానంలో మరొకదాన్ని కనుక్కుంటుంది. వినోదాలు, సంసారం, రాజకీయాలు, నమ్మకాలు, దేవుళ్ళు - ఇవన్నీ స్పష్టత, ప్రేమ ఉండవలసిన స్థానంలో చోటు చేసుకుంటాయి. విజ్ఞానంవల్లా, నమ్మకాలవల్లా స్పష్టత పోతుంది. ఉత్తేజకరమైన అనుభూతుల వల్ల ప్రేమ పోతుంది. నమ్మకం స్పష్టతను తేగలదా? చుట్టూ బిగించి గోడ కట్టుకుని ఉండే నమ్మకం అవగాహన కలుగ నిస్తుందా? ఈ నమ్మకాల అవసరం ఏమిటి? అసలే క్రిక్కిరిసి ఉన్న మనస్సుని చీకటిమయం చేయవా? ఉన్నదాన్ని అర్థం చేసుకోవటానికి నమ్మకాల అవసరం ఉండదు. సూటిగా గ్రహించాలి. కోరిక అనేది అడ్డుపడకుండా సూటిగా తెలుసుకోవాలి. కోరిక చేపట్టే మార్గాలు చాలా సూక్ష్మమైనవి. వాటిన్ని అర్థం చేసుకోకుండా ఉంటే, నమ్మకం సంఘర్షణనీ, సందిగ్ధతనీ, ప్రతికూలతనీ అధికం చేస్తుంది. నమ్మకానికి మరోపేరు మతం. మతం కూడా కోరికకి రక్షణ కల్పించేదే.

నమ్మకాన్ని చర్యకి సాధనంగా పరిగణిస్తాం. ఏదైనా ప్రత్యేకతనుంచి

లభించే విచిత్రమైన శక్తిని నమ్మకం కలుగజేస్తుంది. మనం ఏదో ఒకటి చెయ్యాలనే ఆదుర్దాతో ఉంటాం. కాబట్టి నమ్మకం అవసరమనిపిస్తుంది. నమ్మకం లేకుండా ఏపనీ చెయ్యలేమనుకుంటాం. మనం జీవించటానికీ, పని చెయ్యటానికీ అవసరమనిపించేదాన్ని నమ్మకం మనకిస్తుంది. మనలో చాలామందికి నమ్మకం ఇచ్చేది మినహాయించి జీవితానికి వేరే అర్థం ఉండదు. జీవితాని కన్నా నమ్మకానికే ఎక్కువ ప్రాధాన్యం ఉంది. మన నమ్మకం ప్రకారమే జీవితం గడపాలనుకుంటాం. ఏదో ఒక నమూనా లేనట్లయితే ఏ పని అయినా ఎలా సాధ్యం? అందుచేత మన చర్య ఒక అభిప్రాయంమీద ఆధారపడి గాని, ఒక అభిప్రాయ ఫలితమై గాని ఉంటుంది. అందుచేత చర్య అభిప్రాయమంత ముఖ్యం అవదు.

మానసికమైనవి ఎంత బ్రహ్మాండమైనవైనా, ఎంత సూక్ష్మమైనవైనా, కార్యాచరణ పూర్తి కావటానికీ, ఒకరి బ్రతుకులోనూ, తద్వారా సమాజ వ్యవస్థలోనూ సమూలమైన పరివర్తన తీసుకురావటానికీ ఎంతవరకు దోహదం చేస్తాయి? అసలు అభిప్రాయం అనేది కార్యాచరణకు సాధనం అవుతుందా? ఒక అభిప్రాయం కొంత కార్యాచరణకు వరుసగా దారి తీయవచ్చు. కాని అది కార్యసంరంభం మాత్రమే. కార్యసంరంభం కార్యాచరణకి పూర్తిగా విరుద్ధమైనది. ఈ కార్యసంరంభంలోనే ఎవరైనా చిక్కుకునేది. ఏదైనా కారణం వల్ల ఈ కార్యకలాపం ఆగిపోయినట్లయితే దిక్కు తెలియకుండా తప్పిపోయినట్లు, జీవితం అర్థ శూన్యమైనట్లూ, శూన్యమైనట్లూ అనుకుంటారు. ఈ శూన్యతని గురించి మనకి చైతన్యంగా ఉన్నప్పుడూ, లేనప్పుడూ కూడా తెలిసే ఉంటుంది. అందువల్లనే అభిప్రాయం, కార్యకలాపం అన్నిటి కన్నా ముఖ్యమైనవయ్యాయి. ఈ శూన్యతని మనం నమ్మకంతో నింపుతాము. దాంతో, కార్యకలాపం మత్తు కలిగించే అవసరంలా తయారవుతుంది. ఈ కార్యకలాపం కోసం మనం అన్నిటినీ త్యజిస్తాం. ఎటువంటి ఇబ్బందికైనా, ఎటువంటి భ్రమకైనా లోనవుతాం. నమ్మకంతో వచ్చే కార్యకలాపం సందిగ్ధ జనకంగా, వినాశకరంగా ఉంటుంది. మొదట్లో ఎంతో క్రమబద్ధంగా నిర్మాణాత్మకంగా ఉండొచ్చును. కాని, దాని వెనుకనే సంఘర్షణ, దుఃఖం ఉంటాయి. మత సంబంధమైనది

కాని, రాజకీయ సంబంధమైనది కాని, ఏవిధమైన నమ్మకమైనా సంబంధ బాంధవ్యాలను అవగాహన చేసుకోవటానికి ఆటంకం కలిగిస్తుంది. అవగాహన లేనిదే కార్యాచరణ సాధ్యంకాదు.

## 24. నిశ్శబ్దం

ఆ కారు ఇంజను మంచి శక్తిమంతంగా, అవసరానికి తగినట్లుగా ఉంది. కొండలమీదకు సునాయాసంగా పోతోంది. ఏచప్పుడూ లేకుండా అద్భుతంగా పుంజుకుంటోంది. లోయ దాటిన తరవాత పైకి వెళ్లేదారి నిటారుగా ఉంది. నారింజ తోటల మధ్యనుంచీ, ఎత్తుగా విశాలంగా పెరిగిన అక్రోటుచెట్ల మధ్య నుంచీ పోతోంది. దారి కిరుప్రక్కలా నలభైమైళ్ళ పొడుగున కొండదిగువదాకా విస్తరించి ఉన్నాయి తోటలు. ఆ దారి ఒకటి రెండు చిన్న గ్రామాల మధ్యనుంచి కూడా విశాలమైన పొలాల్లో పచ్చగా నిగనిగలాగే సెనగచేల మధ్య నుంచి సాగింది. మళ్ళీ ఎన్నో కొండల మధ్య మెలికలు తిరుగుతూ చివరికి ఆదారి ఎడారిలోకి వచ్చింది.

ఆ రోడ్డు నున్నగాఉంది. కారు ఇంజను చప్పుడు తడబాటు లేకుండా స్థిరంగా ఉంది. రద్దీ చాలా తక్కువగా ఉంది. అన్నిటినీ తీవ్రంగా గమనించటం జరుగుతోంది - ఆ ప్రదేశాన్నీ, మధ్యమధ్య పక్కనుంచి వెళ్లేకారునీ, రోడ్డు సిగ్నల్సునీ, నిర్మల నీలాకాశాన్నీ, కారులో కూర్చున్న శరీరాన్నీ. కానీ, మనస్సు మాత్రం నిశ్చలంగా ఉంది. అలసటవల్ల ప్రశాంతంగా ఉండటంకాదు, విశ్రాంతి తీసుకోవటంవల్లనూ కాదు. చురుకుతనంతో కూడిన నిశ్చలత అది. మనస్సు నిశ్చలంగా ఉన్నది ఏ కేంద్రం నుంచీ కాదు. ఆ ప్రశాంతతని గమనించే వాడెవడూ లేడు. అనుభవించేవాడు లేనే లేడు. ఏవో అనేక విషయాల మీద సంభాషణ జరుగుతున్నా, ఈ నిశ్శబ్దంలో ఒక్క అల అయినాలేదు. కారు దూసుకుని పోతూంటే రివ్వున వీచే గాలి శబ్దం వినిపిస్తోంది. కాని ఈ నిశ్శబ్దం ఆ గాలి శబ్దాన్నుంచిగాని, కారు చప్పుళ్ళనుంచి గాని, మాట్లాడుతున్న మాటలనుంచి గాని వేరు చేయరానిది. ఇంతకు ముందు ఇటువంటి నిశ్శబ్దం గురించిగాని తెలిసిన వేరే నిశ్శబ్దాల గురించి గాని

ఎటువంటి జ్ఞాపకమూ లేదు మనస్సులో. "ఇదీ ప్రశాంతత" అనలేదు మనస్సు. దాన్ని మాటల్లోకి రూపొందించలేదు. మాటల్లోకి రూపొందించట మంటే అటువంటిదే మరొక అనుభవాన్ని గుర్తుతెచ్చుకొని ఇది కూడా అటువంటిదేనని నిశ్చయించటం. మాటలలోకి రూపొందించటంలేదు కాబట్టి ఆలోచన లేదు. దానికొక స్థిర రూపాన్నివ్వటం లేదు కాబట్టి ఆలోచన ఆ నిశ్శబ్దాన్ని అందుకొని దాన్ని గురించి ఆలోచించలేకపోయింది - "నిశ్శబ్దం" అనేమాట నిశ్శబ్దం కాదు కనుక. మాటలేనప్పుడు మనస్సు పనిచేయలేదు. అందుచేత అనుభోక్త దాన్ని మరికొంత సుఖాన్ని అనుభవించే సాధనంగా దాచుకోలేదు. కూడబెట్టాలనే ప్రక్రియ జరగటం లేదు. పోల్చి చూడటంగాని, అంతర్లీనం చేసుకోవటంగాని లేదు. మనస్సు యొక్క సంచలనమే లేదు.

కారు ఇంటిదగ్గర ఆగింది. కుక్క మొరగటం గాని, కారులోంచి సామాను దించటంగాని, ఆ మొత్తం గొడవగాని ఏవిధంగానూ ఈ అసాధారణమైన నిశ్శబ్దాన్ని భంగపరచలేదు. అసలు గొడవ లేనేలేదు. నిశ్శబ్దం కొనసాగుతూనే ఉంది. దేవదారు చెట్ల మధ్య గాలివీస్తోంది. వీటి నీడలు పొడుగ్గా పడుతున్నాయి. ఓ అడవి పిల్లి పొదలమాటున దూరి పోయింది. ఈ నిశ్శబ్దంలో సంచలనం ఉంది. ఆ సంచలనం ధ్యానభంగం కలిగించటం లేదు. దేని మీదా ప్రత్యేకమైన ధ్యానం లేదు, అందువల్లనే దేనికీ ధ్యానభంగం కావటంలేదు. ఒక ముఖ్యమైన దాన్నుంచి ఆసక్తి మళ్ళినప్పుడే ధ్యానభంగం అవుతుంది. కాని ఈ నిశ్శబ్దంలో దేనిపైనా ఆసక్తి లేదు, అందువల్ల ఇటూ అటూ ఊరికే తిరగటం లేదు. ఆ సంచలనం నిశ్శబ్దానికి దూరంగా లేదు. ఆ నిశ్శబ్దంలోనిదే. అది మరణంలో ఉండే నిశ్చలతకాదు, క్షీణదశలో ఉండేది కాదు. సంఘర్షణ ఏమాత్రం లేకుండా ఉండేది. మనలో చాలామందికి సుఖదుఃఖాల పోరాటం, కార్యాతురతా మనజీవితానికి అర్థాన్నిస్తాయి. ఆ ఆత్రుతని తీసి పారవేస్తే మనం దిక్కులేని వారమై అతి త్వరలో నాశనమై పోతాం. కాని, ఈ నిశ్చలత, ఈ సంచలనం నిత్యనూతన సృష్టి. ఈ సంచలనానికి ఆదిలేదు. అందువల్ల అంతం కూడాలేదు. కొనసాగటం అనేది లేదు. సంచలనం కాలంతో సంబంధించినట్లు ఉంటుంది. కాని కాలం లేదు. కాలం అంటే ఎక్కువ, తక్కువ, దగ్గర, దూరం, నిన్న, రేపు. కాని, ఈ నిశ్చలతలో

పోల్చి చూడటం అంతా ఆగిపోతుంది. ఆ నిశ్శబ్దం అంతం అయేదీ, మళ్ళీ మొదలయేదీ కాదు. మళ్ళీ అదేవిధంగా జరగటం ఉండదు. కపటమైన మనస్సు వేసే టక్కరి వేషాలు ఎక్కడా ఉండవు.

ఈ నిశ్శబ్దం భ్రమే అయినట్లయితే మనస్సుకీ, దానికీ సంబంధం ఉండి ఉండేది. దాన్ని కాదనటమో, దాన్ని పట్టుకు వ్రేళ్ళాడటమో, దాన్ని సహేతుకంగా చెప్పటమో, లేదా, పైకి కనిపించకుండా తృప్తిపడి దానితో సమైక్యం కావటమో చేసేది. ఈ నిశ్శబ్దంతో దానికి ఎటువంటి సంబంధమూ లేదు కనుక మనస్సు దాన్ని అంగీకరించటమూ లేదు, కాదనటమూ లేదు. మనస్సు తనలోంచి వచ్చిన వాటిపైన, తన రూపకల్పనల పైనే పని చేయగలదు. తాను పుట్టించని వాటితో దానికి సంబంధము ఉండదు. ఈ నిశ్శబ్దం మనస్సులోంచి వచ్చినది కాదు. అందువల్ల మనస్సు దాన్ని అలవాటు చేసుకోవటం గాని, దానితో సమైక్యత పొందటంగాని చెయ్యలేదు. ఈ నిశ్శబ్దంలో ఉన్నదాన్ని మాటలతో కొలవటానికి వీలులేదు.

## 25. భోగభాగ్యాలను త్యజించటం

ఒక పెద్ద చెట్టు నీడలో కూర్చున్నాం మేము. అక్కడ నుంచి లోయ ఆకుపచ్చగా కనబడుతోంది. వడ్రంగి పిట్టలు తమ పనిలో మునిగి ఉన్నాయి. రెండు చెట్ల మధ్య చీమలు బారులు తీర్చి ముందుకీ వెనక్కీ చకచకా పోతున్నాయి. సముద్రపుగాలి దూరంగా ఉన్న పొగమంచు వాసనని మోసుకొస్తోంది. కొండలు నీలంగా కలలో మాదిరిగా ఉన్నాయి. తరుచు అవి ఎంతో దగ్గరగా ఉన్నట్లు కనిపించేవి. కాని, ఇప్పుడవి ఎంతో దూరంగా ఎక్కడో ఉన్నాయి. చిన్న పిట్ట ఒకటి పైపులోంచి కారి ఏర్పడిన చిన్ననీటి మడుగులోంచి నీళ్ళు తాగుతోంది. రెండు బూడిదరంగు ఉడతలు పెద్ద కుచ్చుల్లాంటి తోకలతో, ఒకదాన్ని ఒకటి తరుముకుంటూ చెట్టు మీద పైకీ క్రిందికీ తిరుగుతున్నాయి. బాగా పైదాకా పాకి, మళ్లీ గిర్రున తిరిగి వెర్రివేగంతో దాదాపు నేలదాకా దిగిపోయి, మళ్ళీ పైకి పోతున్నాయి.

ఆయన ఒకప్పుడు బాగా ధనమున్నవాడు. తన భోగభాగ్యాలను

త్యజించాడు. ఆయనకి చాలా ఆస్తిపాస్తులుండేవి. వాటి బరువు బాధ్యతలతో ఆయన సంతోషంగా ఉండేవాడు. ఆయన దానధర్మాలు చేసేవాడు. ఆయనది రాతి గుండె కాదు. వెనకా ముందూ ఆలోచించకుండా ఇచ్చేవాడు. ఇచ్చాక దాని సంగతి మరిచిపోయేవాడు. తనకు తోడ్పడిన వాళ్లతో మంచిగా ఉండేవాడు. వారికి లాభదాయకంగా ఉండేట్లు చేసేవాడు. డబ్బు సంపాదించటమే ప్రధానం అయిన ఈ ప్రపంచంలో ఆయన డబ్బు సులభంగానే సంపాదించాడు. ఆయన కొందరి లాగ, తమ కంటె తమ బాంక్ ఎకౌంట్లు, వడ్డీ వ్యాపారాలే ఎక్కువై, ఒంటరిగా ఉండి, జనానికీ, వాళ్లు అడిగే వాటికీ భయపడుతూ, చిత్రమయిన ధనిక వాతావరణంలో తమ్ముతాము బంధించుకునే రకం కాదు. ఆయన కుటుంబానికి ఆయనంటే భయం లేదు. అలాగని అంత సులభంగా లొంగేవాడూ కాదు. ఆయనకి చాలామంది స్నేహితులున్నారు, ఆయన ధనం చూసి కాదు. ఆయన ఎందుకు తన ఆస్తిపాస్తుల్ని త్యజించాడో చెప్పుకొస్తున్నాడు. ఓ రోజున ఏదో చదువుతూంటే హఠాత్తుగా తట్టిందిట - (ఇప్పుడు ఆయనకున్నది అతి స్వల్పం) ఆ డబ్బు సంపాదించటమూ, తన ధనమూ - అంతా ఎంత తెలివితక్కువ తనమో. నిరాడంబరమైన జీవితాన్ని సాగించటానికి ప్రయత్నిస్తున్నాడు. అదంతా దేని కోసమంటే, అసలు భౌతిక వాంఛల్ని మించిన దేదైనా ఉన్నదా అని కనుక్కునేందుకు.

కొంచెంతో తృప్తిపడి ఉండటం కొంతవరకు సులభమే. వేరే దేనికోసమో వెతుకుతూ ప్రయాణం చేసే వారికి తక్కిన బరువులన్నీ వదిలించుకుని స్వేచ్ఛగా ఉండటం కష్టం కాదు. అంతరంగ అన్వేషణ కోసం పడే తపన అధిక సంపదలు కలిగించే సందిగ్ధతని తొలగిస్తుంది. కాని పైపై వాటి నుంచి స్వేచ్ఛ పొందినంత మాత్రాన నిరాడంబరంగా జీవించటం అవదు. ఆంతరంగిక ప్రశాంతత నిష్కపటత్వం అనటానికి వీల్లేదు. పైకి నిరాడంబరంగా జీవించటం మంచిదే, అది కొంత వరకు స్వేచ్ఛ నిస్తుంది కాబట్టి. చిత్తశుద్ధికి అదొక నిదర్శనం. అయితే, ఎప్పుడూ ముందుగా పైపై వాటితోనే మొదలు పెడతామెందుకు? హృదయ నిరాడంబరతతో ఎందుకు ఆరంభించం? మనల్నీ, ఇతరుల్నీ మన ఉద్దేశాల గురించి నమ్మించటానికా?

మనల్ని మనం ఎందుకు నమ్మించుకోవటం? వేటి నుంచైనా స్వేచ్ఛ పొందటానికి వివేకం కావాలి, అంతేకాని నిదర్శనాలూ, నమ్మకాలూ కాదు. వివేకం వ్యక్తిగతమైనది కాదు. సంపద లెక్కువగా ఉంటే ఏం జరుగుతుందో అంతా గ్రహించినట్లయితే, ఆ గ్రహింపే స్వేచ్ఛను కలుగజేస్తుంది. అటువం టప్పుడు గంభీరంగా ఉద్ఘాటించటాలూ, నిదర్శనంగా చేసి చూపించటాలూ అవసరంకావు. ఈ వివేకవంతమైన అవగాహన పని చేయునప్పుడే, క్రమశిక్షణలు, బంధనాలను తెంచుకోవటం మొదలైన వాటిని మొదలు పెడతాం. ఎక్కువ, తక్కువ అన్నది కాదు ముఖ్యం. వివేకం ముఖ్యమైనది. వివేకవంతుడైన మనిషి కొంచెంతోనే తృప్తిపడి, అధిక సంపదలు లేకుండా స్వేచ్ఛగా ఉంటాడు.

కాని సంతుష్టి పడటం అనేది ఒకటి, నిరాడంబరత వేరొకటి. సంతుష్టి పొందాలనే కోరిక గాని, నిరాడంబరంగా ఉండాలనే కోరికగాని బంధనం అవుతుంది. కోరిక చిక్కులు కల్పిస్తుంది. ఉన్నదాన్ని గ్రహించటం వల్ల తృప్తిపడటం జరుగుతుంది. ఉన్న దాంట్లో స్వేచ్ఛగా ఉన్నప్పుడు నిరాడంబరత వస్తుంది. పైకి నిరాడంబరంగా ఉండటం మంచిదే. కాని, అంతర్గతంగా కూడా నిరాడంబరంగా నిర్మలంగా ఉండటం మరింత ముఖ్యం. నైర్మల్యం మనోదీక్షతోనూ, కర్తవ్యభారంతోనూ రాదు. మనస్సు దాన్ని సృష్టించలేదు. మనస్సు తన్ను తాను ఇముడ్చుకోగలదు, సర్దుకోగలదు, తన తలపులన్నిటినీ ఒక తీరులో పెట్టుకోగలదు. కాని, ఇది నైర్మల్యంగానీ నిరాడంబరత గానీ కాదు.

సంకల్ప పూర్వకమైన చర్య సందిగ్ధతను కలుగజేస్తుంది. సంకల్పం ఎంత పవిత్రమైనదైనా కోరికకు మూలమవుతుంది. ఏదో అందుకోవాలనీ, మరేదో అవాలనే సంకల్పం ఎంత అవసరమైనదైనా, పవిత్రమైనదైనా, ఒక మార్గాన్ని సూచించి, సందిగ్ధతలోనే ఒక దారి కల్పిస్తుంది. కాని అటువంటి ప్రక్రియ ఒంటరితనానికి దారి తీస్తుంది. ఒంటరితనం వల్ల నైర్మల్యం రాదు. సంకల్పయుక్తమైన చర్య తాత్కాలికంగా కార్యోన్ముఖం కావటానికి కొంతవరకు దారి చూపించినా, దాని గతాన్ని తుడిచి పెట్టేయటం దాని వల్లకాదు ఎన్నటికీ, ఎందువల్లనంటే, సంకల్పం అనేదే గతం నుంచి వచ్చినది కనుక. మన గతమే సంకల్పాన్ని పుట్టించి పోషిస్తుంది. ఆ సంకల్పం గతానికి

పదునుపెట్టి దాని శక్తుల్ని మరింత అధికం చేస్తుంది. అంతేగాని, గతాన్ని ఎన్నటికీ తుడిచి పెట్టేయలేదు.

నిరాడంబరత మనస్సుకి సంబంధించినది కాదు. నిరాడంబరంగా ఉండాలని పథకం వేసుకోవటం గడుసుగా సర్దుకోవటం మాత్రమే; సంతోషం నుంచీ, బాధనుంచీ రక్షణ కల్పించుకోవటమే. అనేక రకాల సంఘర్షణనీ, గందరగోళాన్నీ పుట్టించే స్వార్థ పూరిత కార్యకలాపం అది. లోపలా, బయటా చీకటిని నింపే సంఘర్షణ అది. సంఘర్షణ, నైర్మల్యం ఒకేచోట ఉండలేవు. సంఘర్షణ లేని స్వేచ్ఛలోనే నిరాడంబరత వస్తుంది - సంఘర్షణను అణచివేయటం వల్లకాదు. ఒకసారి జయించిన దాన్ని మళ్లీ జయిస్తూనే ఉండాలి. దాంతో సంఘర్షణ అంతులేకుండా ఉంటుంది. సంఘర్షణని అర్థం చేసుకోవటం కోరికని అర్థం చేసుకోవటమే. కోరిక తన్ను తాను గమనించేదిగా, అవగాహన కర్తగా రూపొందించుకోవచ్చు. కాని, ఈ విధంగా దానికి ఔన్నత్యాన్ని ఆపాదించటం కోరికను కొనసాగించటమే గాని, అవగాహన చేసుకోవటం కాదు. ద్రష్ట (గమనించేది), దృశ్యం (గమనింపబడేది) - అనేది ద్వంద్వ ప్రక్రియ కాదు. అది ఒకే ప్రక్రియ. ఈ ఏక ప్రక్రియ అనే సత్యం అనుభవంలోకి వచ్చినప్పుడే కోరికనుంచీ, సంఘర్షణ నుంచీ స్వేచ్ఛ లభిస్తుంది. ఈ సత్యం ఎలా అనుభవంలోకి తెచ్చుకోవటం అనే ప్రశ్న రాకూడదు. అది సంభవించాలి, అంతే. ధ్యానంతో ఉన్నప్పుడూ, నిరాసక్తికరంగా గమనిస్తున్నప్పుడే అది సంభవిస్తుంది. మీ గదిలో సుఖంగా కూర్చుని విషసర్పం ఎదురైతే ఎలా ఉంటుంది అని ఊహిస్తేనూ, అంచనా వేస్తేనూ, నిజంగా ఎదురైనప్పుడుమీరు పొందే అనుభవం మీకు కలుగుతుందా? సర్పాన్ని ఎదుర్కోవాలంటే, నున్నని వీధుల్నీ కృత్రిమ దీపాల్నీ దాటి ఇంకా ముందుకి పోయేందుకు సాహసించాలి.

ఆలోచన, భద్రపరచగలదు కానీ, సంఘర్షణారహితమైన స్వేచ్ఛని స్వయంగా అనుభవించలేదు. ఎందువల్లనంటే, నిరాడంబరత, నైర్మల్యం మనస్సుకి సంబంధించినవి కావు.

# 26. పునశ్చరణ, అనుభూతి

పట్నవాసపు చప్పుళ్లూ, వాసనలూ తెరిచి ఉన్న కిటికీలోంచి లోపలికి వస్తున్నాయి. ఆ పెద్ద చతురస్రాకారపు తోటలో నీడలో కూర్చుని జనం వార్తలు చదువుతున్నారు. ప్రపంచ వ్యవహారాలు ముచ్చటించుకుంటున్నారు. పావురాలు రెపరెపలాడుతూ ఇక్కడా అక్కడా వాలుతున్నాయి తిండి వెతుక్కుంటూ. పిల్లలు పచ్చని మైదానం మీద ఆడుకుంటున్నారు. సూర్యుడు అందమైన నీడల్ని సృష్టిస్తున్నాడు.

అతనొక విలేఖరి. చురుకుతనం, తెలివితేటలూ ఉన్నవాడు. తన ప్రశ్నలకు ప్రత్యుత్తరాలేకాక, తన సొంత సమస్యల గురించి చర్చించాలని కూడా అభిలషించాడు. అతని పత్రిక కోసం ప్రశ్నలడగటం, ప్రత్యుత్తరాలు రాసుకోవటం అయిపోయాక, తన ఉద్యోగం గురించి చెప్పాడు - దాని విలువ ఎంతో - ధనరీత్యాకాదు, ఈ ప్రపంచంలో దానికున్న ప్రాముఖ్యం గురించి. అతను పెద్దవాడు, తెలివైనవాడు, సమర్థుడు, ఆత్మ విశ్వాసం ఉన్నవాడు. పత్రికా ప్రపంచంలో త్వరత్వరగా పై కొస్తున్నాడు. అందులోనే అతనికి భవిష్యత్తు ఉంది.

మన మనస్సుల్లో ఎంతో విజ్ఞానాన్ని కూరుతూ ఉండటం చేత సూటిగా అనుభవం పొందటం అసంభవమవుతోంది. సుఖాన్నీ బాధనీ అనుభవించటం సూటిగా వ్యక్తిగతంగా జరిగేదే. కాని, అనుభవాన్ని అర్థం చేసుకోవటం మాత్రం ఇతరులు - మత, సాంఘిక వ్యవస్థల అధికారులు - అందించిన పద్ధతి ప్రకారం జరుగుతోంది. ఇతరుల ఆలోచనలకూ ప్రభావాలకూ ఫలితం మనం. మత, రాజకీయ ప్రచారం మనల్ని తీర్చిదిద్దింది. దేవాలయం, చర్చి, మసీదు - వీటికి మన జీవితాల పైన ఏదో విచిత్రమైన అస్పష్టమైన ప్రభావం ఉంది. రాజకీయ సిద్ధాంతాలు మన ఆలోచనకు ప్రాణం పోస్తాయి. ప్రచారం మనల్ని తయారు చేస్తుంది, ధ్వంసం చేస్తుంది. మత సంస్థలు ఒకటో రకం ప్రచారకులు. ముందు నమ్మించటానికీ, ఆ తరవాత వదలకుండా ఉండటానికీ ఎలాంటి సాధనాన్నైనా ఉపయోగిస్తాయి.

సందిగ్ధమయ ప్రక్రియల సమూహం మనం. మనకి కలుగుతుందన్న

భవితవ్యం ఎంత అనిశ్చయంగా ఉంటుందో మన మధ్యస్తస్థితి కూడా అంత అనిశ్చయంగానూ ఉంటుంది. కేవలం మాటలే అసాధారణమైన ప్రాముఖ్యం కలవిగా కనిపిస్తాయి మనకి. అవి కలిగించే మానసిక ప్రభావంతో, వాటివల్ల కలిగే అనుభూతులే అత్యంత ముఖ్యమైనవనిపిస్తాయి, ఆ ప్రతీక కవతల ఏమున్నదో దానికంటే కూడా.

సంకేతం, ఊహారూపం, జండా, మాట, ఇవన్నీ ఎంతో ముఖ్యం మనకి. నకిలీదేగాని నిజంకాదు మన శక్తి. ఇతరుల అనుభవాల గురించి చదువుతాం. ఇతరులు ఆడుతూంటే చూస్తాం, ఇతరుల ఉదాహరణలను అనుసరిస్తాం, ఇతరులు చెప్పినదాన్ని వర్ణిస్తాం. మనం లోపల శూన్యంగా ఉంటాం. ఈ శూన్యతని మాటలతోనూ, అనుభూతులతోనూ, ఆశలతోనూ, ఊహలతోనూ నింపటానికి ప్రయత్నిస్తాం. కాని, ఆ శూన్యత అలాగే ఉంటుంది.

పునశ్చరణ, దాని అనుభూతులూ ఎంత ఆనందకరమూ, గౌరవ ప్రదమూ అయినప్పటికీ, అది అనుభవం పొందటం కాదు. ఒక పూజ, ఒకమాట, ఒక ప్రార్థన నిరంతరం పదేపదే పునశ్చరణ చేయటం వల్ల తృప్తికరమైన అనుభూతి కలుగుతుంది. దానికే ఎంతో గౌరవప్రదమైన పేరు పెడతారు. కాని, అనుభవం పొందటం అనుభూతి కాదు. ఇంద్రియ ప్రతిక్రియ వెంటనే వాస్తవికతకి చోటిస్తుంది. వాస్తవమైన దాన్ని, అంటే, "ఉన్న దాన్ని" కేవలం ఇంద్రియ జ్ఞానం ద్వారా అర్థం చేసుకోలేము. ఇంద్రియాల పాత్ర కొంతవరకే ఉంటుంది. కాని, అవగాహన గాని, అనుభవం పొందటం గాని, ఇంద్రియాలకు అతీతమైనది. అనుభవం పొందటం అయిపోయిన తరువాతనే అనుభూతి ముఖ్యమవుతుంది. అప్పుడు మాటలు అర్థవంత మవుతాయి. సంకేతాలు ఆధిక్యం చూపిస్తాయి. అప్పుడు గ్రామఫోను ఎంతో ఆనందదాయకమవుతుంది. అనుభవం పొందటం కొనసాగేది కాదు. కొనసాగేది అనుభూతి మాత్రమే, ఏ స్థాయిలోనైనా. అనుభూతి మళ్లీ కలిగినప్పుడు కొత్త అనుభవాన్ని పొందిన అనుభూతి కలుగుతుంది. కాని అనుభూతులు ఎప్పటికీ క్రొత్తవికావు. పునశ్చరణ చేసుకున్న అనుభూతులలో క్రొత్త దానికోసం వెతికి లాభంలేదు. అనుభవం పొందుతూన్న స్థితిలోనే క్రొత్తది ఉద్భవిస్తుంది. అనుభూతి కోసం ఆరాటం, ప్రయాస అంతమైనప్పుడే

అనుభవం పొందటం జరుగుతుంది.

అనుభవం మళ్లీ సంభవించాలని కోరటం అనుభూతి యొక్క తీవ్ర లక్షణం. జ్ఞాపకాలను పెంపొందించుకోవటం, అనుభూతులను విస్తృతం చేసుకోవటమే. అనుభవం మళ్లీ సంభవించాలనే కోరిక - మీ అనుభవం అయినా, మరొకరి అనుభవమైనా సరే - బండబారేటట్లు చేస్తుంది. మరణానికి దారితీస్తుంది. పునశ్చరణ అయిన సత్యం అబద్ధమవుతుంది. సత్యం పునస్సంభవం కాదు. దాన్ని ప్రచారం చేయటానికి గాని, ఉపయోగించు కోవటానికి గాని వీలుకాదు. సత్యాన్ని నాశనం చేసిగాని, కాదని గాని, మళ్లీ దాన్ని ఉపయోగించవచ్చు. కాని, అది ఇంక సత్యం అవదు. ప్రచారకులకు అనుభవం పొందటంతో ప్రమేయం లేదు. వారికి కావలసినదల్లా అనుభూతు లను - మత, రాజకీయ, సాంఘిక, ఆంతరంగిక అనుభూతులను సమకూర్చటమే. ప్రచారకులు మతాన్ని ప్రచారం చేసినా, లౌకిక వాదాన్ని ప్రచారం చేసినా సత్యాన్ని చెప్పేవారు మాత్రం కాదు.

అనుభూతి పైన అభిలాష అంతమైనప్పుడే అనుభవం పొందటం సంభవమవుతుంది. పేరు పెట్టటం, మాటల్లో చెప్పటం అంత మొందాలి. మాటల రూపంలో పెట్టకుండా ఆలోచనా ప్రక్రియ జరగదు. మాటలలో చిక్కుకోవటం కోరికల భ్రమలలో బంధింపబడటమే.

## 27. రేడియో, సంగీతం

రేడియో సంగీతం తప్పించుకునేందుకొక అద్భుతమైన మార్గం అని స్పష్టమవుతోంది. పక్కింటివాళ్లు దాన్ని రోజంతా పెట్టుకోవటమే కాక, రాత్రి చాలా సేపటివరకూ పెట్టి ఉంచుతారు. తండ్రి చాలా తొందరగా ఆఫీసుకి వెళ్లిపోతాడు. తల్లీ, కూతురూ ఇంట్లోనూ, తోటలోనూ పనిచేస్తూ ఉంటారు. వాళ్లు తోటలో పని చేస్తున్నంత సేపూ రేడియో గట్టిగా మోగుతూనే ఉంటుంది. కొడుక్కి కూడా ఆ సంగీతం, ప్రచార కార్యక్రమాలూ ఇష్టంలానే కనిపిస్తుంది. అతను ఇంట్లో ఉన్నప్పుడు కూడా ఆ రేడియో అలా మోగుతూనే ఉంటుంది. రేడియోలో అన్ని రకాల సంగీతాన్నీ, శాస్త్రీయ సంగీతం నుంచి సరికొత్త

సంగీతం వరకూ అంతు లేకుండా వినొచ్చు. రహస్య పరిశోధక నాటకాలూ, వార్తలూ వంటివి నిరంతరం ప్రసారమైన వన్నీ వినొచ్చు. ఎవరితోనూ సంభాషించనక్కర్లేదు. ఒకరి ఆలోచన లొకరికి చెప్పుకోనక్కర్లేదు. మీక్కావలిసినవన్నీ రేడియో చేసి పెడుతుంది. విద్యార్థులు చదువుకోవటంలో కూడా రేడియో తోడ్పడుతుందట. పాలు పిండేటప్పుడు ఆవులికి రేడియో వినిపిస్తే పాలు ఎక్కువిస్తాయట.

ఇందులో అన్నిటికన్నా చిత్రమైన విషయమేమిటంటే రేడియో మన జీవన విధానంలో తెచ్చే మార్పు ఎంత స్వల్పమోనన్నది. కొన్ని విషయాల్లో మరికొంచెం వీలుగా ఉండేట్లు చేస్తూ ఉండి ఉండవచ్చు. ప్రపంచ వార్తల్ని మనకి అతి త్వరగా లభ్యం చేయవచ్చు. హత్యల్ని గురించి ఎంతో వివరంగా వర్ణించి చెప్పవచ్చు. కాని, సమాచారం మనల్ని వివేకవంతుల్ని చెయ్యబోదు. అణ్వాయుధాల ప్రయోగం కలిగించే భీభత్సం గురించీ, అంతర్జాతీయ సంబంధ బాంధవ్యాల గురించీ, ఆకులలోని ఆకుపచ్చ రంగు లక్షణాల పైన పరిశోధన గురించీ, ఇటువంటి వాటి గురించి సమాచారం మన జీవితాల్లో తెచ్చిన ముఖ్యమైన మార్పు ఏమీ లేనట్లే తోస్తుంది. మన యుద్ధ మనస్తత్వం ఎప్పటిలాగే ఉంది. ఇతర జనాన్ని మనం అసహ్యించుకుంటున్నాం. ఒక రాజకీయ నాయకుని ద్వేషిస్తున్నాం. మరొకరికి చేయూతనిస్తున్నాం. మత సంస్థల వల్ల మోసపోతున్నాం. మనం జాతీయ వాదులం. మన దుఃఖాలూ అలాగే కొనసాగుతున్నాయి. వాటిని తప్పించుకోవాలని మనకింకా పట్టుదల. ఆ తప్పించుకునే మార్గాలు ఎంత గౌరవప్రదమైనవీ, ఎంత క్రమ బద్ధమైనవీ అయితే అంత మంచిది. సామూహికంగా తప్పించుకోవటం అత్యుత్తమమైన రక్షణ మార్గం. ఉన్న దాన్ని ఎదుర్కొన్నట్లయితే మనం చెయ్యగలిగినది కొంతైనా ఉంటుంది కాని, ఉన్న స్థితి నుంచి ఎగిరిపోయి తప్పించుకోవటం వల్ల మనం తెలివితక్కువగా, మందకొడిగా, అనుభూతులకూ, సందిగ్ధతకీ బానిసలుగా తయారవటం అనివార్యం.

ఉన్న దాన్నుంచి హాయిగా తప్పించుకునే సూక్ష్మమార్గాన్నివ్వటం లేదూ సంగీతం? మంచి సంగీతం మన నుంచి మనల్ని ఎంతో దూరానికి తీసుకు పోతుంది. ఈ దైనందిన దుఃఖాలకీ, అల్పత్వానికీ, ఆదుర్దాలకీ దూరంగా

తీసుకుపోయి మనం వాటిని మరిచి పోయేటట్లు చేస్తుంది. లేదా, జీవితాన్ని ఎదుర్కొనేందుకు శక్తినిస్తుంది. మనకి ఉత్తేజాన్ని కలిగిస్తుంది. ప్రోత్సాహ పరుస్తుంది. శాంతపరుస్తుంది. మనల్ని మనం మరిచిపోవటానికి గాని, ఉత్తేజం పొందే సాధనంగా గాని, ఏవిధంగానైనా అది మనకి అవసరమవుతుంది. అందమైన దాని మీద ఆధారపడుతూ అనాకారియైన దాన్ని ఏవగించుకుని తప్పించుకుంటే ఆ తప్పించుకునే మార్గం అంతమైపోయినప్పుడు అది దుర్భరమైన సమస్య అవుతుంది. అందం మన సుఖజీవనానికి అవసరమైనప్పుడు, అనుభవించటం అనేది అంతమై, అనుభవం మొదలవుతుంది. అనుభవం పొందే క్షణం వేరు. అనుభూతిని వెంటాడడం వేరు. అవి పూర్తిగా పరస్పర విరుద్ధమైనవి. అనుభవం పొందటంలో అనుభోక్తను గురించి ఎరుక గాని అనుభూతులు గాని ఉండవు. అనుభవం పొందటం అంతమైనప్పుడు అనుభోక్తకు అనుభూతులు ఆరంభమవుతాయి. ఈ అనుభూతులనే అనుభోక్త కోరుతాడు, వెంట పడతాడు. అనుభూతులు అవసరమైనప్పుడు, ఇక, సంగీతం, నది, చిత్రలేఖనం మొదలైనవన్నీ మరికొంత అనుభూతిని కలుగజేయటానికి సాధనాలవుతాయి, అంతే. అనుభూతులకే ఆధిక్యం అంతా - అనుభవం పొందటానికి కాదు. ఒక అనుభవం మళ్లీ కలగాలని తపించటం అనుభూతిని కోరుకోవటమే. అనుభూతులు పునరుద్భవించేటట్లు చేయటం సాధ్యమైనట్లు అనుభవం మళ్లీ అదేవిధంగా పొందటం సాధ్యం కాదు.

అనుభూతిని కోరటం సంగీతాన్ని విడువకుండా పట్టుకునేట్లూ, అందాన్ని తన సొంతం చేసుకునేట్లూ చేస్తుంది. ఒక బాహ్య రేఖ మీద, రూపం మీద ఆధారపడటం మనలోని శూన్యతని సూచిస్తుంది. ఆ శూన్యాన్ని మనం సంగీతంతోనో, లలిత కళతోనో, ప్రయత్న పూర్వకమైన మౌనంతోనో నింపుతూ ఉంటాం. ఈ మార్పులేని శూన్యతని అనుభూతులతో నింపటమో కప్పివేయటమో చేస్తాం కాబట్టే ఉన్న స్థితి అన్నా, మనం ఉన్న పరిస్థితి అన్నా మనకి అంతులేని భయం. అనుభూతులకు ఆది,అంతం ఉంటాయి. వాటిని మళ్లీ పొందవచ్చు. విస్తృతపరచుకోవచ్చు. కాని అనుభవం పొందటానికి కాల పరిమితి లేదు. ముఖ్యమైనదేమిటంటే అనుభవం పొందటం. అనుభూతుల

కోసం వెంపరలాడడంలో అదిలేదు, అనుభూతులు పరిమితమైనవి, వ్యక్తిగతమైనవి. సంఘర్షణనీ, దుఃఖాన్నీ కలిగిస్తాయి. కాని అనుభవం పొందటం అందుకు పూర్తిగా విరుద్ధమైనది. అదే అనుభవాన్ని మళ్ళీ పొందటం జరగదు. అనుభవం కొనసాగదు. ఎప్పటి కప్పుడు అనుభవం పొందటంలోనే పునఃసృష్టి, పరివర్తనం ఉంటాయి.

## 28. అధికారం

పచ్చని మైదానం మీద నీడలు నాట్యం చేస్తున్నాయి. ఎండ వేడిగా ఉన్నా, ఆకాశం బాగా నీలంగానూ మృదువుగానూ ఉంది. దడి అవతల నుంచి ఒక ఆవు పచ్చగడ్డి వైపు చూస్తోంది. అంతమంది జనం గుమిగూడటం దానికి చిత్రంగా ఉంది. పచ్చగడ్డి దానికి పరిచితమైనదే. వర్షాలు పోయి చాలా కాలమై, నేల కాలిన మట్టి రంగులో ఉంది. టేకు చెట్టు మొదలు మీద బల్లి ఒకటి ఈగల్నీ, ఇంకేవో పురుగుల్నీ పట్టుకుంటోంది. దూరాన కొండలు కనీ కనిపించకుండా ఆకర్షణీయంగా ఉన్నాయి.

ఆ చెట్లక్రింద మాట్లాడటం అయిన తరువాత, ఆవిడ చెప్పింది - గురువులకే గురువైనవాడు మాట్లాడితే వినాలని వచ్చిందిటావిడ. మొదట్లో ఎంతో మనస్ఫూర్తిగా అనుకుంది. ఇప్పుడది పట్టుదలగా మారింది. ఈ పట్టుదల చిరునవ్వులతోనూ, సహేతుకమైన సహనంతోనూ కప్పిపుచ్చబడుతోంది. ఈ సహనం ఎంతో జాగ్రత్తగా ఆలోచించి అలవరచుకున్నది. అది మానసికమైనది కాబట్టి దాన్ని హింసాత్మకమైన, ఆగ్రహపూరితమైన అసహనంగా రగిలించవచ్చు. ఆవిడ లావుగా ఉంది. మృదువుగా మాట్లాడుతుంది. కానీ, ఆవిడలో దృఢాభిప్రాయాల వల్లా, నమ్మకాల వల్లా పెరిగిన నిరసన భావం ఒకటి మెదులుతోంది. సౌభ్రాతృత్వానికీ, సత్కార్యాలకీ తన్ను తాను అర్పించుకుందిట. కొంచెం సేపు ఆగి, ఆవిడ ఇంకా ఇలా అంది - దివ్య గురువు మాట్లాడుతూంటే ఆవిడకు తెలుస్తుందిట. అది ఇతరులకు తెలియని నిగూఢమైన విధానం; ఆవిడకీ, ఆవిడ బృందానికీ మాత్రమే తెలుసునట. చేతులూపుతూ, బుర్ర ఒకవైపుకి వంచుతూ ఆవిడ చెప్పే తీరుని బట్టి, తనకు

ప్రత్యేకమైన జ్ఞానం ఉన్నందుకు ఆవిడకి ఎంత సంతోషంగా ఉందో స్పష్టమవుతోంది.

ప్రత్యేక, రహస్య జ్ఞానం ప్రగాఢ సంతృప్తితో కూడిన సంతోషాన్నిస్తుంది. ఇతరులకు తెలియనిదేదో తనకి తెలియటం నిరంతర తృప్తి కలిగించేటట్లుగా ఉంటుంది. గౌరవాన్నీ, అధికారాన్నీ ఇచ్చే గంభీరమైన వేవో అందుబాటులో ఉన్నవన్న భావాన్ని కలిగిస్తుంది. మీరు వాటిని సూటిగా అందుకుంటున్నారు. ఇతరులికి లేనివేవో మీకున్నాయి. అందుచేత మీరు మీ దృష్టిలోనే కాక, ఇతరుల దృష్టిలో కూడా గొప్పవారు. ఇతరులు మీవైపు భయభక్తులతో చూస్తారు, మీకున్న దాంట్లో వారు కూడా భాగం పంచుకోవాలనుకుంటారు కనుక, మీరు ఇస్తారు, కాని, మరికొంత తెలుసుకుంటూ ఉంటారు. మీరు మార్గదర్శి, అధికారి. ఈ హోదా మీకు సులభంగా లభిస్తుంది, ఎవరో ఒకరు చెప్పాలనీ, దారి చూపాలనీ జనం కోరుతూ ఉంటారు కనుక. మనం దారి తప్పినట్లూ అయోమయ స్థితిలో ఉన్నట్లూ తెలుసుకున్న కొద్దీ మరింత ఆత్రుత పడతాం - ఎవరైనా మనకి దారి చూపాలనీ, చెప్పాలనీ. అందుకని అధికారాన్ని ప్రభుత్వం పేరుతోనో, మతం పేరుతోనో, గురువు పేరుతోనో, లేదా, పార్టీ నాయకుని పేరుతోనో రూపొందించుకుంటాం.

పెద్ద విషయాల్లోగాని, చిన్న విషయాల్లోగాని, అధికారాన్ని ఆరాధించటం హానికరం. మత సంబంధమైన విషయాల్లో మరింత హానికరం. మీకూ సత్యానికీ నడుమ మధ్యవర్తి లేడు. ఎవరైనా ఉన్నట్లయితే అతడు వక్రమార్గంలో పెట్టేవాడే, హానికారకుడే. అతడు ఎవరు అన్నది ముఖ్య విషయం కాదు. మహోన్నత రక్షకుడు కావచ్చు, మీ సరికొత్త గురువు కావచ్చు. తెలుసుకున్నాడనుకున్న వాడికి తెలియదు. అతడు తెలుసుకోగలిగినవి - తనకున్న అయిష్టతలూ, తాను ఏర్పరచుకున్న నమ్మకాలూ, మనోవాంఛలూ, అంతే. సత్యాన్నీ, అపరిమితమైన దాన్నీ తెలుసుకోలేడు; హోదానీ, అధికారాన్నీ సంపాదించుకోవచ్చు, గడుసుగా అలవరచుకోవచ్చు, కానీ అది నమ్రత మటుకు కాదు. సద్గుణం స్వేచ్ఛ నిస్తుంది. కాని అలవరచుకున్న నమ్రత సద్గుణం కాదు. కేవలం అనుభూతి మాత్రమే. అందుచేత అది హానికరం, వినాశకరం. అది పదే పదే తెంచుకోవలసిన బంధనం.

ఎవరు గురువో, సాధువో, నాయకుడో కనుక్కోవటం ముఖ్యం కాదు. ఎందుకు వారిని అనుసరిస్తున్నామనేది ముఖ్యం. లాభం పొందటానికీ, స్పష్టత కలగటానికీ, ఎవరినో అనుసరిస్తాం. స్పష్టత ఒకరు ఇవ్వగలిగేది కాదు. అస్పష్టత మనలోనే ఉంది. మనమే దాన్ని కొని తెచ్చుకున్నాం. మనమే దాన్ని స్పష్టపరచుకోవాలి. మనం ఏదో సంతృప్తికరమైన పదవినీ, ఆంతరంగిక రక్షణనీ, మత సంస్థ అధికార పరంపరలో ఒక స్థానాన్నీ సాధించి ఉండవచ్చు. కాని, ఇదంతా స్వార్థపూరిత కార్యకలాపమే. అది సంఘర్షణకీ, దుఃఖానికీ దారి తీస్తుంది. మీరు సాధించిన దానితో తాత్కాలికంగా ఆనందించవచ్చు. మీ పదవి అనివార్యమైనదని మిమ్మల్ని మీరు మభ్యపెట్టుకోవచ్చు. మీరు ఏదో అవాలని అనుకున్నప్పుడు - అది ఏ స్థాయిలోనైనా సరే, దానివల్ల దుఃఖమూ, గందరగోళమూ తప్పవు. ఏమీ అనకుండా ఉండటం వ్యతిరేకత కాదు. ఇచ్ఛాపూర్వకమైన క్రియ అనుకూలమైనదైనా, వ్యతిరేకమైనదైనా, అది తీవ్రమైన, ప్రబలమైన వాంఛ. అది ఎప్పుడూ వైరుధ్యానికీ, సంఘర్షణకీ దారితీస్తుంది. అవగాహన కది మార్గం కాదు. అధికారాన్ని ప్రతిష్ఠించి, దాన్ని అనుకరించటం అవగాహన కాకుండా చేసుకోవటమే. అవగాహన ఉన్నప్పుడు స్వేచ్ఛ ఉంటుంది. అది కొనగలిగినదీ, ఒకరు ఇచ్చేదీ కాదు. కొనుక్కున్నదాన్ని పోగొట్టుకోవచ్చు. ఇచ్చిన దాన్ని మళ్లీ పుచ్చేసుకోవచ్చు. అందువల్ల అధికారం, దానితో బాటే వచ్చే భయం, రెండూ పెంపొందించుకున్నవే. భయాన్ని ప్రార్థనతోనూ, దీపాలతోనూ పోగొట్టటానికి కుదరదు. ఏదో అవాలనే కోరిక అంతమైనప్పుడే అది అంతమవుతుంది.

## 29. ధ్యానం

ఆయన ధ్యానం అంటున్నదాన్ని చాలా ఏళ్ళపాటు సాధన చేశాడు. ఆ విషయం మీద ఎన్నో పుస్తకాలు చదివిన తరవాత, ఒక మఠానికి వెళ్లి అక్కడ రోజుకి కొన్ని గంటల సేపు ధ్యానం చేసే వాళ్లను చూసిన తరవాత ఆయన కూడా కొన్ని క్రమశిక్షణలను అవలంబించాడు. దాన్ని గురించి ఆయన అభిమానంతోనూ లేడు, అలాగని తను చేసిన త్యాగానికి ఆయనకి కళ్లలో నీళ్లు

తిరగనూలేదు. ఇన్ని సంవత్సరాల తరవాత ఆయన తన మనస్సుని అదుపులో పెట్టుకోగలుగుతున్నప్పటికీ అప్పుడప్పుడు అది అదుపులో లేకుండా పోతోందని చెప్పాడాయన. ధ్యానంలో ఆనందం కలగటం లేదుట. తనపై తాను విధించుకున్న ఆ క్రమశిక్షణ ఆయన్ని కఠినంగానూ, నిస్సారంగానూ చేస్తోందిట. మొత్తంమీద అదంతా చాలా అసంతృప్తికరంగా ఉందిట. ఆయన మత సమాజాలనబడే ఎన్నో వాటిల్లో చేరాడుట. అయితే, ఇప్పుడు అవన్నీ ఆఖరు చేసుకుని తనంతట తనే ఆ దైవాన్ని, వాళ్లంతా ఆశపెట్టిన దాన్ని స్వతంత్రంగా అన్వేషిస్తున్నాడుట. వయస్సు పైబడుతోంది. అలిసిపోతున్న ట్లనిపించటం మొదలైందిట.

మనస్సుని శుద్ధి చేయటానికి సరియైన ధ్యానం అవసరం. ఎందువల్ల నంటే, మనస్సుని శూన్యంగా చేయకుండా పునఃసృష్టి సాధ్యంకాదు. కేవలం కొనసాగుతూ ఉండటం పతనావస్థే. నిరంతరం పునశ్చరణతో, తప్పుడు ప్రయోగం వల్ల కలిగే ఘర్షణతో, మందకొడిగా, నిస్సత్తువగా చేసే అనుభూతు లతో మనస్సు క్రమంగా క్షీణించిపోతుంది. మనస్సుని అదుపులో పెట్టటం ముఖ్యంకాదు. మనస్సుకి వేటిపైన ఆసక్తిపోతున్నదో కనుక్కోవటం ముఖ్యం. మనస్సు పరస్పర విరుద్ధమైన ఆసక్తుల సమూహం. ఒక ఆసక్తిని కాదని, మరొక ఆసక్తిని బలపరచటాన్నే ఏకాగ్రత అంటున్నాం. అదే క్రమశిక్షణా పద్ధతి. ప్రతిఘటించటానికి సాధన చేయటమే క్రమశిక్షణ. ప్రతిఘటన ఎప్పుడైతే ఉందో అప్పుడు అవగాహన ఉండదు. క్రమశిక్షణ పొందిన మనస్సు స్వేచ్ఛలేని మనస్సు. స్వేచ్ఛ ఉన్నప్పుడే దేన్నైనా కనుక్కోవటం సాధ్యమవుతుంది. తనలోని సంచలనాలన్నిటి ముసుగూ తొలగించి చూడటం, ఏ స్థాయిలో ఉన్నవాటినైనా కనుక్కోవటం అప్రయత్నంగా ప్రేరణ లేకుండా జరగాలి. ఆ కనుక్కున్నవి సంతోషదాయకమైనవి కాకపోయినా, తనలోని సంచలనా లన్నిటినీ ఆవిష్కరించి అవగాహన చేసుకోవాలి. కాని క్రమశిక్షణలన్నీ ప్రేరణ రహితమైన ఆవిష్కరణలు జరగకుండా చేస్తాయి. క్రమశిక్షణలు ఎంత నిర్దిష్టమైనవైనప్పటికీ మనస్సుని ఒక చట్రంలో బిగిస్తాయి. మనస్సు తను పొందిన శిక్షణవల్ల దానికి తగినట్లుగా సర్దుకుంటుంది. కాని, అది దేనితో సర్దుబాటు చేసుకుంటుందో అది నిజమైనది కాదు. క్రమశిక్షణలు కేవలం

బలవంతాన విధించినవి మాత్రమే. ఆవిష్కరణకి అవి మార్గాలు కాలేవు. క్రమశిక్షణ వల్ల మనస్సు తన లక్ష్యంకోసం తన్ను తాను శక్తిమంతం చేసుకోగలదు. కాని ఈ లక్ష్యం స్వీయకల్పితమైనదే. అది నిజమైనది కాదు. మనస్సు తను కోరిన విధంగానే నిజాన్ని రూపొందిస్తుంది. క్రమశిక్షణలు ఆ రూపానికి జీవశక్తిని ప్రసాదిస్తాయి.

కనుక్కోవటంలోనే, ఆత్మ అవలంబించే మార్గాలన్నిటినీ క్షణక్షణమూ కనుక్కోవటంలోనే ఆనందం ఉంటుంది. ఆత్మని ఏస్థాయిలో ఉంచినా, అది మనస్సే. మనస్సు దేని గురించి ఆలోచించగలిగినా అది మానసికమైనదే. మనస్సుకి చెందని దాన్ని గురించి మనస్సు ఆలోచించలేదు. అపరిచితమైన దాన్ని గురించి మనస్సు ఆలోచించలేదు. ఆత్మ ఏస్థాయిలో ఉన్నా, అది అపరిచితమైనదే. పైపై మనస్సు గ్రహించలేని పొరలు కొన్ని ఆత్మవి ఉన్నప్పటికీ, అవి పరిచితమైన రంగానికి చెందినవే. ఆత్మయొక్క సంచలనాలన్నీ సంబంధ బాంధవ్యాలలో క్రియారూపంలో వెల్లడి అవుతాయి. సంబంధ బాంధవ్యాలు ఒక మూసలో లేనప్పుడు ఆత్మసాక్షాత్కారానికి అవకాశం లభిస్తుంది. ఆత్మ యొక్క చర్యే సంబంధం పెట్టుకోవటం. ఈ చర్యను అర్థం చేసుకోవటానికి పక్షపాతం లేకుండా తెలుసుకోవాలి. ఎందువల్ల నంటే, ఒక పక్షాన్ని ఎంచుకోవటంతో, ఒక ఆసక్తిని కాదని, మరొక దాన్ని బలపరచటమవుతుంది. ఆత్మయొక్క చర్యని అనుభవం పొందటమే తెలుసుకోవటం. ఈ అనుభవం పొందటంలో అనుభవించేది ఉండదు. అనుభవం పొందబడేది ఉండదు. ఆ విధంగా మనస్సు తాను కూడబెట్టిన వాటినన్నిటినీ వదిలి శూన్యమవుతుంది. 'నేను' అనే కూడబెట్టేది ఉండదిక. కూడబెట్టినవన్నీ గాక 'నేను' అనేదేదీ వేరుగా లేదు. ఈ నేను గమనించే దానిగా, పర్యవేక్షించేదానిగా, నిగ్రహంలో ఉంచేదానిగా తన లక్షణాలను తన నుంచి వేరు చేసుకుంటుంది - ఆత్మరక్షణ కోసమూ, అస్థిరత మధ్య తనకు స్థిరత్వాన్ని ఇచ్చుకోవటం కోసమూ. పరస్పరం లీనమయే, సమైక్యమయే అనుభవం పొందటం మనస్సుకి ద్వంద్వ స్థితినుంచి స్వేచ్ఛని కలుగజేస్తుంది. ఆ విధంగా మనస్సు యొక్క యీ ప్రక్రియనూ - పైన జరిగేదాన్నీ, లోపల చాటుగా జరిగేదాన్నీ అంతా కొంచెం కొంచెంగా ఒక్కొక్కదాని కార్యకలాపమే కాకుండా

మొత్తం మీద అనుభవం పొందటం, అవగాహన కావటం జరగాలి. అప్పుడు కలలు, దైనందిన కార్యకలాపం, అన్నీ శూన్యమవుతాయి. తెలుసుకోవటానికి మనస్సు పూర్తిగా శూన్యం అవాలి. కాని, తెలుసుకోవటం కోసం శూన్యం కావాలని తాపత్రయ పడటం ఎడతెగని ప్రతిబంధక మవుతుంది. దాన్నికూడా పూర్తిగా అర్థం చేసుకోవాలి. ఒక ప్రత్యేకస్థాయిలో అని కాకుండా, అనుభవం పొందాలనే తాపత్రయం పూర్తిగా నశించాలి. జరిగిన అనుభవాలతో, వాటి జ్ఞాపకాలతో అనుభవించేది తన్ను తాను పోషించు కోకుండా ఉన్నప్పుడే అది సాధ్యమవుతుంది.

మనస్సు శుద్ధికావటం ఒక్క పైపై స్థాయిలోనే కాక, కనిపించని లోతుల్లోకూడా జరగాలి. అనుభవానికి నామకరణం చేయటం, మాటలలో రూపొందించటం అంతమైతే గాని ఇది జరగటం సాధ్యంకాదు. నామకరణం శక్తిమంతం చేసి, అనుభవించేదాన్నీ, స్థిరత్వం కావాలనే కోరికనీ, జ్ఞాపకానికి ప్రత్యేకత నిచ్చే లక్షణాన్నీ కొనసాగేటట్లు చేస్తుంది. నామకరణం చేయడాన్ని నిశ్శబ్దంగా తెలుసుకోవడం, దాన్ని అవగాహన చేసుకోవడం జరగాలి. నామకరణం చేయటం ఒకరికి తెలియజేయటానికే కాదు, అనుభవానికి జీవం పోస్తూ, కొనసాగేటట్లు చేయటానికీ, అవసరమైనప్పుడు దాన్ని రప్పించి, దాని అనుభూతులను పునస్సంభవం చేసుకోవటానికీ కూడా. ఈ నామకరణం చేసే పద్ధతి అంతమొందాలి - పైపై స్థాయిల్లోనే కాక, మనస్సు యొక్క నిర్మాణ క్రమం అంతటిలోనూ అంతమొందాలి. ఇది చాలా శ్రమతో కూడిన పని. అర్థం చేసుకోవటం, అనుభవం పొందటం అంత సులభం కాదు. ఎందువల్లనంటే, మన చైతన్య ప్రక్రియ అంతా - పేరు పెట్టటం, అనుభవాన్ని మాటల్లో చెప్పటం, తరువాత దాన్ని పదిలపరచటం. ఈ ప్రక్రియే, అనుభవం పొందబడినది కాక వేరే అనుభవించేది ఒకటి ఉన్నదన్న భ్రమని పోషించి శక్తివంతం చేస్తుంది. ఆలోచనలు లేకుండా ఆలోచించేది ఉండదు. ఆలోచనలే ఆలోచించేదాన్ని సృష్టిస్తాయి. ఆలోచించేది తన్నుతాను ప్రత్యేకించుకుంటుంది, తనకొక స్థిరత్వాన్ని ఇచ్చుకోవటం కోసం. ఎందుకంటే, ఆలోచన లెప్పుడూ అస్థిరమైనవే.

మొత్తం జీవనాన్ని, పైపైనే కాక లోలోపల కూడా గతాన్ని శుద్ధి

చేసినప్పుడు స్వేచ్ఛ కలుగుతుంది. ఇచ్ఛ అంటే కోరిక. ఇచ్ఛాపూర్వకమైన చర్య ఏదైనా ఉంటే, స్వేచ్ఛగా ఉండటానికి గాని, శూన్యం చేసుకోవటానికి గాని, ఎట్టి ప్రయత్నం చేసినా స్వేచ్ఛ ఎప్పటికీ లభించదు. మొత్తం అస్తిత్వం పరిశుద్ధం కావటం జరగదు. చైతన్యావస్థలోని అనేకమైన పొరలు అన్నీ నిశ్శబ్దంగా ఉన్నప్పుడు - సంపూర్ణంగా నిశ్చలంగా ఉన్నప్పుడు, అప్పుడే ఆ అపరిమితమైన, కాలంతో నిమిత్తంలేని ఆనందం లభిస్తుంది. పునఃసృష్టి సంభవమవుతుంది.

## 30. కోపం

అంత ఎత్తుమీద కూడా ఎండ తీక్షణంగా ఉంది. కిటికీ అద్దాలు ముట్టుకుంటే వెచ్చగా ఉన్నాయి. విమానం ఇంజను మోత హెచ్చూ తగ్గూ లేకుండా ఒకేలా వినిపిస్తూ జోకొడుతున్నట్లుగా ఉంది. చాలామంది ప్రయాణీకులు కునుకుతున్నారు. భూమి మాకు బాగా దిగువున ఎండలో మాడిపోతోంది. అంతా మట్టిరంగు, మధ్య మధ్య ఆకుపచ్చ రంగు అతుకులు. అప్పుడే భూమి మీదకు దిగాం. ఎండవేడి మరింత దుర్భరంగా ఉంది. నిజంగా బాధాకరంగా ఉంది. భవనం నీడలో నిలబడినా ఆ వేడికి బుర్ర పగిలి పోతుందేమోననిపించింది. అది వేసవికాలం. దేశమంతా ఎడారిలా ఉంది. మళ్లీ బయలుదేరాం. విమానం పైకి ఎగిరింది చల్లని గాలుల్ని వెతుక్కుంటూ. కొత్తగా వచ్చిన ప్రయాణీకులు ఎదురుగా ఉన్న సీట్లలో కూర్చుని గట్టిగా మాట్లాడుకుంటున్నారు. వాళ్లమాటలు వినకుండా ఉండటం అసాధ్యంగా ఉంది. మొదలు పెట్టటం మెల్లిగానే మొదలు పెట్టారు. అంతలోనే వాళ్ల కంఠాల్లో కోపం ధ్వనిస్తూంది - చనువూ, విసుగూతో మిళితమైన కోపం. ఆ ఉద్వేగంలో తక్కిన ప్రయాణీకుల సంగతి మరిచిపోయినట్లున్నారు వాళ్లు. ఒకరిమీద ఒకరు ఎంత అసహనంతో ఉన్నారంటే, అక్కడ వాళ్లిద్దరే ఉన్నట్లూ, చుట్టు పక్కల ఇంకెవ్వరూ లేనట్లూనూ.

కోపానికి ఆవిధమైన ఒంటరితనాన్ని కల్పించే లక్షణం ఉంది. దుఃఖం లాగే అది కూడా వేరు చేస్తుంది. తాత్కాలికంగానైనా అన్ని సంబంధాలూ

అంతమొందుతాయి. కోపానికి తాత్కాలికమైన బలం, ఒంటరిగా ఉండే వారిలో ఉండే జీవశక్తీ ఉంటాయి. కోపంలో ఒక విధమైన నిస్పృహ ఉంటుంది, ఒంటరితనమే నిస్పృహ కనుక. కోపం వల్ల నిరాశా, అసూయా, గాయపరచాలనే తపనా ఉధృతంగా వెలువడుతాయి. వీటివల్ల కలిగే సంతోషం మనల్ని మనం సమర్థించుకోవటం వల్లనే. ఇతరులను మనం నిందిస్తాం, అట్లా నిందించడంలోనే మనల్ని మనం సమర్థించుకోవడం ఉంది. ఏదో ఒక విధమైన ధోరణి లేకుండా - ఆత్మస్తుతి గాని, ఆత్మనిందగాని - మనం ఎలా ఉంటాం? మనల్ని మనం ఆకాశానికి ఎత్తుకోవటానికి అన్ని పద్ధతులూ అవలంబిస్తాం. మామూలు కోపం, హఠాత్తుగా ఎగిరిపడటం, మళ్లీ దాన్ని త్వరలో మరిచిపోవటం - అది ఒకటి. కాని, ప్రయత్నపూర్వకంగా పెంచుకున్న కోపం,. ఎంతోకాలం నిలవుంచి, గాయపరచటానికీ, నాశనం చెయ్యటానికీ ఎదురు చూస్తూండటం మరొక విషయం. మామూలు కోపాన్ని ఏదైనా శారీరక కారణం వల్ల వచ్చి ఉంటే దాన్ని కనిపెట్టి, దాన్ని పోగొట్టవచ్చు. కాని, మానసిక కారణం వల్ల వచ్చిన కోపం చాలా సూక్ష్మమైనదీ, క్లిష్టమైనదీ – వ్యవహరించటానికి. మనలో చాలా మందిమి కోపం వచ్చినా ఫరవాలేదనుకుంటాం. దానికి వెంటనే కారణాన్ని వెతికి చూపిస్తాం. మనకి గాని, ఇతరులెవరికైనా గాని అన్యాయం జరిగినప్పుడు మనం ఎందుకు కోపగించుకోకూడదు? అందువల్ల మనం సహేతుకంగా కోపగించుకుంటాం. ఊరికే కోపం వచ్చిందని చెప్పి, అంతటితో ఎప్పుడూ ఊరుకోం. దానికి గల కారణాన్ని విపులంగా విశదీకరిస్తాం. మనం అసూయపడుతున్నామనీ, మనకి విరక్తి కలిగిందనీ ఊరికే చెప్పి ఊరుకోం. దాన్ని సమర్థించి విశదీకరిస్తాం. అసూయ లేకుండా ప్రేమ ఎలా ఉంటుందని కూడా అడుగుతాం, లేదా, ఎవరి ప్రవర్తనో మనకి నిరాశ కలిగించిందనో ఏదో చెబుతాం.

ఈ విశదీకరించటం, మాటల్లో వ్యక్తపరచటం, మౌనంగా గాని, పైకి చెప్పి గాని - ఇవే కోపాన్ని నిలవుండేటట్లు చేస్తాయి. అది పెరిగేటట్లూ, లోతుకి పోయేటట్లూ చేస్తాయి. ఆ విశదీకరణ - మౌనంగా గాని, మాట్లాడుతూగాని - మనల్ని మనం కనిపెట్టకుండా 'డాలు'లా అడ్డుపెడుతుంది. మనల్ని మెచ్చుకోవాలనో, పొగడాలనో ఏదో ఆశిస్తాం. ఇది సంభవించనప్పుడు మనం నిరాశ చెందుతాం. మనకి నిస్పృహా, ఈర్ష్యా కలుగుతాయి. అప్పుడు ఆగ్రహంతోగాని,

మృదువుగా గాని మరొకర్ని తప్పుపడతాం. మన నిస్పృహకి ఇతరులు కారకులని అంటాం. నా సుఖానికి గాని, నా హోదాకిగాని, గౌరవానికి గాని మీపైన ఆధారపడతాను కాబట్టి మీరు నాకు ముఖ్యం. అందుచేత మిమ్మల్ని జాగ్రత్తగా కనిపెట్టి ఉండాలి. మిమ్మల్ని సొంతం చేసుకోవాలి. మీ ద్వారా నానుంచి నేను పారిపోతాను. నా కాళ్లమీదికి నన్ను వెనక్కి తోసేసినప్పుడు నా సొంతస్థితికి నేనే భయపడటంతో, నేను కోపగించుకుంటాను. కోపం అనేక రూపాలు సంతరించుకుంటుంది. నిరాశ, కచ్చ, విరక్తి, ఈర్ష్య మొదలైనవి.

కోపాన్ని నిలువ చెయ్యటానికి, అంటే, కచ్చ కలిగి ఉండటానికి విరుగుడు క్షమించగలగటం. కానీ, కోపాన్ని నిలువ చేసుకోవటం క్షమించగలగటం కన్న ముఖ్యమైనది. కోపం కూడబెట్టటమే లేనప్పుడు క్షమించగలిగి ఉండవలసిన అవసరమే ఉండదు. కచ్చ ఉన్నట్లయితే క్షమించగలిగి ఉండటం అవసరమవుతుంది. కాని, పొగడ్తకీ, గాయాన్ని మనస్సులో పెట్టుకోవటానికీ లోనవకుండానూ, నిర్లక్ష్యంతో కరుడు కట్టకుండానూ స్వేచ్ఛగా ఉండటంలో దయాదాక్షిణ్యాలుంటాయి. ఇచ్ఛాపూర్వకంగా కోపాన్ని వదిలించుకోలేం. ఎందుకంటే, ఇచ్ఛకూడా హానికరమైనదే. ఇచ్ఛ కోరికనుంచీ, ఏదో అవాలనే తాపత్రయం నుంచీ జనించినదే. ఇచ్ఛాపూర్వకంగా, బలవంతంగా కోపాన్ని అణచివేయటం అంటే, కోపాన్ని మరోస్థాయికి మార్చటం, దానికి మరో పేరు పెట్టటం, అంతే. అది అప్పటికీ హానికరమే. హానికరంగా లేకుండా ఉండటానికి - అంటే, ఆ విధంగా ఉండటానికి ప్రయత్నించాలని కాదు - కోరికని అర్థం చేసుకోవాలి. కోరిక స్థానంలో ఆధ్యాత్మికంగా మరొకటేమీ లేదు. దాన్ని అణచిపెట్టటం గాని, పవిత్రంగా చూడటంగాని సాధ్యంకాదు. కోరికని మౌనంగా, పక్షపాతం లేకుండా తెలుసుకోవటం జరగాలి. ఈ విధంగా నిర్లిప్తంగా తెలుసుకోవటంలోనే కోరిక అంటే ఏమిటో అనుభవం పొందటం జరుగుతుంది. అప్పుడు అనుభవించేవ్యక్తి దానికొక పేరు పెట్టటం జరగదు.

## 31. మానసిక రక్షణ

ఆయన ఆ విషయమై అన్ని విధాలా ఆలోచించానన్నాడు. ఆ విషయం

మీద ఏమేమిటి రాసి ఉన్నాయో అవన్నీ చదివానన్నాడు. దివ్యగురువులు ప్రపంచంలో వివిధ ప్రదేశాల్లో ఉన్నారన్న నమ్మకం తనకి కలిగిందన్నాడు. వారు తమ ప్రత్యేకమైన శిష్యులికి తప్ప ఇతరులెవ్వరికీ భౌతికంగా దర్శనం ఇవ్వకపోయినా, కొందరితో వేరే మార్గాల్లో సంపర్కం పెట్టుకుంటారు. ప్రపంచ సమాలోచనకీ, కార్య నిర్వహణకీ నాయకులైన వారిని లాభదాయకంగా ప్రభావితం చేసి వారికి మార్గాన్ని సూచిస్తారు. ఆ విషయం నాయకులకు తెలియకుండా విప్లవాన్నీ, శాంతినీ తీసుకొస్తారు. ప్రతి భూఖండంలోనూ కొంతమంది దివ్యజ్ఞాన ప్రభువులు ఉన్నారనీ, ఆయా భూఖండాల భవితవ్యాన్ని రూపుదిద్దుతూ వాటికి వారి ఆశీర్వచనాలను అందజేస్తూ ఉంటారని తాను గట్టిగా నమ్ముతున్నాననీ చెప్పాడాయన. అటువంటి మహా పురుషులకు శిష్యులుగా ఉన్న చాలా మందిని ఆయన ఎరుగునుట. వారికి తాము శిష్యులమని వాళ్లు చెప్పబట్టే తెలిసిందని అన్నాడాయన జాగ్రత్తపడు తున్నట్లు. ఆయన ఎంతో మనస్ఫూర్తిగానే చెబుతున్నాడు. ఆ దివ్య గురువులను గురించి మరింత తెలుసుకోవాలని కోరుతున్నాడు. ప్రత్యక్షాను భవం కలగటం, ప్రత్యక్షంగా వారితో సంపర్కం కలగటం సాధ్యమా అని అడిగాయన.

నది ఎంత నిశ్చలంగా ఉంది! రెండు మెరుస్తున్న చక్కని పక్షులు ఒడ్డుకి దగ్గరగా నీటిపైన పైకీ క్రిందికీ ఎగురుతున్నాయి. తేనెటీగలు కొన్ని తేనె పుట్ట కోసం నీటిని పోగుచేస్తున్నాయి. చేపలవాడి పడవ ఒకటి ప్రవాహం మధ్యన ఉంది. నది ఒడ్డు పొడుగునా చెట్లు ఆకులతో ఒత్తుగా ఉన్నాయి. ఆ చెట్ల నీడలు నిండుగా నల్లగా ఉన్నాయి. పొలాల్లో కొత్తగా నాటిన వరినారు పచ్చగా కనిపిస్తున్నాయి. తెల్లటి పిట్టలు కూస్తున్నాయి. ఆ దృశ్యం ఎంతో ప్రశాంతంగా ఉంది. ఆ సమయంలో మన అల్ప సమస్యల గురించి మాట్లాడుకోవటం జాలిపడవలసిన విషయంలా తోచింది. ఆకాశం సాయంకాలపు లేత నీలిరంగులో ఉంది. గొడవ గొడవగా ఉండే పట్టణాలు ఎంతో దూరంలో ఉన్నాయి. నదికి అవతలి ఒడ్డున ఒక గ్రామం ఉంది. నది చుట్టూ ఒడ్డు వెంబడే ఒక దారి ఉంది. ఓ కుర్రవాడు స్పష్టంగా గొంతెత్తి పాడుతున్నాడు. అతని పాట అక్కడి ప్రశాంతతని భంగం చెయ్యటం లేదు.

మనం చాలా చిత్రమైన మనుషులం. ఏదో కావాలని ఎక్కడెక్కడో దూరదూర ప్రదేశాల్లో వెతుకుతూ తిరుగుతాం - అది మనకి ఎంతో దగ్గరలోనే ఉన్నప్పటికీ. సౌందర్యం ఎక్కడో ఉంటుంది, ఇక్కడ కాదు; సత్యం మన ఇళ్లలో ఉండదు, ఎక్కడో దూర ప్రాంతంలో ఉంటుంది అనుకుంటాం. ప్రపంచానికి మరోవైపుకి పోతాం గురువుని అన్వేషించటానికి. నౌకరు గురించి మనం తెలుసుకోం. జీవితంలోని సామాన్య విషయాలను అర్థం చేసుకోము. ప్రతిరోజూ జరిగే పోరాటాలనూ, కలిగే సంతోషాలనూ అర్థం చేసుకోము. అయినా, ఏదో మర్మభూయిష్టమైనదాన్నీ, నిగూఢమైనదాన్నీ అందుకోవటానికి ప్రయత్నిస్తాం. మనల్ని మనమే తెలుసుకోం. ఎవరో ఒక బహుమానాన్నీ ఒక ఫలితాన్నీ ఒక ఆదర్శలోకాన్నీ ఇస్తానని ఆశపెడితే, వారికి సేవ చెయ్యటానికీ, వారిని అనుసరించటానికీ అంగీకరిస్తాం. మనం గందరగోళంగా ఉన్నంత కాలం మనం ఎంచుకున్నదేదైనా గందరగోళంగానే ఉంటుంది. మనం సగం అంధులమై ఉన్నప్పుడు స్పష్టంగా చూడలేము. మనం చూసేది కొంత భాగం మాత్రమే. అందుచేత అది నిజమైనది కాదు. ఇదంతా మనకి తెలుసు. అయినా, మన కోరికలూ, మన తాపత్రయాలూ ఎంత బలమైనవంటే, మనల్ని భ్రమల్లోకీ, అంతులేని దుఃఖాల్లోకీ ఈడ్చుకుపోతాయి.

గురువుల్లో ఉండే నమ్మకమే గురువుల్ని సృష్టిస్తుంది. నమ్మకం అనుభవాన్ని తీర్చిదిద్దుతుంది. ఒక ప్రత్యేక కార్యక్రమంలోనో, సిద్ధాంతంలోనో నమ్మకం ఉంటే, కోరుకున్న దాన్ని అది సృష్టిస్తుంది. కాని, దానివల్ల ఎంత నష్టం, ఎంత బాధ! సామర్థ్యం ఉన్న వ్యక్తి చేతుల్లో నమ్మకం శక్తిమంతమవుతుంది. తుపాకికన్న ప్రమాదకరమైన ఆయుధం అవుతుంది. మనలో చాలామంది వాస్తవానికన్న నమ్మకానికే ఎక్కువ విలువనిస్తారు. ఉన్న దాన్ని అర్థం చేసుకోవటానికి నమ్మకంతో పనిలేదు. అంతేకాక, నమ్మకం, ఉద్దేశం, దురభిప్రాయంగాని ఉంటే అవగాహనకి ప్రతిబంధకం అవుతుంది. కాని, మనకి నమ్మకాలూ, దృఢాభిప్రాయాలే కావాలి. అవి మనలో వేడిని పుట్టిస్తాయి. మనకి ఆశ చూపిస్తాయి. మనల్ని ప్రోత్సహిస్తాయి. మన నమ్మకాల తీరుల్ని అర్థం చేసుకున్నట్లయితే, ఎందుకు వాటిని పట్టుకుని వ్రేలాడుతున్నామో అర్థం చేసుకున్నట్లయితే, వైరుధ్యానికి ఉండే ముఖ్యకారణం ఒకటి మటుమాయమవుతుంది.

లాభం పొందాలనే కోరిక - వ్యక్తిగతంగా గాని, సామూహికంగా గాని, అజ్ఞానానికీ, భ్రమకీ, వినాశానికీ, దుఃఖానికీ దారితీస్తుంది. కోరిక అనేది ఇంకా ఎక్కువ భౌతిక సుఖాలకోసమే కాదు; ధనం, జ్ఞానం, ప్రత్యేకత వల్ల వచ్చే అధికారం కోసం కూడా ఉంటుంది. ఇంకా కావాలనే తాపత్రయం సంఘర్షణకీ, దుఃఖానికీ దారితీస్తుంది. అన్ని రకాలుగానూ ఆత్మవంచన చేసుకుంటూ ఈ దుఃఖాన్ని తప్పించుకుపోవటానికి ప్రయత్నిస్తాం - అణచి వేయటం ద్వారా, దాని స్థానంలో మరొకటి ఉంచటం ద్వారా, దాన్ని పవిత్రం చేయటం ద్వారా. కాని, ఆ తాపత్రయం కొనసాగుతూనే ఉంటుంది - మరొక స్థాయిలో కావచ్చు. తాపత్రయం ఏ స్థాయిలోనైనా అది ఎప్పటికీ సంఘర్షణే, దుఃఖమే. అన్నింటిలోకీ సులభమైన పలాయన మార్గాల్లో గురువు ఒకటి. తాపత్రయం ఒకటి. కొంతమంది రాజకీయ సిద్ధాంతాల ద్వారా, దాని కార్యకలాపాల ద్వారా తప్పించుకుంటారు. కొంతమంది పూజలూ, క్రమశిక్షణ - వాటివల్ల కలిగే అనుభూతుల ద్వారా తప్పించుకుంటారు. మరి కొంతమంది గురువు ద్వారా తప్పించుకుంటారు. అలాంటప్పుడు తప్పించుకునే మార్గాలే అతి ముఖ్యమైపోతాయి. భయం, పట్టుదల ఈ మార్గాల్ని సురక్షితంగా ఉంచుతాయి. ఇక, మీరు ఉన్న స్థితి ఏమిటి అనేదానితో ప్రమేయం ఉండదు. గురువే ముఖ్యం అవుతాడు. మీ ప్రాముఖ్యం సేవకుడిగా మాత్రమే, లేక శిష్యుడిగా మాత్రమే - దాని అర్థం ఏదైనప్పటికీ. అందులో ఏదో ఒకటి అవటానికి మీరు కొన్ని పనులు చేస్తారు. కొన్ని పద్ధతుల ప్రకారం నడుచుకుంటారు. కొన్ని పాట్లు పడతారు. ఇదేకాదు, ఇంకేమైనా చెయ్యటానికైనా మీరు సంసిద్ధులే - ఈ ప్రత్యేకత సుఖాన్నీ, అధికారాన్నీ ఇస్తుంది కనుక. గురువు పేరుతో సుఖం, అధికారం గౌరవనీయమవుతాయి. మీరింక ఒంటరిగా, అయోమయంగా, ఏదో పోగొట్టుకున్నట్లుగా ఉండరు. మీరు వారికో, ఆ పార్టీకో, చెందుతారు. మీరు క్షేమంగా ఉంటారు.

ఏం చేసినా, మనలో చాలామంది కోరుకునేది అదే కాదా - క్షేమంగా ఉండటం, సురక్షితంగా ఉండటం. నలుగురితో బాటూ తప్పిపోతే అదొక రకమైన మానసిక రక్షణ. ఒక సంఘంతో గాని, ఒక భావంతో గాని - సర్వసమ్మతమైనది గాని, ఆధ్యాత్మికమైనది గాని - ఏదో ఒకదానితో ఐక్యం

చేసుకున్నట్లయితే సురక్షితంగా ఉన్నట్లనిపిస్తుంది. అందువల్లనే మనలో చాలామంది జాతీయ భావాన్ని పట్టుకుని వదలరు - అది వినాశానికీ, దుఃఖానికీ దారి తీసినా సరే. అందువల్లనే మత వ్యవస్థలకి ప్రజలపైన అంత ప్రభావం - అది విభేదాల్నీ, వైరుధ్యాన్నీ పుట్టించినా సరే. వ్యక్తిగతంగా గాని, సామూహికంగా గాని రక్షణ కోసం తాపత్రయ పడటం వినాశాన్ని కలుగ జేస్తుంది. మానసికంగా క్షేమంగా ఉండాలనుకోవడం భ్రమని కలిగిస్తుంది. మన జీవితమంతా భ్రమ, దుఃఖం; మధ్య మధ్య ప్రశాంతమైన, సంతోష కరమైన క్షణాలు అరుదుగా ఉంటాయి. అందుకని ఏవి మనకి ఆశ్రయాన్ని కల్పిస్తాయని ఆశపెట్టినా మనం వెంటనే ఒప్పుకుంటాం. కొంతమంది రాజకీయ ఆదర్శాల నిరుపయోగాన్ని చూచిన మీదట మతం వైపుకి మొగ్గుతారు - గురువుల్లోనూ, మూఢవిశ్వాసాల్లోనూ, ఆదర్శాల్లోనూ రక్షణనీ, సుఖాన్నీ వెతుక్కోవటానికి. నమ్మకం అనుభవాన్ని రూపొందిస్తుంది కనక గురువులు ఉన్నారనేది తప్పించుకోశక్యం కాని నిజం అవుతుంది. ఒకసారి ఐక్యం చేసుకోవటంలో ఉన్న సుఖాన్ని అనుభవించిన తరువాత మనస్సు గట్టిగా బంధింపబడి ఉంటుంది. దాన్ని కుదపటం దేనికీ తరం కాదు. దాని లక్షణమే అనుభవం.

కాని అనుభవం నిజం కాదు. నిజాన్ని అనుభవం పొందటం సాధ్యం కాదు. అది ఉంటుంది, అంతే. అనుభవించేవాడు నిజాన్ని అనుభవం పొందుతున్నానని అనుకుంటే అతనికి తెలిసినది భ్రమ మాత్రమే. నిజం గురించి ఉన్న జ్ఞానమంతా భ్రమే. నిజం ఉండాలంటే జ్ఞానం, అనుభవం అంతమొందాలి. అనుభవం నిజాన్ని చేరుకోలేదు. అనుభవం జ్ఞానాన్ని రూపొందిస్తుంది. జ్ఞానం అనుభవాన్ని మలుస్తుంది. నిజం ఉండాలంటే ఆ రెండూ అంతమవాలి.

## 32. ప్రత్యేకత

ఆయన పొట్టిగా ఉన్నాడు. ఉద్రేకపడే మనిషి. ఏదో విశ్వ విద్యాలయంలో అధ్యాపకుడు. ఆయన ఎంతగా చదివాడంటే, ఆయన

భావాలెక్కడ మొదలయాయో, ఇతరుల భావాలెక్కడ అంతమయాయో ఆయనకే తెలియటం కష్టం. తను తీవ్రమైన జాతీయవాదిననీ, దాని కోసం ఒక విధంగా ఎంతో బాధ అనుభవించాననీ చెప్పాడాయన. మత ధర్మాన్ని ఆచరిస్తూండేవాడుట. ఇప్పుడా చెత్తంతా దులిపేసుకున్నాడుట. భగవంతుడి దయవల్ల మూఢవిశ్వాసాల నుంచి విముక్తి పొందాడుట. ఈ మానసికమైన విషయాల గురించి ప్రసంగాలూ, చర్చలూ జనాన్ని తప్పుత్రోవని పట్టిస్తాయని గట్టిగా నొక్కి చెప్పాడు. ముఖ్యంగా మనకి కావలసినది మానవుల ఆర్థిక పునర్వ్యవస్థ - మనిషి బ్రతకటానికి తిండి ముఖ్యం కనుక, తిండి తరువాతే తక్కినవన్నీ. రక్తవిప్లవం రావాలిట. వర్గరహితమైన సమాజం స్థాపింపబడాలిట. లక్ష్యం సాధించగలిగితే ఎటువంటి మార్గమయినా ఫరవాలేదుట. అవసరమైతే గందరగోళం పుట్టించి, అధికారాన్ని హస్తగతం చేసుకుని అప్పుడు సక్రమమైన వ్యవస్థని నెలకొల్పాలిట. సామూహికత అవసరమట. వ్యక్తిని దోపిడీ చెయ్యటాన్ని పూర్తిగా అణగద్రొక్కాలిట. భవిష్యత్తు గురించి సుస్పష్టంగా చెప్పాడాయన. మనిషి పరిస్థితుల ప్రభావంతో తయారైనవాడు. అవి భావిలో మరోలా రూపొందిస్తాయి. భావికోసం, రాబోయే ప్రపంచంకోసం అన్నిటినీ త్యాగం చేస్తారు. ప్రస్తుతం ఉన్న మనిషిని రూపుమాపటం అంత ముఖ్యం కాదు వారికి, భవిష్యత్తు వారికి తెలుసును.

మనం చరిత్ర చదువుకుని చారిత్రాత్మక వాస్తవాలను మన దురభిప్రాయాల కనుగుణంగా అనువదించుకుంటాం. కాని, భవిష్యత్తు గురించి నిశ్చయంగా ఉండటం భ్రమకి లోనవటమే. మనిషి ఒక్క ప్రభావ ఫలితం కాడు. అతడు ఎంతో క్లిష్టమైనవాడు. ఒక ప్రభావానికి ప్రాముఖ్యం ఇచ్చి తక్కిన వాటిని అల్పం చేస్తే అస్థిరత పెంపొందుతుంది. అది మరింత కల్లోలానికీ, దుఃఖానికీ దారి తీస్తుంది. యావత్ప్రక్రియకీ రూపం మనిషి. ఒక్క భాగాన్ని మాత్రమే కాకుండా సమస్తమూ అర్థం చేసుకోవాలి - ఆ భాగం తాత్కాలికంగా ఎంత ముఖ్యమనిపించినప్పటికీ. భవిష్యత్తుకోసం ప్రస్తుతాన్ని త్యాగం చేసే పిచ్చి విపరీతమైన అధికార వాంఛ ఉన్నవాళ్లకే ఉంటుంది. అధికారం హానికరమైనది. ఇటువంటి వాళ్లు మానవులను ఒక దిక్కుకి మళ్లించే హక్కు తమకే ఉన్నదనుకుంటారు. వీళ్లు కొత్త రకం మత పోషకులు.

కాని, మార్గమూ, లక్ష్యమూ వేరు కావు. అవి రెండూ సమ్మిళితమైన విశేషమది. మార్గమే లక్ష్యాన్ని నిర్ణయిస్తుంది. హింస ద్వారా శాంతి ఎన్నటికీ లభించదు. రక్షక భటులతో కూడిన ప్రభుత్వం శాంతియుతమైన ప్రజలని రూపొందించలేదు. నిర్బంధం ద్వారా స్వేచ్ఛను సాధించలేరు. ఒక రాజకీయ పక్షానికి అధికారమంతా ఉన్నప్పుడు వర్గరహితమైన సమాజం స్థాపించబడటం సాధ్యం కాదు. నిరంకుశాధికారంవల్ల అది ఏనాటికీ సిద్ధించదు. ఇదంతా సుస్పష్టం.

వ్యక్తి యొక్క ప్రత్యేకత సమూహంతో గాని, సిద్ధాంతంతో గాని ఐక్యత చేసుకోవటం వల్ల నాశనం కాదు. దాని స్థానంలో మరొకటి ఉంచినందు వల్లగాని, దాన్ని అణచి వేసినందువల్ల గాని ప్రత్యేకత అనే సమస్యని తప్పించుకోలేరు. దాని స్థానంలో మరొకటి ఉంచినందువల్ల గాని, దాన్ని అణచినందువల్ల గాని తాత్కాలికంగా లాభించవచ్చు. కాని, వేరు అనే భావం మరింత ఉధృతంగా పైకి ఉబుకుతుంది. భయం వల్ల తాత్కాలికంగా వెనక్కి నొక్కి పెట్టవచ్చు. కాని సమస్య అలాగే ఉంటుంది. ప్రత్యేకతని పోగొట్టటం కాదు సమస్య - మనలో ప్రతి ఒక్కరం దానికంత ప్రాముఖ్యం ఎందుకిస్తున్నా మన్నదే. వర్గరహిత సమాజాన్ని సృష్టించాలని కోరుతున్న వాళ్లే తమ అధికార బల ప్రయోగంతో విభేదాన్ని పెంపొందిస్తున్నవారు. మీరు వేరు, నేను వేరు; నేను వేరు. ఇంకొకరు వేరు. ఇది వాస్తవం. అయితే, ఈ వేరు అనే భావానికి మనం ఎందుకంత ప్రాముఖ్యం ఇస్తాం- దానికి దుష్ఫలితాలున్నాయని తెలిసి? మనందరిలోనూ చాలా వరకు పోలిక ఉన్నప్పటికీ, మనం ఒకరిని పోలి ఒకరం లేము. ఈ పోలిక లేకపోవటమనేదే మనం ఎవరికి వారు ప్రత్యేకంగా ఉండటానికి ప్రాముఖ్యాన్ని కల్పిస్తుంది. పేరు, కుటుంబం, ఆస్తి - వీటితో వేరే వ్యక్తి నన్న భావం కలుగు తుంది. ఈ ప్రత్యేకత, ఈ వ్యక్తిత్వభావం ఎంతో హాని కలుగజేస్తాయి. అందుకే సామూహిక కృషి నిర్వహణ, వ్యక్తిని మొత్తం సంఘంకోసం త్యాగం చెయ్యటం మొదలైనవి కోరటం జరుగుతుంది. మత వ్యవస్థలు వ్యక్తిగతమైన ఇచ్ఛను సమిష్టి ఇచ్ఛముందు మోకరిల్లేటట్లు ప్రయత్నించాయి. ఇప్పుడు రాజకీయ పక్షం ప్రభుత్వ బాధ్యతని చేపట్టి వ్యక్తిని ముంచి వెయ్యటానికి చేతనైనదంతా చేస్తోంది.

భేద భావాన్ని పట్టుకుని ఎందుకంతగా ప్రాకులాడుతాం? మన అనుభూతులు వేరు. ఆ అనుభూతులతోనే బ్రతుకుతున్నాం. ఆ అనుభూతులే మనం, ఆ అనుభూతులను - సంతోషకరమైనవైనా, బాధాకరమైనవైనా - లేకుండా చేస్తే, ఇక మనం ఉండనే ఉండము. అనుభూతులు మనకి ముఖ్యం. వాటితోనే విభేదం. వ్యక్తిగత జీవితంలోనూ, ప్రజా జీవితంలోనూ విభిన్న అనుభూతులుంటాయి. విభిన్న స్థాయిల్లో అవి పరస్పరం ఢీకొన్నప్పుడు సంఘర్షణ ఏర్పడుతుంది. అనుభూతులెప్పుడూ పరస్పరం పోరాడుకుంటూనే ఉంటాయి - వ్యక్తిగత జీవితంలోగాని, ప్రజా జీవితంలో గాని, అనుభూతిలో సంఘర్షణ సహజంగా ఉంటుంది. అధికారంతోగాని, నమ్రతతోగాని ఉండాలని కోరుతున్నంతకాలం, అనుభూతిలో సంఘర్షణ ఉండి తీరుతుంది. దానితో బాటే వ్యక్తిగతంగానూ, సాంఘికంగానూ దురవస్థ ప్రాప్తిస్తుంది. ఇంకా అవాలనో, ఇంత అవకూడదనో నిరంతరం కోరటం వలన వ్యక్తిత్వ భావం, భేదభావం ఉద్భవిస్తాయి. ఈ వాస్తవాన్ని మనం నిరసించకుండా, సమర్థించకుండా, దానితో బాటే ఉండగలిగితే, మన జీవితమంతా అనుభూతులతో రూపొందినది కాదని తెలుసుకుంటాం. అప్పుడు మనస్సు, దాని స్మృతి, అనుభూతి ప్రశాంతంగా అయి, దాని సంఘర్షణలతో అది చీలిపోకుండా ఉంటుంది. అప్పుడే, మనస్సు నిశ్శబ్దంగా, ప్రశాంతంగా ఉన్నప్పుడే, "నేను" "నా" అనేవి లేకుండా ప్రేమించటం సాధ్యమవుతుంది. ఇటువంటి ప్రేమ లేకుండా సామూహిక చర్య కేవలం బలత్కారం మాత్రమే అవుతుంది. అది వైరుధ్యాన్నీ, భయాన్నీ పెంపొందింపజేసి, వ్యక్తిగత, సాంఘిక సంఘర్షణలకు దారి తీస్తుంది.

## 33. అధికార శక్తి

ఆయన చాలా బీదవాడు, కానీ, సమర్థుడూ, తెలివైన వాడూ: ఆయన తనకున్న దానితో తృప్తి పడుతున్నట్లుగా ఉన్నాడు. అధమం, ఉన్నట్లు కనిపిస్తున్నాడు. ఆయనకు కుటుంబ భారం లేదు. ఆయన తరుచు ఇవీ అవీ మాట్లాడటానికి వస్తూ ఉంటాడు. ఆయనకి భవిష్యత్తు గురించి గొప్ప

కలలున్నాయి. ఆయన అప్రమత్తగా, ఉత్సాహంగా ఉంటాడు. ఆయన సుఖాలు చాలా సామాన్యమైనవి. ఇతరులకేవైనా చిన్న చిన్న పనులు చేసిపెట్టటంలో సంతోషాన్ని పొందుతాడు. ఆయన తనకి ధనమన్నా, భౌతిక సుఖాలన్నా పెద్ద మోజు లేదన్నాడు. కాని, డబ్బుంటే ఏం చెయ్యదలుచు కున్నాడో వివరంగా చెప్పటం ఇష్టం ఆయనకి. దేనికో ఒకదానికి సహాయం చేస్తాననీ, సలక్షణమైన పాఠశాల ప్రారంభిస్తాననీ, ఇంకా ఎన్నో చెప్పాడు. ఆయన కలగంటున్నట్లుగానూ, తన ఉత్సాహంలోనూ, ఇతరుల ప్రభావం లోనూ పడికొట్టుకుపోతున్నట్లుగా ఉన్నాడు.

ఎన్నో ఏళ్లకి మళ్లీ వచ్చాడాయన. ఆయనలో ఒక చిత్రమైన పరివర్తన వచ్చింది. ఆ స్వాప్నిక దృష్టిపోయింది. వ్యవహార దృష్టితో, నిశ్చితంగా, కర్కశమైన అభిప్రాయాలతో, కఠినమైన నిర్ణయాలతో ఉన్నాడు. ఆయన దేశాలు తిరిగాడు. ఆయన ప్రవర్తన ఎంతో సంస్కృతి ఉట్టిపడేట్టుగానూ, సభ్యత అలవరచుకున్నట్లుగానూ ఉంది. తన సమ్మోహనా శక్తిని మధ్య మధ్య ప్రదర్శిస్తున్నాడు. ఆయనకి చాలా ఆస్తి సంక్రమించిందిట. దాన్ని ఎన్నో రెట్లు అధికం చేశాడుట. మనిషి పూర్తిగా మారిపోయాడు. ఇప్పుడు ఆయన రావటం అరుదైపోయింది. ఎప్పుడైనా వచ్చి కలుసుకున్నప్పుడైనా, ఎంతో దూరాన ఉన్నట్లూ, తన చుట్టూ గోడ కట్టుకున్నట్లూ ఉంటాడు.

దారిద్ర్యం, సంపదా కూడా బంధనాలే. దారిద్ర్యాన్నీ, సంపదల్నీ మనస్సులో పెట్టుకున్న వారు పరిస్థితుల చేతుల్లో కీలు బొమ్మలవుతారు. అవి రెండూ మనిషిని చెడిపేవే. ఆ రెండూ చెడు చేసే దాన్నే అభిలషిస్తాయి. అధికారాన్ని కోరతాయి రెండూ. అధికారం ఆస్తిపాస్తుల కన్న గొప్పది. అధికారం సంపదకన్నా, భావాలకన్నా గొప్పది. ఇవన్నీ బలాన్నిస్తాయి. అయినా, వాటిని వదులుకోవటం సాధ్యమే. కాని, అధికార భావం ఉండి పోతుంది. అధికారాన్ని నిరాడంబర జీవితం ద్వారా గాని, సద్గుణం ద్వారా గాని, రాజకీయ పక్షం ద్వారా గాని, త్యజించడం ద్వారా గాని పొందవచ్చు. కాని ఆ మార్గాలన్నీ ప్రత్యామ్నాయం మాత్రమే. అవి ఎవరినీ మోసగించలేవు. హోదా, పలుకుబడి, అధికారం కావాలనే కోరిక ఎంతో సహజంగా పుట్టినట్లుంటుంది. బలప్రయోగం వల్ల గాని, నమ్రత వల్ల గాని, సన్యాసం వల్ల గాని, జ్ఞానం వల్ల

గాని, పరులను దోచుకోవటం వల్ల గాని, ఆత్మత్యాగం వల్ల గాని, పొందిన అధికారం పైకి కనిపించకుండా పట్టుబడుతుంది. ఏ రకమైన విజయం సాధించినా, అది అధికారమే. ఓటమి కేవలం గెలుపు లేకపోవటమే. అధికారంతో ఉండటం, జయించడం అంటే బానిసగా ఉండటమే. అంటే సద్గుణం లేకపోవడమే. సద్గుణం స్వేచ్ఛనిస్తుంది. కాని, అది పొందగలిగినది కాదు. ఏది సాధించినా, వ్యక్తిగతంగా గాని, సామూహికంగా గాని, అది అధికారానికి సాధనం అవుతుంది. ఈ ప్రపంచంలో విజయవంతం అవటాన్నీ, ఆత్మనిగ్రహం ద్వారా, ఆత్మత్యాగం ద్వారా పొందే అధికారాన్నీ తప్పించుకోవాలి - ఆ రెండూ అవగాహనని వికృతం చేస్తాయి కనుక. విజయవంతం కావాలనే కోరిక నమ్రత లేకుండా చేస్తుంది. నమ్రత లేకుండా అవగాహన ఎలా కలుగుతుంది? విజయవంతమైన మనిషి కఠినంగా స్వార్థ పరాయణుడిగా అవుతాడు. అతని ప్రాముఖ్యంతో, బాధ్యతలతో, సాధించిన వాటితో, జ్ఞాపకాలతో అతనికి భారం పెరుగుతుంది. తనకు తాను తెచ్చిపెట్టుకున్న బాధ్యతలనుంచీ, సాధించిన దాని భారం నుంచీ స్వేచ్ఛ పొందాలి. భారంతో క్రుంగిపోయేవాడు చురుకుగా ఉండలేడు. అవగాహన చేసుకోవటానికి చురుకైన, మృదువైన మనస్సు ఉండటం అవసరం. విజయవంతులైన వారికి దయ ఉండదు. వారికి ప్రేమ అనే జీవిత సౌందర్యాన్ని తెలుసుకునే శక్తి ఉండదు.

విజయవంతం కావాలని కోరటం అంటే ఆధిపత్యాన్ని కోరటం. ఆధిపత్యం వహించటం అంటే సొంతం చేసుకోవటం. తన్నుతాను ప్రత్యేకించుకునే పద్ధతి. మనలో అనేకమంది కోరుకునేది ఈ స్వయం ప్రత్యేకతే - పేరు ద్వారా, సంబంధం ద్వారా, పని ద్వారా, భావకల్పన ద్వారా గాని, ప్రత్యేకతలో అధికారం ఉంటుంది. అధికారం వల్ల వైరుధ్యం, బాధా పెంపొందుతాయి. ప్రత్యేకత భయం మూలాన్ని వచ్చినది. భయం సంపర్కాన్ని పూర్తిగా అంతం చేస్తుంది. సంపర్కమే సంబంధం. సంబంధం ఎంత సంతోషకరమైనా, బాధాకరమైనా, దానివల్ల తన్ను తాను మరిచిపోయే అవకాశం ఉంటుంది. ప్రత్యేకత అనేది అహం అవలంబించే మార్గం. అహంతో కూడిన కార్యకలాపాలన్నీ సంఘర్షణకీ, దుఃఖానికీ కారణమవుతాయి.

# 34. చిత్తశుద్ధి

పచ్చని చిన్న మైదానం, దాని చుట్టూ అంచున కళకళలాడుతూ పువ్వులు. ఎంతో జాగ్రత్త తీసుకుని దాన్ని అందంగా ఉంచారు. ఎండ మాత్రం వీలైనంత వరకు గడ్డిని మాడ్చేసి పువ్వులు ఎండిపోయేట్లు చేస్తోంది. ఈ ముచ్చటైన తోటకి అవతలున్న కొన్ని ఇళ్లు దాటితే నీలిరంగు సముద్రం ఎండకి తళతళలాడుతోంది. దానిమీద తెల్లని తెరచాపతో ఒక ఓడ. గదిలోంచి చూస్తే క్రిందనున్న తోట, ఇళ్ల కప్పులు, చెట్లపైభాగం కనిపిస్తాయి. ఆ గది కిటికీ లోంచి ఉదయం పూటా, సాయంకాలం పూటా సముద్రం చూడటానికి హాయిగా ఉంటుంది. పగటిపూట దాని నీళ్లు కాంతివంతంగా కఠినంగా ఉన్నట్లుంటాయి. కాని, మిట్ట మధ్యాహ్నం కూడా ఓడ తెరచాప కనిపిస్తూనే ఉంటుంది. సూర్యుడు సముద్రం లోపలికి వెళ్ళిపోతాడు మెరిసే ఎర్రని బాట వేస్తూ. సంధ్య వెలుగు ఉండదు. నక్షత్రం ఒకటి ఆకాశం మీద తిరిగి అంతలోనే మాయమవుతుంది. అప్పుడే ఉదయిస్తున్న చంద్రుని ఛాయ సాయంకాలాన్ని ఆవరించుకుంటుంది. కాని అంతలోనే చంద్రుడు కూడా ఆ కల్లోలిత సముద్రంలోకి మాయమవుతాడు. నీళ్లనిండా చీకటి నిండుతుంది.

ఆయన చాలాసేపు భగవంతుడి గురించీ, మొక్కుల గురించీ, సంధ్యా వందనాల గురించీ, ఉపవాసాల గురించీ మాట్లాడాడు. మొక్కుల గురించీ, రగులుతున్న కోరికల గురించీ చాలా స్పష్టంగా, నిశ్చితంగా వ్యక్తం చేశాడు. సరియైన మాటలకోసం తడుముకోవటం లేదు. ఆయనది బాగా శిక్షణ పొందిన మనస్సు. ఆయన ఉద్యోగానికి కావలసినదే అది. ఆయన కాంతి వంతమైన కళ్లతో చురుకుగా చూస్తున్నాడు, కొంత కఠినత్వం ఆయనలో ఉన్నప్పటికీ. లక్ష్యసిద్ధికోసం పట్టుదల, లొంగే స్వభావం లేకపోవటం కనిపిస్తున్నాయి ఆయన కూర్చున్న తీరులో. ఆయనలో ఏదో అసాధారణమైన ఇచ్ఛాశక్తి ప్రేరణ ఉన్న సంగతి స్పష్టమవుతోంది. ఆయన చిరునవ్వు నవ్వినా, ఆయన మనస్సు చురుకుగా పర్యవేక్షణ చేస్తూ, తన ఆధిక్యతని చూపిస్తూనే ఉంది. ఆయన దైనందిన జీవితంలో చాలా సక్రమంగా ఉంటాడు. తాను అలవరచుకున్న అలవాట్లను తన ఇచ్ఛానుసారంగానే మార్చుకుంటాడు. ఇచ్ఛ

లేకుండా ఏ సద్గుణమూ ఉండదన్నాడు. చెడుని నిర్మూలించాలంటే ఇచ్ఛ ఉండటం అవసరం. మంచికీ చెడుకీ మధ్య యుద్ధం అనంతమైనది. ఇచ్ఛ ఒక్కటే చెడుని అదుపులో పెట్టగలిగేది. ఆయనలో కొంత సరళ స్వభావం కూడా ఉంది. ఎందుకంటే, తోటకేసీ, హాయిగొల్పే పువ్వులకేసీ చూసినప్పుడు చిరునవ్వు నవ్వుతున్నాడు. కాని, ఆయన తన ఇచ్ఛ, దాని కార్యరూపం - వీటి నుంచి మనస్సుని మరో చోటికి పోనివ్వటం లేదు. ఆయన పరుషపదాల్ని వాడకుండా ఉండటానికి ప్రయాసపడుతున్నప్పటికీ, ఏ మాత్రం కోపం, అసహనం కలిగినా, ఆయన ఇచ్ఛ ఆయన్ని ఉద్రిక్తుణ్ణి చేస్తోంది. ఆయన లక్ష్య పరిధిలో అందానికి స్థానం ఉన్నట్లయితే దాన్ని స్వీకరిస్తాడు. కాని, ఇంద్రియ సుఖానుభూతి కలుగుతుందేమోనన్న భయం మెదులుతూనే ఉంటుంది. ఆయన బాగా చదువుకున్నవాడు. సభ్యత తెలిసినవాడు. ఆయన ఇచ్ఛ ఆయన్ని వెన్నంటే ఉంది.

చిత్తశుద్ధి నిరాడంబరంగా ఉండలేదు. చిత్తశుద్ధి ఇచ్ఛను పెంపొందించేందుకు మూలాధారం. స్వార్థం ఎన్ని విధాలుగా ఉంటుందో ఇచ్ఛ తెలుసుకోలేదు. ఆత్మజ్ఞానం ఇచ్ఛానుసారం కలిగేది కాదు. క్షణక్షణం జీవితంలో ప్రతి సంచలనానికీ కలిగే ప్రతిక్రియలను తెలుసుకోవటం ద్వారా ఆత్మజ్ఞానం కలుగుతుంది. వాటంతట అవే కలిగే ప్రతిక్రియలను ఇచ్ఛ ఆటంకపరుస్తుంది. అసలా ప్రతిక్రియల వల్లనే ఆత్మయొక్క రూపనిర్మాణం ఆవిష్కారమవుతుంది. కోరిక యొక్క సారమే ఇచ్ఛ. కోరికను అర్థం చేసుకోవటానికి ఇచ్ఛ ప్రతిబంధకమవుతుంది. ఇచ్ఛ ఏ రూపంలో ఉన్నా - మనస్సు పైపైన ఉన్నది గాని, లోలోపలికి వేళ్లు పాతుకుపోయిన కోరికలు గాని, ఉదాసీనంగా ఉండలేవు. ఉదాసీనతలోనే, అప్రమత్తమైన నిశ్శబ్దంలోనే, సత్యమనేది ఉంటుంది. సంఘర్షణ ఎప్పుడూ కోరికల మధ్యనే. ఆ కోరికలు ఏస్థాయిలో ఉన్నవైనా సరే. ఒక కోరికని బలపరుస్తూ, దానికి వ్యతిరేకంగా ఉండే తక్కిన వాటిని అణచివేసినట్లయితే, మరింత ప్రతిఘటన ఏర్పడుతుంది. ఈ ప్రతిఘటనే ఇచ్ఛ. ప్రతిఘటన ద్వారా అవగాహన కలగదు. ముఖ్యమైన దేమిటంటే, కోరికను అర్థం చేసుకోవటం. అంతేకాని, ఒక కోరికను మరోకోరిక ద్వారా తప్పించుకోవటం కాదు.

ఏదో సాధించాలి, ఏదో లాభం పొందాలి అనే కోరిక చిత్తశుద్ధికి పునాది. ఈ బలవత్తరమైన కోరిక పైపైదైనా, లోలోపలిదైనా, దానికి అనుగుణంగా ప్రవర్తించేటట్లు చేస్తుంది. దానితోనే భయం ఆరంభమవుతుంది. భయం ఆత్మజ్ఞానాన్ని అనుభవం వరకే పరిమితం చేస్తుంది. అందుచేత, అనుభవించిన దానికి అతీతంగా ఉండటం సాధ్యం కాదు. పరిమితమైనది కాబట్టి, ఆత్మజ్ఞానం విస్తృతమైన, గాఢమైన ఆత్మచైతన్యావస్థను మాత్రమే అలవరచు కుంటుంది. అనేక స్థాయిల్లో, అనేక సమయాల్లో "నేను" అనేది అంత కంతకు విస్తృతమవుతుంది. అంచేత, సంఘర్షణ, బాధా కొనసాగుతూనే ఉంటాయి. ఏదో కార్యకలాపంలో పడి మిమ్మల్ని మీరు ప్రయత్నపూర్వకంగా మరిచి పోవచ్చు - తోట పెంచటంలోనో, ఒక సిద్ధాంతాన్ని అవలంబించటంలోనో, ప్రజలందరిలోనూ యుద్ధం చెయ్యాలనే తీవ్రమైన ఉత్సాహం ప్రకోపించేటట్లు ఉద్రిక్తపరచవచ్చు. కానీ, దాంతో మీరే దేశం, మీరే సిద్ధాంతం, మీరే కార్య కలాపం, మీరే భగవంతుడూ అవుతారు. తాదాత్మ్యత ఎక్కువైన కొద్దీ సంఘర్షణనీ, బాధనీ మరింత కప్పిపుచ్చటం జరుగుతుంది. దేనితోనో ఒకదానితో ఐక్యం చేసుకోవాలనే అంతులేని పోరాటం సాగుతుంది. ఎంచుకున్న ఒకదానితో ఒకటై పోవాలనే కోరిక చిత్తశుద్ధిలో సంఘర్షణకి దారి తీస్తుంది. దాంతో నిరాడంబరత పూర్తిగా పోతుంది. ముఖాన విభూతి పూసుకోవచ్చు, సామాన్యమైన వస్త్రం కట్టుకోవచ్చు, బిచ్చగానిలా తిరగవచ్చు. కాని అది నిరాడంబరత కాదు.

నిరాడంబరత, చిత్తశుద్ధి ఎన్నటికీ ఒకచోట సఖ్యంగా ఉండలేవు. ఏదో ఒకదానితో, ఏ స్థాయిలోనైనా సరే, తన్నుతాను ఐక్యం చేసుకున్నవాడు ఎంత చిత్తశుద్ధి కలవాడైనా నిరాడంబరుడు కాడు. ఏదో అవాలనే ఇచ్ఛే నిరాడంబ రతకి వ్యతిరేకం. ఇంకా పోగుచెయ్యాలనే ఆకాంక్ష, ఇంకా సాధించాలనే వాంఛ లేకుండా స్వేచ్ఛగా ఉన్నప్పుడే నిరాడంబరత్వం వస్తుంది. సాధించిన దానితో ఐక్యం అయిపోవటం - ఆ ఐక్యం అయిపోవటమే ఇచ్ఛ. అప్రమత్తంగా, ఉదాసీనంగా తెలుసుకోవటమే నిరాడంబరత. ఆవిధంగా తెలుసుకోవటంలో అనుభవించేవాడు అనుభవాన్ని పదిలపరచటం జరుగదు. స్వయం విశ్లేషణ ఈ విధంగా అవ్యక్తంగా తెలుసుకోనివ్వకుండా చేస్తుంది. విశ్లేషించటంలో

ఎప్పుడూ ఒక ఉద్దేశం ఉంటుంది. - స్వేచ్ఛ పొందాలనో, అర్థం చేసుకోవాలనో, లాభం పొందాలనో. ఇటువంటి కోరిక ఆత్మచైతన్యానికి ప్రాధాన్యం ఇస్తుంది. అదే విధంగా ఆత్మపరీక్ష చేసుకుని తీసుకున్న నిర్ణయాలు కూడా ఆత్మజ్ఞానాన్ని అరికడతాయి.

## 35. సాఫల్యం

ఆవిడకి వివాహం అయింది. కాని పిల్లల్లేరు. ఐహికంగా సుఖంగానే ఉన్నట్లు చెప్పిందావిడ. డబ్బు ఆవిడకి సమస్య కాదుట. కార్లున్నాయి, మంచి హోటళ్లున్నాయి. అన్నిచోట్లకీ ప్రయాణం చెయ్యొచ్చు. ఆవిడ భర్త బాగా వ్యాపారం చేస్తున్నాడు. ఆయనకున్న ఆసక్తి అంతా భార్యని ముస్తాబు చేయించటం, ఆవిడ సుఖంగా ఉండేలా చూడటం, ఆవిడ కోరినదల్లా సమకూర్చటం. ఇద్దరూ బాగా చిన్నవాళ్లే. కలిసిమెలిసి ఉంటారు. ఆవిడకి సైన్సులోనూ కళల్లోనూ ఆసక్తి ఉందిట. మతం విషయంలో కూడా కొంత ప్రవేశం ఉందిట. ప్రస్తుతం ఆధ్యాత్మిక విషయాలు తక్కిన వాటన్నిటినీ పక్కకి తోసేస్తున్నాయని చెప్పింది. వివిధ మతాలు ఏవేం బోధించాయో అవన్నీ ఆవిడకి తెలుసునట. కాని ఆ వ్యవస్థల సమర్థత, వాళ్ల ఆచారాలూ, ప్రగాఢ విశ్వాసాలూ ఆవిడకి నిరాశ కలిగించాయట. నిజమైన విషయాలను శోధించాలని గాఢంగా వాంఛిస్తున్నదట. ఆవిడ తీవ్రమైన అసంతృప్తితో ఉంది. ప్రపంచంలో వివిధ ప్రదేశాల్లోని గురువుల వద్దకు వెళ్లిందట. కాని ఏదీ ఆవిడకి శాశ్వతమైన తృప్తినివ్వలేదుట. ఆవిడ అసంతృప్తి, ఆవిడ చెప్పిన దాన్ని బట్టి, పిల్లలు లేకపోవటం వల్ల కలిగింది కాదు. ఆ విషయమై ఆవిడ చాలా ఆలోచించిందిట. ఆ అసంతృప్తి సాంఘిక విషయాల్లో ఆశాభంగం కలగటం వల్ల వచ్చిందీ కాదుట. కొంతకాలంపాటు ఆవిడ పేరు పొందిన వాళ్లలో ఒకరి చేత మనస్తత్వ విశ్లేషణ చేయించుకుందిట. అయినా, అంతరంగంలోని ఈ బాధ, శూన్యత ఇంకా అలాగే ఉన్నాయిట.

సాఫల్యాన్ని కోరటం ఆశాభంగాన్ని కొని తెచ్చుకోవటానికే. ఆత్మకి సాఫల్యం అనేది లేదు. అది కోరినదల్లా సొంతం చేసుకొని, తన్ను తాను

శక్తిమంతం చేసుకోవటమే. సొంతం చేసుకున్నది ఎటువంటి స్థాయికి చెందినదైనా, అది ఆత్మకి శక్తి, సంపద, చురుకుతనం కలిగినట్లు భావన కలుగచేస్తుంది. ఈ అనుభూతినే సాఫల్యం అంటారు. అన్ని అనుభూతుల లాగే అది కూడా త్వరలోనే రూపుమాసి, దాని స్థానంలో మరొకదాన్ని తేవటం, ప్రత్యామ్నాయంగా ఉంచటం - ఈ విధమైన ప్రక్రియ మన కందరికీ తెలిసినదే. ఈ రకం క్రీడతోనే మనలో చాలా మంది తృప్తిపడుతున్నారు. అయితే, కొంతమందికి ఇంకా శాశ్వతమైన సంతృప్తి కావాలి. తమ జీవితాంతం పొంద గలిగే సంతృప్తి కావాలి. అటువంటిది దొరికినట్లయితే, ఇకవారికి ఏవిధమైన ఇబ్బందీ కలుగకూడదని ఆశిస్తారు. కాని, ఇబ్బంది కలుగుతుందేమోనన్న అవ్యక్త భయం నిత్యం ఉంటుంది. దాన్ని ప్రతిఘటించటం సూక్ష్మరూపాలలో అలనరచుకుని, వాటిల్లో రక్షణ పొందుతుంది మనస్సు. అందుచేత మరణభయం అనివార్యమవుతుంది. సాఫల్యం, మరణభయం - ఈ రెండూ ఆత్మని శక్తి సంపన్నం చేసుకునే ఏక ప్రక్రియకి రెండు వైపులు. సాఫల్యం అంటే దేనితోనో ఒకదాంతో - పిల్లలతో గాని, ఆస్తితోగాని, భావాలతో గాని తన్నుతాను ఐక్యం చేసుకోవటమే కదా. పిల్లలు, ఆస్తి కొంతవరకు ప్రమాదకరం. కాని భావాలు ఎక్కువ క్షేమాన్నీ రక్షణనీ ప్రసాదిస్తాయి. మాటలు, అంటే భావాలూ, జ్ఞాపకాలూ - వీటికి సంబంధించిన అనుభూతులు - ఇవి చాలా ముఖ్యం అవుతాయి. సాఫల్యం, సంపూర్ణత కేవలం మాటలుగా మాత్రమే మిగులుతాయి.

ఆత్మసాఫల్యం అనేది లేదు. ఆత్మని శాశ్వతం చేసుకోవటం మాత్రమే. నిరంతరం అధికమయే ఆత్మ సంఘర్షణలతో, వైరుధ్యాలతో, దుఃఖాలతో, అనంతమైన సంతృప్తిని ఏదో ఒక స్థాయిలో కోరుకోవటం ద్వారా గందరగోళాన్నీ, దుఃఖాన్నీ కొనితెచ్చుకోవటమే అవుతుంది. సంతృప్తి అనేది ఎప్పటికీ శాశ్వతంగా ఉండటం సాధ్యంకాదు. సంతృప్తి కలిగించిన అనుభవాన్నొక దాన్ని మీరు జ్ఞాపకం పెట్టుకోవచ్చు. కాని, ఆ అనుభవం గతించి పోయింది. దాని స్మృతి మాత్రమే మిగిలింది. ఈ స్మృతికి జీవం ఉండదు. కాని, ప్రస్తుతానికి తగిన ప్రక్రియ లేకుండా చేసి, దానికి మీరు జీవం పోస్తున్నారు. గతించిన దానిపై మీరు జీవిస్తున్నారు. మనలో, అనేకమంది చేసేది అదే. ఆత్మ అవలంబించే మార్గాలను తెలుసుకోకపోవటం భ్రమకి దారితీస్తుంది. ఒక్కసారి

భ్రమలో చిక్కుకున్నట్లయితే, దాని వల తెంపుకుని బయట పడటం కష్టం. భ్రమని గుర్తుపట్టటం కష్టం. భ్రమని కల్పించినా, ఆ సంగతి మనస్సు గ్రహించలేదు. దాన్ని అవ్యక్తంగా, పరోక్షంగా చేరుకోవాలి. కోరిక తీరుల్ని అర్థం చేసుకోకుండా ఉన్నట్లయితే, భ్రమలో ఉండిపోవటం అనివార్యం. అవగాహన ఇచ్ఛానుసారంగా కలిగేది కాదు. మనస్సు నిశ్చలంగా ఉన్నప్పుడు మాత్రమే కలుగుతుంది. మనస్సుని నిశ్చలంగా చేయలేము - ఆ చేసేది కూడా మనస్సే. అంటే, కోరిక తయారు చేసినదే కాబట్టి. ఈ ప్రక్రియ యావత్తూ తెలుసుకోవాలి. ఏ విధమైన మనోభీష్టం లేకుండా తెలుసుకోవాలి. భ్రమ పెంపొందకుండా ఉండటానికి అప్పుడే అవకాశం ఉంటుంది. భ్రమ చాలా సంతృప్తికరంగా ఉంటుంది. అందుకే దాన్ని అంటిపెట్టుకుని ఉంటాం. భ్రమవల్ల బాధ కలగవచ్చు. కాని ఆ బాధే మన అసంపూర్ణతని బయటపెట్టి, ఆ భ్రమతో మనల్ని మనం పూర్తిగా ఐక్యం చేసుకునేట్లు తొందరపెడుతుంది. ఆ విధంగా భ్రమకి మన జీవితాల్లో ఎంతో ప్రాముఖ్యం ఉంది. ఇది ఉన్నదాన్ని - బాహ్యంగా కాదు - అంతర్గతంగా కప్పిపెట్టి ఉంచటంలో సహాయపడుతుంది. అంతర్గతంగా ఉన్నదాన్ని లెక్కచెయ్యకుండా ఉండటం వల్ల వినాశం, దుఃఖం సంభవిస్తాయి. ఉన్నదాన్ని దాచిపెట్టటం వలన భయం ఉంటుంది. ఇచ్ఛానుసారం వర్తించి భయాన్ని జయించలేము - ప్రతిఘటన వల్లనే ఇచ్ఛ పుడుతుంది కనుక. ఉదాసీనంగా ఉంటూ చురుకుగా తెలుసుకోవటం ద్వారానే భయం నుంచి విముక్తి లభిస్తుంది.

## 36. మాటలు

ఆయన విస్తారంగా చదివాడు. బీదవాడైనా, తను జ్ఞాన సంపన్నుడి ననుకుంటాడాయన. అందువల్ల ఆయనకి కొంత ఆనందం. ఆయన ఎన్నో గంటలసేపు పుస్తకాలు చదువుతూనూ, చాలాసేపు ఏకాంతంగానూ గడుపుతాడుట. ఆయన భార్య పోయింది. ఆయన పిల్లలిద్దరూ ఎవరో బంధువుల దగ్గర ఉంటున్నారు. ఈ బంధుత్వపు బెడదంతా తప్పించు కున్నందుకు కొంతవరకు సంతోషిస్తున్నాడాయన. ఆయన తన ఒక్కడితో

సరిపెట్టుకుంటూ స్వతంత్రంగా ఉంటున్నాడు. మెత్తని వాడైనా పట్టుదల గల మనిషి. ఎంతో దూరం నుంచి వచ్చానన్నాడు. ధ్యానం విషయమై తెలుసుకోవటానికి - ముఖ్యంగా, కొన్ని మంత్రాలూ, పదాలూ నిత్యం పదే పదే జపించటం ద్వారా ఎంతో సులువుగా మనస్సుని శాంతింప జేయటం విషయమై. అంతేకాదు అసలు మాటల్లోనే కొంత మాయ ఉందిట. శబ్దాల్ని సరియైన పద్ధతిలో ఉచ్చరించాలిట. సరిగ్గా వల్లించాలిట. ఈ శబ్దాలు ప్రాచీన కాలం నుంచీ సంక్రమించినవట. ఆ శబ్దాల్లోని అందం, వాటి గమకం, లయ ఇవే ధ్యానం కేంద్రీకరించటానికి అనువైన వాతావరణాన్ని సృష్టిస్తాయిట. ఆ విధంగా చెప్పి, మంత్రాలు చదవటం మొదలుపెట్టాడు. ఆయన గొంతు బాగుంది. ఆ శబ్దాల్ని అర్థం చేసుకున్నందువల్లనూ వాటిపైన ఉన్న అభిమానం వల్లనూ ఆ గొంతులో ఒకవిధమైన తీయదనం వచ్చింది. ఎంతోకాలం నుంచి శ్రద్ధగా సాధన చేయటం వల్ల సునాయాసంగా వల్లిస్తున్నాడు. ఆయన వల్లించటం మొదలు పెట్టటంతో సర్వాన్నీ విస్మరించాడు.

పొలంలోంచి పిల్లన గ్రోవి శబ్దం వినవస్తోంది. మధ్య మధ్య ఆపుతూ వాయిస్తున్నా, స్వరం స్పష్టంగానూ పరిశుద్ధంగానూ ఉంది. అతడు పెద్ద చెట్టు క్రింద చిక్కని నీడలో కూర్చుని వాయిస్తున్నాడు. అతనికి అవతల దూరాన కొండలు ఉన్నాయి. నిశ్శబ్దంగా ఉన్న ఆ కొండలు, ఆ మంత్ర పఠనం, పిల్లన గ్రోవి శబ్దం - అన్నీ కలిసి, మాయమై మళ్లీ మొదలవుతున్నాయి. చిలకలు చప్పుడు చేస్తూ ఎగిరి వెళ్లాయి. మళ్లీ పిల్లనగ్రోవి మీద స్వరాలూ, గంభీరంగా, శక్తిమంతంగా చదువుతూన్న మంత్రం. అది ప్రాతఃకాలం. సూర్యుడు చెట్లమీదుగా పైకి వస్తున్నాడు. జనం గ్రామాలనుంచి పట్నానికి పోతున్నారు కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ. పిల్లనగ్రోవీ, మంత్రమూ - రెండూ ఆగకుండా వినిపిస్తూనే ఉన్నాయి. దారిన పోయేవాళ్లు కొంతమంది ఆగిపోయారు వినటానికి. ఆ దారి ప్రక్కనే కూర్చుండిపోయారు ఆ మంత్రాలకీ, ఉదయకాలం మహిమకీ ముగ్ధులై. దూరం నుంచి వినిపిస్తున్న రైలుకూత వేటికీ అడ్డు రాలేదు. అన్ని శబ్దాలూ కలిసిపోయి భూతలాన్ని నింపినట్లుగా తోచింది. కాకి గట్టిగా అరవటం కూడా కటువుగా ధ్వనించలేదు.

ఎంతో చిత్రంగా శబ్దాల ధ్వనిలో చిక్కుకుంటాం మనం. మాటలు

మనకెంత ముఖ్యమైపోయాయి. దేశం, దైవం, మతప్రవక్త, ప్రజాప్రభుత్వం, విప్లవం. ఆ మాటల్లోనే మనం జీవిస్తూ అవి సృష్టించే అనుభూతులతో ఆనందాన్ని పొందుతాం. ఈ అనుభూతులే అంత ముఖ్యమైపోయాయి. మాటలు మనకి తృప్తి కలిగిస్తాయంటే, వాటి ధ్వనులు మరిచిపోయిన అనుభూతులను మళ్లీ మేల్కొల్పుతాయి. వాస్తవికతకు బదులు మాటలే ప్రత్యామ్నాయమైనప్పుడు వాటివల్ల కలిగే తృప్తి మరింత ఎక్కువగా ఉంటుంది. మన అంతరంగంలోని శూన్యతని ఆ మాటలతో, ఆ ధ్వనితో, చప్పుళ్లతో, కార్యకలాపంతో నింపుతాం. సంగీతం, మంత్రపఠనం మన నుంచీ, మన అల్పత్వాన్నుంచీ, విసుగుదల నుంచీ పారిపోవటానికి సుఖసాధనాలు. మన గ్రంథాలయాల నిండా మాటలే. అంతులేకుండా ఎలా మాట్లాడతాం! ఓ పుస్తకం లేకుండా, ఏ పనీ చేస్తూ ఉండకుండా ఏకాంతంగా ఉండటానికి సాహసించలేము కూడా. మనం ఏకాంతంగా ఉన్నప్పుడు మనస్సు అశాంతిగా ఉంటుంది - ఇటూ అటూ అంతటా తిరుగుతూ, ఆదుర్దాపడుతూ, జ్ఞాపకం చేసుకుంటూ, కొట్టుకుంటూ. అందుచేత ఏకాంతమనేది ఎప్పుడూ ఉండదు. మనస్సు ఎప్పుడూ నిశ్చలంగా ఉండదు.

ఏదో మాటనో, మంత్రాన్నో, ప్రార్థననో జపిస్తూ మనస్సుని నిశ్చలం చేయవచ్చును. నిస్సంశయంగా, మనస్సుకి మత్తు కలిగించి నిద్రపుచ్చవచ్చు. ఎంతో సంతోషకరంగా గాని, హింసాత్మకంగా గాని మనస్సుని నిద్రపోయేటట్లు చేయవచ్చు. నిద్రలో కలలు రావచ్చు. క్రమశిక్షణ ద్వారా, పూజ ద్వారా, జపం ద్వారా శాంతపరచిన మనస్సు ఎన్నటికీ చురుకుగా, సున్నితంగా, స్వేచ్ఛగా ఉండదు. ఈ విధంగా మృదువుగా గాని మోటుగా గాని, మనస్సుని బాదటం ధ్యానం కాదు. మంత్రాలు పఠించటం, బాగా పఠిస్తూంటే వినటం ఆనంద దాయకంగానే ఉంటుంది. కాని, అనుభూతి మరో అనుభూతికి ఆధారమవుతుంది. అనుభూతి భ్రమకి దారితీస్తుంది. మనలో చాలామంది భ్రమలలో బ్రతకటానికే ఇష్టపడతారు. ఇంకా తీవ్రమైన, విస్తారమైన భ్రమలను కనుక్కోవటంలో ఆనందం ఉంటుంది. కాని, ఆ భ్రమలను పోగొట్టు కుంటామన్న భయమే నిజాన్నీ, వాస్తవాన్నీ కప్పిపెట్టి, దాన్ని కనిపించకుండా చేస్తుంది. వాస్తవికతని అర్థం చేసుకునే శక్తి మనకి లేక కాదు. వాస్తవికతని

తిరస్కరించి భ్రమలను పట్టుకోవటం వల్లనే మనం భయపడుతూ ఉంటాం. భ్రమలో అంతకంతకి లోతుకి కూరుకుపోవటం, మనల్ని బంధించిన బోనుని ముస్తాబు చేయడమూ ధ్యానం కాదు. భ్రమని పెంపొందించే మనో మార్గాలలో దేనివైపూ మొగ్గకుండా, తెలుసుకోగలగటమే ధ్యానానికి ఆరంభం.

నిజమైన దాని స్థానంలో మరొక దాన్ని సులభంగా పెట్టేసి, దానితోనే మనం తృప్తిపడటం చిత్రమైన విషయం. సంకేతం, మాట, కల్పన ఎంతో ముఖ్యమైపోతాయి. ఈ సంకేతం చుట్టూ ఆత్మవంచన అనే కట్టడాన్ని నిర్మిస్తాం. దానికి బలం చేకూర్చటానికి జ్ఞానాన్ని వినియోగిస్తాం. అందుకే నిజాన్ని అవగాహన చేసుకోకుండా అనుభవం అడ్డుపడుతుంది. తెలియ జేయటానికే కాకుండా, అనుభవానికి శక్తి సమకూర్చటానికి కూడా నామకరణం చేస్తాం. అనుభవానికి శక్తినివ్వటం ఆత్మని చైతన్యంగా చేసుకోవటమే. ఒకసారి ఆ ప్రక్రియలో చిక్కుకుంటే దాన్ని వదలటం కష్టం. ఆత్మ చైతన్యాన్ని తప్పించుకోవటం కష్టం. నిన్నటి అనుభవాలనూ, నేటి అనుభూతులనూ వదిలివేయటం అవసరం. లేనట్లయితే పునశ్చరణం అవుతుంది. ఒక చర్యని గాని, ఒక పూజని గాని, ఒక శబ్దాన్ని గాని పునశ్చరణ చేయటం వృథా పునశ్చరణలో పునఃసృష్టి ఉండదు. అనుభవం గతించిపోవటమే సృష్టి.

## 37. ఊహ, యథార్థం

ఆవిడకి వివాహం అయి చాలా ఏళ్లయింది. కాని, పిల్లల్లేరు. ఆవిడకి పిల్లలు పుట్టలేదుట. ఆ యథార్థం ఆవిణ్ణి తీవ్రంగా కలచివేసింది. ఆవిడ అక్కచెల్లెళ్లకి పిల్లలున్నారుట. తనకే ఎందుకా శాపం? ఆవిడకి చిన్నప్పుడే వివాహం అయిందట - ఆనాటి ఆచారం ప్రకారం. ఆవిడ ఎన్నో బాధలు పడిందిట. ఏదో కొంత ఆనందాన్ని కూడా అనుభవించిందిట. ఆవిడ భర్త పెద్ద ఉద్యోగి ఏదో కార్పొరేషన్‌లోనో, ప్రభుత్వశాఖలోనో; వాళ్లకి పిల్లలేర్నన్న విషయానికి ఆయనా బాధపడ్డాడుట. కాని, ఆ యథార్థంతో ఆయన సమాధాన పడుతున్నట్లు కనిపిస్తోందిట. అదీ కాక, ఆయనకి తీరుబడి లేనంత వ్యాపకం, అన్నదావిడ. ఆయన మీద ఆవిడకి అధిపత్యం ఉన్నట్లు - మరీ ఎక్కువ

కాకపోయినా, ఉన్నట్లు తెలుస్తూనే ఉంది. ఆవిడ ఆయన మీద ఆధారపడింది. అందువల్ల ఆయన పైన ఆధిపత్యం చూపించకుండా ఉండలేదు. ఆవిడకి పిల్లల్లేరు కనుక ఆవిడ తీర్చుకోదలుచుకున్నదంతా ఆయనతోనే. కానీ, ఆయనకి ఆ శక్తి లేదు. ఆవిడే అన్నీ నిర్వహించాలి. అందుకే ఆవిడకి నిరాశ. ఆయన ఆఫీసులో అన్నీ చాలా కట్టుదిట్టంగా ఉంచుతాడనీ, నిరంకుశంగా ప్రవర్తిస్తాడనీ, కాని ఇంట్లో మాత్రం మెత్తగా ఏమీ పట్టించుకోకుండా ఉంటాడనీ ఆవిడే చిరునవ్వుతో చెప్పింది. ఆయన ఒక పద్ధతి ప్రకారం ఉండాలని కోరుతుందావిడ. ఆయన్ని తన పద్ధతిలో బలవంతంగా ఉంచాలని చూస్తోంది- ఎంతో సరళంగానే అయినా. ఆయన ఆవిడ అందుబాటులోకి రావటం లేదు. ఆవిడకి తను ఆధారపడటానికీ, తన ప్రేమ కురిపించటానికీ ఎవరూ లేరు.

యథార్థం కన్న మనకి ఊహే ఎక్కువ ముఖ్యం. ఎలా ఉండాలో అనే ఊహకి ఉన్నంత విలువ వాస్తవంగా ఉన్నదానికి ఉండదు. ప్రస్తుతం కన్న ఎప్పుడూ భవిష్యత్తే ఎక్కువ ఆకర్షణీయంగా ఉంటుంది. ఊహారూపం, సంకేతం వాస్తవమైన దాని కన్న గొప్పగా ఉంటాయి. వాస్తవమైన దాన్ని ఊహారూపంలో గాని, ఒక నమూనాతో గాని, కప్పిపెట్టి ఉంచుతాం. ఆ విధంగా ఉన్నదానికీ, ఉండాలనుకున్నదానికీ వైరుధ్యాన్ని సృష్టిస్తాం. ఉండాలనుకున్నది ఊహ మాత్రమే, కల్పితమైనది మాత్రమే. అందుచేత వాస్తవమైన దానికీ, భ్రమకీ మధ్య సంఘర్షణ - కేవలం వాటి మధ్య కాదు, మన లోపలే. మనకి వాస్తవికత కన్న భ్రమే ఇష్టం. ఊహ ఎక్కువ ఆకర్షణీయం గానూ, తృప్తికరంగానూ ఉంటుంది. అందుకే దాన్ని గట్టిగా పట్టుకువదలం. ఈ భ్రమే నిజమై, వాస్తవమైనది అబద్ధమైపోతుంది. ఈ నిజం అనుకునే దానికీ, వాస్తవమైన దానికీ మధ్య జరిగే సంఘర్షణలో చిక్కుకుంటాం మనం.

ప్రయత్న పూర్వకంగానో, అనాలోచితంగానో మనం ఎందుకు ఊహని పట్టుకుని వదలకుండా వాస్తవమైనదాన్ని అవతలికి తోసేస్తాం? ఊహగాని, నమూనాగాని స్వయంకల్పితమే. అదొక రకమైన స్వీయ ఆరాధన - ఆత్మని శాశ్వతం చేసుకోవటం. అందువల్లనే అది తృప్తికరంగా ఉంటుంది. అధికారం చెలాయించటానికీ, గట్టిగా పట్టుపట్టటానికీ, మార్గదర్శకత్వం వహించటానికీ, తీర్చిదిద్దటానికీ ఊహ శక్తినిస్తుంది. ఊహ స్వయంకల్పితం కావటం చేత తన్ను

తాను ఎప్పుడూ వదులుకోదు. తన్ను తాను ముక్కలుగా చేసుకోదు. అందుకని ఒక ఆదర్శంగాని, ఊహగాని ఆత్మని సంపన్నయుతంగా చేస్తుంది. దీన్ని ప్రేమ అని కూడా అనుకుంటారు. నా కొడుకునీ, నా భర్తనీ ప్రేమిస్తున్నాను. వాళ్ళు ఇది అవాలి, అది అవాలి అని కోరుతున్నాను. ఇప్పుడున్నట్లుగా కాక, వేరే ఏదో అవాలని కోరుతున్నాను.

ఉన్నదాన్ని అర్థం చేసుకోవాలంటే ఊహనీ, ఆదర్శాన్నీ అవతలికి తోసెయ్యాలి. ఉన్నదాన్ని అర్థం చేసుకోవటం తక్షణం అవసరం కాదనిపించి నప్పుడే ఊహని అవతలికి తోసెయ్యటం కష్టమవుతుంది. స్వయం కల్పితమైన ఊహ ఉన్నదాని కన్న ఎక్కువ సంతృప్తికరమైనది కాబట్టి ఉన్నదానికీ ఊహకీ మధ్య మనలో సంఘర్షణ జరుగుతూ ఉంటుంది. ఉన్నదాన్ని, అంటే వాస్తవమైనదాన్ని ఎదుర్కోవలసి వచ్చినప్పుడే ఆ ఆదర్శం ముక్కలవుతుంది. అందుచేత ఊహని ఎలా వదిలించుకోవాలన్నది కాదు - వాస్తవమైన దాన్ని ఎలా ఎదుర్కోవాలన్నది అసలు విషయం. సంతృప్తిని కలిగించే ప్రక్రియని, స్వీయ ప్రకృతిని అర్థం చేసుకున్నప్పుడు మాత్రమే వాస్తవమైన దాన్ని ఎదుర్కోవటం సాధ్యం.

మనమంతా సాఫల్యాన్ని అపేక్షించే వాళ్లమే - ఏ రకంగా అపేక్షించి నప్పటికీ. ధనం, హోదా, పిల్లలు, భర్త, దేశం, ఆదర్శం, సేవ, త్యాగం, అధికారం చెలాయించటం, అణచి ఉంచటం - ఈ విధంగా. కాని స్వీయ సాఫల్యం పొందటం అంటూ ఉందా? సాఫల్యం పొంద కోరినది ఎప్పుడూ స్వయంకల్పితమే కదా - తాను ఎంచుకున్నదే కదా. అందుచేత సాఫల్యం పొందాలనే తపన ఆత్మని శాశ్వతం చేసుకునే విధానమే. వ్యక్తంగా గాని, అవ్యక్తంగా గాని సాఫల్యం పొందే విధానం తాను స్వయంగా ఎంచుకున్నదే. అది సంతృప్తి చెందాలనే కోరికపైన, ఆ సంతృప్తి శాశ్వతంగా ఉండాలనే కోరికపైన ఆధారపడి ఉంటుంది. అందుచేత కోరికను శాశ్వతం చేసుకునే మార్గాన్ని ప్రయత్నించటమే స్వలాభాన్వేషణ. కోరిక అశాశ్వతమైనది. దానికి ఒక స్థిరనివాసం లేదు. అది కావాలని పాకులాడుతున్న దాన్ని కొంత కాలంపాటు కొనసాగనివ్వవచ్చు. కాని, కోరిక అనేదానికే శాశ్వతత్వం లేదు. దీన్ని మనం అనాలోచితంగా గ్రహిస్తాం. అందువల్లనే ఊహనీ, నమ్మకాన్నీ

వస్తువునీ, సంబంధాన్నీ శాశ్వతం చేసుకోవాలని ప్రయత్నిస్తాం. ఇది కూడా అసంభవం కాబట్టి అనుభవించేది అనే శాశ్వతమైన అంశాన్ని సృష్టిస్తాం. "నేను" అనేదాన్ని కోరిక నుంచి వేరు చేస్తాం. ఆలోచించే దాన్నీ, ఆలోచననీ వేరు చేస్తాం. ఈ విభేదం నిజానికి అసత్యమైనది. ఇది భ్రమకి దారితీస్తుంది.

శాశ్వతత్వాన్ని కోరటం స్వీయ సాఫల్యం కోసం అనంతంగా ఆక్రోశించటమే. ఆత్మ ఎప్పుడూ సాఫల్యం పొందలేదు. ఆత్మ అశాశ్వతమైనది. దేనిలో అది సాఫల్యాన్ని కోరుకుంటున్నదో అది కూడా అశాశ్వతమైనదే అవుతుంది. ఆత్మ అదేవిధంగా కొనసాగితే అది వినాశమే. ఎందువల్లనంటే, అందులో పరివర్తన చెంధే అంశంగాని, కొత్త ఊపిరి గాని ఉండదు. కొత్తది సృష్టింపబడాలంటే ఆత్మ అంతమొంది తీరాలి. ఆత్మ అనేది ఒక ఊహ, ఒక నమూనా, ఒక జ్ఞాపకాల మూట - సాఫల్యాన్ని కోరే ప్రతి ఊహనీ, అనుభవాన్నీ మరికొంత వరకు కొనసాగించటమే. అనుభవం ఎప్పుడూ పరిమితం చేస్తుంది. అనుభవించేది ఎప్పుడూ అనుభవం నుంచి తన్ను తాను విడదీసుకుంటూ, వేరుచేసుకుంటూ ఉంటుంది. అందుచేత, అనుభవం నుంచీ, అనుభవం పొందాలనే కోరిక నుంచీ స్వేచ్ఛ లభించాలి. అంతర్గతమైన దారిద్ర్యాన్నీ, శూన్యతనీ కప్పిపుచ్చే మార్గమే సాఫల్యం. సాఫల్యంలో దుఃఖము, బాధా ఉంటాయి. 



## 38. కొనసాగించటం

ఎదురుగుండా ఉన్న సీటులో కూర్చున్నాయన తన్ను తాను పరిచయం చేసుకున్నాడు - ఏవో ప్రశ్నలడగాలనే ఉద్దేశంతో. మరణం గురించీ, మరణం తరువాత రాబోయే దాన్ని గురించీ ప్రతి మంచి పుస్తకాన్నీ - ప్రాచీన కాలం నుంచి ఆధునిక కాలం వరకూ వచ్చిన పుస్తకాలన్నిటినీ చదివానని చెప్పాడాయన. ఆయన భౌతిక విజ్ఞానశాస్త్ర పరిశోధనా సంఘంలో సభ్యుడుగా ఉండేవాడుట. ఎన్నో ప్రశస్తమైన, ప్రతిష్ఠాకరమైన సమావేశాల్లో పాల్గొన్నాడుట. ఆధ్యాత్మిక శక్తి ప్రదర్శనలనెన్నిటినో, నిజమైన వాటినే దర్శించాడుట. ఆయన ఈ విషయమై ఎంతో తీవ్రంగా ఆలోచించటం వల్ల అనేక సార్లు స్వయంగా

భౌతిక ప్రకృతికి అతీతమైన వాటిని దర్శించగలిగాడుట. అయితే, అవన్నీ తన ఊహా జనితాలు కావచ్చునని ఆయనే అన్నాడు మళ్ళీ. కాని, అలాటివై ఉండవని తను అభిప్రాయ పడుతున్నానన్నాడు. ఏమయినప్పటికీ, ఆయన అంత విస్తృతంగా చదివినవాడయినప్పటికీ, ఎంతో తెలిసిన వాళ్లెందరితోనో చర్చించి ఉన్నప్పటికీ, మరణించిన వారి భౌతిక దేహాలను నిస్సంశయంగా చూసి ఉన్నప్పటికీ, అసలు నిజం అర్థమైందనుకుని ఇంతవరకు తృప్తి పడలేకపోతున్నాడుట. నమ్మకం గురించీ, నమ్మకం లేకపోవటం గురించీ ఎంతో గంభీరంగా చర్చించాడు. ఆయన స్నేహితుల్లో - మరణానంతరం ఏదో ఇంకా కొనసాగుతూనే ఉంటుందని నమ్మేవాళ్లు కొందరున్నారుట, మరణంతో ఈ భౌతికదేహంతో బాటు జీవితంకూడా అంతమైపోతుందనీ, ఆ తరవాత ఇంకేమీ ఉండదనీ నమ్మేవాళ్లూ ఉన్నారుట. ఆధ్యాత్మిక విషయాల్లో ఎంతో జ్ఞానమూ, అనుభవమూ సంపాదించినప్పటికీ ఇంకా మనస్సులో కొంత సందేహం మిగిలిపోయిందిట. వయస్సు పైబడుతున్నందువల్ల నిజం ఏమిటో తెలుసుకోవాలని కోరుతున్నారుట. ఆయనకి మరణం అంటే భయం లేదుట. కాని, దాని గురించి నిజం తెలియాలిట.

రైలు ఆగింది. అప్పుడే రెండు చక్రాల గుర్రపుబండి ఒకటి అటువైపు నుంచి పోతోంది. ఆ బండి మీద ఒక శవం ఉంది. కోరారంగు బట్టలో చుట్టి ఉంది. అప్పుడే కోసిన పచ్చని పొడుగాటి వెదురుబొంగులు రెండింటిపైన వేసి కట్టి ఉంది. ఏదో గ్రామం నుంచి నదికి తీసుకువెడుతున్నారు - దహనం చేయటానికి. ఆ గతుకుల బాట మీద బండిపోతూంటే శవం అదిరి పడుతోంది. బట్ట క్రింద ఉన్న తలకి సహజంగా మరీ ఎక్కువగా తగుల్తోంది కుదుపు. బండితోలే వాడుకాక, ఆ బండిలో మరొక మనిషి ఉన్నాడంతే. ఎవరో దగ్గర బంధువై ఉంటాడు. బాగా ఏడ్చిన మీదట కళ్లు ఎర్రబడ్డాయి. వసంతకాలం ప్రారంభమైంది. ఆకాశం లేత నీలంరంగులో ఉంది. పిల్లలు దారిలో మట్టిలో ఆడుకుంటున్నారు. చావు సామాన్యంగా కనిపించే దృశ్యమేనేమో. ఎవరి పనులు వారు చేసుకుంటున్నారు. మరణం గురించి ప్రశ్నిస్తున్నాయన కూడా ఆ బండినీ, అది మోస్తున్న దాన్నీ గమనించలేదు!

నమ్మకం అనుభవాన్ని ప్రభావితం చేస్తుంది. అటుపైన అనుభవం

నమ్మకాన్ని బలపరుస్తుంది. మీరు నమ్మిన దాన్నే మీరు అనుభవం పొందుతారు. ఏం చెయ్యాలో మనస్సు శాసిస్తుంది. అనుభవాన్ని అనువదించి చెబుతుంది. దాన్ని ఆహ్వానిస్తుంది, లేదా, తిరస్కరిస్తుంది. మనస్సే అనుభవం యొక్క పర్యవసానం. మనస్సు దానికి పరిచయమైన దాన్నీ, తెలిసిన దాన్నే గుర్తు పడుతుంది, లేదా, అనుభవం పొందుతుంది - ఏస్థాయి లోనైనా సరే. అంతవరకు తెలియని దాన్ని అనుభవం పొందలేదు మనస్సు. అనుభవం కన్న మనస్సూ, దాని ప్రతిక్రియా ఎక్కువ అర్థవంతమైనవి. సత్యాన్ని అర్థం చేసుకోవటానికి అనుభవం మీద ఆధారపడటం అజ్ఞానానికీ, భ్రమకీ లోను కావటమే. సత్యాన్ని అనుభవం పొందాలని కోరటం సత్యాన్ని కాదనటమే - ఎందువల్లనంటే, కోరిక ప్రభావితం చేస్తుంది కనుక. నమ్మకం అనేది కోరిక కప్పుకునే మరోవస్త్రం మాత్రమే.

జ్ఞానం, నమ్మకం, సహేతుకంగా నమ్మటం, నిశ్చయానికి రావటం, అనుభవం - ఇవన్నీ సత్యానికి ప్రతిబంధకాలు. అవన్నీ కలిసి తయారైనదే ఆత్మ. మొత్తం అనుభవాల ఫలితం లేనట్లయితే ఆత్మ ఉండనే ఉండదు. ఉండటం, అనుభవించటం ఆఖరైపోతుందన్న భయమే మరణభయం. ఉంటుందనీ, అనుభవం పొందుతూ, ఉండటం నిశ్చయమనీ నమ్మకంగా తెలిసినప్పుడు భయం ఉండదు. తెలిసినదానికీ, తెలియనిదానికీ మధ్యనున్న సంబంధంలోనే భయం ఉంటుంది. తెలిసినది తెలియనిదాన్ని లోబరచుకోవాలని నిత్యం ప్రయత్నిస్తూ ఉంటుంది. తెలిసినది తెలియనిదాన్ని అనుభవం పొందటం అసాధ్యం. తెలియనిది ఉండాలంటే తెలిసినది అంతమొందాలి.

సత్యాన్ని అనుభవం పొందాలనే కోరికని వెతికి పట్టుకుని దాన్ని అర్థం చేసుకోవాలి. కాని అన్వేషణలో ఒక ఉద్దేశం ఇమిడి ఉంటే సత్యం ఆవిర్భవించదు. వ్యక్తంగా గాని, అవ్యక్తంగా గాని, ఏ ఉద్దేశమూ లేకుండా అన్వేషణ జరగగలదా? ఉద్దేశం ఉన్నప్పుడు అది అన్వేషణ అవుతుందా? మీకు కావలసినది మీకు ముందే తెలిసినప్పుడు, మీ లక్ష్యాన్ని ముందే రూపొందించుకున్నప్పుడు కేవలం ఆ లక్ష్యసాధనమే మీ అన్వేషణ - అది స్వయం కల్పితం. అలా అయితే, అన్వేషణ సంతృప్తి కోసమే కాని సత్యం కోసం

కాదు. ఏ విధంగా సంతృప్తి లభిస్తుందో, అందుకు తగిన సాధనాన్నే ఎంచుకోవటం జరుగుతుంది. ఉన్నదాన్ని అర్థం చేసుకోవటానికొక ఉద్దేశం అవసరం ఉండదు. ఉద్దేశం, సాధనం అవగాహన కాకుండా అడ్డుపడతాయి. అన్వేషణ అంటే ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా తెలుసుకోవటం - ఏదో ఫలానా దాని కోసం అని కాదు. ఒక లక్ష్యం కోసం దాని సాధన కోసం పడే తాపత్రయం గురించి తెలుసుకోవటమే అన్వేషణ. ఇలా ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా తెలుసుకున్నందువల్ల 'ఉన్నది' అవగాహన అవుతుంది.

శాశ్వతత్వం కోసం, కొనసాగింపు కోసం మనం తాపత్రయ పడటం చిత్రంగా ఉంటుంది. ఈ కోరిక ఎన్నో రూపాల్లో ఉంటుంది. మోటుగా ఉండేది మొదలుకొని అత్యంత సూక్ష్మరూపం వరకూ స్పష్టమైన రూపాలు మనకి పరిచితమైనవే; పేరు, ఆకారం, లక్షణం మొదలైనవి. పైకి కనిపించని తాపత్రయాన్ని కనిపెట్టటం, అర్థం చేసుకోవటం అంతకన్న చాలా కష్టం. ఒక ఊహ గాని, ఉండటం గాని, జ్ఞానం గాని, అవటం గాని - ఏ స్థాయిలో ఉన్నా ఆ ప్రత్యేక రూపాన్ని తెలుసుకోవటం, వెలికి తీసుకురావటం కష్టం. కొనసాగుతూ ఉండడం గురించి మాత్రమే మనకు తెలుసును. కొనసాగుతూ ఉండని స్థితి ఎటువంటిదో మనకి తెలియదు. దాన్ని మనం మరణం అనీ, ఎవరికీ తెలియనిది అనీ, మాయ అనీ అనేక రకాలుగా పిలుస్తాం. దానికి ఆ విధంగా పేర్లు పెట్టి, దాన్ని ఏదో విధంగా పట్టుకోవాలని చూస్తాం - మళ్లీ అది కొనసాగుతూ ఉండాలనే కోరికే.

ఆత్మచైతన్యం అంటే - అనుభవం, అనుభవానికి నామకరణం చేయటం, దాన్ని పదిలపరచుకోవటం. ఈ ప్రక్రియ మనస్సులో వివిధ అంతస్తుల్లో జరుగుతూ ఉంటుంది. ఈ ఆత్మచైతన్య ప్రక్రియని పట్టుకు వ్రేలాడతాం - దానివల్ల కలిగే ఆనందం క్షణికమే అయినప్పటికీ, సంఘర్షణ, గందరగోళం, దుఃఖం అనంతమైనప్పటికీ. మనకి తెలిసినది అంతే. అదే మన బ్రతుకు - మన జీవం, భావం, స్మృతి, శబ్దం - అన్నీ కొనసాగుతూ ఉండటమే. భావం కొనసాగుతుంది - మొత్తంగానో, దానిలో ఒక భాగంగానో, "నేను"గా రూపొందిన భావం అది. కాని, ఈ కొనసాగింపువల్ల స్వేచ్ఛ ప్రాప్తిస్తుందా? స్వేచ్ఛలోనే కదా ఆవిష్కారం, పునఃసృష్టి ఉన్నవి.

కొనసాగేది, ఉన్నదే గాని మరొకటి కాజాలదు, ఉన్నదానిలోనే కొద్ది మార్పులు ఉంటాయి. కాని ఈ మార్పులు దానికి కొత్తదనాన్నివ్వలేవు. వేరే వేషం వేసుకోవచ్చు, వేరే రంగు పూసుకోవచ్చు, అయినా, అది అప్పటికీ భావమే, జ్ఞాపకమే, మాట మాత్రమే. ఈ కొనసాగింపుకి ముఖ్యకేంద్రం ఆధ్యాత్మిక సారం కాదు. ఎందువల్లనంటే, అది అప్పటికీ ఆలోచనా రంగానికీ, జ్ఞాపకానికీ చెందినది కావడంతో కాలానికి కూడా చెందినదవుతుంది. తాను కల్పించిన దాన్నే అది అనుభవం పొందగలదు. ఆ స్వయంకల్పిత అనుభవాన్ని మరికొంత పొడిగింపు చేస్తుంది. ఆ విధంగా అది ఉన్నంతకాలం దాన్ని మించి దేన్నీ అనుభవం పొందలేదు. అది గతించాలి. భావం ద్వారా, జ్ఞాపకం ద్వారా శబ్దం ద్వారా కొనసాగటం జరగకుండా అది అంతమొందాలి. ఆ కేంద్రం అంతం కావటంతోనే పునరావిర్భవించటం జరుగుతుంది. ఆ పునఃసృష్టి, కొనసాగింపు కాదు. మరణం కూడా జీవితం లాగే పునరావిర్భవిస్తుంది. ఈ పునరావిర్భావమే సృష్టి.

## 39. ఆత్మరక్షణ

ఆయన బాగా పేరున్నవాడు. ఇతరులకు హాని కలిగించగల స్థితిలో ఉన్నాడు. అది చెయ్యటానికి ఆయన సందేహించడు. కపటంగా, అల్ప బుద్ధితో ఉంటాడు. ఔదార్యం అనేది లేకుండా, తన బాగుకోసమే కృషిచేస్తాడు. అన్నీ మాట్లాడి తెలుసుకోవాలనే ఉత్సుకతతో రాలేదనీ, పరిస్థితుల ప్రాధ్బలం వలన రావలసి వచ్చిందనీ, అందుకే తను ఇక్కడికి వచ్చాననీ చెప్పాడాయన. ఆయన చెప్పిన దాన్నంతటిని బట్టీ, చెప్పని దానిని బట్టీ చూస్తే ఆయన చాలా తీవ్రమైన ఆకాంక్ష కలవాడనీ, తన చుట్టూ ఉన్న వారిని తానే తీర్చిదిద్దుతాడనీ, తనకు లాభం ఉన్నప్పుడు నిర్దయగా వర్తిస్తాడనీ, ఆయనకేదైనా కావలసి వచ్చినప్పుడు సౌమ్యంగా ఉంటాడనీ బాగా స్పష్టమవుతోంది. ఆయనకి తనపైన ఉండే వాళ్లంటే గౌరవం. సాటి వారిని ఓర్పుతో సహిస్తాడు. తన క్రింది వాళ్లని బొత్తిగా లెక్క చెయ్యడు. తన్ను తీసుకు వచ్చిన కారు డ్రైవరుని కన్నెత్తి అయినా చూడడు. ఆయనకున్న స్నేహితులు చాలా కొద్దిమంది. ఆయన

పిల్లల గురించి మాట్లడినప్పుడు వాళ్లు తనకి ఆనందం కలిగించే బొమ్మలు అన్నట్లుగా మాట్లాడాడు. ఆయన ఒంటరిగా ఉండలేనన్నాడు. ఎవరో ఆయనకి హాని కలిగించారు. తిరిగి కక్ష తీర్చుకోవాలంటే ఆ వ్యక్తి అందుబాటులో లేడు. అందుచేత తనకు అందుబాటులో ఉన్న వారిమీద ప్రతీకారం తీర్చుకుంటున్నాడు. తను ఎందుకంత క్రూరంగా ఉంటాడో, తను ప్రేమిస్తున్నానని చెప్పిన వాళ్లకే ఎందుకు హాని కలిగించాలని కోరుతున్నాడో తనే అర్థం చేసుకోలేకపోతున్నానన్నాడు. కొంతసేపు మాట్లాడాక క్రమంగా కరిగి, దాదాపు స్నేహపూర్వకంగా అయాడు. అది క్షణం సేపు వెచ్చదనం చేకూర్చి, దాన్నుంచి ఏ మాత్రం ఆశించినా లేదా ఏమాత్రం అడ్డుతగిలినా అంతలోనే మూసుకు పోయే స్నేహశీలత అది. ఆయన్నుంచి ఏమీ అపేక్షించటం జరగలేదు కనుక ఆయన స్వేచ్ఛగా ఉన్నాడు. తాత్కాలికంగా ప్రేమపూర్వకంగా ఉన్నాడు.

ఇంకొకరికి హాని కలిగించాలనీ, గాయం కలిగించాలనీ - మాట ద్వారా గాని, చేష్ట ద్వారా గాని, మరీ గాఢంగా గాని - మనలో చాలమందిలో బలమైన కోరిక ఉంటుంది. అది సర్వసాధారణమైనది. అది కలిగించే ఆనందం భయంకరం. మనం గాయపడకూడదనే కోరికే ఇంకొకరిని గాయపరచేలా చేస్తుంది. ఇతరులకు హాని కలిగించటం ఒక విధమైన ఆత్మరక్షణ. ఆత్మరక్షణ అనేక రూపాలు ధరిస్తుంది - పరిస్థితులను బట్టీ, ప్రవృత్తులను బట్టీ. ఇంకొకరిని గాయపరచటం ఎంత సులభం! గాయపరచకుండా ఉండడానికి ఎంత మృదుత్వం అవసరమవుతుంది! మనం గాయపడ్డాం కాబట్టి ఇతరుల్ని గాయపరుస్తాం. మన సంఘర్షణలవల్ల, దుఃఖాలవల్ల మనం ఎన్నో దెబ్బలు తిని ఉంటాం. అంతర్గతంగా ఎంత చిత్రహింస అనుభవిస్తే బయటికి అంత హింసాత్మకంగా ఉండాలనే తపన ఉంటుంది. అంతరంగిక కల్లోలం బాహ్య రక్షణ కోసం అస్త్రులు చాచేటట్లు చేస్తుంది. తన్ను తాను రక్షించుకుంటున్న కొద్దీ ఇతరులపైన దాడి ఎక్కువవుతూ ఉంటుంది.

మనం అంత జాగ్రత్తగా దాచుకుని రక్షించుకునేదేమిటి? నిశ్చయంగా అది మన గురించి మనకున్న భావమే - ఏస్థాయిలో నైనా మనం ఆ భావాన్ని, ఆ కూడబెట్టిన వాటి కేంద్రాన్ని రక్షించకుండా ఉన్నట్లయితే, "నేను" అనేది "నా"

అనేది ఉండనే ఉండదు. అప్పుడు మనం మన వ్యక్తిత్వ రీతులకు - వ్యక్తంగా ఉన్నవైనా, అవ్యక్తంగా లోపల దాగి ఉన్నవైనా - వాటికి లొంగిపోయేటంత విపరీతంగా సున్నితంగా అయిపోతాం. కాని మనలో అనేక మంది ఈ "నేను" అనే ప్రక్రియని కనుక్కోవాలని కోరుకోరు. మన గురించి మనకున్న భావంతో, ఎవరినీ కలుగజేసుకోనివ్వం. మన గురించి మనకున్న భావం అంతా పైపైనే. అయితే మనలో చాలా మంది పైపైనే జీవిస్తూ ఉంటారు. భ్రమలతోనే తృప్తి పడుతూ ఉంటారు.

ఇంకొకరికి హాని కలిగించాలనే ప్రవృత్తి గాఢమైనది. మనస్సులో కూడ బెట్టిన ఉక్రోషం ఒక విధమైన జీవశక్తినీ, ఒక క్రియానుభూతినీ, జీవితానుభూతినీ ఇస్తుంది. కూడబెట్టినది ఖర్చవుతుంది - కోపం ద్వారా, అవమానం, నింద, పట్టుదల, వాటికి వ్యతిరేకమైన వాటి ద్వారా. ఈ ఉక్రోషాన్ని కూడబెట్ట నందువల్లనే క్షమాగుణం అవసరమవుతుంది. మానసిక గాయాన్ని పదిలపరచ కుండా ఉన్నప్పుడు అది అనవసరమే అవుతుంది.

పొగడ్తనీ, అవమానాన్నీ, మానసిక గాయాన్నీ, అనురాగాన్నీ ఎందుకు పదిలపరుస్తూ ఉంటాం? ఈ అనుభవాలనూ, ఈ ప్రక్రియలనూ కూడబెట్టటమే లేకుంటే మనమే ఉండం. మనకి పేరు, మమకారం, నమ్మకం లేనట్లయితే మనం ఏమీ కాము. ఏమీ కాకుండా ఉంటామనే భయమే కూడబెట్టేటట్లు తొందరపెడుతుంది.

ఈ భయమే - వ్యక్తమైనది గాని, అవ్యక్తమయినది గాని - మనకి ఎన్ని కూడబెట్టే కార్యకలాపాలున్నా, మన విచ్ఛిన్నతకీ, వినాశానికీ కారకమవుతుంది. ఈ భయం యొక్క సత్యాన్ని మనం గ్రహించగలిగినప్పుడు మనల్ని స్వేచ్ఛగా ఉండనిస్తుంది సత్యం - అంతేకాని, స్వేచ్ఛగా ఉండాలని నిర్ణయం తీసుకున్నందువల్ల కాదు.

మీరు ఏమీ కాదు. మీకు పేరు, బిరుదు ఉండొచ్చును. ఆస్తి, బ్యాంకులో డబ్బూ ఉండొచ్చును. మీకు అధికారం ఉండి, పేరు పొందిన వారు కావచ్చు. ఈ రక్షణలన్నీ ఉన్నప్పటికీ, మీరు ఏమీ కానట్లుగానే ఉంటారు. ఏమీ కాకపోవటమనే దాన్ని గురించీ, ఈ శూన్యత గురించీ, మీరు

బొత్తిగా తెలుసుకోకుండా ఉండి ఉండొచ్చు. లేదా, తెలుసుకోవాలన్న కోరిక లేకపోవచ్చు. కాని, అది అలాగే ఉంటుంది - దాన్ని తప్పించుకోవటానికి మీ ఇష్టం వచ్చినట్లు ఏంచేసినా సరే. పక్కతోవల్నుంచి దాన్ని తప్పించుకోవచ్చు. వ్యక్తిగతంగా గాని, సామూహికంగా గాని హింస, ఆరాధన, జ్ఞానం, వినోదం - ఏవిధంగానైనా, మీరు నిద్రిస్తున్నా, మేల్కొని ఉన్నా, అది ఎప్పటికీ అలాగే ఉంటుంది. ఈ ఏమీ కాకపోవటమనే దానితోనూ, దానివల్ల కలిగే భయంతోనూ మీకు సంబంధం ఏర్పడటమన్నది మీరు దాన్ని తప్పించుకునే మార్గాలన్నిటినీ మీ ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా తెలుసుకున్నప్పుడు మాత్రమే సాధ్యమవుతుంది. మీకు దానితో ఒక ప్రత్యేక వ్యక్తిగా సంబంధం లేదు. గమనించేవాడుగా వాటిని గమనించడం లేదు. ఆలోచించేవాడుగా, గమనించేవాడుగా మీరు లేనప్పుడు అదీ ఉండదు. మీరూ, ఏమీ కాకపోవటమనేదీ ఒక్కటే. మీరూ, ఏమీకాక పోవటమనేదీ ఒక సమైక్యస్థితి - రెండూ వేరు వేరు ప్రక్రియలు కావు. మీరు ఆలోచించేవాడిగా దాన్ని గురించి భయపడితే, అది మీకు వ్యతిరేకమయినదనీ, విరుద్ధమైనదనీ అనుకుని దాన్ని సమీపించబోతే, దానిపట్ల మీరుఏ చర్య తీసుకున్నా అది భ్రమకి దారి తీస్తుంది. ఆ ఏమీ కాకపోవటమనేది మీరేనని కనుక్కుంటున్నప్పుడు, అనుభవం పొందుతున్నప్పుడు భయం పూర్తిగా అడుగంటుతుంది. ఎందువల్లనంటే ఆ భయం అనేది - ఆలోచించేవాడు తను వేరు, తన ఆలోచనలు వేరు అనుకొని, వాటితో ఒక సంబంధాన్ని ఏర్పరచుకొంటున్నప్పుడే ఉంటుంది కనుక. ఆ భయం పూర్తిగా అంతమై పోయినప్పుడే మనస్సు నిశ్చలంగా ఉంటుంది. ఇటువంటి ప్రశాంతతలో సత్యం ఆవిర్భవిస్తుంది.

## 40. "నా మార్గం, మీ మార్గం"

ఆయన పండితుడు. ఆయనకి ఎన్నో భాషలు మాట్లాడటం వచ్చు. మరొకరు మద్యానికి అలవాటుపడ్డట్లుగా ఆయన జ్ఞానానికి అలవాటుపడ్డాడు. తన అభిప్రాయాలకు ఆధారాలుగా ఎవరెవరో చెప్పిన వాటిని ఎప్పుడూ ఉదాహరిస్తూ ఉంటాడు. ఆయనకి విజ్ఞాన, సాంఘిక శాస్త్రాల్లో కొంత ప్రవేశం

ఉంది. తన అభిప్రాయాన్ని వెల్లడించినప్పుడు బుర్ర కొంచెం ఊపి, చిరునవ్వు నవ్వుతాడు - అది తన అభిప్రాయం మాత్రమే కాదు, అదే తుది సత్యం అన్నట్లుగా. ఆయన ఉద్దేశంలో ఆయనకున్న అనుభవాలే అధికార పూర్వకమైనవీ, నిశ్చితమైనవీ. "మీ అనుభవాలు మీకుండొచ్చును, కాని మీరు నన్ను ఒప్పించలేరు" అన్నాడు. "మీ మార్గాన్ని మీరు వెళ్లండి. నా మార్గం నాది. సత్యానికి అనేక మార్గాలున్నాయి. ఓ రోజున మనమంతా అక్కడ కలుసుకుందాం" అన్నాడు. ఆయన ఒక విధంగా స్నేహపూర్వకంగానే ఉన్నాడు. కానీ కచ్చితంగా ఉన్నాడు. ఆయన ఉద్దేశంలో దివ్య ప్రభువులు నిజంగా లేకపోయినా, కనిపించే గురువులంతా యథార్థమే. వారికి శిష్యులు అవసరం. ఆయన మరికొందరితో కలిసి ఈ మార్గాన్నీ, వారి ఆధిపత్యాన్నీ స్వీకరించటానికి ఇష్టపడిన కొందరికి శిష్యరికం ప్రసాదించారట. కానీ, మరణించిన వారిలో మార్గదర్శకులైనట్టి వారిని ఆధ్యాత్మిక శక్తితో దర్శించిన వారితో తనకు గాని, తన తోటివారికి గాని సంబంధం లేదన్నాడు. దివ్య ప్రభువులను దర్శించటానికి సేవ చెయ్యాలి, కష్టపడాలి, త్యాగం చెయ్యాలి. చెప్పినదాన్ని అనుసరించాలి. కొన్ని సద్గుణాలను సాధన చెయ్యాలి. నమ్మకం ఉండటం అవసరం.

ఉన్నదాన్ని కనుక్కునేందుకు సాధనంగా, అనుభవం మీద ఆధార పడటం - భ్రమలో చిక్కుకోవటమే. కోరిక, తాపత్రయం అనుభవాన్ని ప్రభావితం చేస్తాయి. సత్యాన్ని అవగాహన చేసుకోవటానికి సాధనంగా, అనుభవం మీద ఆధారపడటం - స్వాతిశయాన్ని పెంపొందించుకునే మార్గాన్ని అవలంబించటమే. అనుభవం వల్ల దుఃఖం నుంచి విముక్తి లభించదు. జీవితాన్ని ఎదుర్కోవటానికి తగిన ప్రక్రియ కాదు అనుభవం. సమస్యని కొత్తగా స్వచ్ఛంగా చూడాలి - సమస్యలెప్పుడూ కొత్తవే కనుక. సమస్యని దానికి తగినట్లుగా చూడాలంటే అనుభవాన్ని పరిమితం చేసే జ్ఞాపకాన్ని అవతలికి తోసెయ్యాలి. సంతోషం, బాధ అనే ప్రతిక్రియలను ప్రగాఢంగా అర్థం చేసుకోవాలి. అనుభవం సత్యానికి అవరోధం. ఎందువల్లనంటే, అనుభవం కాలానికి చెందినది, అంటే; గతం యొక్క ఫలితం. అనుభవంతోనూ, కాలం తోనూ ఏర్పడిన మనస్సు కాలరహితమైన దాన్ని ఎలా అర్థం చేసుకోగలదు? అనుభవం యొక్క నిజం వ్యక్తిగతమైన చాదస్తాలమీదా ఊహలమీదా

ఆధారపడి ఉండదు. నిరసన గాని, సమర్థన గాని, ఏ రకమైన ఐక్యభావం గాని లేకుండా తెలుసుకున్నప్పుడే సత్యం అవగాహన అవుతుంది. అనుభవం సత్యానికి మార్గం కాదు. "మీ అనుభవం" అనీ "నా అనుభవం" అనీ లేదు - సమస్యని వివేకంతో అవగాహన చేసుకోవటం మాత్రమే.

ఆత్మజ్ఞానం లేనట్లయితే, అనుభవం, భ్రమని పెంపొందిస్తుంది. ఆత్మజ్ఞానం ఉన్నప్పుడు ఏ సమస్యకైనా ప్రతిక్రియగా ఏర్పడే అనుభవాన్ని పదిలపరుచుకోవటం జరగదు, దాని జ్ఞాపకం మిగలదు. ఆత్మజ్ఞానం అంటే అనుక్షణమూ తన మనసు అవలంబించే మార్గాలనీ, దాని ఉద్దేశాలనీ, ప్రయత్నాలనీ, ఆలోచనలనీ, తృష్ణలనీ కనుక్కోవటమే. "మీ అనుభవం" అనీ, "నా అనుభవం" అనీ ఎన్నటికీ ఉండజాలదు. "నా అనుభవం" అనటంలోనే అజ్ఞానంలో, భ్రమలో ఉన్నట్లు తెలుస్తుంది. కాని, మనలో చాలామంది భ్రమలోనే జీవించటానికి ఇష్టపడతారు - అందులోనే ఎక్కువ సంతృప్తి ఉంటుంది కనుక. మనకి ఉత్తేజాన్ని కలిగించి, మనకొక ఔన్నత్య భావాన్ని కలుగజేసే ఆంతరంగిక ఆశ్రయం అది. నాకే కనుక సామర్థ్యం, సహజమైన చాకచక్యం, గడుసుతనం ఉన్నట్లయితే, నేను ఆ భ్రమకి నాయకుడిగా గాని, మధ్యవర్తిగా గాని, ప్రతినిధిగా గాని అవుతాను. చాలా మందికి ఉన్నదాన్ని తప్పించుకోవటమే ఇష్టం. ఒక సంస్థ ఆస్తులతో, ఆచారాలతో, ప్రమాణాలతో, రహస్య సమావేశాలతో స్థాపితమవుతుంది. భ్రమకి సంప్రదాయం ప్రకారం దుస్తులు వేసి, గౌరవస్థానంలో ఉంచి, ఒక అధికార పరంపర విధానాన్ని ఏర్పరుస్తారు - మనలో అందరూ ఏదో ఒక విధమైన అధికారాన్ని ఆశిస్తూ ఉంటారు కనుక. కొత్తగా చేరినవాడు, ప్రారంభదశలో ఉన్నవాడు, శిష్యుడు, గురువు - అని ఏర్పాటు చేస్తారు. గురువుల్లో కూడా అనేక రకాలైన వారున్నారు - వారి వారి ఆధ్యాత్మిక వికాసాన్ని బట్టి. మనలో అనేక మంది ఇతరులను తమ స్వలాభానికి వుపయోగించుకోవాలన్నా, ఇతరుల లాభానికి తాము ఉపయోగపడాలన్నా ఇష్టపడతారు. ఈ వ్యవస్థ అలాంటి సదుపాయాలను కలుగజేస్తుంది - నిగూఢంగానో, ప్రకాశంగానో.

ఇతరులను స్వలాభానికి ఉపయోగించుకోవడమంటే ఇతరుల స్వలాభానికి ఉపయోగింపబడటమే. ఇతరులను మీ మానసికావసరాలకు వినియోగించుకోవాలని కోరటంపైన ఆధారపడేటట్లు చేస్తుంది. ఆధార

పడినప్పుడు పట్టుకోవాలి, సొంతం చేసుకోవాలి, మీరు సొంతం చేసుకున్నది మిమ్మల్నే సొంతం చేసుకుంటుంది. సూక్ష్మంగా గాని, స్థూలంగా గాని ఏ విధంగానూ ఆధారపడకుండా, వస్తువుల్నీ, మనుష్యుల్నీ, భావాల్నీ సొంతం చేసుకోకుండా ఉంటే మీరు శూన్యంగా ఉంటారు - మీరు ఏవిధమైన ప్రాముఖ్యం లేనట్లుగా ఉంటారు. మీరు ఏదో అవాలనుకుంటారు; ఏమీ కాకపోతే ఏమవుతుందోననే ఎముకలు కొరికే భయాన్ని తప్పించుకోవటానికి ఇదో అదో ఏదో ఒక సంస్థకో, ఏదో ఒక సిద్ధాంతానికో, ఈ చర్చికో, ఆ దేవాలయానికో చెందుతారు. ఆ విధంగా ఇతరుల లాభానికి వినియోగింప బడతారు. దాంతో, మీరూ స్వలాభానికి ఇతరులను వినియోగించుకుంటారు. ఈ అధికార పరంపర నిర్మాణం ఆత్మవిస్మృతికి అద్భుతమైన అవకాశాన్ని అందిస్తుంది. మీరు సౌభ్రాతృత్వాన్ని కోరవచ్చు. కాని, సౌభ్రాతృత్వం ఎలా ఉంటుంది - మీరు ఆధ్యాత్మిక వినాశానికి ప్రయత్నిస్తున్నప్పుడు? ప్రాపంచిక పదవుల్ని చూసి మీరు నవ్వొచ్చు. కాని మీరు దివ్య ప్రభువునీ, రక్షకుడినీ, గురువునీ ఆధ్యాత్మిక రంగంలో ఒప్పుకుంటున్నప్పుడు మీరు ప్రాపంచిక ప్రవృత్తిని అందులోకి కూడా తోడ్కొనిపోతున్నట్లు కాదా? ఆధ్యాత్మిక వికాసంలోనూ, సత్యాన్ని అవగాహన చేసుకోవటంలోనూ, దైవాన్ని తెలుసుకోవటంలోనూ అధికార పరంపర విభజనలూ, తరతమ భేదాలూ ఉండగలవా? ప్రేమ విభజనకి తావివ్వదు. ప్రేమిస్తారు, లేకపోతే లేదు, అంతేకాని, ప్రేమ లేకుండా ఉండే సుదీర్ఘ మార్గాన్ని అవలంబిస్తూ ప్రేమ అనే లక్ష్యాన్ని చేరుకోవటం కుదరదు. మీరు ప్రేమించటం లేదని మీకు "తెలిసి" నప్పుడు ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా ఆ యథార్థాన్ని తెలుసు కున్నప్పుడు పరివర్తన రావటానికి అవకాశం ఉంటుంది. కాని, గురువుకీ శిష్యుడికీ మధ్య, సిద్ధి పొందిన వారికీ పొందని వారికీ మధ్య, రక్షకుడికీ పాపికీ మధ్య విభేదాన్ని శ్రమపడి అలవరచుకోవడమంటే ప్రేమని వదులుకోవటమే. స్వలాభానికి ఇతరులను వినియోగించుకునేవాడూ, మరోవైపు తాను ఇతరులచే ఉపయోగింపబడేవాడు, ఈ అంధకారంలో, ఈ భ్రమలో ఆనందంగా వేటాడుకోవచ్చు.

దైవానికీ, లేదా సత్యానికీ మీకూ మధ్య ఎడం మీరు తెచ్చుకున్నదే -

అంటే, తెలిసిన దాన్నీ, నిశ్చయమైన దాన్నీ, రక్షణనీ పట్టుకు వ్రేలాడే మనస్సు తెచ్చినదే. ఈ ఎడానికి వంతెన వేయలేము. దాన్ని దాటించేందుకు ఏ విధమైన పూజాలేదు, క్రమశిక్షణ లేదు, త్యాగం లేదు. నిజమైన దాని వద్దకు మిమ్మల్ని తీసుకుపోవటం కాని, ఆ అంతరాన్ని లేకుండా చేయటం గాని ఏ రక్షకుడికీ, ఏ దివ్యజ్ఞాన సంపన్నుడికీ, ఏ గురువుకీ సాధ్యం కాదు. విభజన ఏర్పడినది నిజానికీ, మీకూ మధ్య కాదు. మీలో మీకే - పరస్పర విరుద్ధమైన కోరికల మధ్య. కోరిక దానికి వ్యతిరేకమైన దాన్ని సృష్టిస్తుంది. పరివర్తన అంటే ఒకే కోరికపైన కేంద్రీకృతం కావటం కాదు - తాపత్రయం తెచ్చే సంఘర్షణ నుంచి విముక్తి పొందటమే. మనిషిలో ఏ స్థాయిలో తాపత్రయం ఉన్నప్పటికీ అది సంఘర్షణని పెంపొందించుతుంది. దాన్నుంచి తప్పించుకోవటానికి వీలైన ప్రతి మార్గాన్నీ ప్రయత్నిస్తాం. దానివల్ల లోపలా బయటా కూడా సంఘర్షణ ఎక్కువవుతుంది. అంతే. ఈ సంఘర్షణని రూపు మాపడం ఇంకొకరి వల్ల జరిగేది కాదు - వారెంత గొప్పవారైనా. మాయవల్లనో, పూజవల్లనో జరిగేది కూడా కాదు. ఇవి మిమ్మల్ని హాయిగా నిద్రపుచ్చవచ్చు. కాని, మేలుకోగానే ఆ సమస్య ఇంకా అక్కడే ఉంటుంది. కాని, మనలో చాలా మంది మేలు - కోవాలని కోరుకోరు. అందువల్ల మనం భ్రమలోనే బ్రతుకుతాం. సంఘర్షణ రూపుమాసి పోయినప్పుడు ప్రశాంతత ఉంటుంది. అటువంటప్పుడే వాస్తవమైనది ఉద్భవిస్తుంది. దివ్యప్రభువులూ, రక్షకులూ, గురువులూ ముఖ్యం కాదు. అవసరమైనదేమిటంటే, కోరికల వలన పెరిగే సంఘర్షణని అవగాహన చేసుకోవటం. ఈ అవగాహన ఆత్మజ్ఞానం వల్లా, మనసు యొక్క సంచలనాలను నిత్యం తెలుసుకుంటూ ఉండటం వల్లా కలుగుతుంది.

తన్ను తాను తెలుసుకుంటూ ఉండటం ప్రయాసకరం. మనలో చాలామంది సులభమైన ఊహామార్గాన్ని ఇష్టపడతారు కాబట్టి మన జీవితానికొక ఆకారాన్నీ, పద్ధతినీ సమకూర్చే అధికారిని ప్రవేశపెడతారు. ఈ అధికారి ప్రభుత్వంలా సామూహికమైనది కావచ్చు, దివ్య ప్రభువు, రక్షకుడు, గురువు వంటి వ్యక్తి కావచ్చు. అధికారం ఎటువంటిదైనా అంధకార బంధురమే. ఆలోచనారాహిత్యాన్ని పెంచుతుంది. మనలో చాలా మంది ఆలోచిస్తే బాధ కలుగుతుంది అనుకుంటారు కాబట్టి అధికారికి తమ్ము తాము

అర్పించుకుంటారు.

అధికారి అధికారాన్ని పెంపొందించుకుంటాడు. అధికారం ఎప్పుడూ కేంద్రీకృతం అవుతుంది. అందువల్ల పూర్తిగా అనర్థమవుతుంది. అధికారాన్ని చెలాయించేవాడినే కాకుండా అతన్ని అనుసరించేవాడిని కూడా చెడగొడుతుంది. జ్ఞానంతోనూ, అనుభవంతోనూ వచ్చే అధికారం వక్రగతికి తెస్తుంది - అది దివ్యప్రభువులో ఉన్నా, ఆయన ప్రతినిధిలో ఉన్నా, మత ప్రవక్తలో ఉన్నా. మీ సొంత జీవితమూ, ఈ అనంతమనిపించే సంఘర్షణే ముఖ్యం కాని ఒక పద్ధతో, ఒక నాయకుడో కాదు. దివ్య ప్రభువు యొక్క అధికారం గాని, మత ప్రవక్త అధికారం గాని మిమ్మల్ని ముఖ్య సమస్య నుంచి - అంటే మీ అంతస్సంఘర్షణ నుంచి దూరం చేస్తుంది. జీవనవిధానాన్ని అన్వేషించటం ద్వారా దుఃఖాన్ని అర్థం చేసుకోవటంగాని, రూపుమాపటం గాని సాధ్యం కాదు - అటువంటి అన్వేషణ దుఃఖాన్ని తప్పించుకోవటానికి మాత్రమే. ఒక పద్ధతిని తమపైన విధించుకోవటం తప్పించుకునే మార్గమే. తప్పించుకున్నది ప్రకోపించి మరింత విపత్తునీ బాధనీ తెస్తుందంతే. మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోవటం ఎంత బాధాకరమైనా, లేదా తాత్కాలికంగా ఆనందదాయకమైనా, దానితో వివేకం ఆరంభమవుతుంది.

వివేకానికి మార్గంలేదు. మార్గం ఉన్నట్లయితే అది రూపొందింపబడినదీ, అప్పుడే ఊహింపబడినదీ, తెలిసిపోయినదీ అయి ఉంటుంది. వివేకం తెలుసుకోగలిగేదా, అలవరచుకోగలిగేదా? అది నేర్చుకునే విషయమా? పోగుచేసుకునేదా? అలాగే అయితే, అప్పుడది జ్ఞానం మాత్రమే అవుతుంది - అనుభవం వల్ల కలిగినది కావచ్చు, పుస్తకాల్లో ఉన్నది కావచ్చు. అనుభవం, జ్ఞానం గొలుసులా సాగే ప్రతిక్రియలు. అందువల్ల అవి కొత్తదాన్నీ, తాజాగా ఉన్నదాన్నీ, సృష్టింపబడని దాన్నీ ఎన్నటికీ తెలుసుకోలేవు. అనుభవం, జ్ఞానం కొనసాగుతూ ఉండేవి కాబట్టి తమ స్వయంకల్పిత రూపాలకు మార్గాన్నేర్పరచుకుంటున్నాయి. అందువల్ల అవి అనునిత్యం బంధనంగా ఉంటాయి. ఉన్న స్థితిని క్షణక్షణమూ అనుభవాన్నీ, జ్ఞానాన్నీ కూడబెట్టకుండా అవగాహన చేసుకోవటం వివేకం. కూడబెట్టినది స్వేచ్ఛగా అవగాహన చేసుకోనివ్వదు. స్వేచ్ఛ లేనిదే సాక్షాత్కారం కాదు. ఈ అనంతమైన

సాక్షాత్కారంలోనే వివేకం ఉంది. వివేకం ఎప్పుడూ క్రొత్తగా స్వచ్ఛంగా ఉంటుంది. దాన్ని పోగుచేసే సాధనం లేదు. సాధనం స్వచ్ఛతనీ, క్రొత్తదనాన్నీ, అప్రయత్న సాక్షాత్కారాన్నీ ధ్వంసం చేస్తుంది.

సత్యానికి అనేక మార్గాలుంటాయనేది మనస్సు అసహనంతో కనిపెట్టిన విషయం. అవి మనస్సు అలవరచుకున్న సహనం ఫలితంగా వచ్చినవి. "నేను నా మార్గాన్ని అనుసరిస్తాను, మీరు మీ దాన్ని అనుసరించండి, కాని మనం స్నేహితులుగా ఉందాం. ఎప్పుడో ఒకప్పుడు కలుసుకుందాం" అంటారు. మీరు ఉత్తరానికీ, నేను దక్షిణానికీ వెడుతూంటే మనం కలుసుకుంటామా? మీకు కొన్ని నమ్మకాలుండి, నాకు వేరే కొన్ని ఉంటే మనం స్నేహంగా ఉండగలమా? నేను సామూహిక హంతకుణ్ణి, మీరు శాంతి యుతమైనవారూ అయితే? స్నేహంగా ఉండటం అంటే పనిలోనూ, ఆలోచనలోనూ సంబంధం ఉండటం. అయితే, ద్వేషించే మనిషికీ, ప్రేమించే మనిషికీ మధ్యా, భ్రమలో ఉన్న మనిషికీ, స్వేచ్ఛగా ఉన్నవానికీ మధ్యా ఏదైనా సంబంధం ఉంటుందా? స్వేచ్ఛగా ఉన్న మనిషి బంధనంలో ఉన్నవానితో ఏదో విధమైన సంబంధాన్ని ఏర్పాటు చేసుకోవచ్చు; కాని భ్రమలో ఉన్న మనిషి స్వేచ్ఛగా ఉన్న మనిషితో సంబంధం పెట్టుకోనేలేడు.

విడిగా ఉన్నవాళ్లు వారి వారి ప్రత్యేకతల్ని పట్టుకుని వదలక తమలాగే స్వార్థపరులైన మరికొందరితో సంబంధం పెట్టుకోవటానికి ప్రయత్నిస్తారు. కాని అటువంటి ప్రయత్నాలు తప్పనిసరిగా సంఘర్షణకీ బాధకీ దారితీస్తాయి. ఈ బాధని తప్పించుకోవటానికి గడుసుతనం ఉన్నవాళ్లు సహనాన్ని కనిపెడతారు. ప్రతి ఒక్కరూ తమ చుట్టూ కట్టుకున్న అడ్డుగోడ మీంచి చూస్తూ దయ, ఔదార్యం చూపించటానికి ప్రయత్నిస్తూ ఉంటారు. సహనం మానసికమైనది - హృదయానికి సంబంధించినది కాదు. ప్రేమిస్తున్నప్పుడు సహనం గురించి మాట్లాడతారా? హృదయం ఖాళీగా ఉన్నప్పుడు మనస్సు దాన్ని కపట సాధనాలతో, భయాలతో నింపుతుంది. సహనం ఉన్నప్పుడు ఒకరినొకరు అర్థం చేసుకోవటం ఉండదు.

సత్యానికి మార్గం లేదు. సత్యాన్ని సాక్షాత్కరింపజేసుకోవాలి. ఆ సాక్షాత్కారానికొక సూత్రం లేదు. సూత్రీకరించినది సత్యం కాదు. అపరిచిత

సముద్రం మీద వెళ్లటానికి సిద్ధపడాలి. ఆ అపరిచిత సముద్రం మీరే. మిమ్మల్ని మీరే తెలుసుకోవటానికి సిద్ధపడాలి కాని, ఒక ప్రణాళిక ప్రకారం, ఒక పద్ధతి ప్రకారం కాదు - అలాంటప్పుడు తెలుసుకోవటం కుదరదు కనుక. తెలుసుకోవడం అనేదానివలన ఆనందం కలుగుతుంది - స్మృతిని మననం చేసుకున్నప్పుడూ, పోల్చిచూచినప్పుడూ కలిగే ఆనందం కాదది. ఇది నిత్య నూతనమైన ఆనందం. ఆత్మజ్ఞానంతో వివేకం ఆరంభమవుతుంది. దాని ప్రశాంతతలో, నీరవతలో అప్రమేయమైనది, అంటే కొలతలకు అందనిది ఉంటుంది.

## 41. ఎరుక

మేఘాలు విస్తారంగా ఉన్నాయి ఎగిసిపడే తెల్లని కెరటాల్లాగ. ఆకాశం నిర్మలంగా నీలంగా ఉంది. దానికి ఎన్నో వేల అడుగుల క్రింద మేము నిలబడిన చోట నీలంగా వంపు తిరిగి ఉన్న సముద్రం ఉంది. దూరాన భూభాగం ఉంది. ఆ సాయంకాలం రమణీయంగా ఉంది - ప్రశాంతంగా, స్వేచ్ఛగా. దూరాన ఆకాశంలో నౌక పొగ కనిపిస్తోంది. నారింజ తోటలు కొండదిగువున పొడుగుతా ఉన్నాయి. వాటి పరిమళం గాలి నిండా ఉంది. సాయంకాలం నీలిరంగుకి మారుతోంది ఎప్పుడూలాగే. గాలికూడా నీలంగా అయినట్లుంది. ఆ లేతరంగులో తెల్లటి ఇళ్లు వెలవెల బోతున్నాయి. సముద్రపు నీలిరంగు ఒలికి నేలంతా పరుచుకున్నట్లుగా ఉంది. పైనున్న పర్వతాలు కూడా లేతనీలంరంగులో ఉన్నాయి. ఆకర్షణీయమైన దృశ్యం అది. అపారమైన నిశ్శబ్దం. సాయంకాలపు చప్పుళ్లేవో కొద్దిగా ఉన్నప్పటికీ, అవి కూడా నిశ్శబ్దంలో భాగమైపోయాయి మేమూ అయినట్లుగానే. ఈ నిశ్శబ్దం ప్రతిదాన్నీ సరికొత్తగా చేస్తోంది - యుగాల తరబడి పేరుకున్న మురికినీ, అన్ని గుండెల్లోని బాధనీ తుడిచిపెట్టేస్తూ. కన్నులు ప్రక్షాళితమైనాయి. మనస్సు ఆ నిశ్శబ్దంలో చేరింది. గాడిద ఒకటి ఓండ్ర పెట్టింది. దాని ప్రతిధ్వనులతో లోయంతా నిండింది. నిశ్శబ్దం వాటిని స్వీకరించింది. రోజు పూర్తి కావడంతో గతదినాలన్నీ మరణిస్తాయి. ఈ మరణంలోనే పునర్జన్మ ఉంటుంది - దుఃఖపూరితమైన

గతం లేకుండా. అపార నిశ్శబ్దంలో జీవితం కొత్తగా ఉంది.

గదిలో ఒక మనిషి ఎదురు చూస్తున్నాడు - ఏవో మాట్లాడాలనే ఆదుర్దాతో. ఆయన ఒక రకంగా తీక్షణంగా ఉన్నాడు, కాని శాంతంగా కూర్చున్నాడు. పట్నవాసస్థుడని స్పష్టంగా తెలుస్తోంది. ఆ చిన్న పల్లెటూరులో ఆ గదిలో అందమైన నలగని దుస్తుల్లో ఉన్న ఆయన అదోలా ఉన్నాడు. ఆయన తన కార్యకలాపాల గురించీ తన ఉద్యోగంలో ఉన్న కష్టాల గురించీ, కుటుంబ జీవితంలో ఉన్న చిన్న గొడవలగురించీ, తన కోరికల తీవ్రత గురించీ చెప్పుకొచ్చాడు. ఈ సమస్యలన్నిటినీ తెలివిగా అందరిలాగే ఎదుర్కోగలిగాడు. ఆయన్ని నిజంగా చికాకు పరుస్తున్నవి లైంగిక వాంఛలు. ఆయనకి వివాహమైంది. పిల్లలున్నారు. అవన్నీ కాక, ఆయన లైంగిక కార్యకలాపాలు ఆయనకి తీవ్రసమస్య అయిపోయి, ఆయనకి పిచ్చెత్తిపోయేట్లు చేస్తున్నాయిట. కొంతమంది డాక్టర్లనీ, మనస్తత్వ విశ్లేషకులనీ సంప్రదించాడుట. కాని ఆ సమస్య ఇంకా అలాగే ఉందిట. ఇప్పుడు ఎలాగైనా దాని లోతుపాతులు తెలుసుకోవాలిట.

మన సమస్యల్ని పరిష్కరించుకోవటానికి మనం ఎంత ఆత్రుత పడతాం! ఏదో సమాధానం, ఏదో మార్గం, ఏదో మందుకోసం. సమస్యని యథాతథంగా పరిశీలించం. కాని ఉద్రిక్తతతో, ఆదుర్దాతో ఏదో పరిష్కారం కోసం వెతుకుతాం. ఆ వెతికేది తప్పని సరిగా స్వయం కల్పితమైనదే. సమస్య తాను స్వయంగా సృష్టించుకున్నదే అయినా, పరిష్కారాన్ని మాత్రం ఎక్కడో దానికి దూరంగా వెతుకుతాం. పరిష్కారం కోసం చూడటమంటే తప్పించు కోవటమే. అదే మనలో చాలామంది చెయ్యాలనుకునేది. అప్పుడు పరిష్కారం అత్యంత ముఖ్యమైపోతుంది - సమస్య కాదు. పరిష్కారం సమస్యకి విడిగా లేదు. పరిష్కారం సమస్యలోనే ఉంది - దానికి దూరంగా కాదు. పరిష్కారం అసలు సమస్యతో సంబంధం లేకుండా వేరుగా ఉంటే, మనం వేరే సమస్యలు సృష్టిస్తాం - సమస్యకి పరిష్కారాన్నెలా కనుక్కోవటం, ఎలా ఆచరించటం, ఎలా అమలుపరచటం మొదలైనవి. పరిష్కారం కోసం వెతకటం సమస్యని తప్పించుకోవటం కాబట్టి స్వయం కల్పితమైన ఆదర్శాల్లో, నమ్మకాల్లో, అనుభవాల్లో మునిగిపోతాం. ఈ స్వయంకృత రూపాల్నే ఆరాధిస్తా

అంతకంతకు మరీ అయోమయంగా అలసటగా అయిపోతాం. ఏదో ఒక నిర్ణయానికి రావటం కొంత సులభమే. కాని సమస్యని అర్థం చేసుకోవటం శ్రమతో కూడినది. దానికి వేరే పద్ధతి ఉండాలి. ఆ పద్ధతిలో పరిష్కారం కావాలనే కోరిక మెదుల్తూ ఉండకూడదు.

సమస్యని అర్థం చేసుకోవటానికి పరిష్కారం కావాలనే కోరిక నుంచి విముక్తి పొందటం అవసరం. ఈ విముక్తి పొందటం వల్ల పూర్తిగా ధ్యానం ఏర్పడటానికి వీలవుతుంది. వేరే ఇతర విషయాలవైపు మనస్సు మరలకుండా ఉంటుంది. సమస్యకి అనుకూలంగా గాని, వ్యతిరేకంగా గాని సంఘర్షణ ఉన్నంత కాలం దాన్ని అవగాహన చేసుకోవటం జరగదు - ఈ సంఘర్షణే ధ్యానాన్ని మరోవైపుకి మళ్లిస్తుంది కనుక. సన్నిహిత సంపర్కం ఉన్నప్పుడే అవగాహన కలుగుతుంది. ప్రతిఘటన, వ్యతిరేకత, భయం, లేదా, అంగీకారం ఉన్నంతకాలం సన్నిహిత సంపర్కం ఏర్పడటం అసాధ్యం. సమస్యతో సరియైన సంబంధం ఏర్పరచుకోవాలి. అదే అవగాహనకి ఆరంభం. అయితే, సరియైన సంబంధం ఎలా ఉంటుంది, మీరు దాన్ని ఎలా వదిలించుకోవాలా అని బాధపడుతున్నప్పుడు - అంటే, దానికో పరిష్కారాన్ని వెతకాలనుకుంటున్నప్పుడు? సరియైన సంబంధం అంటే సన్నిహిత సంపర్కం. వ్యక్తంగా గాని అవ్యక్తంగా గాని ప్రతిఘటన ఉన్నప్పుడు సన్నిహిత సంపర్కం ఏర్పడటానికి వీలుండదు. సమస్య కన్న ఆ సమస్యని ఎలా సమీపిస్తున్నారన్నది ఎక్కువ ముఖ్యం. సమీపించే మార్గమే సమస్యనీ దాని అంతాన్నీ రూపొందిస్తుంది. సాధనం, లక్ష్యం, సమీపించే మార్గం వేరు కావు. సమీపించే మార్గమే సమస్య గతిని నిర్ణయిస్తుంది. సమస్యని ఎలా పరికిస్తున్నారన్నది అత్యంత ముఖ్యం. ఎందువల్లనంటే, మీ ప్రవృత్తి, మీ అయిష్టతలూ, భయాలూ, ఆశలూ దాని రంగుని మారుస్తాయి కనుక. సమస్యని సమీపించే పద్ధతిని ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా తెలుసు కోవటం వల్ల సమస్యతో సరియైన సంబంధం ఏర్పడుతుంది. సమస్య స్వయంకృతం. అందుచేత స్వీయజ్ఞానం ఉండాలి. మీరూ, సమస్యా ఒక్కటే, వేరువేరు కాదు. మీరే మీ సమస్య.

'నేను' యొక్క కార్యకలాపాలు భయంకరంగా చికాకుపెడతాయి.

'నేను' స్వభావమే విసుగు కలిగించేది. దాని తత్త్వమే అసహనంగా ఉండటం, అర్థం లేకుండా ఉండటం, వ్యర్థంగా ఉండటం. దాని పరస్పర వ్యతిరేకమైన, విరుద్ధమైన కోరికలూ, ఆశలూ, నిరాశలూ, నిజాలూ, భ్రమలూ సమ్మోహితం చేస్తాయి. అయినా, అది శూన్యంగానే ఉంటుంది. దాని కార్యకలాపాలే దానికి నిస్త్రాణ కలిగిస్తాయి. 'నేను' స్వభావమే ఎప్పుడూ పైకెక్కుతూ, క్రిందికి దిగుతూ, అర్రులు చాస్తూ, నిస్పృహ చెందుతూ, ఎప్పుడూ లాభం పొందుతూనో నష్టపడుతూనో ఉంటుంది. ఈ వ్యర్థ పరిశ్రమ నుంచి ఎప్పుడూ తప్పించుకోవాలని ఉంటుంది. సంతృప్తి కలిగించే భ్రమలు - తాగుడు, లైంగికానుభవం, రేడియో, పుస్తకాలూ, జ్ఞానం, వినోదాలూ మొదలైన బాహ్య కార్యకలాపాల ద్వారా తప్పించుకుంటుంది. అది భ్రమలను పెంపొందించుకునే శక్తి - నానావిధ సమ్మిళితమైనదీ, అపారమైనదీ. ఈ భ్రమలు స్వయంకృతమైనవీ, స్వయం కల్పితమైనవీ. అవే ఆదర్శవంతమైన, ఆరాధనా రూపాలైన గురువులూ, రక్షకులూ, తన్నుతాను శక్తివంతం చేసుకునేందుకు సాధనమైన భవిష్యత్తూ మొదలైనవి. తన విసుగుదల నుంచి తానే తప్పించుకోవటానికి 'నేను' అంతర్గతంగానూ, బహిరంగంగానూ తన అనుభూతులనూ ఉత్తేజాలనూ అనుసరిస్తుంది. ఆత్మ సంయమనానికి ఇవి ప్రత్యామ్నాయాలు. ఈ ప్రత్యామ్నాయాల్లో పడి తప్పించుకుపోవాలంటుంది. తరుచు విజయం సాధిస్తుంది. కాని ఆ విజయం దాని అలసటని మరింత అధికం చేస్తుంది. ఒక ప్రత్యామ్నాయం తరువాత మరొక దాన్ని అనుసరించటంలో ప్రతి ఒక్కటీ దాని సమస్యల్నీ, దాని సంఘర్షణనీ, బాధనీ సృష్టిస్తుంది.

వ్యక్తి స్వీయ విస్మరణ కోసం అంతర్గతంగానూ బహిరంగంగానూ ప్రయత్నం జరుపుతాడు. కొంతమంది మతంవైపూ, మరి కొంతమంది ఏదో పనివైపూ, ఏవో కార్యకలాపం వైపూ మళ్లుతారు. తనను మరచిపోయేందుకు ఏవిధమైన మార్గమూ లేదు. లోపలా, బయటా ఉండే చప్పుడు తనని అణచి ఉంచవచ్చు. కాని, అంతలోనే అది మరో రూపంలో, మరో వేషంలో బయటికి వస్తుంది. అణగి ఉన్నది ఎప్పుడో అప్పుడు విముక్తి పొందాలి. త్రాగుడు, లైంగికానుభవం, భక్తి, జ్ఞానం - ఇటువంటి వాటి ద్వారా కలిగిన స్వీయ విస్మరణ వాటిపైన ఆధారపడేటట్లు చేస్తుంది. దేనిమీదైనా ఆధారపడితే అది

సమస్యని సృష్టిస్తుంది. మీ విముక్తికోసం, స్వీయ విస్మరణ కోసం, ఆనందం కోసం తాగుడు మీదో, గురువు మీదో ఆధారపడితే అదే మీ సమస్య అవుతుంది. పరాధీనత, సొంతం చేసుకోవాలనే ఇచ్ఛనీ, ఈర్ష్యనీ, భయాన్నీ పెంపొందింపజేస్తుంది. అప్పుడు భయం, దాన్ని ఎలా తప్పించుకోవటం అన్నది మీ తీవ్ర సమస్య అవుతుంది. ఆనందాన్ని అన్వేషించటంలో సమస్యను మనమే సృష్టించుకుని అందులో చిక్కుకుంటాం. లైంగికానుభవంతో మనల్ని మనం మరిచిపోవటంలో కొంత ఆనందాన్ని చవిచూస్తాం. దాన్ని మన కోరికను సాధించుకోవటానికి సాధనంగా ఉపయోగిస్తాం. దేనివల్ల ఆనందం కలుగుతుందో అది తప్పనిసరిగా సంఘర్షణ పుట్టిస్తుంది - ఆనందం కన్న దాని సాధనమే ఎంతో ఎక్కువ అర్థవంతం, ముఖ్యం అనుకుంటాం కాబట్టి. ఆ కుర్చీ అందం వల్ల నాకు ఆనందం కలిగితే ఆ కుర్చీ నాకు అత్యంత ముఖ్యమై పోతుంది. దాన్ని నేను అన్నిటి నుంచీ రక్షించుకోవాలి. 'నేను' అన్న ప్రత్యేకత కోసం ప్రయత్నించడం లేదా? నేనే ఆనందంగా ఉండాలని అనుకోవడం లేదా? ఈ పోరాటంలో, ఒకప్పుడు ఆ కుర్చీ అందం వల్ల నేను పొందిన ఆనందాన్ని పూర్తిగా మరిచిపోతాను. నాకు కుర్చీయే మిగుతులుంది. కుర్చీ దానంతట అది విలువైనది కాదు. నేను దానికి అసాధారణమైన విలువ నిచ్చాను - అది నా ఆనందానికి సాధనం కనుక. అందువల్ల ఆనందానికి ఒక ప్రత్యామ్నాయం సాధనం అవుతోంది.

జీవించే ఒక మనిషి నా ఆనందానికి సాధనం అయినప్పుడు ఆ సంఘర్షణ, గందరగోళం, వైరుధ్యం, బాధా మరింత ఎక్కువగా ఉంటాయి. సంబంధం ఉపయోగం మీద ఆధారపడి ఉన్నప్పుడు మరీ పైపైన తప్పితే అసలు సంబంధం అనేది ఉంటుందా ఉపయోగించుకునే వారికీ, ఉపయోగింపబడే వారికీ మధ్య? మిమ్మల్ని నా కోసం ఉపయోగించుకుంటే మీతో నాకు సంబంధం ఉన్నట్లేనా? సంబంధం అంటే వివిధ స్థాయిల్లో పరస్పర సన్నిహిత సంపర్కం ఉండటం. ఇంకొకరు సాధనం మాత్రమే అయితే, ఆనందానికి ఒక మార్గం మాత్రమే అయితే, అతనితో సన్నిహిత సంపర్కం ఉంటుందా? ఆ విధంగా ఒకరిని ఉపయోగించుకోవటంలో స్వీయ ప్రత్యేకత కోసం ప్రయత్నించడం లేదా? 'నేనే' ఆనందంగా ఉండాలని

అనుకోవడం లేదా? ఈ స్వీయ ప్రత్యేకతనే సంబంధం అంటున్నాను. కాని, వాస్తవంగా ఈ ప్రక్రియలో సన్నిహిత సంపర్కం ఉండదు. భయం లేనప్పుడే సంపర్కం ఉంటుంది. ఉపయోగించటం, ఆధారపడటం ఉన్నప్పుడు నరాలు పిండే భయం, బాధా ఉంటాయి. ఏదీ ప్రత్యేకంగా వేరుగా ఉండలేదు కాబట్టి, మనస్సు తన్ను తాను ప్రత్యేకించుకునేందుకు చేసే ప్రయత్నాలు నిస్పృహకీ, దుఃఖానికీ దారితీస్తాయి. ఈ అసంపూర్ణ భావాన్ని తప్పించుకోవటానికి ఊహల్లోనూ, మనుషుల్లోనూ, వస్తువుల్లోనూ సంపూర్ణతని అన్వేషిస్తాం. అంచేత మనం మళ్లీ మొదటికి వస్తాం - ప్రత్యామ్నాయాల కోసం అన్వేషణ.

'నేను' యొక్క కార్యకలాపాలు ఆధిక్యం వహించినప్పుడు ఎప్పుడూ సమస్యలు ఉంటాయి. ఏవి 'నేను' యొక్క కార్యకలాపాలు, ఏవి కావు - అని తెలుసుకోవటానికి నిరంతరం ధ్యానంతో చూడటం అవసరమవుతుంది. ఈ ధ్యానంతో చూడటం క్రమశిక్షణతో అలవరచుకున్నది కాదు. అది ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా విస్తారంగా తెలుసుకొని ఉండటమే. క్రమశిక్షణతో అలవడిన ధ్యానం "నేను"కు శక్తినిస్తుంది. అదొక ప్రత్యామ్నాయం, ఆధారం అవుతుంది. తెలుసుకొని ఉండటం అలా కాదు. అది స్వీయ ప్రోద్బలం వల్ల గాని, సాధన వల్ల గాని వచ్చినది కాదు. మొత్తం సమస్యలో ఉన్నదంతా - నిగూఢమైనదీ, పైపైన ఉన్నదీ కూడా అర్థం చేసుకోవటం అది. నిగూఢమైనది బయట పడాలంటే పైన ఉన్నదాన్ని అర్థం చేసుకోవాలి. పైపై మనస్సు శాంతంగా ఉంటే గాని నిగూఢమైనదాన్ని బయటపెట్టలేము. ఈ ప్రక్రియ అంతా మాటలతో కూడినది కాదు. కేవలం అనుభవానికి సంబంధించిన విషయమూ కాదు. మాటల్లో వ్యక్తపరచటం మనస్సు మందకొడితనాన్ని సూచిస్తుంది. అనుభవం కూడబెట్టినదవటం వల్ల పునశ్చరణ అవుతుంది. తెలుసుకుని ఉండటం అంటే నిశ్చయానికి రావటం కాదు. లక్ష్య సూచన అంటే ప్రతిఘటన. దానికి ప్రత్యేకత కలిగించే లక్షణం ఉంది. తెలుసుకుంటూ ఉండటం అంటే ఉన్నదాన్ని ప్రశాంతంగా ఇష్టాయిష్టాలు లేకుండా గమనించటం. తెలుసుకుంటూ ఉన్నప్పుడు సమస్య దానంతటదే విప్పుకుంటుంది. ఆ విధంగా అది సంపూర్ణంగా అర్థమవుతుంది.

ఏ సమస్య అయినా ఒక స్థాయిలోనే ఎన్నటికీ పరిష్కారం కాదు - అది

అనేక రకాలతో సమ్మిళితమైనది కాబట్టి. దాని మొత్తం ప్రక్రియని అర్థం చేసుకోవాలి. సమస్యని ఒక స్థాయిలోనే - భౌతికంగా గాని, మానసికంగా గాని పరిష్కరించడానికి ప్రయత్నించటం మరింత సంఘర్షణకీ సందిగ్ధతకీ దారి తీస్తుంది. సమస్య పరిష్కారం అవాలంటే ఇదంతా తెలుసుకుంటూ ఉండటం జరగాలి. దాని మొత్తం ప్రక్రియని తేటతెల్లం చేసే ఉదాసీన పూర్వకమైన ధ్యానం ఉండాలి.

ప్రేమ ఇంద్రియ సంబంధమైన అనుభూతి కాదు. అటువంటి అనుభూతులు మాటల ద్వారా, సంకేతాల ద్వారా ఆలోచనకు రూపాన్నిస్తాయి. అనుభూతులూ, ఆలోచనా ప్రేమ స్థానంలో చోటు చేసుకుంటాయి. ప్రేమకి ప్రత్యామ్నాయం అవుతాయి. అనుభూతులు లైంగిక వాంఛల లాగే మానసికమైనవి. మనస్సు ఆకలినీ, భావోద్రిక్తతనీ జ్ఞాపకం చేసుకోవటం ద్వారా పెంపొందిస్తుంది. ఆ విధంగా సంతృప్తి కలిగించే అనుభూతులు పొందుతుంది. మనస్సు వివిధ పరస్పర విరుద్ధమైన ఆసక్తులతో, కోరికలతో, వాటి వాటి ప్రత్యేక అనుభూతులతో కూడుకొన్నది. అందులో ఒకటి తక్కిన వాటిపైన ఆధిపత్యం వహించటం మొదలుపెడితే ఘర్షణపడి సమస్యని సృష్టిస్తాయి. అనుభూతులు సంతోషకరమైనవీ, సంతోషకరం కానివీ, రెండు రకాలైనవీ ఉంటాయి. మనస్సు సంతోషకరమైన వాటినే పట్టుకుని ఉంటుంది. వాటికి బానిస అవుతూ. మనస్సులో పరస్పర విరుద్ధమైన అనుభూతులు కూడబెట్టి ఉన్నప్పుడు ఈ బంధనం సమస్య అయిపోతుంది. బాధాకరమైన వాటిని తప్పించుకోవటం కూడా బంధమే. దాని భ్రమలూ, దాని సమస్యలూ దానివి. మనస్సే సమస్యల్ని సృష్టిస్తుంది. కాబట్టి వాటిని అది పరిష్కరించలేదు. ప్రేమ మనస్సుకి చెందినది కాదు. కాని అది మనస్సులోకి వచ్చినప్పుడు అనుభూతి కలుగుతుంది. అప్పుడు దాన్ని ప్రేమ అని పిలుస్తుంది. ఈ విధమైన మానసిక ప్రేమని గురించి ఆలోచించవచ్చు. దానికి ముస్తాబు చేసి ప్రత్యేకించవచ్చు. మనస్సు సంతోషకరమైన అనుభూతులను గుర్తుకి తెచ్చుకోగలదు. ముందుగానే ఊహించగలదు. ఈ ప్రక్రియే ఆకలి - దాన్ని ఏ స్థాయిలో ఉంచినా సరే. మనోరంగంలో ప్రేమ ఉండలేదు. మనస్సు అనేది భయం, విచక్షణ చేయటం, ఈర్ష్య, ఆధిపత్యం, పోల్చటం, వదులుకోవటం - ఇవన్నీ ఉండే స్థలం. అందుచేత అందులో ప్రేమ ఉండదు.

అసూయ, గర్వం మాదిరే మానసికమైనది. కాని అది ప్రేమ కాదు. ప్రేమకీ, మానసిక ప్రక్రియలకీ మధ్య వంతెన కట్టి వాటిని కలపటం సాధ్యం కాదు. అనుభూతులు ఆధిక్యం పొందినప్పుడు ప్రేమకి స్థానం ఉండదు. మానసికమైనవి హృదయంలో నిండుతాయి. ఆ విధంగా ప్రేమ అపరిచితమైనదీ, ప్రయత్నించవలసినదీ, ఆరాధించవలసినదీ అవుతుంది. దాన్ని వినియోగించటానికీ, విశ్వసించటానికీ దాన్ని ఆదర్శంగా చేస్తారు. ఆదర్శాలన్నీ స్వయంకల్పితమైనవే. అందుచేత మనస్సు దాన్ని పూర్తిగా ఆక్రమించటంతో, ప్రేమ ఒక శబ్దం, ఒక అనుభూతి అవుతుంది. అప్పుడిక ప్రేమని పోలుస్తారు. "నేను ఎక్కువ ప్రేమిస్తాను. మీరు తక్కువ ప్రేమిస్తారు" అని. కాని ప్రేమ వ్యక్తిగతం కాదు. ఒక వ్యక్తికి సంబంధించినది కాదు. ఆలోచనా రూపం లేనట్టి, అనుభూతి అనేది ఎంత మాత్రమూ లేనటువంటి స్థితే ప్రేమ.

## 42. ఒంటరితనం

ఆవిడ కొడుకు ఈ మధ్యనే పోయాడుట. ఇప్పుడేం చెయ్యాలో తెలియటం లేదు అందావిడ. బోలెడు తీరుబడి. ఏమీ తోచదు. అలసట, దుఃఖం. చచ్చిపోతే బాగుండుననుకుంటోంది. కుర్రవాడిని ఎంతో ప్రేమతో జాగ్రత్తగా తెలివిగా పెంచిందిట. అన్నిటికన్నా మంచి స్కూల్లోనూ, కాలేజిలోనూ చదివించిందిట. కుర్రవాణ్ణి పాడుచెయ్యలేదుట - అవసరమైన ప్రతీదీ అతడికిచ్చినప్పటికీ. తన నమ్మకం, ఆశ, అన్నీ అతడిలోనే ఉంచిందిట. తన ప్రేమంతా అతనికే ఇచ్చిందిట - ఇంకొకరెవరూ దాన్ని పంచుకోవటానికి లేరు కనుక. ఆవిడా, ఆవిడ భర్తా చాలాకాలం క్రిందటే విడిపోయారుట. ఆవిడ కొడుకు చనిపోవటం - అతని జబ్బుని తిన్నగా కనిపెట్టకపోవటం వల్లా, ఆపరేషను సరిగ్గా చెయ్యకపోవడంవల్లా అని చెప్పింది. "డాక్టర్లు ఆపరేషను విజయవంతమైందనే అన్నారు" అంది చిరునవ్వుతో. ఇప్పుడు ఆవిడ ఒంటరిగా మిగిలింది. జీవితం వ్యర్థంగా అర్థశూన్యంగా కనిపిస్తోందిట. అతడు పోయినప్పుడు ఎంతో ఏడ్చిందిట. ఇప్పుడిక కన్నీళ్లు మిగలలేదుట -

మందకొడిగా అలసటగా ఉండే శూన్యత తప్ప. తమ ఇద్దరి గురించీ ఎన్నో ఆలోచించి ఉంచిందిట. ఇప్పుడు అంతా పోగొట్టుకుంది.

సముద్రం మీంచి గాలి చల్లగా హాయిగా వీస్తోంది. చెట్టు క్రింద ప్రశాంతంగా ఉంది. పర్వతాల మీద రంగులు స్పష్టంగా ఉన్నాయి. నీలిరంగు పాల పిట్టలు తెగకూస్తున్నాయి. ఆవూ, దూడా కలిసి తిరుగుతున్నాయి. ఉడత ఒకటి చర్రుమని చెట్టుమీదికి పాకింది - కిచకిచ మంటూ. ఒక కొమ్మమీద కూర్చుని అరవటం మొదలుపెట్టింది. ఆ అరవటం చాలాసేపు సాగించింది తోక పైకీ క్రిందికీ ఆడిస్తూ. దాని కళ్లు తెగమెరుస్తున్నాయి. కాలిగోళ్ళు వాడిగా ఉన్నాయి. ఒక బల్లి వెచ్చదనం కోసం బయటికి వచ్చి ఓ ఈగని పట్టుకుంది. చెట్లపైనున్న కొమ్మలు నాజూగ్గా ఊగుతున్నాయి. ఎండిపోయిన చెట్టొకటి నిటారుగా ఉండి, వెనుక ఆకాశం కనిపిస్తూ అద్భుతంగా ఉంది. సూర్యుడి ఎండకి అది తెల్లబడిపోతోంది. దాని ప్రక్కన మరో ఎండిన చెట్టుంది - నల్లగా, వంకరగా. ఈ మధ్యనే చచ్చిపోయినట్లుంది. దూరాన పర్వతాల మీద మేఘాలు కొన్ని నిలిచిపోయాయి.

ఒంటరితనం ఎంత విచిత్రమైనది, ఎంత భయంకరమైనది! దానికి మరీ దగ్గరగా వెళ్ళడానికి ఎప్పుడూ ఒప్పుకోము. ఒకవేళ ప్రమాదవశాత్తూ వెళ్ళినా తొందరగా పారిపోయి వచ్చేస్తాం. ఒంటరితనం నుంచి పారిపోవడానికీ, దాన్ని కప్పిపుచ్చడానికీ ఏమైనా చేస్తాం. వ్యక్తంగానూ, అవ్యక్తంగానూ మనం చేసేది దాన్ని తప్పించుకోవడమో, లేదా దాన్ని నెగ్గుకురావడమోననిపిస్తుంది. ఒంటరితనాన్ని తప్పించుకోవడం, జయించడం - రెండూ వృథాయే. అణచిపెట్టి ఉన్నా, నిర్లక్ష్యం చేయబడినా ఆ బాధ, ఆ సమస్య అలాగే ఉంటుంది. జన సమూహంలో పడి మిమ్మల్ని మీరు తప్పించుకోవచ్చు. అయినా చెప్పలేనంత ఒంటరిగా ఉంటారు. తీవ్రంగా పనిచేస్తూ ఉండవచ్చు. కాని ఒంటరితనం మిమ్మల్ని ఆవరిస్తుంది. పుస్తకం మూసెయ్యండి. అది అక్కడే ఉంటుంది. వినోదాలూ, తాగుళ్ళూ అయిపోయిన తరవాత ఒంటరితనపు భయం తిరిగి వస్తుంది. మీరెంతో ఆకాంక్షతో పైకి రావచ్చు. ఇతరులపైన మీకెంతో అధికారం ఉండొచ్చు. జ్ఞాన సంపద మెండుగా ఉండొచ్చు. ఆరాధనలో, వ్యర్థ పూజా పునస్కారాల్లో మిమ్మల్ని మీరు

మరిచిపోవచ్చు. మీ ఇష్టం వచ్చినది చెయ్యండి. ఒంటరితనం బాధ కొనసాగుతూనే ఉంటుంది. మీ కొడుకు కోసమే, మీ గురువు కోసమే, మీ సహజ సామర్థ్యాన్ని ప్రదర్శించడం కోసమే మీరు బ్రతుకుతూ ఉండొచ్చు. అయినా ఒంటరితనం బాధ కొనసాగుతూనే ఉంటుంది. అయినా ఒంటరితనం అలాగే నిరీక్షిస్తూ, పరికిస్తూ, వెనక్కి ముడుచుకుంటూ, మళ్ళీ ముందుకి సమీపిస్తూ ఉంటుంది.

ఒంటరితనం పూర్తిగా వేరైపోవడాన్ని తెలియజేస్తుంది. మన కార్యకలాపాలన్నీ స్వార్థపూరితమైనవి కాదా? మన సంబంధాల్లో, మన హక్కుల్లో, ఆస్తిపాస్తుల్లో ఆధిక్యాన్ని కోరడం లేదా? ఆ విధంగా ప్రతిఘటనని సృష్టించడం లేదా? పనిని "నీది" అనీ, "నాది" అనీ చూడటం లేదా? మనం ఒక సంఘంతో, ఒక దేశంతో, కొద్దిమందితో ఏకమై ప్రత్యేకించుకోవడం లేదా? మనల్ని మనం ప్రత్యేకించుకునే ధోరణి విభజించడానికీ, వేరు చేయడానికీ కాదా? అసలు ఆత్మ కార్యకలాపమే ఏ స్థాయిలోనైనా ప్రత్యేకించుకొనేదే. ఒంటరితనం అనేది ఏ విధమైన కార్యకలాపమూ లేని వ్యక్తి స్వీయ చైతన్యావస్థ. ఏ కార్యకలాపమైనా, శారీరకమైనదైనా, మానసికమైనదైనా స్వీయ విస్తరణకి అంటే స్వప్రయోజన విస్తరణకి మార్గం అవుతుంది. ఏ విధమైన కార్యకలాపమూ లేనప్పుడు తన లోపలి శూన్యత తెలిసివస్తుంది. ఈ శూన్యాన్నే మనం నింపటానికి ప్రయత్నిస్తాం. ఆ నింపటంలోనే మన జీవితాన్ని గడుపుతాం - ఉదాత్తంగానో, నీచంగానో. ఉదాత్తస్థాయిలో నింపటం వల్ల సాంఘికంగా ఏ విధమైన హానీ లేనట్లు కనిపించవచ్చు. కాని, భ్రమ చెప్పలేనంత దుఃఖాన్నీ, వినాశాన్నీ పెంపొందిస్తుంది - అది తక్షణం కాకపోవచ్చు. ఈ శూన్యాన్ని నింపాలనే తాపత్రయం, లేదా దాన్నుంచి పారిపోవాలనుకునేది - ఏదైనా ఒకటే - దాన్ని పవిత్రం చెయ్యటానికి గాని, అణచిపెట్టటానికి గాని సాధ్యం కాదు. ఆ అణచిపెట్టే, పవిత్రం చేసే రూపం ఏమిటి? ఆ రూపం కూడా మరోరకమైన తాపత్రయమే కాదా? వేటికోసం తాపత్రయపడతామో అవి మారవచ్చు. కాని, అన్ని తాపత్రయాలూ ఒక లాంటివే కాదా? మీ తాపత్రయం తాగుడు నుంచి కాల్పనిక ప్రక్రియకి మారవచ్చు. కాని, ఈ తాపత్రయపు ప్రక్రియని అర్థం చేసుకోకపోతే భ్రమ

అనివార్యమవుతుంది.

తాపత్రయం కాని వేరే రూపం ఏదీ లేదు. తాపత్రయమే ఉంటుంది. తాపత్రయపడేది అంటూ ఏదీ ఉండదు. తాపత్రయం వివిధ ముఖరూపాలను వివిధ సమయాల్లో ధరిస్తుంది. - ఆ వివిధ ఆసక్తుల జ్ఞాపకాలు మరో కొత్తదానితో కలిసినప్పుడు సంఘర్షణ బయలుదేరుతుంది. ఆ విధంగా ఎంచుకునేది ఒకటి పుట్టుకొస్తుంది - తాను తాపత్రయంతో సంబంధం లేని వేరే జీవినన్నట్లు స్థిరపరుచుకుంటుంది. కాని, ఆ జీవికీ, దాని లక్షణానికీ భేదం లేదు. శూన్యతనీ, అసంపూర్ణతనీ, ఒంటరితనాన్నీ నింపటానికి గాని, దాన్నుంచి పారిపోవటానికి గాని ప్రయత్నించే జీవీ, దేన్నుంచి పారిపోతుందో అదీ, వేరువేరు కాదు. ఆ జీవే అది. తన నుంచి తానే పారిపోలేదు. అది చేయగలిగినదల్లా తన్నుతాను అవగాహన చేసుకోవటమే. తనే ఒక ఒంటరితనం, తన శూన్యత. అది వేరు, తను వేరు అనుకున్నంతకాలం భ్రమా, అంతులేని సంఘర్షణా ఉంటాయి. తనే తన ఒంటరితనం అని ప్రత్యక్షంగా అనుభవం పొందినప్పుడే భయం నుంచి విముక్తి కలుగుతుంది. ఒక ఊహకి సంబంధించినప్పుడే భయం ఉంటుంది. ఊహ జ్ఞాపకం నుంచి వచ్చే ఆలోచనకి ప్రతిక్రియ. ఆలోచన అనుభవ ఫలితం. శూన్యత గురించి అది ఆలోచించగలిగినా, దాని గురించి అనుభూతులు కలిగినా, శూన్యతని ప్రత్యక్షంగా తెలుసుకోలేదు. ఆ "ఒంటరితనం" అనే శబ్దం, దాని బాధాకరమైన, భయంకరమైన జ్ఞాపకాలూ దాన్ని సరికొత్తగా అనుభవం పొందనియ్యవు. మాట అనేది జ్ఞాపకం. మాటకి ప్రాముఖ్యం లేనప్పుడు అనుభవించేదానికీ, అనుభవింపబడేదానికీ మధ్య సంబంధం పూర్తిగా విభిన్నంగా ఉంటుంది. అప్పుడు ఆ సంబంధం ప్రత్యక్షంగా కలుగుతుంది. మాట ద్వారా, జ్ఞాపకం ద్వారా కాదు. అప్పుడు, అనుభవించేదే అనుభవం. అప్పుడే భయం నుంచి విముక్తి కలుగుతుంది.

ప్రేమా, శూన్యతా ఒక్కచోట ఉండలేవు. ఒంటరితనం అనే భావం ఉన్నప్పుడు ప్రేమ ఉండదు. మీ శూన్యతని "ప్రేమ" అనే మాట వెనుక దాచుకోవచ్చు. మీరు ప్రేమించే వస్తువు అక్కడింక లేనప్పుడు, దాన్నుంచి ప్రతిక్రియ రానప్పుడు, మీరు మీ శూన్యతని తెలుసుకుంటారు. మీరు నిస్పృహ చెందుతారు. మన నుంచీ, మన అసమర్థత నుంచీ మనవే

తప్పించుకోవటానికి మార్గం కోసం "ప్రేమ" అనే పదాన్ని ఉపయోగిస్తాం. మనం ప్రేమించే వాణ్ణి పట్టుకు వదలం. అసూయ పడతాం. దగ్గర లేకుంటే బాధపడతాం. అతను మరణిస్తే మనకి పూర్తిగా మతి పోతుంది. అప్పుడు మరో రూపంలోనో, ఏదో నమ్మకంలోనో, ఇంకేదో ప్రత్యామ్నాయంలోనో సౌఖ్యాన్ని పొందాలని ఆశిస్తాం. ఇదంతా ప్రేమేనా? ప్రేమ ఒక ఊహ కాదు. సాంగత్య ఫలితం కాదు. మనకున్న దుస్థితి నుంచి పారిపోవటానికి ఉపయోగించు కునేది కాదు ప్రేమ. దాన్ని అలా ఉపయోగించినప్పుడు సమస్యల్ని సృష్టిస్తాం. వాటికి పరిష్కారాలుండవు. ప్రేమ ఊహాజనితం కాదు. భావం, మనస్సూ ప్రముఖ అంశం కాకుండా ఉన్నప్పుడే నిజమైన దాన్ని అనుభవం పొందటం సాధ్యమవుతుంది.

## 43. ఒకే రీతిగా ఉండటం

ఆయన తెలివైనవాడు, చురుకైనవాడు. ఏవో కొన్ని ఎంచుకున్న పుస్తకాలు చదువుతూ ఉంటాడని స్పష్టమవుతోంది. వివాహితుడైనా, సంసార తాపత్రయం ఉన్నవాడు కాదు. తను ఆదర్శవాదిననీ, సంఘ సేవకుడననీ తనే చెప్పుకున్నాడు. రాజకీయ కారణాలవల్ల జైలుకి వెళ్లాడుట. ఎంతో మంది స్నేహితులున్నారుట. తనకు గాని, తన పార్టీకి గాని పేరు తెచ్చుకోవాలనే బాధ లేదు ఆయనకి. ఆ రెండూ ఒకటిగానే గుర్తిస్తాడాయన. ఆయనకి సంఘసేవలోనే నిజమైన ఆసక్తి ఉంది - అదైనా మానవ కల్యాణానికి దారి తీస్తుందేమోనని. దైవతత్పరత ఉన్నవాడని చెప్పవచ్చును. కాని, ఆవేశపరుడూ, మూఢవిశ్వాసాలు ఉన్నవాడూ కాదు. ఒక ప్రత్యేక సిద్ధాంతంలో గాని, ఆచారంలో గాని నమ్మకం ఉన్నవాడు కాదు. వైరుధ్యం అన్న సమస్య గురించి - తనలోని వైరుధ్యమే కాక, ప్రకృతిలోనూ, ప్రపంచంలోనూ ఉన్నదాన్ని గురించి చర్చించటానికి వచ్చానన్నాడు. ఈ వైరుధ్యం అనివార్యమైనదని ఆయనకి అనిపిస్తున్నదట. తెలివైనది, తెలివి తక్కువది, మనిషిలో ఉండే పరస్పర విరుద్ధమైన కోరికలు, మాటకీ, ఆచరణకీ, మాటకీ, భావానికీ - ఈ విధంగా వైరుధ్యం ప్రతి చోటా కనిపిస్తుందన్నాడు.

ఒకే రీతిగా ఉండటం అంటే ఆలోచనారహితంగా ఉండటమే. ఆలోచన వల్ల బాధ పడటానికి సాహసించటం కన్న, మార్పు లేకుండా ఒక పద్ధతి ప్రకారం నడుచుకోవటం, ఒక సిద్ధాంతానికో, సంప్రదాయానికో అనుగుణంగా వర్తించటం ఎక్కువ సులభం, క్షేమదాయకం. అధికారానికి అంతర్గతంగా గాని, బహిరంగంగా గాని తలవంచటానికి ఎదురు ప్రశ్న వేయవలసిన అవసరం ఉండదు. అది ఆలోచననీ, దానితో బాటు వచ్చే అదుర్దాలనీ, ఆందోళనలనీ నిర్మూలిస్తుంది. మనం నిశ్చయించుకున్న వాటినీ, అనుభవాలనీ, నిర్ణయాలనీ అనుసరించటం వల్ల మన లోలోపల వైరుధ్యం కలగదు. మన లక్ష్యం కోసమే మనం ఒకే రీతిలో ఉంటాం. ఒక మార్గాన్ని ఎంచుకుని దాన్నే అనుసరిస్తాం - దేనికీ లొంగకుండా కృతనిశ్చయంతో అనుసరిస్తాం. మనలో చాలామంది ఏవిధమైన ఆందోళనా కలిగించని, అధమం, మానసిక రక్షణ కలిగించే జీవనమార్గాన్ని ఆశించరా? తన ఆదర్శానికి అనుగుణంగా జీవించే మనిషిని మనం ఎంత గౌరవిస్తాం! వారిని ఉదాహరణలుగా తీసుకుంటాం. వారిని అనుసరించాలి, ఆరాధించాలి. ఒక ఆదర్శాన్ని అనుసరించటానికి కొంత శ్రమా, పీకులాటా ఉన్నప్పటికీ, మొత్తం మీద అది సంతోషదాయకంగానూ, సంతృప్తికరంగానూ ఉంటుంది. అయితే, ఆదర్శాలు స్వయం నిర్మితాలూ, స్వీయ కల్పితాలే కదా. ఆధ్యాత్మిక విషయాల్లో గాని, ప్రాపంచిక విషయాల్లో గాని మీ ఆదర్శపురుషుణ్ణి ఎంచుకుని అతణ్ణి అనుసరిస్తారు. ఒకే రీతిగా ఉండాలనే కోరిక ఒక విధమైన శక్తినీ, సంతృప్తినీ ఇస్తుంది - చిత్తశుద్ధిలో రక్షణ ఉంటుంది కనుక. కాని, చిత్తశుద్ధి నిరాడంబరత కాదు. నిరాడంబరత లేకుండా అవగాహన కలగడం సాధ్యం కాదు. బాగా ఆలోచించి తయారు చేసుకున్న పథకానికి అనుగుణంగా ఒకే రీతిలో నడిచినట్లయితే, ఏదో సాధించాలనే తపనని తృప్తి పరచినట్లవుతుంది. అందులో విజయం సాధిస్తే సౌఖ్యమూ, రక్షణా ఉంటాయి. ఒక ఆదర్శాన్ని పెట్టుకుని దాన్ని నిరంతరం అనుకరించటం వల్ల ప్రతిఘటన అలవడుతుంది. సర్దుకుపోవటం అనేది ఆ అనుకరించే పద్ధతిని అతిక్రమించకపోవటం. ఒకే రీతిగా ఉండటం వల్ల రక్షణా, నమ్మకం ఉంటాయి. అందుకే అంత గతిలేనట్లు దాన్ని పట్టుకుని వదలం.

తనతో తను వైరుధ్యంతో ఉండటం అంటే సంఘర్షణతోనూ, దుఃఖం తోనూ జీవించటం. 'నేను' స్వభావమే స్వతస్సిద్ధంగా వైరుధ్యంతో కూడుకున్నది. రకరకాల ముఖాలతో ఉండే పరస్పర విరుద్ధమైన ఆసక్తులూ, విలువలూ, వివిధస్థాయిల్లో అనేక రకాల కోరికలతో కలిసి నేయబడినది. ఈ 'తను', ఈ 'నేను' రకరకాల కోరికల వల. ప్రతి కోరికకీ దాని ప్రేరణా, దాని లక్ష్యం దానికుంటాయి. ఇతర ఆశలకూ, ప్రయత్నాలకూ తరచు వ్యతిరేకంగా ఉంటాయి. ఉత్సుకత కలిగించే పరిస్థితులనూ అనుభూతులనూ బట్టి ఇవి బహుముఖాలు తగిలించుకుంటాయి. అందుచేత 'నేను' నిర్మాణ క్రమంలోనే ఉన్న వైరుధ్యం మనలో భ్రమనీ, బాధనీ పెంపొందిస్తుంది. దాన్ని తప్పించుకోవటానికి అన్ని రకాల స్వీయవంచనలకూ సిద్ధమవుతాము. దానివల్ల సంఘర్షణా, దుఃఖం మరింత అధికమవుతాయి. ఆంతరంగిక వైరుధ్యం దుర్భరమై పోయినప్పుడు మనం తెలిసిగాని, తెలియకుండా గాని మరణం ద్వారానో, మతి భ్రమణం ద్వారానో తప్పించుకునేందుకు ప్రయత్నిస్తాం. లేదా, ఒక భావానికో, ఒక సంఘానికో, ఒక దేశానికో, ఏదో కార్యకలాపానికో అంకితమైపోతాం. అది మనల్ని పూర్తిగా ఆకట్టుకుంటుంది. లేదా, ఒక మత సంస్థవైపుకీ, దాని ప్రగాఢ విశ్వాసాల వైపుకీ, ఆచారాలవైపుకీ మొగ్గుతాం. మనలోని ఈ విభజన మరింత ఆత్మవిస్తరణకో, వినాశానికో, మతి భ్రమణానికో దారి తీస్తుంది. మనం ఉన్నట్లు కాకుండా ఇంకేదో అవాలనే ప్రయత్నం వైరుధ్యాన్ని పెంచుతుంది. ఉన్న స్థితి అంటే ఏర్పడిన భయం దానికి వ్యతిరేకమైన ఒక భ్రమని పెంపొందిస్తుంది. ఆ వ్యతిరేకమైన దాని కోసం ప్రయత్నించటంలో భయం నుంచి తప్పించుకోగలమని ఆశపడతాం. సమన్వయం అంటే వ్యతిరేకమైనదాన్ని పెంచటం కాదు. సమన్వయం వ్యతిరిక్తత వల్ల రాదు. ప్రతి దానిలోనూ దానికి వ్యతిరేకమైన అంశాలు ఇమిడి ఉంటాయి. మనలోని వైరుధ్యం ప్రతి రకమైన శారీరక, మానసిక ప్రతిక్రియకీ దారితీస్తుంది. ఆ ప్రతిక్రియ సౌమ్యంగా ఉండొచ్చును, గౌరవనీయంగా ఉండొచ్చును, ప్రమాదకరంగా ఉండొచ్చును. ఒకే రీతిగా ఉండటం వల్ల ఈ వైరుధ్యం మరింత గందరగోళంగా, మరింత అస్పష్టంగా తయారవుతుంది. ఒకే ఒక్క కోరికనో, ఆసక్తినో కేంద్రీకృతం చేసుకుని దాన్ని సాధించటానికి ప్రయత్నించటం వల్ల వ్యతిరిక్తత 'నేను' ని ఆవరిస్తుంది. ఆంతరంగిక వైరుధ్యం

బహిరంగంగా సంఘర్షణని తెస్తుంది. సంఘర్షణ వైరుధ్యాన్ని సూచిస్తుంది. కోరిక తీరుతెన్నులను అర్థం చేసుకోవటంలోనే స్వీయ వైరుధ్యం నుంచి విముక్తి లభిస్తుంది.

సమైక్యత మనస్సు యొక్క పై అంతస్తులకే పరిమితం కాజాలదు. అది పాఠశాలలో నేర్చుకుంటే వచ్చేది కాదు. జ్ఞానం వల్లగాని, ఆత్మ త్యాగం వల్ల గాని రాదు. సమైక్యత ఒకే రీతిలో ఉండటం నుంచీ, వైరుధ్యం నుంచీ కూడా విముక్తి కలుగజేస్తుంది. కాని, సమైక్యత అంటే అన్ని కోరికల్నీ, అన్నిరకాల ఆసక్తుల్నీ కలిపి ఒకేలా చేయటం కాదు. సమైక్యత ఒక పద్ధతి ప్రకారం నడుచుకోవటం కాదు - ఆ పద్ధతి గౌరవనీయమైనదైనా సరే, కపటమైనదైనా సరే - దాన్ని సూటిగా, స్పష్టంగా సమీకరించటం కాదు, మరోదారిని, అగోచరంగా సమీపించాలి. సమైక్యతని ఊహించటం అంటే ఒక పద్ధతిని అవలంబించటమే - దానివల్ల తెలివితక్కువ తనం, వినాశకత్వం పెంపొందుతాయి. సమైక్యతకి ప్రయత్నించటం అంటే, దాన్నొక ఆదర్శంగా, స్వయం కల్పిత లక్ష్యంగా చేయటమే. అన్ని ఆదర్శాలూ స్వీయ కల్పితాలే కనుక అవి తప్పనిసరిగా, సంఘర్షణకీ, శత్రుత్వానికీ కారకమవుతాయి. వ్యక్తి తనకు తాను కల్పించే రూపం తన ప్రకృతిదే కాబట్టి అది వైరుధ్యయుతంగానూ, సందిగ్ధ జనకంగానూ ఉంటుంది. సమైక్యత ఒక ఊహకాదు. కేవలం జ్ఞాపకం వల్ల కలిగిన ప్రతిక్రియ కాదు. అందువల్ల దాన్ని పెంచటానికి వీలవదు. సంఘర్షణ ఉన్నందువల్లనే సమైక్యత కావాలనే కోరిక కలుగుతుంది. సమైక్యత పెంపొందించుకోవటం ద్వారా సంఘర్షణకి అతీతం కావటం జరగదు. వైరుధ్యాన్ని కప్పిపుచ్చవచ్చు. లేదనవచ్చు, ఉందని తెలియకుండా ఉండొచ్చు. కాని అది అక్కడే ఉంటుంది - బయట పడటానికి ఎదురుచూస్తూ.

సంఘర్షణనే మనం పట్టించుకునేది, సమైక్యతని కాదు. సమైక్యత కూడా శాంతి లాగే అసలు లక్ష్యం కాదు. పక్క నుంచి పుట్టుకొచ్చినది. అది ఒక ఫలితం మాత్రమే - అందువల్ల దానికంత ప్రాముఖ్యం లేదు. సంఘర్షణని అర్థం చేసుకోవటంతో సమైక్యత, శాంతమే కాక అంతకన్న అనేక రెట్లు గొప్పదైన దేదో ఉంటుంది. సంఘర్షణని అణచివెయ్యటం గాని, పవిత్రం చెయ్యటం గాని సాధ్యం కాదు. దానికి ప్రత్యామ్నాయంగా మరొకటి లేదు. సంఘర్షణ

తాపత్రయం వల్ల వస్తుంది. కొనసాగాలనీ, ఇంకా అవాలనీ కోరటం వల్ల వస్తుంది - అంటే స్తబ్ధంగా ఉండిపోతూ తృప్తిపడటం కాదు. "ఇంకా" అనేది 'నేను' నిత్యం చేసే గోల. అది అనుభూతి కోసం అపేక్షించటం - గతించినది గాని, రానున్నది గాని. అనుభూతి మానసికమైనది. అందువల్ల సంఘర్షణని అర్థం చేసుకోవటానికి మనస్సు సాధనం కాదు. అర్థం చేసుకోవటం మాటల్లో కాదు. అది మానసిక ప్రక్రియ కాదు. అందువల్ల అది అనుభవానికి చెందిన విషయం కాదు. అనుభవం ఒక జ్ఞాపకం. మాటలేకుండా, సంకేతం లేకుండా, రూపం లేకుండా జ్ఞాపకం అనేది ఉండదు. సంఘర్షణ గురించి బోలెడు గ్రంథాలు చదవచ్చు. దానికీ, సంఘర్షణని అర్థం చేసుకోవటానికీ సంబంధం లేదు. సంఘర్షణని అర్థం చేసుకోవాలంటే ఆలోచన అడ్డు రాకూడదు. ఆలోచించేవాడు లేకుండా సంఘర్షణని తెలుసుకోవటం జరగాలి. ఆలోచించే వాడు ఎంచుకుంటాడు. సంతోషకరమైన వాటివైపూ, సంతృప్తికరమైన వాటివైపూ తప్పని సరిగా మొగ్గుతాడు. దాంతో, సంఘర్షణని పోషిస్తాడు. ఒక ప్రత్యేక విషయంలో సంఘర్షణని వదిలించుకోచ్చు. సంఘర్షణ పుట్టించే క్షేత్రం అలాగే ఉంటుంది. ఆలోచించేవాడు సమర్థించటమో, ఖండించటమో చేస్తే అవగాహన కాకుండా అడ్డుపడతాడు. ఆలోచించేవాడు లేకుండా ఉంటే సంఘర్షణ సూటిగా అర్థమవుతుంది - అనుభవించేవాడు అనుభవం పొందుతున్నట్లుగా కాదు. అనుభవమవుతూన్న స్థితిలో అనుభవించేవాడు గాని, అనుభవం పొందబడేది కాని ఉండదు. అనుభవమవటం సూటిగా అవుతుంది. ఆ సంబంధం సూటిగా ఉంటుంది. జ్ఞాపకం ద్వారా కాదు. ఈ ప్రత్యక్ష సంబంధమే అవగాహన కలుగజేస్తుంది. అవగాహన వల్ల సంఘర్షణ నుంచి విముక్తి కలుగుతుంది. సంఘర్షణ నుంచి విముక్తి కలగటంతో సమైక్యత ఏర్పడుతుంది.

## 44. క్రియ, భావం

ఆయన మృదువుగానూ, శాంతంగానూ ఉన్నాడు. ఆయన ముఖం మీద వెంటనే వస్తుంది చక్కని చిరునవ్వు. ఎంతో సామాన్యమైన దుస్తులు వేసుకున్నాడు ఆయన ప్రవర్తన నెమ్మదిగానూ, మొహమాటంతో కూడినట్లు

గానూ ఉంది. ఆయన అహింసని ఎన్నో సంవత్సరాలుగా సాధన చేశాడుట. దాని శక్తి, ఆధ్యాత్మిక ప్రాముఖ్యం బాగా తెలుసుకున్నాడుట. దాన్ని గురించి ఎన్నో పుస్తకాలు రాశాడుట. తనతో కూడా ఒక పుస్తకాన్ని పట్టుకొచ్చాడు. ఎన్నో ఏళ్లనుంచీ ప్రయత్నపూర్వకంగా దేన్నీ చంపలేదని వివరించాడు. కూరగాయలు తప్ప వేటినీ తినడుట. తను కూరగాయలు తినే విషయం గురించి ఎన్నో వివరాలు చెప్పాడు. ఆయన జోళ్లూ, చెప్పులూ సహజంగా చచ్చిపోయిన జంతువుల చర్మం నుంచి చేసినవి మాత్రమేనట. ఆయన తన జీవితాన్ని వీలైనంత నిరాడంబరంగా చేసుకున్నాడుట. ఆహార పదార్థాలను గురించి చదివాడుట. తనకు అవసరమైన వాటినే తింటాడుట. ఆయన ఎన్నో సంవత్సరాలుగా కోపం తెచ్చుకోలేదుట. కాని కొన్ని సందర్భాల్లో అసహనం కలుగుతుంది. అది కేవలం నరాల్లో కలిగే ప్రతిక్రియ మాత్రమేనట. ఆయన ప్రసంగం హద్దుల్లో ఉండి సౌమ్యంగా ఉంది. అహింసకున్న శక్తి ప్రపంచాన్ని మారుస్తుందనీ, దాని కోసం తన జీవితాన్ని అంకితం చేశాననీ చెప్పాడాయన. తన గురించి తాను సులభంగా మాట్లాడే రకం కాదాయన. కాని, అహింస విషయంలో ఆయన ధారాళంగా మాట్లాడాడు. మాటలు ప్రయత్నం లేకుండానే ప్రవహిస్తున్నాయి. తన కిష్టమైన ఆ విషయం గురించి మరింత ప్రగాఢంగా చర్చించటానికే వచ్చానని చెప్పాడు.

దారికెదురుగా ఆ పెద్ద కాలవ ప్రశాంతంగా ఉంది. వాటిల్లో నీళ్లు కల్లోలితమైనాయి పెద్ద గాలి వీచే సరికి. చెట్టుకున్న పెద్ద పెద్ద ఆకుల నీడ నీటిమీద పడుతోంది. ఒకటో రెండో కలువ పువ్వులు నీటిపై భాగం మీద ప్రశాంతంగా తేలుతున్నాయి. ఒక మొగ్గ నీటిపైకి కొద్దిగా కనిపిస్తోంది. పక్షులు రావటం మొదలైంది. ఎన్నో కప్పలు బయటికి వచ్చి మళ్లీ నీళ్లలోకి దూకాయి. అలలు క్రమంగా మాయమైపోయాయి. మళ్లీ నీళ్లు ప్రశాంతంగా ఉన్నాయి. ఒక పొడుగాటి చెట్టుకి బాగాపైన పిట్ట ఒకటి కూర్చుని ముక్కుతో ఈకలు సవరించుకుంటూ పాడుతోంది. ఒక వంపులా ఎగిరి మళ్లీ తన చిటారు కొమ్మమీదికి వస్తోంది. ప్రపంచాన్ని చూసీ, తన్ను తాను చూసుకునీ మురిసి పోతోంది. మాకు కొద్ది దూరంలోనే ఒక లావుపాటి ఆయన పుస్తకం పుచ్చుకుని కూర్చున్నాడు. కాని, ఆయన దృష్టి ఎక్కడో ఉంది. చదవటానికి

ప్రయత్నిస్తున్నాడు గాని, ఆయన మనస్సు మళ్లీ మళ్లీ పారిపోతోంది. ఆఖరికి ఆ పోరాటం ఆపేసి, మనస్సుని దాని త్రోవని దాన్ని వదిలేశాడు. ఒక లారీ కొండమీది నుంచి క్రిందికి మెల్లిగా భారంగా వస్తోంది. దాని వేగం ఇంకా తగ్గించవలసి వచ్చింది.

క్రియారూపంలో పెట్టటానికి మనం ఎంతో బాధపడుతూ ఉంటాం - పైకి కనిపించే చేష్టల రూపంలో ముందు బాహ్యంగా ఒక క్రమపద్ధతి తీసుకురావటానికి ప్రయత్నిస్తాం. మన తీర్మానాల ప్రకారం అంతరంగంలో ఏర్పరచుకున్న సూత్రాల ప్రకారం బాహ్యంగా మన జీవితాన్ని సరిదిద్దు కుంటాం. అంతరంగికమైన దానికి అనుగుణంగా, బాహ్యంగా ఉన్నదాన్ని ఎందుకు బలవంతంగా మారుస్తాం? ఒక భావం ప్రకారం ఎందుకు క్రియ జరుపుతాం? భావం క్రియ కన్నా ఎక్కువ శక్తిమంతమైనదా?

భావం ముందు ఏర్పడుతుంది - సహేతుకంగానో, సహజంగా తట్టినందువల్లనో ఆ తరువాత క్రియని ఆ భావం సమీపానికి తీసుకు రావటానికి ప్రయత్నిస్తాం. దాని ప్రకారం జీవితం నడపటానికి ప్రయత్నిస్తాం. దాన్ని సాధన చేస్తాం. దానికి తగిన క్రమశిక్షణ పొందుతాం. క్రియని భావం సరిహద్దులలోకి తీసుకురావటానికి ఇదొక అనంతమైన కృషి. క్రియని భావం ప్రకారం రూపొందించటానికి ఎందుకీ అంతులేని బాధాకరమైన పోరాటం? లోపలి దానిలా పైదాన్ని చెయ్యాలనే ఈ తపన ఏమిటి? లోపలి దాన్ని శక్తిమంతం చెయ్యటానికా? లేక, లోపలిది సందేహావస్థలో ఉన్నప్పుడు దానికి పైదాని హామీ ఇవ్వటానికా? పైదాని నుంచి సౌఖ్యం పొందుతున్నప్పుడు పై దానికి ఎక్కువ ప్రాముఖ్యం, ప్రాధాన్యం ఏర్పడవా? బాహ్య వాస్తవికతకి ప్రాధాన్యం ఉంది. కాని, దాన్ని చిత్తశుద్ధికి తార్కాణంగా చూచినప్పుడు, భావానికే ఎక్కువ ఆధిక్యం అని సూచించదా? భావం ఎందుకంత శక్తిమంతమై పోయింది? మనల్ని క్రియాత్మకంగా చేయటానికా? మనం క్రియ జరపటానికి భావం ఎంత వరకు దోహదం చేస్తుంది? క్రియకి అడ్డు తగులుతుందా?

భావం క్రియని, నిశ్చయంగా పరిమితం చేస్తుంది. క్రియ అంటే ఉండే భయమే ఊహని కలిగిస్తుంది. ఊహలో రక్షణ ఉంటుంది. క్రియలో ప్రమాదం ఉంటుంది. క్రియ పరిమితులు లేనట్టిది. అట్టి క్రియని

నిగ్రహించటానికి ఊహని పెంపొందించటం జరుగుతుంది. చర్యని ఆపు చేయటానికి భావం ఏర్పడుతుంది. క్రియలో మీరు నిజంగా ఔదార్యంగా ఉంటే ఏమవుతుంది? అందుచేత మీ హృదయంలోని ఔదార్యానికి వ్యతిరేకంగా మానసిక ఔదార్యం ఉంటుంది. మీరు అంతవరకే వెడతారు - రేపు ఏమవుతుందో మీకు తెలియదు కనుక, క్రియని భావం తీర్చిదిద్దుతుంది. క్రియ పరిపూర్ణంగా విశాలంగా, విస్తృతంగా, ఉంటుంది. భయం ఊహలాగే ముందు కొచ్చి బాధ్యత తీసుకుంటుంది. ఆ విధంగా భావం అత్యంత ముఖ్యమవుతుంది - క్రియ కాదు.

క్రియ ఊహకి అనుగుణంగా ఉండాలి అని ప్రయత్నిస్తాం. అహింస అనేది భావం లేదా ఆదర్శం. మన చర్యలూ, చేష్టలూ, ఆలోచనలూ, అన్నీ మనసులో ఉన్న ఆ పద్ధతి ప్రకారం రూపొందుతాయి. మనం తినేదీ, కట్టుకునేదీ, చెప్పేదీ చాలా ముఖ్యం అవుతాయి. మన చిత్తశుద్ధిని వాటి ద్వారా నిర్ణయిస్తాం కాబట్టి, చిత్తశుద్ధి ముఖ్యమైపోతుంది, అహింసాయుతంగా ఉండటం కాదు. మీ చెప్పులూ, మీరు తినేదీ ఎంతో ఆసక్తికరమైన అంశాలవుతాయి. అహింసాయుతంగా ఉండటం మరిచిపోవటమవుతుంది. భావం ఎప్పుడూ అప్రధానమైనదే. అప్రధానమైన విషయాలే ప్రధానమైన దానిపైన ఆధిక్యాన్ని చూపిస్తాయి. మీరు భావం గురించి రాయవచ్చు, ప్రసంగించవచ్చు, కబుర్లు చెప్పవచ్చు. ఊహలో ఆత్మవిస్తరణకి అవకాశం ఎక్కువ ఉంటుంది. అహింసాయుతంగా ఉండటంలో ఆత్మవిస్తరణ వల్ల కలిగే సంతృప్తి ఉండదు. ఊహ స్వయంకల్పితం కాబట్టి ఉత్తేజకరంగా సంతృప్తికరంగా ఉంటుంది - వ్యక్తంగా అయినా, అవ్యక్తంగా అయినా. కాని అహింసాయుతంగా ఉండటంలో ఆకర్షణ ఉండదు. అహింస కేవలం లక్ష్యం కాదు. అహింస ఒక ఫలితం, పక్క నుంచి పుట్టుకొచ్చింది మాత్రమే. భావం ఆధిపత్యం వహించినప్పుడు అది లక్ష్యం మాత్రమే అవుతుంది. భావం ఎప్పటికీ నిశ్చితాభిప్రాయం, లక్ష్యం, స్వయంకల్పిత లక్ష్యం. ఊహ అనేది తెలిసిన దానిలో జరిగే సంచలనం. కాని, అహింసాయుతంగా ఉండటం ఎలాగో ఆలోచన రూపొందించలేదు. ఆలోచన అహింస గురించి లోతైన ఆలోచనలు చేయవచ్చు. కాని, అది అహింసాయుతంగా ఉండలేదు. అహింస ఊహ కాదు. దాన్ని క్రియాత్మకంగా చేయటం సాధ్యం కాదు.

# 45. నగరంలో జీవితం

ఆ గది అన్ని విధాలా వీలుగా, ప్రశాంతంగా, హాయిగా ఉంది. గదిలో సామాను నాజూకుగా ఎంతో మంచి అభిరుచితో ఉంది. తివాసీ ఒత్తుగా మెత్తగా ఉంది. చలువరాతి గట్టుక్రింద నిప్పుచేసుకునే స్థలం - అందులో నిప్పులున్నాయి. ప్రపంచంలో అనేక ప్రదేశాల నుంచి తెచ్చిన పాత పూలకూజాలు ఉన్నాయి. గోడలమీద కొన్ని కొత్త చిత్రాలూ, కొన్ని పురాతన కళాకారుల చిత్రాలూ ఉన్నాయి. ఆ గది అందంగా సౌకర్యంగా ఉండటానికి ఎంతో ఆలోచించి జాగ్రత్త తీసుకున్నట్లుగా ఉంది. దానిలో వారి డబ్బూ, అభిరుచీ ప్రతిబింబిస్తోంది. ఆ గదిలోంచి చూస్తే చిన్నతోట, ఆ తోటలో పచ్చని మైదానం కనిపిస్తాయి. ఎన్నో సంవత్సరాలనుంచీ గడ్డి కత్తిరించబడి, పరిచినట్లుగా ఉంది.

నగరంలో జీవితానికీ జగత్తుకీ బంధం తెగిపోతుంది చిత్రంగా. లోయలూ, కొండలూ ఉండే స్థలాల్లో మనుషులు కట్టిన మేడలు, ఉరకలు వేసే జలధారల స్థానంలో వచ్చేపోయే వాహనాల రొద, రాత్రి నక్షత్రాలు కనిపించటం అరుదు. ఒకేళ ఎవరైనా చూడాలనుకున్నా, నగర దీపాలు మరీ కాంతివంతంగా ఉంటాయి. నగరవాసులకేదో అవుతుంది నిశ్చయంగా. నాజూగ్గా మర్యాదగా ఉంటారు. వాళ్లకి చర్చిలూ, మ్యూజియమ్‌లూ, త్రాగుడూ, నాటకాలూ, అందమైన బట్టలూ, అంతులేని దుకాణాలూ ఉంటాయి. ఎక్కడ చూసినా మనుషులు - వీధుల్లో భవనాల్లో, గదుల్లో. ఆకాశంలో ఒక మేఘం వెడుతుంది. దానివైపు ఎవరో గాని కన్నెత్తి చూడరు. హడావిడి, కల్లోలం.

కాని, ఈ గదిలో అంతా నిశ్శబ్దంగా గంభీరంగా ఉంది. ధనవంతుల వద్ద ఉండే చిత్రమైన వాతావరణం ఉంది - అన్నిటికీ దూరంగా, సురక్షితంగా, ధీమాగా, దేనికీ కొరత లేకుండా స్వేచ్ఛగా ఉంటుంది. ఆయనకి వేదాంతంలో ఆసక్తి ఉందని చెప్పుకొన్తున్నాడాయన - పూర్వ పశ్చిమ సిద్ధాంతాలు రెండింటిలోనూ ఆసక్తి ఉందట. గ్రీకు దేశస్థులతోనే ప్రారంభమైందనటం ఎంత అసందర్భం - అక్కడికి, వాళ్లకి ముందు ఇంకేమీ లేనట్లు - అన్నాడాయన. అంతలోనే తన సమస్య గురించి చెప్పటం మొదలుపెట్టాడు

- ఎట్లా ఇవ్వాలి, ఎవరికి ఇవ్వాలి, అని. డబ్బుండటం, దానితో వచ్చే బాధ్యతలూ ఆయన్ని కొంత చికాకు పెడుతున్నాయిట. ఆయన దాన్ని సమస్యలా ఎందుకు చూస్తున్నాడు? ఎవరికిచ్చాడో, ఏ ఉద్దేశంతో ఇచ్చాడో అంత ముఖ్యమైనదా? అది సమస్యగా ఎలా పరిణమించింది?

ఆయన భార్య వచ్చింది. ఆకర్షణీయంగా, కాంతివంతంగా, కుతూహలంతో ఉన్నట్లుగా ఉంది. ఇద్దరూ బాగా చదువుకున్నవాళ్ళు, మర్యాదస్తులు, ప్రాపంచిక విషయాల్లో శ్రద్ధ ఉన్నవాళ్ళు, తెలివైన వాళ్ళు. ఎన్నో విషయాల్లో ఆసక్తి ఉంది. ఇద్దరూ కూడా చిన్న ఊరు నుంచీ, గ్రామం నుంచీ వచ్చిన వాళ్ళే. వారి హృదయాలు ఇంకా చిన్న ఊరులోనే ఉన్నాయి. ఆ ఒక్కటి - దయ అనేది ఎంతో దూరమై పోయినట్లుగా అనిపిస్తోంది. మనోలక్షణాలను ఎంతో శ్రద్ధగా పోషించుకున్నారు - ఒక విధమైన వాడితనం, కరుకుగా ప్రవర్తించటం. కానీ వాటివల్ల ఏమీ లాభం లేకపోయింది. ఆవిడ కొద్ది రచనలు చేసింది. ఆయన ఒకరకంగా రాజకీయ వేత్త. ఎంతో సునాయాసంగానూ, భరోసాతోనూ మాట్లాడారు వాళ్ళు. ఏదైనా ఆవిష్కారం కావాలన్నా, అవగాహన కావాలన్నా సందేహావస్థలో ఉండటం అవసరం. మీ కంతగా తెలిసి ఉన్నప్పుడు - ఆత్మ రక్షణ చేసుకునే కవచం అంతమెరిసేటట్లు పెట్టుకున్నప్పుడు ఏ మాత్రమూ బీటలూ పడకుండా లోపలనుంచి తాపడం చేసినప్పుడు సందేహావస్థ ఎలా ఉంటుంది? అనుభూతి కలిగించే వాటి బంధనంలో చిక్కుకున్నవారికి రేఖారూపాలు అసాధారణమైన ప్రాముఖ్యం గలవై ఉంటాయి. అప్పుడు అందం ఒక అనుభూతి, మంచితనం ఒక ఊహ, సత్యం సహేతుకంగా నిర్ణయించవలసినదీ అవుతుంది. అనుభూతులు ఆధిక్యం వహిస్తే సౌఖ్యం అత్యవసరమైపోతుంది - శరీరానికే కాకుండా అధ్యాత్మికంగా కూడా - ముఖ్యంగా, మానసికంగా హరించి వేస్తూ భ్రమకి దారితీస్తుంది.

మనం సొంతం చేసుకున్నవే మనం. మనం వేటితో బంధం పెంచుకున్నామో అవే మనం. బంధనానికి ఔన్నత్యం ఉండదు. జ్ఞానంతో బంధం పెంచుకోవటానికీ, మరింకేదో సంతృప్తి కలిగించే దురలవాటుకీ తేడా లేదు. దేనితోనైనా బంధనం పెంచుకోవటం తన గొడవలో తాను మునిగి ఉండటమే - నీచ స్థాయిలోనైనా, ఉన్నతస్థాయిలోనైనా. బంధనం

పెంచుకోవటం ఆత్మవంచన. తనలోని వెలితిని తప్పించుకోవటానికి అదొక మార్గం. మనం బంధనం పెంచుకునేవి - ఆస్తి, మనుషులూ, ఊహలూ - ఇవి అత్యంత ముఖ్యం అవుతాయి, శూన్యాన్ని నింపే అవన్నీ లేకపోతే తనే ఉండడు కనుక. ఉండడేమోనన్న భయంతో సొంతం చేసుకుంటారు. భయం భ్రమని పెంపొందిస్తుంది. నిశ్చితమైన వాటి బంధనంలో ఉండటమే భ్రమ - నిశ్చితమైనవి వస్తువులైనా, భావాలైనా; వివేకం, స్వేచ్ఛా ఉన్నప్పుడే వాస్తవికత తెలియటానికి వీలవుతుంది. ఈ స్వేచ్ఛ లేకుండా కపటత్వాన్ని వివేకం అనుకుంటారు. కపటంగా ఉండేవారి పద్ధతులెప్పుడూ గందరగోళంగా, వినాశకరంగా ఉంటాయి. ఈ ఆత్మరక్షకమైన కపటత్వమే బంధనాలు ఏర్పరచుకునేట్లు చేస్తుంది. బంధనం బాధ కలిగించినప్పుడు కపటత్వమే బంధనం వదిలించుకోవటానికి ప్రయత్నిస్తుంది. పైగా త్యజించటాన్ని గర్వంగా, గొప్పగా భావించి, అందులో సంతోషాన్ని పొందుతుంది. కపట రీతులూ, ఆత్మ అవలంబించే మార్గాలూ అర్థం కావటమే వివేకానికి ఆరంభం.

## 46. వెర్రిభ్రమ

**ఆయనకి** చిన్నచిన్న విషయాల గురించి వెర్రిభ్రమలు ఉన్నాయన్నాడు. వెర్రిభ్రమలు నిత్యం మారుతూ ఉంటాయిట. ఏదో శారీరక లోపం ఊహించుకుని దాన్ని గురించే ఆదుర్దా పడుతూ ఉంటాడుట. కొన్ని గంటలయింతరవాత దాని స్థానంలో మరో సంఘటనో, ఆలోచనో చోటు చేసుకుంటుందిట. ఆదుర్దా కలిగించే ఒక వెర్రిభ్రమలో నుంచి మరొక వెర్రిభ్రమలో పడి బ్రతుకుతున్నట్లు ఉందిట. ఈ వెర్రిభ్రమలను జయించ టానికి వాటి గురించి పుస్తకాలు చదువుతాడుట. ఎవరైనా స్నేహితుడితో తన సమస్య చెప్పుకుంటాడు. ఒక మనస్తత్వ పరిశీలకుడి దగ్గరకి కూడా వెళ్లాడుట. అయినా, ఏ విధంగానూ బాధ నివారణ కాలేదుట. ఎంతో గంభీరమైన, ఆసక్తికరమైన సమావేశాల్లో పాల్గొన్న తరవాత తక్షణం మళ్లీ ఈ వెర్రి భ్రమలు ప్రవేశిస్తాయిట. వాటి కారణం ఆయన తెలుసుకోగలిగితే వాటిని అంతం చెయ్యటానికి వీలవుతుందా?

కారణం కనుక్కోగలిగినంత మాత్రాన ఫలితం నుంచి విముక్తి కలుగుతుందా? కారణం తెలిసినందువల్ల ఫలితం పోతుందా? యుద్ధానికి కారణాలు ఆర్థికమైనవీ, మానసికమైనవీ మనకి తెలుసును. అయినా, రాక్షసత్వాన్నీ, ఆత్మవినాశాన్నీ ప్రోత్సాహపరుస్తున్నాం. కారణాన్ని వెతకటంలో మన ఉద్దేశం ఫలితాన్ని తప్పించుకోవాలనే కదా. ఈ కోరిక ఇంకో రకమైన ప్రతిఘటన, లేదా ఖండన. ఖండన ఉన్నప్పుడు అవగాహన ఉండదు.

"అయితే ఏం చెయ్యాలి" అని అడిగాడాయన.

మనస్సు ఈ అల్పమైన తెలివి తక్కువ భ్రమల అధీనంలో ఎందుకుంటోంది? "ఎందుకు" అని అడగటం, మీరు కాకుండా వేరే ఇంకేదైనా కారణం ఉందేమో కనుక్కోవాలని ప్రయత్నించటం కాదు. మీ ఆలోచనా ధోరణి గురించి తెలుసుకునే ప్రయత్నం మాత్రమే. ఇంతకూ మనస్సు ఆ విధమైన గొడవ ఎందుకు పడుతోంది? అది పైపైనే ఉండేదీ, వెలితిగా, అల్పంగా ఉండేదీ కనుకనూ, అందువల్లనే తన ఆకర్షణల్లో తానే పడుతున్నది కనుకనూ కాదా?

"అవును" అని సమాధానమిచ్చాడు. "అది నిజమే అనిపిస్తోంది. కాని పూర్తిగా కాదు. ఎందుకంటే, నేను ప్రతి విషయం గురించీ తీవ్రంగా ఆలోచిస్తాను" అన్నాడు.

ఈ వెర్రిభ్రమలు కాక, మీ ఆలోచనలింకా దేన్ని గురించి?

"నా ఉద్యోగం గురించి" అన్నాడు. "నేనొక బాధ్యత గల పదవిలో ఉన్నాను. రోజంతా ఒక్కొక్కప్పుడు బాగా రాత్రి వరకూ నా ఆలోచనలన్నీ నా వ్యవహారాల గురించే. తరుచు చదువుతూ ఉంటాను. కాని, నా సమయమంతా చాలావరకు నా ఉద్యోగ నిమిత్తమే ఖర్చవుతుంది."

మీరు చేస్తున్నపని మీ కిష్టమేనా?

"ఆ, కాని పూర్తిగా సంతృప్తికరం కాదు. నా జీవితమంతా నేను చేస్తున్నదానితో అసంతృప్తి పడుతూనే ఉన్నాను. కాని, నా ప్రస్తుత పదవిని నేను వదులుకోలేను. ఎందుకంటే, నాకింకా కొన్ని బాధ్యతలున్నాయి. పైగా వయస్సు పైబడుతోంది. నాకు చికాకు కలిగిస్తున్నవి ఈ వెర్రిభ్రమలే. నా

ఉద్యోగం అన్నా, మనుషులన్నా అంతకంతకు పెరుగుతున్న అయిష్టతా కూడా నాకు చికాకు కలిగిస్తున్నాయి. నేనెప్పుడూ కనికరం చూపించలేదు. భవిష్యత్తు గురించి ఆదుర్దా అధికమవుతోంది. శాంతి అన్నది ఉండటం లేదనిపిస్తోంది. నేను నా పని బాగానే నిర్వర్తిస్తాను, కాని. ...."

ఉన్నదానితో మీరు ఎందుకంత పోరాడుతున్నారు? నేను ఉంటున్న ఇల్లు గొడవగొడవగా మురికిగా ఉండొచ్చు. సామాను ఘోరంగా ఉండొచ్చు. ఎక్కడా అందం అనేది లేకుండా ఉండి ఉండొచ్చు. కాని, అనేక కారణాల వల్ల నేను అక్కడే ఉండవలసి రావచ్చు. ఇంకో ఇంటికి వెళ్లిపోలేను. అప్పుడు, ఉన్న వాటిని స్వీకరించాలన్న ప్రశ్నకాదు, స్పష్టంగా కనిపిస్తున్న వాటిని చూడటం. ఉన్న దాన్ని నేను చూడనట్లయితే, ఆ పూలకుండీ చూసినా, ఆకుర్చీ చూసినా, ఆ బొమ్మ చూసినా రోత పుట్టేలా బాధపడతాను. అవే నా వెర్రి భ్రమలైపోతాయి. ఇక మనుషులన్నా, నా ఉద్యోగమన్నా, ఏమన్నా రోత పుడుతుంది. అవన్నీ వదిలేసి మళ్లీ మొదలుపెడితే అది వేరే సంగతి. కానీ, అలా చెయ్యలేను. ఉన్నదాన్ని గుర్తించటం నిరాసక్తమైన తృప్తికీ, నిర్లక్ష్యానికీ దారి తీయదు. ఉన్నదానికి నేను లొంగినట్లయితే, అది అవగాహన అవటమే కాకుండా ఒక విధమైన ప్రశాంతత వస్తుంది పైపై మనస్సులో. పైపై మనస్సు శాంతంగా లేనట్లయితే, అది పిచ్చి భ్రమలలో పడుతుంది - వాస్తవమైనవైనా, ఊహామయమైనవైనా; సంఘసేవలోనో, మత విశ్వాసంలోనో - గురువూ, రక్షకుడూ, పూజలూ వంటివి. పైపై మనస్సు శాంతంగా ఉన్నప్పుడే నిగూఢంగా ఉన్నది విశదమవుతుంది. నిగూఢంగా ఉన్నదాన్ని బయటపెట్టాలి. కాని, పైపై మనస్సు వెర్రిభ్రమలతో, ఆదుర్దాలతో బరువై పోయినప్పుడు అది సాధ్యం కాదు. పైపై మనస్సు నిత్యం ఏదో ఒక ఆందోళనలో ఉంటుంది. కనుక మనస్సు పై పొరలకీ, లోలోపలి పొరలకీ సంఘర్షణ తప్పదు. ఈ సంఘర్షణ పరిష్కారం కానంతవరకూ వెర్రిభ్రమలు అధికమవుతాయి. ఈ వెర్రిభ్రమలు మన సంఘర్షణ నుంచి తప్పించుకోవటానికి మార్గాలే కదా. తప్పించుకునే మార్గాలన్నీ ఒకలాంటివే - కొన్ని సాంఘికంగా ఎక్కువ హానికరమైనవైనప్పటికీ.

వెర్రిభ్రమగాని, ఏ సమస్యగాని, దాని మొత్తం ప్రక్రియని తెలుసు కున్నప్పుడే సమస్య నుంచి విముక్తి లభిస్తుంది. సంపూర్ణంగా తెలుసు

కోవటానికి ఖండన జరక్కూడదు. సమస్యని సమర్థించటం జరగకూడదు. తెలుసుకొని ఉండటం ఇష్టాయిష్టాలు లేకుండా జరగాలి. ఆవిధంగా తెలుసుకోవటానికి ఎంతో ఓర్పు, సున్నితత్వం ఉండాలి. ఉత్సుకతా, నిర్విరామమైన శ్రద్ధా ఉండాలి - మొత్తం ఆలోచనా ప్రక్రియని గమనించటానికీ, అర్థం చేసుకోవటానికీ.

## 47. ఆధ్యాత్మిక మార్గదర్శి

ఆయన గురువు వర్ణించటానికి వీల్లేనంత గొప్పవాడనీ, ఆయనకి తను చాలా ఏళ్లపాటు శిష్యుడిగా ఉన్నాననీ చెప్పాడాయన. ఆయన గురువు కఠినమైన ఆఘాతాలను కలిగిస్తూ దుర్భాషలాడుతూ, అవమాన పరిచే మాటల ద్వారా, చర్యల ద్వారా తన ఉపదేశాలను బోధపరిచేవాడుట. ఎంతో మంది ప్రముఖులు ఆయన్ని అనుసరించే వారిలో ఉన్నారని కూడా చెప్పాడాయన. ఆయన పద్ధతిలో ఉన్న మోటుతనమే మనుషుల్ని ఆలోచించేటట్లు చేసేదిట. లేచి కూర్చుని, చప్పున గ్రహించేటట్లు చేసేదిట. చాలామంది నిద్రావస్థలో ఉంటారు. అటువంటివారిని కుదిపి లేపి కూర్చోబెట్టటం అవసరం అన్నాడాయన. ఈ గురువు దేవుణ్ణి గురించి నానామాటలూ అనేవాడుట. ఆయన శిష్యులు ఎంతో తాగవలసివచ్చేదిట. ఎందుకంటే గురువు గారే భోజనంతో బాటు తెగ తాగేవాడుట. కాని, ఆయన బోధనలు మాత్రం ప్రగాఢంగా ఉండేవిట. ఒకప్పుడు వాటిని రహస్యంగా ఉంచేవారుట. ఇప్పుడు అందరికీ తెలియనిస్తున్నారట.

శరత్కాలపు సూర్యకాంతి కిటికీలోంచి పుష్కలంగా ప్రసరిస్తోంది. వీధి రొద అంతా వినిపిస్తోంది. ఎండిపోతున్న ఆకులు తళతళలాడుతున్నాయి. గాలి హాయిగా దట్టంగా వీస్తోంది. అన్ని నగరాల్లో లాగే ఒక విధమైన నిస్పృహ, చెప్పలేని బాధతో కూడిన వాతావరణానికి విరుద్ధంగా ఉంది సాయంకాలపు కాంతి. కృత్రిమమైన ఆనందోత్సాహం మరింత దుఃఖభాజనంగా ఉంది. సహజంగా ఉండటం అంటే ఏమిటో, హాయిగా నవ్వటం అంటే ఏమిటో మరిచిపోయినట్లున్నాం. మన ముఖాలు దుఃఖంతో, ఆదుర్దాతో ముడుచుకు

పోయి ఉంటాయి. కాని, ఆకులు మాత్రం ఎండలో మెరుస్తున్నాయి. ఒక మేఘం అటువైపు నుంచి వెళ్లింది.

ఆధ్యాత్మిక ఉద్యమాల్లో కూడా సాంఘిక విభేదాలను పాటిస్తారు. పదవిలో ఉన్న వ్యక్తిని ఎంత ఆత్రుతగా ఆహ్వానించి ముందు సీట్లో కూర్చోబెడతారు! ప్రఖ్యాతి గాంచినవారిని అనుసరించేవారు వారిని ఎలా పట్టుకు వ్రేలాడుతారు! ప్రత్యేకత కోసం, పేరు ప్రఖ్యాతుల కోసం ఎంత తృష్ణ మనకి! దగ్గరగా ఉన్నవారు, దూరంగా ఉన్నవారు అనీ, దివ్యజ్ఞాన సంపన్నుడు, గురువు, ప్రవేశం పొందినవాడు, శిష్యుడు, ఆరంభదశలో ఉన్నవాడు - అనే విభజనలతో ఉండే అధికార పరంపరలో ఒక ప్రత్యేక స్థానం కోసం తీవ్రంగా వాంఛించడమే ఆధ్యాత్మిక వికాసం అనుకుంటారు. దైనందిన ప్రాపంచిక వ్యవహారాల్లో ఇటువంటి తాపత్రయం ఉంటుందన్నది విదితమే. దాన్ని కొంతవరకు అర్థంచేసుకోవచ్చు. కాని, అదే ప్రవృత్తి, ఇటువంటి మూర్ఖప్రత్యేకతలకు తావులేని చోట కూడా తీసుకురావటం చూస్తే మన తాపత్రయాలతో, తృష్ణలతో ఎంత ప్రభావితం అయి ఉన్నాయో తెలుస్తుంది. ఈ తాపత్రయాలను అర్థం చేసుకోకుండా అహంభావం నుంచి విముక్తి పొందాలనుకోవటం వృథాయే.

"కానీ," అంటూ కొనసాగించి, ఆయన "మాకు మార్గదర్శకులూ, గురువులూ, దివ్యప్రభువులూ కావాలి కదా. మీరు వారికి అతీతులు కావచ్చు. కాని, మావంటి సాధారణమైన వాళ్లకి వారి అవసరం ఉంటుంది. లేకుంటే, దారి తప్పిన గొర్రెల్లాగ అవుతాం" అన్నాడు.

మనలోని సందిగ్ధతతోనే మనం రాజకీయనాయకులను గాని, ఆధ్యాత్మిక మార్గదర్శకులను గాని ఎంచుకుంటాం. కాబట్టి వారు కూడా సందిగ్ధంలో ఉన్నవారే. మనల్ని బతిమాలి, బుజ్జగించి, ప్రోత్సహించి, సంతృప్తి పరిచే వాళ్లనే కోరతాం మనం. అందుకే గురువుని ఎంచుకుంటాం - మనం వాంఛించిన దాన్ని మనకి ఇస్తాడని. సత్యాన్ని అన్వేషించం, సంతృప్తీ, అనుభూతీ కోరుకుంటాం. ముఖ్యంగా ఆత్మస్తుతి కోసమే గురువునీ, లేక దివ్య ప్రభువునీ సృష్టిస్తాం. మనం తప్పిపోయినట్లు సందిగ్ధంలోనూ, ఆదుర్దాలోనూ పడిపోతాం - అహం ఉండకూడదన్నప్పుడు. మీకు ప్రత్యక్షంగా, భౌతికంగా

గురువెవ్వరూ లేనట్లయితే, మీరు ఎక్కడో నిగూఢంగా మాయగా ఉన్నవాణ్ణి సృష్టిస్తారు. మొదటిరకం, అనేక రకాల భౌతిక - మానసిక ప్రభావాల మీద ఆధారపడినది. రెండోరకం స్వీయకల్పిత, స్వయం నిర్మిత ఆదర్శం. కానీ, రెండూ మీరు ఎంచుకున్నవే. ఎంచుకోవటం మీ ఇష్టం మీదా, అయిష్టం మీదా ఆధారపడి ఉంటుంది. మీ అయిష్టతకి అంతకన్న గౌరవనీయమైన, శాంతి ప్రదమైన పేరు పెట్టొచ్చు. కాని మీకున్న సందిగ్ధతలోనుంచీ, వాంఛలలో నుంచే మీరు ఎంచుకుంటారు. మీరు సంతృప్తిని కోరుతున్నట్లయితే సహజంగా మీరు కోరేదే మీకు దొరుకుతుంది. కాని, దాన్నే సత్యం అనకూడదు మనం. అనుభూతి పొందాలనీ, సంతృప్తి పొందాలనీ కోరటం అంతమైనప్పుడే సత్యం సాక్షాత్కారమవుతుంది.

"నాకు ఒక గురువు ఉండటం అవసరం లేదని మీరు నన్ను ఒప్పించలేక పోయారు' అన్నాడాయన.

సత్యం వాదించవలసిన విషయం, ఒప్పించవలసిన విషయం కాదు. అది అభిప్రాయ ఫలితం కాదు.

"కాని, దివ్యప్రభువులు దురాశనీ, ఈర్ష్యనీ జయించటంలో నాకు సహాయపడతారు" అన్నాడు మళ్లీ ఆయన.

ఇంకొకరు ఎంత గొప్పవారైనా మీలో పరివర్తన తెప్పించటంలో సహాయపడగలరా? అదే సాధ్యమయితే మీలో పరివర్తన తెచ్చినట్లు కాదు, మిమ్మల్ని అధీనంలో ఉంచి ప్రభావితం చెయ్యటమే. ఈ ప్రభావం చాలా కాలం నిలిచి ఉండొచ్చు. కాని మీరు పరివర్తన చెందినట్లు కాదు. మీరు లొంగిపోయారు. మీరు ఈర్ష్యకి లొంగినా, ఉన్నతమైనదనుకునేదాని ప్రభావానికి లోనైనా, మీరు బానిసగా ఉన్నట్లే. మీరు స్వేచ్ఛగా లేరు. మనకి బానిసత్వంలో ఉండటం ఇష్టం. ఎవరో ఒకరి అధీనంలో ఉండాలి - దివ్య గురువైనా, మరొకరైనా. ఎందుకంటే, అధీనతలో రక్షణ ఉంటుంది. గురువు ఒక ఆశ్రయం అవుతాడు. స్వాధీనం చేసుకోవటం అంటే పరాధీనమవటమే, అంతేకాని, స్వాధీనత అంటే ఈర్ష్య నుంచి విముక్తి పొందటం కాదు.

"దురాశని ప్రతిఘటించాలి నేను. దానితో పోరాడాలి. దాన్ని నాశనం

చెయ్యటానికి అన్ని ప్రయత్నాలూ చెయ్యాలి. అప్పుడే అది పోతుంది" అన్నాడాయన.

మీరు చెప్పిన దాన్ని బట్టి ఎన్నో సంవత్సరాలుగా మీకు దురాశతో సంఘర్షణ జరుగుతోంది. మీరు తగినంతగా కష్టపడి ప్రయత్నించలేదని చెప్పకండి. అది స్పష్టంగా తెలుస్తూనే ఉంది. సంఘర్షణ ద్వారా మీరేమైనా అర్థం చేసుకోగలరా? జయించటం అంటే అర్థం చేసుకోకపోవటమే. మీరు జయించిన దాన్ని మళ్లీ మళ్లీ జయించాలి. కాని, పూర్తిగా అర్థం చేసుకున్నప్పుడు అర్థం చేసుకున్న దాన్నుంచి విముక్తి లభిస్తుంది. అర్థం చేసుకోవటానికి ప్రతిఘటనా ప్రక్రియ తెలుసుకోవాలి. అర్థం చేసుకోవటం కన్న ప్రతిఘటించటం సులభం. పైగా, ప్రతిఘటించమనే మనకి బోధించారు. ప్రతిఘటించటానికి గమనించనక్కరలేదు, విచారించనక్కర్లేదు, తెలియజేయ నక్కరలేదు. ప్రతిఘటన మనస్సు యొక్క మందకొడితనాన్ని సూచిస్తుంది. ప్రతిఘటించే మనస్సు అహంభావపూరితమై ఉంటుంది. సున్నితత్వం గాని, అవగాహనగాని దానికి సాధ్యం కావు. దురాశ లేకుండా చేసుకోవటం కన్నా, ప్రతిఘటన ధోరణి గురించి తెలుసుకోవటం చాలా ముఖ్యం. నిజానికి, చెబుతున్న దాన్ని మీరు వినిపించుకోవటం లేదు. ఇన్ని సంవత్సరాలుగా మీరు చేసిన పోరాటానికీ, ప్రతిఘటనకీ ఫలితంగా మీలో పెరిగిన విశ్వాసాల గురించి ఆలోచిస్తున్నారు మీరు. మీరు ఆ విశ్వాసాలకి అంకితమై ఉన్నారు. మీ విశ్వాసాల గురించి మీరు ప్రసంగించి ఉండవచ్చు. రాసి ఉండవచ్చు. స్నేహితులను కూడ దీశారు. మీ దివ్యజ్ఞాన సంపన్నుని వలన మీరు లాభం పొందగలరని ఆశిస్తున్నారు - మీ ప్రతిఘటనలో ఆయన సహాయపడ్డాడు కనుక. అందుచేత మీ గతం అడ్డునిలిచి, ప్రస్తుతం చెబుతున్నదాన్ని విననీయటం లేదు.

"మీరు చెప్పిన దాన్ని ఒప్పుకుంటున్నాను, ఒప్పుకోవటం లేదు కూడా" అన్నాడాయన.

దాన్ని బట్టే తెలుస్తోంది మీరు వినటం లేదని. మీ విశ్వాసాలనూ, ఇప్పుడు చెబుతున్న దాన్నీ పోల్చి చూస్తున్నారు. అంటే, వినకపోవటమే. వినటానికి మీకు భయం. అందుకని మీరు సంఘర్షణలో పడ్డారు.

ఒప్పుకుంటూనే ఒప్పుకోవటం లేదు.

"మీరన్నది సరైనదే కావచ్చు. నేను ఇంతవరకు పోగుచేసినవన్నీ వదులుకోలేను - నా స్నేహితులు, నా జ్ఞానం, నా అనుభవం అవన్నీ వదులుకోవాలని నాకు తెలుసును. కాని, ఆ పనిచేయటం నా వల్లకాదు అంతే."

ఆయనలో సంఘర్షణ ఇప్పుడు మరింత ఎక్కువవుతుంది. ఉన్నదాన్ని తెలుసుకోగానే, ఎంత అయిష్టంగా ఉన్నా, మీ విశ్వాసాల కారణంగా ఎంత వద్దనుకున్నా, ప్రగాఢ వైరుధ్యం ప్రారంభమవుతుంది. ఈ వైరుధ్యం ద్వంద్వత్వం. రెండు వ్యతిరేకమైన కోరికలకు వంతెన కట్టడం కుదరదు. వంతెన కట్టినట్లయితే అది ప్రతిఘటనే, అంటే ఒకే రీతిలో ఉండటం. ఉన్నదాన్ని అవగాహన చేసుకున్నప్పుడే ఉన్నదాన్నుంచి విముక్తి లభిస్తుంది.

అదొక విచిత్రమైన యథార్థం - అనుసరించేవారు తమకు నయాన్నో, భయాన్నో మార్గదర్శనం చేయించాలని కోరుకోవటం. కఠినంగా ప్రవర్తించటం నేర్పించే ఒకరకమైన పద్ధతి అనుకుంటారు - ఆధ్యాత్మిక సిద్ధిని పొందేందుకు ఇచ్చే శిక్షణలో బాధలు పడటం, తీవ్రమైన అఘాతం పొందటం, బాధ పెట్టటంలో ఉండే సంతోషంలో ఒక భాగమే. మార్గదర్శకుడూ, అనుచరుడూ - పరస్పరం కించపరుచుకోవటం అనుభూతి పొందాలనే కోరిక మూలాన్నే. మీకు ఇంకా గొప్ప అనుభూతి కావాలి కనుక మీరు అనుసరిస్తారు. దాని కోసం ఒక మార్గదర్శినో, ఒక గురువునో సృష్టిస్తారు. ఈ కొత్త రకం సంతృప్తి కోసం కొంత త్యాగం చేస్తారు. అసౌఖ్యాన్నీ, అవమానాలనీ, నిరుత్సాహం పొందటాన్నీ సహిస్తారు. ఇదంతా ఒకరి వల్ల ఒకరు లాభం పొందటానికే. దీనికీ, నిజంగా ఉన్న స్థితికీ ఏమీ సంబంధం లేదు. ఇది ఎన్నటికీ ఆనందానికి దారి తీయదు.

## 48. ఉత్తేజం

"పర్వతాలు నాలో నిశ్శబ్దాన్ని కలిగించాయి" అందావిడ. "ఈ మధ్య ఎంగాడిన్‌కి వెళ్లాను. దాని సౌందర్యం నన్ను పూర్తిగా మౌనంగా చేసింది. ఆ అద్భుతాన్నంతా చూసి మూగదాన్నైపోయాను. అదొక బ్రహ్మాండమైన

అనుభవం. ఆ నిశ్శబ్దాన్ని - సజీవంగా స్పందించే, సంచలించే ఆ నిశ్శబ్దాన్ని అలాగే పట్టుకుని ఉండగలిగితే బాగుండుననిపించింది. మీరు చెప్పే నిశ్శబ్దం నేను పొందిన ఈ అసాధారణమైన అనుభవం లాంటిదేననుకుంటాను. నేను అనుభవం పొందిన నిశ్శబ్దానికి ఉన్న లక్షణాలున్నదేనా మీరు చెప్పేది కూడా - అన్న విషయాన్ని నిజంగా తెలుసుకోవాలని ఉంది నాకు. ఆ నిశ్శబ్దం ప్రభావం చాలాకాలం దాకా ఉంది. ఇప్పుడు, దాన్ని మళ్లీ అందుకుని దానిలోనే జీవించటానికి ప్రయత్నిస్తున్నాను.''

ఎంగాడిన్ మిమ్మల్ని నిశ్శబ్దంగా చేసింది. మరొకర్ని ఒక అందమైన మానవాకారం, వేరొకర్ని ఒక దివ్యగురువో, ఒక పుస్తకమో, తాగుడో నిశ్శబ్దంగా చేస్తుంది. బాహ్య ఉత్తేజం ద్వారా ఎవరైనా ఒక అనుభూతికి లోనవుతారు. దాన్నే నిశ్శబ్దం అంటారు. అది విపరీతమైన సంతోషాన్ని కలిగిస్తుంది. రోజూ ఉండే సమస్యల్నీ, సంఘర్షణలనీ అవతలికి తోసేసి తేలిగ్గా చేసుకోవటమే ఆ అందమూ, మాహాత్మ్యమూ యొక్క ప్రభావం. బాహ్య ఉత్తేజంతో మనస్సు తాత్కాలికంగా శాంతి నొందుతుంది. అదొక కొత్త అనుభవం, కొత్త ఉల్లాసం కావచ్చు. దాన్నింక మళ్లీ అనుభవం పొందుతూ ఉండనప్పుడు, మనస్సు దాన్నొక జ్ఞాపకంగా తలుచుకుంటుంది. పర్వతాల్లో ఉండిపోవటం సాధ్యం కాకపోవచ్చు. మళ్లీ వెళ్లి తమ పనిలో తాము చేరాలి. కాని, ఆ ప్రశాంత స్థితి మరొకరకమైన ఉత్తేజం ద్వారా, తాగుడు ద్వారా, మనిషి ద్వారా, ఊహద్వారా తిరిగి పొందటానికి ప్రయత్నించటం సాధ్యమే. అదే మనలో చాలామంది చేసేది. ఇవన్నీ వివిధ రకాలైన ఉత్తేజాలు - మనస్సుని నిశ్చలం చెయ్యటానికి సాధనాలు. అందుచేత సాధనాలు ప్రధానమవుతాయి, ముఖ్యమవుతాయి. మనం వాటికి బంధితులమవుతాం. సాధనం మనకి నిశ్శబ్దం అనే సుఖాన్నిస్తుంది. కాబట్టి అది మన జీవితంలో ఆధిపత్యం వహిస్తుంది. అదే మన ముఖ్య ఆసక్తి, మానసికావసరం. దాన్ని రక్షించుకుంటాం. దానికోసం అవసరమైతే ఒకరినొకరం నాశనం చేసుకుంటాం. సాధనం, అనుభవం స్థానంలో ఉంటుంది. అదిప్పుడు కేవలం జ్ఞాపకం మాత్రమే.

ఉత్తేజాలు అనేక విధాలుగా ఉండొచ్చును. మనిషిపై ఉన్న ప్రభావాన్ని బట్టి ప్రతిదానికీ ఒక ప్రత్యేక ప్రాధాన్యం ఉండొచ్చును. కాని, అన్ని

ఉత్తేజాల్లోనూ ఒక సామాన్య లక్షణం ఉంది - ఉన్న స్థితి నుంచీ, మన దినచర్య నుంచీ, సజీవంగా లేని సంబంధం నుంచీ, ఎప్పటికప్పుడు పాతబడే జ్ఞానం నుంచీ పారిపోవాలనే కోరిక. మీరొక మార్గం ఎంచుకుంటారు. నేనొకదాన్ని ఎంచుకుంటాను. నేను ఎంచుకున్న ప్రత్యేక రకం మీ దానికన్న ఎక్కువ లాభదాయకమని ఎప్పుడూ భావిస్తాను. కాని, తప్పించుకునే మార్గం ఏ రూపంలోనైనా - ఆదర్శమైనా, సినిమా అయినా, చర్చి అయినా - హానికరమైనదే. భ్రమకీ, ఆఘాతానికీ దారి తీస్తుంది. స్పష్టంగా కనిపించే వాటి కన్న మానసికమైన మార్గాలు మరింత హానికరమైనవి. అవి సూక్ష్మమైనవీ, క్లిష్టమైనవీ కాబట్టి కనిపెట్టటం ఎక్కువ కష్టం. ఉత్తేజం ద్వారా ఉదయింప జేసిన నిశ్శబ్దం, క్రమశిక్షణల ద్వారా, నిగ్రహాల ద్వారా, ప్రతిఘటనల ద్వారా - వ్యక్తంగా గాని, అవ్యక్తంగా గాని - సాధించిన నిశ్శబ్దం ఒక ఫలితం, ఒక ప్రభావం మాత్రమే. అందుచేత సృజనాత్మకమైనది కాదు. అది గతించిపోయినదే.

నిశ్శబ్దం అనేది - మరొకదానికి ప్రతిక్రియ కానిది, ఫలితం కానిది, ఉత్తేజం వల్లా, అనుభూతి వల్లా ఉదయించని నిశ్శబ్దం - నిర్మింపబడినదీ. నిశ్చయింపబడినదీ కాదు. అది ఆలోచనా ప్రక్రియని అర్థం చేసుకున్నప్పుడు సాక్షాత్కారమవుతుంది. ఆలోచన జ్ఞాపకానికి ప్రతిక్రియ. వ్యక్తమైనవి గాని, అవ్యక్తమైనవి గాని, నిశ్చితాభిప్రాయాలకు ప్రతిక్రియ ఆలోచన. ఈ జ్ఞాపకం సంతోషాన్ని బట్టిగాని బాధని బట్టిగాని చర్యని శాసిస్తుంది. ఆవిధంగా భావాలు చర్యపై అధికారం చెలాయిస్తాయి. అందుచేత చర్యకీ, భావానికీ మధ్య సంఘర్షణ ఏర్పడుతుంది. ఈ సంఘర్షణ ఎల్లప్పుడూ మనతోనే ఉంటుంది. అది తీవ్రమవుతున్న కొద్దీ దాన్నుంచి విముక్తి పొందాలనే తపన కలుగుతుంది. కాని, ఈ సంఘర్షణ అర్థమై పరిష్కారమయేవరకూ దాన్నుంచి విముక్తి పొందాలని ఏ ప్రయత్నం చేసినా అది తప్పించుకునే మార్గమే అవుతుంది. చర్య భావాన్ని పోలి ఉండటానికి యత్నం జరుగుతున్నంత వరకూ సంఘర్షణ అనివార్యం. చర్య, భావం నుండి విడివడినప్పుడే సంఘర్షణ అంతమవుతుంది.

"కాని చర్య ఎప్పటికైనా భావం నుంచి విడిపోగలదా? భావన లేకుండా చర్య అనేది సాధ్యం కాదు నిశ్చయంగా. చర్య భావాన్ని అనుసరిస్తుంది. భావం ఫలితంగా జరగని చర్యని నేను ఊహించలేనేమో."

భావం జ్ఞాపకానికి ఫలితం. జ్ఞాపకాన్ని మాటలలో పొందుపరచటమే భావం. భావం సమస్యనీ, జీవితాన్నీ ఎదుర్కోవటానికి సరిపోని ప్రతిక్రియ. జీవితాన్ని ఎదుర్కోవటానికి సరిపోయే ప్రతిక్రియ చర్య, అంతేకాని భావం కాదు. చర్య తీసుకోకుండా మనల్ని మనం రక్షించుకోవటానికి భావనాత్మకంగా ఎదుర్కొంటాం. భావాలు చర్యని పరిమితం చేస్తాయి. భావాల ఆవరణలో రక్షణ ఉంటుంది - చర్యలో కాదు. అందుచేత చర్యని భావానికి లొంగి ఉండేటట్లు చేయటం జరుగుతుంది. చర్య తీసుకునేందుకు ఏర్పరచుకున్న ఆత్మరక్షణ పథకమే భావం. తీవ్రమైన అవాంతరంలో చర్య సూటిగా ఉంటుంది - భావంతో సంబంధం లేకుండా. ఇలాంటి తక్షణచర్య జరగకుండానే మనస్సు తనకు తాను క్రమశిక్షణ నిచ్చుకుంటుంది. దాదాపు మనందరి లోనూ మనస్సుకి ఆధిపత్యం ఉంటుంది. భావాలు చర్యని నిగ్రహించేట్లు పనిచేస్తాయి. అందువల్లనే చర్యకీ, భావనకీ సంఘర్షణ ఉంటుంది.

"నా మనస్సు ఎంగాడిన్‌లో జరిగిన అందమైన అనుభవం వైపే పరుగులిడుతోంది. అది ఆ అనుభవాన్ని జ్ఞాపకం ద్వారా పునరుజ్జీవింప చేసుకోవటమేనా?"

నిశ్చయంగా, వాస్తవమైనది మీ ప్రస్తుత జీవితం. ఈ జనంతో కిక్కిరిసిన వీధి, మీ పని, మీ దగ్గర సంబంధాలు. ఇవి సంతోషదాయకంగానూ, సంతృప్తికరంగానూ ఉన్నట్లయితే ఎంగాడిన్ మసక మసగ్గా అయిపోతుంది. కాని, వాస్తవంగా ఉన్నది గందరగోళంగానూ, బాధాకరంగానూ ఉంది. మీరు ఎప్పుడో జరిగిన దానివైపుకి, గతించిపోయిన అనుభవం వైపుకి మళ్లుతున్నారు. కాని, అది అంతమైపోయింది. జ్ఞాపకం ద్వారా మాత్రమే దానికి ప్రాణం పోస్తున్నారు - చచ్చిపోయిన దాంట్లో ప్రాణం దూర్చటానికి ప్రయత్నిస్తున్నట్లు. ప్రస్తుతం ఉన్నది అనాసక్తికరంగా వెలితిగా ఉండటంతో, గతం వైపుకో, స్వయం కల్పితమైన భవిష్యత్తు వైపుకో మళ్లుతాం. ప్రస్తుతం నుంచి ఇలా పారిపోవటం భ్రమకి దారితీయక తప్పదు. ప్రస్తుతాన్ని ఉన్నదున్నట్లు ఖండన లేకుండా సమర్థన లేకుండా చూడటం ఉన్నదాన్ని అవగాహన చేసుకోవటమే. అప్పుడే చర్య సంభవమవుతుంది. అటువంటి చర్య ఉన్న స్థితిలో పరివర్తన తెస్తుంది.

# 49. సమస్యలు - తప్పించుకునే మార్గాలు

"నాకెన్నో తీవ్ర సమస్యలున్నాయి. వాటిని పరిష్కరించటానికి ప్రయత్నించి, అవి మరింత క్లిష్టంగా బాధాకరంగా అయేటట్లు చేశానేమో అనిపిస్తోంది. నాకు మతిపోతోంది. ఏం చెయ్యాలో తోచటం లేదు. వీటన్నిటికీ తోడు నాకు వినిపించదు. వినిపించటానికి చెవిలో పెట్టుకునే పీడ - ఇదొకటి నాకు. నాకు బోలెడు మంది పిల్లలు. నా భర్త నన్నొదిలేశాడు. నా పిల్లల గురించే నాకు బాధ. నేను పడిన దురవస్థలన్నీ వాళ్లు తప్పించుకోవాలని నా. కోరిక."

మన సమస్యలకి పరిష్కారం కనిపెట్టాలని ఎంత ఆదుర్దా మనకి! పరిష్కారం కనిపెట్టాలని ఎంత ఆత్రుత పడతామంటే, సమస్యని పరిశీలించనే లేము. సమస్యని ప్రశాంతంగా గమనించనివ్వదు. సమస్యే ముఖ్య విషయం - పరిష్కారం కాదు. పరిష్కారం కోసం వెతికితే దొరుకుతుంది. కానీ, సమస్య అలాగే కొనసాగుతుంది. ఎందుకంటే ఆ పరిష్కారానికి సమస్యతో సంబంధం లేదు. మన అన్వేషణ సమస్యను తప్పించుకునే మార్గంకోసం. పరిష్కారం పైపైన వాడే మందే. అంచేత సమస్యని అవగాహన చేసుకోవటం అవదు. అన్ని సమస్యలకీ ఒక్కటే మూలం. ఆ మూలాన్ని అర్థం చేసుకోకుండా సమస్యని పరిష్కరించటానికి ఏ ప్రయత్నం చేసినా అది మరింత గందరగోళానికీ, దుస్థితికీ కారణమవుతుంది. సమస్యని అర్థం చేసుకోవాలనే ఉద్దేశం గంభీరమైనదనీ, అన్ని సమస్యల నుంచీ విముక్తి పొందవలసిన అవసరం ఉన్నదనీ ముందుగా స్పష్టమవాలి. అప్పుడే సమస్యల్ని సృష్టించిన దాన్ని సమీపించవచ్చు. సమస్యలనుంచి విముక్తి కలగకుండా ప్రశాంతంగా ఉండటం సాధ్యం కాదు. ప్రశాంతత ఆనందానికి అత్యవసరం. కాని, ఆనందం లక్ష్యం కాదు. గాలి ఆగిపోయినప్పుడు సరస్సు నిశ్చలంగా ఉన్నట్లు సమస్యలు పోగానే మనస్సు కూడా నిశ్చలమవుతుంది. కాని, మనస్సుని నిశ్చలంగా చెయ్యలేము. అలా అయితే అది చచ్చిపోయినట్లే. అది చలనంలేని నీటి మడుగు. ఇది స్పష్టమైనప్పుడు సమస్యల్ని సృష్టించే దాన్ని గమనించవచ్చు. ఈ గమనించటం నిశ్శబ్దంగా జరగాలి - సుఖదుఃఖాలను బట్టి ముందుగానే నిర్ణయించుకున్న పథకం ప్రకారం కాదు.

"కాని, మీరు అసంభవమైన దాన్ని అడుగుతున్నారు! మన విద్యాభ్యాసం మన మనస్సుకి విచక్షణ చేయగలిగేలా, పోల్చేలా, నిర్ణయించేలా, ఎంచుకునేలా నేర్పుతుంది. దేన్నైనా గమనించినప్పుడు ఖండించకుండానో, సమర్థించకుండానో ఉండటం చాలా కష్టం. ఈ ప్రభావం నుంచి తప్పించుకుని నిశ్శబ్దంగా గమనించటం ఎలా?"

నిశ్శబ్దంగా గమనించటం, ఇష్టాయిష్టాలు లేకుండా తెలుసుకోవటం అవగాహనకి ముఖ్యావసరమని మీరు గ్రహించినట్లయితే మీరు గ్రహించిన దానిలోని సత్యం మిమ్మల్ని మీగతం నుంచి విముక్తి చేస్తుంది. అనాసక్తంగా, చురుకుగా తెలుసుకోవటం తక్షణం అవసరం అని మీరు గ్రహించనప్పుడే "ఎలా" అనే ప్రశ్న, మీ గతాన్ని రూపుమాపే మార్గం కోసం ప్రయత్నం బయలు దేరతాయి. సత్యమే విముక్తి కలిగిస్తుంది - సాధనమూ, పద్ధతీ కాదు. నిశ్శబ్దంగా గమనించటం వల్లనే అవగాహన కలుగుతుందనే సత్యాన్ని గ్రహించాలి. అప్పుడే ఖండన నుంచీ, సమర్థన నుంచీ మీకు విముక్తి కలుగుతుంది. మీరు ప్రమాదాన్ని చూడగానే దాన్ని తప్పించుకోవటం ఎలా అని మీరు అడగరు. ఇష్టాయిష్టాలు లేకుండా తెలుసుకునే అవసరాన్ని మీరు గ్రహించటం లేదు కనుకనే మీరు "ఎలా" అని అడుగుతున్నారు. దాని అవసరాన్ని మీరు ఎందుకు గ్రహించరు?

"నాకు గ్రహించాలనే ఉంది. కాని, ఈ విధంగా నేనిదివరకెన్నడూ ఆలోచించలేదు. నేను చెప్పగలిగిందల్లా నా సమస్యల్ని వదిలించుకోవాలని కోరుతున్నాను. అవి నన్ను చిత్రవధ చేస్తున్నాయి. నాకు హాయిగా ఉండాలని ఉంది అందరి మాదిరిగా."

అనాసక్తంగా ఉంటూ, నిశ్చలంగా ఉంటూ తెలుసుకోవాలనే ముఖ్యావసరాన్ని గ్రహించటానికి అంగీకరించం - వ్యక్తంగా గాని, అవ్యక్తంగా గాని - నిజంగా మనం ఆ సమస్యల్ని దూరం చేసుకోవాలని కోరటం లేదు కనుక. అవి లేకపోతే మనం ఎలా ఉంటాం? మనకి తెలిసిన దాన్ని పట్టుకుని ఎలాగో వ్రేలాడతాం - అదెంత బాధాకరమైనదైనాసరే. అంతేకాని, మనల్ని ఎక్కడికి తీసుకుపోతోందో తెలియని కొత్తదాన్ని ప్రయత్నించటానికి సాహసించం. సమస్యలు ఎంతైనా, మనకి పరిచితమైనవి. కాని, వాటిని

సృష్టించిన దాన్ని గురించిన ఆలోచన - అది మనల్ని ఎక్కడికి తీసుకుపోతుందో తెలియక భయాన్నీ, మందకొడితనాన్నీ కలుగజేస్తుంది. సమస్యల గురించి ఆదుర్దా లేకపోతే మతిపోయినట్లుంటుంది. మనస్సు వాటివల్లనే బ్రతుకుతోంది. అవి ప్రపంచ సమస్యలైనా, వంటింటి సమస్యలైనా, రాజకీయాలైనా, వ్యక్తిగత వ్యవహారాలైనా, మతానికి సంబంధించినవైనా, సిద్ధాంతానికి సంబంధించినవైనా. అందువల్ల మన సమస్యలే మనల్ని అల్పంగా, సంకుచితంగా ఉండేట్లు చేస్తాయి. ప్రపంచ సమస్యల గురించి బాధపడే మనస్సు ఎంత అల్పమైనదో, ఆధ్యాత్మిక వికాసం పొందటం విషయంలో బాధలు పడుతున్న మనస్సూ అంతే అల్పమైనది. సమస్యల వల్ల భయంతో మనస్సు బరువెక్కిపోతుంది. ఎందుచేతనంటే, సమస్యలు అహానికి, - "నేను" అనేదానికి, "నా" అనేదానికి శక్తినిస్తాయి. సమస్యలు లేకుండా జయాపజయాలు లేకుండా ఉంటే "నేను" అన్నది లేదు.

"కానీ "నేను" అన్నది లేకుండా ఎవరైనా ఎలా బ్రతకగలరు? చర్య అంతటికీ మూలం అదేకదా."

కోరిక, జ్ఞాపకం, సుఖదుఃఖాలంటే భయం - వీటి ఫలితంగా చర్య జరిగినంతకాలం అది సంఘర్షణనీ, గందరగోళాన్నీ, వైరుధ్యాన్నీ పెంపొందించి తీరుతుంది. మన చర్య మనం పొందిన ప్రభావాన్ని బట్టి ఉంటుంది - ఏ స్థాయిలోనైనా. క్లిష్టపరిస్థితిని ఎదుర్కొన్నప్పుడు మన ప్రతిక్రియ అసంతుష్టికరంగా, అసంపూర్ణంగా ఉంటుంది. కాబట్టి సంఘర్షణ బయలుదేరి తీరాలి - అదే సమస్య. అహం స్వరూపంలోనే సంఘర్షణ ఉంది. సంఘర్షణ లేకుండా, దురాశ, భయం, విజయం - వీటి సంఘర్షణ లేకుండా జీవించటానికి పూర్తిగా అవకాశం ఉంది. కాని, ప్రత్యక్షానుభవం ద్వారా కనుక్కునే వరకూ ఈ అవకాశం కేవలం సిద్ధాంతరూపంలోనే ఉంటుంది - వాస్తవంగా కాదు. అహం రీతుల్ని అర్థం చేసుకున్నప్పుడే దురాశ లేకుండా బ్రతకటం సాధ్యమవుతుంది.

"నా చెవుడు నా భయాలవల్లనూ, అణచి పెట్టిన అనుభూతుల వల్లనూ అంటారా? చెవి నిర్మాణంలో ఏ విధమైన లోపమూలేదని డాక్టర్లు నమ్మకంగా చెప్పారు. నేను మళ్లీ వినగలిగే అవకాశం ఉంటుందంటారా? నా జీవిత

మంతా ఏదో ఒక విధంగా అణగద్రొక్కబడే ఉన్నాను. నేను కావాలనుకున్నది ఒక్కటీ చెయ్యలేక పోయాను."

అంతర్గతంగానూ, బాహ్యంగానూ వాటిని అర్థం చేసుకోవటం కన్న అణచిపెట్టటం తేలిక. అర్థం చేసుకోవటం శ్రమతో కూడినది - ముఖ్యంగా చిన్నతనం నుంచీ ప్రభావితం అయినవారికి. కష్టమనిపించినా, అణచిపెట్టటం అలవాటయిపోతుంది. అవగాహన చేసుకోవటాన్ని అలవాటు చేసుకోవటం ఎన్నటికీ సాధ్యం కాదు. అది దినచర్య కాజాలదు. దానికి నిత్యం జాగరూకతతో గమనించటం, చురుకుగా ఉండటం అవసరం. అర్థం చేసుకోవటానికి మృదుత్వం, సున్నితత్వం, ఆప్యాయతా ఉండాలి. ఆవేశంతో కూడిన అనురాగం కాదు. అణచిపెట్టటానికి చురుకుగా తెలుసుకోవలసిన అవసరం లేదు. ప్రతిక్రియలతో వ్యవహరించేందుకు ఆ మార్గం అన్నిటికన్నా సులభమైనదీ, తెలివి తక్కువదీ. అణచిపెట్టటం అంటే ఒక అభిప్రాయానికీ, ఒక పద్ధతికీ అనుగుణంగా ఉండటం. అది పైపైకి రక్షణ, గౌరవం కలుగజేస్తుంది. అవగాహన విముక్తిని కలుగజేస్తుంది. కాని అణచిపెట్టటం ఎప్పుడూ సంకుచితంగా స్వార్థపూరితంగా చేస్తుంది. అధికారమన్నా, రక్షణ లేక పోవటమన్నా, సంఘమన్నా ఉండే భయం సిద్ధాంతపరమైన ఆశ్రయాన్ని సృష్టిస్తుంది. దాని భౌతిక స్థితి వైపుకి మనస్సు మళ్లుతుంది. ఈ ఆశ్రయం, ఏ స్థాయిలో ఉన్నా, ఎప్పటికీ భయాన్ని పోషిస్తూనే ఉంటుంది. ఆ భయం నుంచే ప్రత్యామ్నాయం వెతకటం, పవిత్రతని ఆపాదించటం, క్రమశిక్షణా మొదలైన అణచిపెట్టే పద్ధతులు వస్తాయి. అణచిపెట్టబడినది బయటకొచ్చే మార్గం ఏదో చూసుకోవాలి - అది శారీరక రుగ్మత కావచ్చు, సిద్ధాంత సంబంధమైన భ్రమకావచ్చు. ఎవరి ప్రవృత్తినీ, విపరీత ప్రవర్తనలనూ బట్టివారు అనుభవించ వలసివస్తుంది.

"నేను గమనించాను - ఎప్పుడైనా నాకిష్టం లేనిది వినదలుచు కోనప్పుడు ఈ సాధనమే నాకు ఆశ్రయమవుతుంది. నేను నా ప్రపంచంలోకి పారిపోయేందుకు సహాయపడుతుందది. కాని, సంవత్సరాల తరబడి అణచిపెట్టిన వాటి నుంచి ఎలా విముక్తి పొందటం? దానికి ఎంతో సమయం పట్టదా?"

సమయం ప్రశ్న కాదది. గతాన్ని పెకిలించటమూ, జాగ్రత్తగా పరికించటమూ - అణచిపెట్టబడింది అనే సత్యాన్ని దర్శించటమే. ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా అనాసక్తంగా తెలుసుకోవటం జరిగినట్లయితే, మొత్తం అణచిపెట్టటం అనే ప్రక్రియని - ఆ సత్యాన్ని తక్షణం గ్రహించటం జరుగుతుంది. నిన్న, రేపు - అనే సందర్భంలో ఆలోచిస్తూ ఉంటే అణచిపెట్టటం అనే సత్యాన్ని కనుక్కోవటం సాధ్యం కాదు. సమయం గడుస్తున్న కొద్దీ అవగతమయేది కాదు సత్యం. సాధించి పొందగలిగేది కాదు సత్యం. దాన్ని గ్రహించాలి, లేదా గ్రహించకుండా ఉండాలి. దాన్ని క్రమంగా గ్రహించటానికి వీలవదు. అణచివేత నుంచి విముక్తి పొందాలన్న ఇచ్ఛ దాని గురించిన సత్యాన్ని తెలుసుకోవటంలో అవరోధమవుతుంది. 'ఇచ్ఛే, కోరిక - వ్యక్తమైనదైనా అవ్యక్తమైనదైనా, కోరిక ఉన్నప్పుడు అనాసక్తంగా గమనించడం ఉండదు. కోరిక, లేదా తాపత్రయం వల్లనే అణచివేత సంభవిస్తుంది. ఈ కోరికనే ఇప్పుడు ఇచ్ఛ అంటున్నా, తన సృష్టి నుంచి తాను విముక్తి పొందలేదు. మళ్లీ, ఇచ్ఛ అనే సత్యాన్ని కూడా అనాసక్తంగా చురుకుగా తెలుసుకొంటూ గ్రహించాలి. పరిశీలకుడు పరిశీలించే దాన్నుంచి తన్ను తాను వేరు చేసుకున్నా, దానిలోని భాగమే అతడు కూడా. పరిశీలించే దానివల్ల ప్రభావితుడైన వాడు కాబట్టి దాన్నుంచి విముక్తి పొందలేడు. ఈ సత్యాన్ని కూడా గ్రహించాలి. సత్యమే విముక్తి కలిగిస్తుంది. అంతేకాని, ఇచ్ఛా, ప్రయత్నమూ కాదు.

## 50. ఉన్నది, ఉండవలసిది

"నాకు వివాహం అయింది. పిల్లలున్నారు." అని చెప్పిందావిడ. "కాని, నాలోని ప్రేమ అంతా పోయింది. నేను క్రమంగా ఎండిపోతున్నాను. ఏదో కాలక్షేపం క్రింద సాంఘిక కార్యకలాపాల్లో పాల్గొంటున్నప్పటికీ, అవి ఎంత వ్యర్థమో గ్రహించాను. నాకు ప్రగాఢంగా, సంపూర్ణంగా ఆసక్తి కలిగించేదేదీ లేదనిపిస్తోంది. ఈ మధ్య ఇంటిపనుల నుంచీ, సాంఘిక కార్యకలాపాల నుంచీ చాలాకాలంపాటు సెలవు తీసుకుని చిత్రలేఖనం ప్రయత్నించాను. కాని నా మనస్సు అందులోనూ లేదు. పూర్తిగా చచ్చిపోయినట్లూ సృజనాత్మకత

లేనట్లూ నిస్పృహగా అసంతృప్తిగా అనిపిస్తోంది. నేనింకా వయస్సులో ఉన్నదాన్నే. కాని, భవిష్యత్తంతా చీకటి నిండినట్లుగా ఉంది. ఆత్మహత్య చేసుకుందామనుకున్నాను. కాని, అది ఎంత తెలివి తక్కువతనమో గ్రహించాను. నాకు అంతకంతకు అయోమయంగా ఉంటోంది. నా అసంతృప్తికి అంతం లేదనిపిస్తోంది."

దేన్ని గురించి మీకు అయోమయంగా ఉన్నట్లుంది? మీ సమస్య మీ సంబంధ బాంధవ్యాల గురించా?

"అబ్బే, అదికాదు, అవన్నీ అయిపోయాయి. ఎలాగో చచ్చిచెడి బయట పడ్డాను. కాని నాకు మతిపోతోంది. ఏదీ నాకు సంతృప్తి నివ్వటం లేదు."

మీకేదైనా ప్రత్యేక సమస్య ఉందా, లేక అన్ని విధాలా అసంతృప్తికరంగా ఉన్నట్లు ఊరికే అనిపిస్తోందా? ఎక్కడో లోలోపల ఆదుర్దా, భయం ఉండి ఉండాలి. అది మీరు తెలుసుకోవటం లేదేమో. అదేమిటో తెలుసుకోవాలని కోరుతున్నారా?

"అవును. అందుకే మీ వద్దకు వచ్చాను. ఇప్పుడున్నట్లు ఇదే విధంగా ఇంక ఉండలేను. ఏదీ ముఖ్యమనిపించటం లేదు. తరుచు అస్వస్థతగా ఉంటోంది."

మీ అస్వస్థత మీ పరిస్థితుల నుంచి మీరు తప్పించుకునేందుకు మార్గం కావచ్చు.

"అదే అని నా నమ్మకం. కాని నేనేం చెయ్యాలి? నాకు నిజంగానే దారీ తెన్నూ తోచటం లేదు. నేను ఇక్కణ్ణించి వెళ్లేముందు దీన్నుంచి తప్పించుకునే మార్గాన్ని తెలుసుకుని తీరాలి."

సంఘర్షణ రెండు వాస్తవాల మధ్యగాని, వాస్తవమైనదానికీ, ఊహ జనితమైన దానికీ మధ్యగాని ఉన్నదా? మీ అసంతుష్టి కేవలం అసంతృప్తి మాత్రమేనా? అసంతృప్తి అయితే సులభంగానే తృప్తి కలిగించవచ్చు. లేక, నిష్కారణంగా దుఃఖపడటమా? అసంతృప్తి త్వరలోనే ఏదో మార్గం వెతుక్కుంటుంది తృప్తి పొందటానికి. ఆ అసంతృప్తిని త్వరలో ఒక మార్గాన పెట్టవచ్చు. కాని, అసంతుష్టిని ఆలోచన ద్వారా ఉపశమనం కలిగించటానికి

కుదరదు. ఈ అసంతుష్టి అనేది సంతృప్తి కలగలేదని తెలుసుకోవటం వల్ల ఏర్పడినదా? తృప్తి కలిగినట్లయితే మీ అసంతుష్టి మాయమవుతుందా? ఒక విధమైన శాశ్వతమైన సంతృప్తికోసం ప్రయత్నిస్తున్నారా నిజానికి?

"లేదు. అది కాదు. నేను ఏ విధమైన తృప్తికోసం ప్రయత్నించటం లేదు. అధమం, అలా చేస్తున్నానని అనుకోను నేను. నాకు తెలిసిందల్లా అయోమయంలో, సంఘర్షణలో ఉన్నాననీ, దాంట్లోంచి బయట పడే మార్గం కనిపించటం లేదనీ."

మీరు సంఘర్షణలో ఉన్నారని మీరంటున్నారంటే, అది దేనికో సంబంధించి ఉండే ఉంటుంది. మీ భర్తతో కానీ, లేదా పిల్లలతో కానీ, లేదా మీ కార్యకలాపాలతో కానీ సంబంధం ఉన్నదై ఉంటుంది. మీ సంఘర్షణ ఈ రకమైనదేదీ కాదని అన్నట్లయితే మీ సంఘర్షణ మీరున్న స్థితికీ, మీరు కోరుకుంటున్న స్థితికీ మధ్య సంఘర్షణ అయి ఉండాలి. వాస్తవానికీ, ఆదర్శానికీ మధ్యా, ఉన్నదానికీ ఉండవలసినది అనే కల్పనకీ మధ్యా సంఘర్షణ. మీరు ఎలా ఉండాలనుకుంటున్నారో మీకో అభిప్రాయం ఉంది. ఈ స్వయంకల్పితమైన పద్ధతి ప్రకారం ఉండాలన్న కోరికవల్లనే సంఘర్షణా, అయోమయ స్థితీ ఏర్పడి ఉండవచ్చు. మీరున్నట్లుగా కాకుండా ఇంకెలాగో ఉండాలని మీరు గిలగిల్లాడుతున్నారు, అంతేనా?

"నేను ఎందువల్ల అయోమయంగా ఉన్నానో నేనిప్పుడే గ్రహించ గలుగుతున్నాను. మీరన్నది నిజమే అనుకుంటాను."

సంఘర్షణ వాస్తవంగా ఉన్నదానికీ కల్పనకీ మధ్య, మీరు ఉన్న స్థితికీ ఫలానాలా ఉంటే బాగుండునని మీరు అనుకునే స్థితికీ మధ్య వస్తుంది. కల్పిత రూపం చిన్నతనం నుంచీ పెంచుతారు. క్రమంగా విస్తృతమై, లోతుగా పాతుకుని వాస్తవికంగా ఉన్నదానికి విరుద్ధంగా పెరుగుతూ ఉంటుంది. అన్ని ఆదర్శాలూ, లక్ష్యాలూ ఊహా లోకాల మాదిరిగానే ఈ కల్పన స్పష్టంగా ఉన్నదానికీ, వాస్తవంగా ఉన్నదానికీ విరుద్ధంగా ఉంటుంది. అందుచేత మీరు ఉన్న స్థితి నుంచి తప్పించుకునేందుకు మార్గమే కల్పన. ఈ తప్పించుకునే మార్గం పరస్పరం వ్యతిరేకంగా ఉన్నవాటి మధ్య నిష్ప్రయోజన కరమైన సంఘర్షణని సృష్టిస్తుంది. అన్ని రకాల సంఘర్షణా - అంతరంగికంగా గాని,

బహిరంగంగా గాని వృథా, వ్యర్థం, తెలివితక్కువ. గందరగోళాన్నీ, వైరుధ్యాన్నీ సృష్టిస్తుంది.

అందువల్ల, నేను చెప్పేదేమంటే, మీ అయోమయం, మీరున్న స్థితికీ, మీరుండాలనుకున్న ఊహకీ మధ్య సంఘర్షణ వల్ల మొదలైంది. కల్పన, ఆదర్శం అసత్యమైనవి. తప్పించుకోవటానికి స్వయంగా కల్పించుకున్న మార్గం అది. దానిలో వాస్తవికత లేదు. వాస్తవమైనది మీరు ఉన్న స్థితి. మీరు ఎలా ఉండాలో అన్నదానికన్న మీరు ఉన్నస్థితి ఎంతో ఎక్కువ ముఖ్యం. ఉన్నదాన్ని మీరు అర్థం చేసుకోగలరు. ఎలా ఉండాలో అనే స్థితిని అవగాహన చేసుకోలేరు. భ్రమ అర్థంకాదు. అది ఎలా బయలుదేరుతుందో మాత్రం అర్థమవుతుంది. కల్పన, ఊహజనితమైనది, ఆదర్శం - దేనిలోనూ నిజం లేదు. అదొక ఫలితం, ఒక గమ్యం. ముఖ్యమైనదేమిటంటే, అది ఏవిధంగా వచ్చిందో అర్థం చేసుకోవటం.

మీరున్న స్థితిని, అది సంతోషకరమైనదైనా, సంతోషకరం కానిదైనా, దాన్ని అవగాహన చేసుకోవటానికి కల్పనా, ఆదర్శప్రాయమైన స్వయం కల్పిత స్థితీ పూర్తిగా అంతమొందాలి. అప్పుడే ఉన్న స్థితితో వ్యవహరించగలుగుతారు. ఉన్నదాన్ని అర్థం చేసుకోవటానికి ఏవిధమైన ఇతర ఆకర్షణ లేమీ లేకుండా స్వేచ్ఛగా ఉండాలి. మరో ఆకర్షణ ఉంటే ఉన్నదాన్ని ఖండించటమో, సమర్థించటమో జరుగుతుంది. మరో ఆకర్షణ ఉంటే పోల్చిచూడట మవుతుంది. వాస్తవంగా ఉన్నదాన్ని ప్రతిఘటించటంగాని, క్రమశిక్షణలో పెట్టటంగాని జరుగుతుంది. మరో ఆకర్షణ ఉంటే, అర్థం చేసుకోవటానికి పెద్ద ప్రయత్నం, బలవంతం చెయ్యవలసి ఉంటుంది. ఉన్నదాన్ని అర్థం చేసుకోవటానికి తక్షణం ఉద్యమించేందుకు ఇతర ఆకర్షణలు అవరోధా లవుతాయి. ఉన్న స్థితి స్థిరమైనది కాదు. అది క్షణక్షణం జరుగుతూ ఉంటుంది. దాన్ని అనుసరించటానికి మనస్సు ఏవిధమైన నమ్మకానికి గాని, జయం కలుగుతుందనే ఆశకిగాని, భగ్నమవుతుందనే భయానికి గానీ కట్టుపడి ఉండకూడదు. అనాసక్తంగా చురుకుగా తెలుసుకుంటూ ఉన్నప్పుడే ఉన్నది ఆవిష్కృతమవుతుంది. ఆవిష్కృతం కావటం సమయానికి సంబంధించి ఉండదు.

# 51. వైరుధ్యం

ఆయన బాగా పేరు పొందిన, బాగా నిలదొక్కుకున్న రాజకీయవేత్త. కొంత అహంకారం ఉన్నవాడు. అందువల్ల ఆయనకి అసహనం. ఉన్నత విద్య పొందినవాడు. ఆయన బాగా విచారించి, అతిమెల్లిగా వ్యక్తం చేస్తున్నాడు తన అభిప్రాయాలు. సూక్ష్మంగా సూచించటం ఆయనకి చేతకాదు. ఎందుకంటే ఆయనకి ఇతరులను మెప్పించే అలవాటుంది. ఆయనే ప్రజలు, ప్రభుత్వం, అధికారం. ఆయన ధారాళంగా ప్రసంగించగలడు. ధారాళంగా మాట్లాడటమే ఒక దురదృష్టం. ఆయన్ని ఎవ్వరూ అక్రమ పద్ధతిలోకి లాగలేరు. అందువల్లనే ప్రజల మీద ఆయన కంత ప్రభావం. ఆ గదిలో కూర్చోవటానికి ఆయనకి ఒక విధంగా అసౌకర్యంగా ఉంది. రాజకీయవేత్త ఎక్కడో దూరాన ఉన్నాడు. మనిషి ఇక్కడున్నాడు, మనఃకల్లోలంతో తన్ను తాను తెలుసుకుంటూ. ఆ దర్పం, దృఢవిశ్వాసం పోయాయి. తెలుసుకోవాలనే ఆదుర్దా, యోచనా, ఆత్మవివరణా ఉన్నాయి.

అపరాహ్ణపుటెండ, కిటికీ లోంచి వస్తోంది. అలాగే వీధిలో చప్పుళ్లు కూడా. పచ్చని కాంతి పుంజాల్లాటి చిలకలు రోజంతా బయటికి తిరగటం పూర్తి అయాక రాత్రికి పట్నంలో దారి పక్కల్నీ, తోటల్లోనూ ఉన్న పెద్ద చెట్ల మధ్య తలదాచుకోవటానికి తిరిగి వస్తున్నాయి. ఎగురుతూ, ఆ చిలకలు భీకరంగా కీచుమంటూ అరుస్తున్నాయి. ఒక వరుసలో తిన్నగా ఎగరవు - పడుతూ, లేస్తూ, పక్కలికి తిరుగుతూ, ఎగురుతున్నంత సేపూ గొడవగా కేకలేస్తూ ఉంటాయి. వాటి ఎగరటం తీరూ, వాటికేకలూ వాటి అందానికి విరుద్ధంగా ఉంది. దూరంగా సముద్రం మీద ఒకే ఒక్క ఓడ, తెల్లని తెరచాపతో ఉంది. గది చిన్న జనసమూహంతో నిండి ఉంది - వివిధ రకాల ఆలోచనల వైరుధ్యంతో. ఒక కుక్కపిల్ల లోపలికి వచ్చి ఇటూ అటూ చూసి వెళ్లిపోయింది, ఎవరూ గమనించకుండా. గుడిలో గంట మోగుతోంది.

"మన జీవితంలో వైరుధ్యం ఎందుకుంటుంది?" అని అడిగాడాయన. "మనం శాంతి, అహింస అనే ఆదర్శాల గురించి మాట్లాడుతూ ఉంటాం, కాని యుద్ధానికి పునాది వేస్తూ ఉంటాం. మనం యథార్థవాదులుగా

కావాలి గాని స్వాప్నికులుగా కాదు. మనకి శాంతి కావాలి. అయినా, దైనందిన కార్యకలాపాలు యుద్ధానికి దారితీస్తాయి. మనకి కాంతి కావాలి. అయినా మనం కిటికీ మూసేస్తాం. మన ఆలోచనా విధానమే వైరుధ్యం - కావాలి, వద్దు. ఈ వైరుధ్యం మన ప్రకృతి సిద్ధమే కావచ్చు. అందువల్ల దాన్ని ఐక్యం చేసి మొత్తం ఒకేలా చేయటానికి ప్రయత్నించటం వృథాయే అనిపిస్తుంది. ప్రేమ, ద్వేషం ఎప్పుడూ ఒకేచోట ఉన్నట్లు తోస్తుంది. ఈ వైరుధ్యం ఎందుకుంది? ఇది అనివార్యమా? దాన్ని తప్పించుకోవటానికి వీలుందా? నేటి ప్రభుత్వం శాంతి కోసమే ఉండటానికి వీలవుతుందా? అది ఒకేలా ఉండటానికి వీలవుతుందా? అదీ శాంతికోసం పని చెయ్యాలి, అయినా యుద్ధం కోసం సంసిద్ధం కావాలి. శాంతి అనే లక్ష్యాన్ని యుద్ధ సంసిద్ధతతో చేరుకోవాలి".

మనం ఒక నిశ్చితమైన లక్ష్యాన్నీ ఆదర్శాన్నీ ఎందుకు పెట్టుకుంటాం? దాన్నుంచి వైరుధ్యాన్ని ఎందుకు సృష్టిస్తాం? ఒక నిశ్చితాంశం, ఒక నిశ్చితాభి ప్రాయం లేనట్లయితే వైరుధ్యమే ఉండదు. మనం స్థిరమైన లక్ష్యాన్ని ఏర్పాటు చేసి, దానికి దూరంగా తిరుగుతూ ఉంటాం. దాన్నే వైరుధ్యం అంటున్నాం. ఒక నిశ్చితాభిప్రాయానికి అనేక వక్రమార్గాల ద్వారా, వివిధ స్థాయిల్లో చేరుకుంటాం. అటుపైన ఆ నిశ్చితాభిప్రాయానికీ, ఆదర్శానికీ అనుగుణంగా జీవించటానికి ప్రయత్నిస్తాం. అలా చెయ్యలేం కనుక ఒక వైరుధ్యం సృష్టింప బడుతుంది. ఇక, ఒకవైపున ఆ నిశ్చిత లక్ష్యానికీ, ఆదర్శానికీ, నిశ్చితాభి ప్రాయానికీ, ఆలోచనకీ, మరోవైపున చర్యకీ వంతెన కట్టటానికి ప్రయత్నిస్తాం. ఈ వంతెన కట్టడాన్ని ఒకే రీతిలో ఉండటం అంటున్నాం. ఆ విధంగా ఒకే రీతిలో ఉన్నవాణ్ణి, తన నిశ్చితాభిప్రాయానికీ, తన ఆదర్శానికీ కట్టుబడి ఉన్నవాణ్ణి ఎంత మెచ్చుకుంటాం? అటువంటి మనిషిని మహాత్ముడు అంటాం. కాని, పిచ్చివాళ్లు కూడా ఒకే రీతిలో ఉంటారు. వారి నిశ్చితాభి ప్రాయాలకి వాళ్లూ కట్టుబడి ఉంటారు. తన్ను తాను నెపోలియన్ అనుకునే వాడిలో వైరుధ్యం ఉండదు. అతను తన నిశ్చితాభిప్రాయంలో మూర్తీ-భవిస్తాడు. తన ఆదర్శంతో తన్ను తాను ఐక్యం చేసుకున్న వాడు స్పష్టంగా మతి స్తిమితం లేని వాడే.

ఆదర్శం అని మనం పిలిచే ఆ నిశ్చితాభిప్రాయం ఏ స్థాయిలోనైనా

ఏర్పడవచ్చు - వ్యక్తంగా కావచ్చు, అవ్యక్తంగా కావచ్చు. ఒకసారి ఏర్పరచుకున్న తరవాత మన చర్యని దాని సమీపానికి తీసుకురావటానికి ప్రయత్నిస్తాం. అదే వైరుధ్యాన్ని సృష్టిస్తుంది. ఏర్పరచుకున్న విధానానికీ, ఆదర్శానికీ అనుగుణంగా ఒకే రీతిలో వర్తించటం అన్నది ముఖ్యం కాదు. అసలు ఆ నిశ్చిత లక్ష్యాన్ని ఎందుకు పోషిస్తున్నామని కనుక్కోవటం ముఖ్యం. ఎందుకంటే, ఆ విధానం లేకపోతే వైరుధ్యమే ఉండదు కనుక. అంచేత మనకి ఆదర్శం, నిశ్చితాభిప్రాయం ఉండటం ఎందుకు? ఆదర్శం చర్యకి ప్రతిబంధకం కాదా? చర్యని మార్చటానికీ, అదుపులో పెట్టటానికీ కదా ఆదర్శం బయలుదేరినది? ఆదర్శం లేకుండా వ్యవహరించటం సాధ్యం కాదా? ఆదర్శం గతానికీ, ప్రభావితమవటానికీ ప్రతిక్రియ. అందువల్ల మనిషిని సంఘర్షణనుంచీ, గందరగోళం నుంచీ అది ఎన్నటికీ విముక్తి కలిగించలేదు. ఆదర్శం, నిశ్చితాభిప్రాయం మనిషికీ మనిషికీ మధ్య విభేదం ఎక్కువ చేసి త్వరలో నాశనం అయేందుకు దోహదం చేస్తుంది.

నిశ్చిత లక్ష్యం ఏదీ లేనట్లయితే, ఆదర్శం లేనట్లయితే, పెడమార్గం పట్టే అవకాశం గాని, వైరుధ్యం గాని ఉండదు. ఒకే రీతిలో ఉండాలనే తపన ఉండదు. అప్పుడిక క్షణక్షణమూ చర్యే ఉంటుంది. ఆ చర్య ఎప్పుడూ సంపూర్ణంగానూ, నిజమైనదిగానూ ఉంటుంది. సత్యం ఆదర్శం కాదు, కల్పన కాదు, అది వాస్తవమైనది. వాస్తవమైన దాన్ని అర్థం చేసుకోవచ్చు, దానితో వ్యవహరించవచ్చు. వాస్తవాన్ని అర్థం చేసుకోవటం వల్ల శత్రుత్వం పెంపొందదు, ఆదర్శం వల్ల అలాకాదు. ఆదర్శాలు ఎన్నటికీ మూలపరివర్తనని తీసుకురాలేవు. అవి తెచ్చేది కొద్ది మార్పులతో కొనసాగే పాతది మాత్రమే. క్షణక్షణమూ తీసుకునే చర్య వల్లనే మూల పరివర్తన సంభవిస్తుంది. అది ఆదర్శం మీద ఆధారపడి ఉండదు. అందువల్ల నిశ్చితాభిప్రాయానికి బంధింపబడి ఉండదు.

"కానీ, ప్రభుత్వం ఈ సూత్రం ప్రకారం వ్యవహరించలేదు. ఒక లక్ష్యం, ఒక ప్రణాళిక ప్రకారం కార్యాచరణ జరగాలి. ఒక సమస్య విషయమై దీక్షతో కూడిన కృషి ఉండాలి. నా మటుకు నాకు అందులో గొప్ప అవకాశాలున్నట్లు

గ్రహించాను. కాని సామూహిక కార్యాచరణకి అది పని చెయ్యదు."

ప్రణాళిక ప్రకారం చర్య తీసుకోవాలంటే దాన్ని నిత్యం మార్పు చేయటం అవసరమవుతుంది. ఒక స్థిర పథకం ప్రకారం చర్య తీసుకోవాలంటే అది తప్పకుండా భగ్నమవుతుంది - దానితో బాటు భౌతిక వాస్తవికతలనూ, మానసికమైన ఒత్తిడులనూ విచారించకుండా ఉంటే; మీరొక వంతెనను కట్టాలని పథకం వేసుకుంటే, దాని నమూనాని తయారు చేయటమే కాదు, ఉన్న మట్టినీ, భూభాగాన్నీ, కట్టవలసిన స్థలాన్నీ కూడా పరిశీలించాలి. లేకుంటే మీ పథకం సరిపోదు. భౌతిక వాస్తవికతలనూ, మానసికమైన ఒత్తిడులనూ, అన్నిటితో కూడిన మానవ ప్రక్రియని అర్థం చేసుకున్నప్పుడే పూర్తి చర్య సాధ్యమవుతుంది. ఈ అవగాహన ఏ నమూనాపైనా ఆధారపడి ఉండదు. దానికి కావలసినది సర్దుకు పోవలసిన లక్షణం. అదే వివేకం. వివేకం లేనప్పుడే మన నిశ్చితాభిప్రాయాలనీ, ఆదర్శాలనీ, లక్ష్యాలనీ పట్టుకుంటాం. ప్రభుత్వ వ్యవస్థ స్థిరమైనది కాదు. దాని నాయకులు అనుకుంటే అనుకోవచ్చు. ప్రభుత్వం కూడా వ్యక్తిలాగే సజీవమైనది. క్రియాశక్తి సంపన్నమైనది. క్రియాశక్తి సంపన్నమైన దానిని ఒక నమూనా అనే చట్రంలో బంధించలేము. మనం సాధారణంగా ప్రభుత్వం చుట్టూ గోడలు నిర్మిస్తాం - నిశ్చితాభిప్రాయాలూ, ఆదర్శాలూ అనే గోడల మధ్య బంధించి ఉంచగలమని ఆశిస్తాం. కాని, ఒక సజీవమైన దాన్ని బంధించి ఉంచలేరు - దాన్ని చంపకుండా. అందుచేత ప్రభుత్వాన్ని నాశనం చెయ్యటానికి పూనుకుని ఒక పథకం తయారు చేస్తాం ఒక ఆదర్శం ప్రకారం. చచ్చిపోయిన దాన్ని మాత్రమే చట్రంలో బిగించగలరు. జీవితం నిత్యం చలనంలో ఉంటుంది కాబట్టి జీవితాన్ని ఒక నిశ్చితమైన విధానానికీ, ఒక నిశ్చితాభిప్రాయానికీ కట్టి ఉంచిన క్షణంలో వైరుధ్యం బయలు దేరుతుంది. ఒక పద్ధతి ప్రకారం నడుచుకోవటం వ్యక్తి వినాశమే. అందుచేత ప్రభుత్వ వినాశం కూడా. ఆదర్శం జీవితం కన్న ఉన్నతమైనది కాదు. మనం దాన్ని అలా చేసినప్పుడు గందరగోళం, వైరుధ్యం దుఃఖం తప్పవు.

# 52. అసూయ

ఎదురుగా ఉన్న తెల్లని గోడమీద ఎండ బాగా పడుతోంది. దాని తీక్షణమైన కాంతికి ముఖాలు మసకమసగ్గా కనిపిస్తున్నాయి. ఒక చిన్నపిల్ల తల్లి చెప్పకుండానే వచ్చి దగ్గరలో కూర్చుంది. అదంతా ఏమిటి అన్నట్లు తెల్లబోతూ కళ్లు పెద్దవి చేసి చూస్తోంది. అప్పుడే స్నానం చేసి బట్టలు వేసుకుంది. ఆ అమ్మాయి తల్లో పువ్వులున్నాయి. ఆ అమ్మాయి ప్రతీదీ గమనిస్తోంది పిల్లలందరి లాగే, దేన్నీ మనస్సులో పదిలపరచుకోకుండా. ఆ పిల్ల కళ్లు మెరుస్తున్నాయి. ఏం చెయ్యాలో తెలియట్లేదు ఆ పిల్లకి - ఏడవాలో, నవ్వాలో, ఎగరాలో. దానికి బదులు నా చెయ్యి పుచ్చుకుని ఎంతో దీక్షగా ఆసక్తిగా చూస్తోంది. అంతలోనే ఆ గదిలో చుట్టుపక్కలున్న మనుషులందరినీ మరిచిపోయి హాయిగా తన తల నా ఒడిలో పెట్టుకుని నిద్రపోయింది. ఆ అమ్మాయి తల మంచి తీరుగా సరిగ్గా సరిపోయినట్లుంది. ఎంతో పరిశుభ్రంగా ఉంది పిల్ల. ఆ అమ్మాయి భవిష్యత్తు కూడా ఆ గదిలో కూర్చుని ఉన్న తక్కిన వాళ్ల భవిష్యత్తులాగే అయోమయంగా దుఃఖపూరితంగా ఉంటుంది. ఆ అమ్మాయి సంఘర్షణ, సంతాపం ఆ గోడమీద ఎండలాగే అనివార్యమైనవి. బాధ నుంచీ, దుఃఖం నుంచీ విముక్తి పొందాలంటే అత్యున్నతమైన వివేకం ఉండాలి. ఆ అమ్మాయి విద్యా, ఆమె చుట్టూ ఉన్న ప్రభావాలూ ఆమెకు ఆ వివేకాన్ని కలుగనియ్యవు. ఈ ప్రపంచంలో ప్రేమ అనేది అరుదుగా ఉంటుంది - అది పొగలేని జ్వాల. పొగ అంతటినీ కమ్మేసి ఉక్కిరి బిక్కిరి చేసి తీవ్రమైన బాధ, కన్నీళ్లు తెప్పిస్తుంది. జ్వాల అరుదుగా కనిపిస్తుంది. పొగ అన్నిటికన్నా ముఖ్యమైపోయినప్పుడు జ్వాల ఆరిపోతుంది. ప్రేమ జ్వాల లేకుండా జీవితానికి అర్థం లేదు. అది మందకొడిగా అలసట గొలిపేలా తయారవుతుంది. కాని, చీకటి నింపే పొగలో జ్వాల నిలువ లేదు. ఆ రెండూ ఒకచోట ఉండలేవు. జ్వాల స్పష్టంగా ఉండాలంటే పొగ ఆగిపోవాలి. జ్వాలకి సాటి మరొకటి లేదు. పొగ జ్వాల కాదు. జ్వాలని తనలో ఇముడ్చుకోలేదు. పొగ జ్వాల ఉంధని సూచించదు - పొగలేనప్పుడే జ్వాల ఉంటుంది కనుక.

"ప్రేమ, ద్వేషం ఒక చోట ఉండలేవా? అసూయ ప్రేమకు సూచన

కాదా? మనం చేతుల్లో చేతులు పెట్టుకుంటాం. ఆ మరుక్షణం తిట్టిపోస్తాం. ఎంతో కఠినమైన మాటలంటాం. తరువాత ముద్దుపెట్టుకుని సమాధాన పడతాం. ఇదంతా ప్రేమకాదా? అసలు అసూయ ఉందంటేనే ప్రేమ ఉందన్న సూచన. వెలుగు - చీకటిలాగ - ఆ రెండూ జంటగా ఉంటాయి. ముక్కుమీద కోపం, ముద్దుపెట్టుకోవటం - ఈ రెండూ కలిస్తేనే కదా ప్రేమ. నది కల్లోలం గానూ ఉంటుంది. ప్రశాంతంగానూ ఉంటుంది. నీడలోనూ ప్రవహిస్తుంది, ఎండలోనూ ప్రవహిస్తుంది. అందులోనే ఉంది ఆ నదికి అందం."

మనం ప్రేమ అనేదేమిటి? అసూయ, కామం, కఠిన వాక్కులు, కౌగిలింతలు, చేతులు పట్టుకోవటాలు, తగువులాడుకోవటం, మళ్లీ కలుసు కోవటం - ఇవన్నీ కలిసినది. ఇవన్నీ ప్రేమ అనబడేదానిలోని వాస్తవాలు. ఈ రంగంలో కోపగించుకోవటం, కౌగిలించుకోవటం - ఈ రెండూ దైనందిన యథార్థాలు, కాదా? వివిధ వాస్తవాల మధ్య సంబంధం ఏర్పరచటానికి గాని, వాటిని ఒక దానితో ఒకటి పోల్చటానికి గాని ప్రయత్నిస్తాం. అదే రంగంలోని ఒక వాస్తవాన్ని మరో వాస్తవంతో పోల్చి దాన్ని ఖండించటమో సమర్థించటమో చేస్తాం, లేదా, ఆ రంగంలోని ఒక వాస్తవాన్ని దాని కవతలగా మరో రంగానికి చెందిన వాస్తవంతో సంబంధం ఏర్పరచటానికి ప్రయత్నిస్తాం. ప్రతి యథార్థాన్నీ విడిగా తీసుకోకుండా ఒక దానికీ మరొక దానికీ మధ్య సంబంధం వెతకటానికి ప్రయత్నిస్తాం. మనం ఎందుకు చేస్తాం ఇలా? ఒక యథార్థాన్ని అదే రంగం లోని మరో యథార్థం ద్వారా అవగాహన చేసుకోవటానికి ప్రయత్నించకుండా ఉన్నప్పుడే ఆ యథార్థం అర్థమవుతుంది. అలా కాకపోయినట్లయితే సంఘర్షణా, అయోమయ స్థితీ సృష్టించటమవుతుంది. అదే రంగంలోని రెండు వాస్తవాలను మనం ఎందుకు పోల్చుతాం? ఒక వాస్తవాన్ని తేటతెల్లం చేయటానికి గాని, వివరంగా తెలియజేయటానికి గాని మరో వాస్తవం యొక్క ప్రాధాన్యాన్ని ఎందుకు వాడుకుంటాం?

"మీరు చెప్పిన దాంట్లోని అర్థాన్ని ఇప్పుడే గ్రహించగలుగుతున్నాను. అయితే, మనం ఎందుకు చేస్తాం అలా?"

మనం యథార్థాన్ని భావం అనే తెరద్వారా, జ్ఞాపకం అనే తెర ద్వారా చూడగలమా? మీ చెయ్యి పట్టుకున్నందువల్ల అసూయ అర్థమవుతుందా.

నాకు? చెయ్యిపట్టుకోవటం యథార్థం. అసూయ కూడా వాస్తవమే. అసూయ ఎలా పనిచేస్తుందో మీరు చెయ్యిపట్టుకున్నారన్నది నేను జ్ఞాపకం తెచ్చుకోవటం మూలంగా అర్థమవుతుందా? జ్ఞాపకం పోలుస్తుంది, మార్పులు చేస్తుంది, ఖండిస్తుంది, సమర్థిస్తుంది, ప్రత్యేకంగా గుర్తిస్తుంది. కాని అవగాహన కలుగజేయలేదు. ప్రేమ అనబడే రంగంలోని యథార్థాలను భావాలతోనూ నిర్ణయాలతోనూ సమీపిస్తాం. అసూయ అనే సత్యాన్ని విడిగా తీసుకుని దాన్ని నిశ్శబ్దంగా గమనించం. కాని ఆ సత్యాన్ని మెలికలు తిప్పుతాం - ఒక పద్ధతి ప్రకారం, ఒక నిశ్చితాభిప్రాయం ప్రకారం. మనం దాన్ని సమీపించే విధానం అదే. ఎందువల్లనంటే, అసూయ అనే సత్యాన్ని అర్థం చేసుకోవటం మనకి నిజంగా ఇష్టం లేదు కనుక. అసూయ యొక్క అనుభూతులు కూడా కౌగిలింత మాదిరిగానే ఉత్తేజకరంగా ఉంటాయి. కాని, మనకి బాధ, అసౌకర్యం లేకుండా ఉత్తేజం కావాలి - ఉత్తేజంతో బాటు అవీ అనివార్యమైనప్పటికీ. అందువల్లనే ప్రేమ అనే రంగంలో సంఘర్షణ, గందరగోళం, వైరుధ్యం ఉంటాయి. కాని అది ప్రేమా? ప్రేమ ఒక భావమూ, ఒక అనుభూతీ, ఉత్తేజమూనా? ప్రేమ అంటే అసూయా?

"భ్రమ లోనే నిజం పొదిగి ఉండదా? కాంతిని చీకటి ఆవరించదా? దాచి ఉంచదా. దైవం బంధింపబడి లేడా?"

ఇవన్నీ ఊహలూ, ఉద్దేశాలూ. అంచేత వాటిల్లో నిజం లేదు. అటువంటి ఊహలు శత్రుత్వాన్ని పెంపొందిస్తాయి. అవి సత్యాన్ని కప్పి ఉంచలేవు, వెలుగు ఉన్నచోట చీకటి ఉండదు. చీకటి వెలుగుని దాచి ఉంచలేదు. అది అలాచేసిందంటే అది వెలుగు కాదన్న మాటే. అసూయ ఉన్నప్పుడు ప్రేమ ఉండదు. భావంలో ఉండదు ప్రేమ. పరస్పర సంబంధం ఉన్నప్పుడే ఒకరినొకరు తెలుసుకోగలుగుతాం. ప్రేమ భావంతో ముడిపడి లేదు. అందువల్ల భావంతో ప్రేమని సమీపించలేము. ప్రేమ పొగలేని జ్వాల.

## 53. సహజత్వం

ఏదో గంభీర విషయాన్ని చర్చించటానికి వచ్చిన కొద్దిమందిలో ఆవిడ

కూడా ఉంది. కుతూహలం కొద్దీ వచ్చి ఉండచ్చు, లేదా, స్నేహితులెవరైనా తీసుకొస్తే వచ్చి ఉండవచ్చు. మంచి దుస్తులు వేసుకుంది. హుందాగా ఉంది. తను చాలా అందంగా ఉంటానని ఆవిడ అనుకుంటోందన్నది స్పష్టమే. ఆవిడ తన గురించే అన్నీ ఆలోచిస్తున్నట్లుగా ఉంది - తన శరీరం, తన అందం, తన జుట్టు, తను ఇతరుల మీద కలిగిస్తున్న ప్రభావం - ఇదంతా. ఆవిడ చేష్టలు జాగ్రత్తగా ఆలోచించి చేస్తున్నట్లుగా ఉన్నాయి. మధ్యమధ్య వివిధ ధోరణులను ప్రదర్శించింది ముందుగానే ఎంతో జాగ్రత్తగా ఆలోచించి. ఆవిడ ధోరణి అంతా ఎంతో కాలం నుంచి అలవాటు చేసుకున్న ఠీవి, దానిలో ఎలాగైనా ఏం జరిగినా సరే ఇమిడిపోవాలన్న కృతనిశ్చయంతో ఉన్నట్లుగా ఉంది. తక్కిన వాళ్లు ఏవో గంభీర విషయాల గురించి మాట్లాడటం మొదలు పెట్టారు. ఆ గంటసేపూ ఆవిడ అదే ఠీవిలో ఉంది. ఆ గంభీరమైన, తీవ్రమైన ముఖాల మధ్య తనగురించే ఆలోచిస్తున్న ఆ అమ్మాయి ఆ చెబుతున్నదాన్ని వింటూ చర్చలో పాల్గొనటానికి ప్రయత్నిస్తోంది. కాని, ఆవిడ నోటివెంట మాటలు వెలువడలేదు. చర్చిస్తున్న సమస్య గురించి తనకు కూడా తెలుసునన్న విషయాన్ని ప్రదర్శించాలని కోరుతోంది. కాని, ఆమె కన్నుల్లో కంగారు - తను ఆ గంభీర సంభాషణలో పాల్గొన లేకపోతున్నానని. అంతలోనే తనలో తాను ముడుచుకుని పోతున్నట్లు కనిపించింది, కాని తాను ఎంతోకాలం నుంచి అలవరచుకున్న ఆ ఠీవిలోనే ఉందింకా. సహజత్వాన్ని ప్రయత్న పూర్వకంగా నాశనం చేయటం జరుగుతోంది.

ప్రతి ఒక్కరూ ఒక రకమైన ఠీవి అలవరచుకుంటారు. ఒకవైపు స్థితిమంతుడైన వ్యాపారస్థుని నడకా, ఠీవీ, విజయాన్ని సూచించే అతని చిరునవ్వూ; మరోవైపు కళాకారుడి రూపం, ఠీవీ; ఇంకో పక్కన వినయ విధేయతలు కల శిష్యుడు, ఆ పక్కని క్రమశిక్షణ పొందిన సాధువు ఠీవి. తన గురించే ఆలోచించే ఆ అమ్మాయి లాగే ఆ ధర్మనిరతుడనుకునే అతని ఠీవి, క్రమశిక్షణతో ప్రయత్న పూర్వకంగా ఎన్నో వదులుకుని త్యాగంచేసి, కావాలని అలవరచుకున్నదే. ఆవిడ ఒక విధంగా ఉండాలనే ప్రయత్నంలో సహజత్వాన్ని త్యాగం చేస్తున్నట్లుగానే అయన తన లక్ష్యం కోసం తనని తాను బలిదానం చేసుకుంటాడు. ఇద్దరికీ కావలసినది లక్ష్యసాధనే - వేరు వేరుస్థాయిల్లో

అయినా. ఆయన సాధించే ఫలితం సంఘానికి ఎక్కువ లాభదాయకం కావచ్చు, ఆవిడ లక్ష్యం కన్నా. కాని, ప్రధానంగా రెండూ ఒక లాంటివే. ఒకటి రెండవదాని కన్న ఉన్నతమైనది కాదు. ఇద్దరూ వివేకం లేని వారే. ఇద్దరూ సూచించేది మనస్సు అల్పత్వాన్నే. అల్ప మనస్సు ఎప్పటికీ అల్పంగానే ఉంటుంది. దాన్ని సంపన్నంగా పుష్కలంగా చేయటం సాధ్యంకాదు. అటువంటి మనస్సు తన్ను తాను అలంకరించుకోవటమో, సద్గుణాలను సంపాదించటమో చేసినప్పటికీ, అది ఎప్పటిలాగే ఉంటుంది వెలితిగా. తామనుకునే వికాసం, అనుభవం - వీటి ద్వారా దాని అల్పత్వమే అధికమవుతుంది. అనాకారిగా ఉన్న దాన్ని అందంగా చెయ్యలేము. అల్పమనస్సు సృష్టించే దేవుడు అల్పదైవమే అవుతాడు. వెలితిగా ఉండే మనస్సు లోతు తెలియనంతగా మారదు - జ్ఞానంతోనూ గడుసు మాటలతోనూ, వివేకవంతుల మాటలను ఉదాహరించటంతోనూ ఎంత అలంకరించుకున్నప్పటికీ, బాహ్య రూపాన్ని ఎంత ముస్తాబు చేసినప్పటికీ. అలంకారాలు ఆంతరంగికమైనవైనా, బహిరంగంగా ఉన్నవైనా మనస్సుని లోతు తెలియనంతగా చేయవు. ఆ లోతు తెలియని ప్రగాఢమైన మనస్సే సౌందర్యాన్నిస్తుంది - అంతేకాని, ఆభరణమూ, పెంపొందించుకున్న సద్గుణమూ కాదు. సౌందర్యం కలగటానికి మనస్సు ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా తన అల్పత్వాన్ని తెలుసుకుంటూ ఉండాలి. ఆ తెలుసుకుంటూ ఉండటంలో పోల్చి చూడటం పూర్తిగా ఆపివెయ్యాలి.

ఆ అమ్మాయి అలవరచుకున్న టీవీ, ఆ ధర్మనిరతుడనని చెప్పుకునే ఆయన క్రమశిక్షణతో కూడిన టీవీ - రెండూ అల్పమనస్సు చిత్రహింసతో సాధించిన ఫలితాలే. అత్యవసరమైన సహజత్వాన్ని పూర్తిగా వదులుకున్నారు. ఇద్దరికీ సహజత్వం అంటే భయమే - తాము వాస్తవంగా ఉన్న స్థితి తమకూ, ఎదుటి వారికీ బయటపడుతుందేమోనని. ఇద్దరూ దాన్ని నాశనం చెయ్యటానికే పూనుకున్నారు. వారి సఫలతకి కొలమానం ఏమిటంటే, వారు ఎంచుకున్న పద్ధతికీ, నిశ్చితాభిప్రాయానికీ పూర్తిగా అనుగుణంగా ఉండటమే. కాని ఉన్న స్థితిని తెరిచి చూపే సాధనం ఒక్క సహజమైన స్పందనే. అప్రయత్నంగా జరిగే ప్రతిక్రియ మనస్సుని ఉన్నదున్నట్లుగా తెరిచి చూపుతుంది.

కాని ఆవిష్కృతమైన దాన్ని వెంటనే అలంకార భూషితం చేయటమో, నాశనం చేయటమో జరుగుతుంది. అందుచేత సహజత్వాన్ని అంతం చేయటమవు తుంది. సహజత్వాన్ని హతమార్చటం అల్పమనస్సు అవలంబించే పద్ధతి. దానికోసం బాహ్యంగా కూడా అలంకరిస్తుంది - ఏ స్థాయిలోనైనా. ఈ అలంకరణే స్వీయ ఆరాధన. సహజత్వంలోనే, స్వేచ్ఛలోనే ఏదైనా కనుక్కోవచ్చు. క్రమశిక్షణ పొందిన మనస్సు కనుక్కోలేదు. ఎంతో సమర్థవంతంగా, దానికోసం నిర్దయగా ప్రవర్తించవచ్చు. కాని, ఆలోతు తెలియనంత ప్రగాఢమైన దాన్ని కనుక్కోవటం సాధ్యం కాదు. భయమే క్రమశిక్షణ అనే ప్రతిఘటనని సృష్టిస్తుంది. కాని, అప్రయత్నంగా భయాన్ని కనుక్కున్నప్పుడు భయం నుంచి విముక్తి లభిస్తుంది. ఒక పద్ధతికి అనుగుణంగా ఏ స్థాయిలోనైనా, ఉండటమే భయం. అది సంఘర్షణనీ, గందరగోళాన్నీ వైరుధ్యాన్నీ పెంపొందిస్తుంది. ఎదురు తిరిగిన మనస్సు భయం లేకుండా ఉండదు, ఎందువల్ల నంటే వ్యతిరేకమైనది ఎన్నటికీ సహజంగా స్వేచ్ఛగా ఉండదు.

సహజంగా ఉండకుండా ఆత్మజ్ఞానం ఉండటం సాధ్యంకాదు. స్వీయ జ్ఞానం లేకపోతే మనస్సు మీద వచ్చేపోయే ప్రభావాలుంటాయి. ఈ వచ్చేపోయే ప్రభావాలు మనస్సుని సంకుచితంగా గాని, విస్తృతంగా గాని చేస్తాయి. కాని, ఇంకా ప్రభావపు పరిధిలోనే ఉంటుంది. ఒకటిగా కూర్చిన వాటిని తిరిగి విడగొట్టవచ్చు. ఆవిధంగా లేనటువంటి దాన్ని స్వీయజ్ఞానం ద్వారానే తెలుసుకోవటం సాధ్యం. "నేను" అనేది దగ్గరగా కూర్చబడినటువంటిదే. "నేను"ని విడగొట్టటంలోనే ప్రభావాల ఫలితమైనటువంటి దాన్నీ, కారణాలకు అతీతమైనటువంటి దాన్నీ తెలుసుకోవచ్చు.

## 54. చేతన, అంతశ్చేతన

ఆయనొక వ్యాపారస్థుడు, రాజకీయవేత్త కూడా. రెండు విధాలా విజయవంతమయాడు. వ్యాపారం, రాజకీయాలూ - రెండూ మంచి జోడీ అన్నాడాయన నవ్వుతూ. అయినా, ఆయన ఒక విధంగా మూఢవిశ్వాసాల్లో

నమ్మకం గలవాడే. వీలు చిక్కినప్పుడల్లా పవిత్ర గ్రంథాలను చదువుతాడుట. కొన్ని పదాల్ని పదేపదే పునశ్చరణ చేస్తాడుట. వాటివల్ల లాభం ఉందనుకుంటాడాయన. వాటివల్ల ఆత్మశాంతి చేకూరుతుంది అన్నాడాయన. ఆయన వయస్సు మీరినవాడే. ఆయన డబ్బున్నవాడు. ఆయన చేత్తోగాని, హృదయంతోగాని ఔదార్యం చూపినవాడు కాదు. ఆయన ఎంతో గడుసువాడనీ, ముందువెనకా ఆలోచించే రకమనీ తెలుస్తూనే ఉంది. అయినా, భౌతిక విజయం కాక, ఇంకేదో కావాలన్న తపన ఉంది. జీవితం ఆయన్ని స్పృశించనేలేదని చెప్పవచ్చు. ఎందుకంటే, ఆయన ఎంతో కష్టపడి తన్ను తాను రక్షించుకున్నాడు, ఏ విధమైన ప్రభావానికీ లోబడిపోకుండా. శారీరకంగానూ, మానసికంగానూ కూడా ఆయన తన్ను తాను అభేద్యంగా చేసుకున్నాడు. మానసికంగా తను ఉన్నది ఉన్నట్లుగా చూసుకోవటానికి ఇష్టపడలేదు. ఆపని చెయ్యగల స్తోమత ఆయనకుంది. కాని, దాని ఫలితం ఆయన మీద పని చెయ్యటం మొదలుపెట్టింది. ఆయన జాగ్రత్తగా గమనించకుండా ఉన్నప్పుడు, ఆయనలో ఎవరో వెంట పడుతున్నట్లుంటుంది ఆయన చూపు. ధనరీత్యా ఆయన సురక్షితంగానే ఉన్నాడు. అధమం, ఇప్పుడున్న ప్రభుత్వం ఉన్నన్నాళ్ళూ ఏవిధమైన పరివర్తనా ఉండదు. ఆధ్యాత్మిక లోకం అనే దాంట్లో కూడా ఆయన రక్షణ కోసం కొంత ప్రయత్నించదలుచుకున్నాడు. తను సొంతం చేసుకున్నవాటి మీద తప్ప ఆయనకు ప్రేమలేదు. పిల్ల తల్లిని వాటేసుకున్నట్లుగా వాటిని కరుచుకుని ఉన్నాడాయన. ఆయనకి అంతకన్న వేరే ఏమీ లేదు. మెల్లిగా ఆయనకి తెలుస్తోంది తను ఎంతో దుఃఖితుడని. ఈ గ్రహింపు కలగకుండా వీలైనంతవరకు తప్పించుకున్నాడు. కాని జీవితం ఆయన్ని ఒత్తిడి చేస్తోంది.

ఒక సమస్యని వ్యక్తంగా ఉన్న చేతన పరిష్కరించ లేకుండా ఉంటే, అవ్యక్తంగా వుండే అంతశ్చేతన దానిని పరిష్కరించటంలో సహాయ పడుతుందా? ఈ వ్యక్తంగా ఉన్నదేమిటి? అవ్యక్తంగా ఉన్నదేమిటి? ఈ రెండింటికీ మధ్యా ఒక గీత ఉన్నదా, ఒకటి ఆఖరై రెండవది మొదలయే చోట? వ్యక్తంగా ఉన్న దానికొక పరిధి ఉందా - దాన్ని దాటి వెళ్లలేక పోవటానికి? తన హద్దులకు తన్ను తానే పరిమితం చేసుకుంటుందా? అవ్యక్తంగా ఉన్నది వేరు,

వ్యక్తంగా ఉన్నది వేరూనా? అవి పోలిక లేనివా? ఒకటి భగ్నమైతే రెండవది పనిచెయ్యటం మొదలు పెడుతుందా?

మనం 'వ్యక్తంగా ఉన్నది' లేదా 'చేతన' అనేదేమిటి? అది దేనితో తయారైనదో అర్థం చేసుకోవటానికి, ఏదైనా సమస్యని మనం సచేతనంగా ఎలా సమీపిస్తామో గమనించాలి. మనలో చాలామంది సమస్యకి పరిష్కారం వెతకటం కోసం ప్రయత్నిస్తారు. మనం పరిష్కారం గురించి ఆలోచిస్తాం, సమస్య గురించి కాదు. సమస్యని పరిష్కారం ద్వారా తప్పించుకోవాలని కోరుకుంటాం. సమస్యని యథాతథంగా గమనించం, కాని, సంతృప్తికరమైన జవాబు కోసం తడుముకుంటాం. మన చేతనంలో మన ఆలోచన అంతా పరిష్కారాన్ని, సంతృప్తికరమైన నిర్ణయాన్ని వెతకటం గురించే. తరుచు మనకి తృప్తి కలిగించే పరిష్కారాన్ని కనుక్కుంటాం. ఆ తరవాత సమస్యని పరిష్కరించేశామనుకుంటాం. మనం నిజానికి చేసేదేమిటంటే, సమస్యని ఒక నిర్ణయంతో, ఒక సంతృప్తికరమైన పరిష్కారంతో కప్పిపెట్టి ఉంచుతాం. ఆ నిర్ణయం బరువు క్రింద తాత్కాలికంగా ఊపిరి సలపకుండా అణచిపెట్టి ఉన్నప్పటికీ, ఆ సమస్య ఇంకా అలానే ఉంటుంది. పరిష్కారం కోసం వెతకటం సమస్యని తప్పించుకోవటమే. తృప్తికరమైన పరిష్కారం లేనప్పుడు వ్యక్తంగా ఉన్న పైపై మనస్సు వెతకటం మానేస్తుంది. అప్పుడు అవ్యక్తంగా ఉన్నదనబడే లోలోపలి మనస్సు అందిపుచ్చుకుని పరిష్కారాన్ని కనుక్కుంటుంది.

వ్యక్తంగా ఉన్న మనస్సు సమస్యని తప్పించుకోవటానికి మార్గం వెతుకుతుందనీ, తృప్తికరమైన నిర్ణయమే ఆ తప్పించుకునే మార్గం అనీ స్పష్టమవుతోంది. వ్యక్తంగా లేదా చేతనంగా ఉన్న మనస్సు నిర్ణయాలతో తయారైనదే కదా - ఆ నిర్ణయాలు అనుకూలమైనవి గాని, ప్రతికూలమైనవి గాని. వేరొకటి వెతకటం దానికి చేతనవునా? అనుభవాలవల్లా, గతించిన వాటి ప్రభావం వల్లా ఏర్పడిన నిశ్చితాభిప్రాయాలకు ఆటపట్టు కాదా పైపై మనస్సు? నిజానికి, వ్యక్తంగా ఉన్న మనస్సు గతంతో తయారైనదీ, గతంమీద ఆధారపడినదీ - ఎందువల్లనంటే, జ్ఞాపకమే నిశ్చితాభిప్రాయాలతో నేయబడినది. ఈ నిశ్చితాభిప్రాయాలతో మనస్సు సమస్యని సమీపిస్తుంది. సమస్యని ఆ నిశ్చితాభిప్రాయాల తెర లేకుండా చూడటం చేతకాదు దానికి.

దానికి నిశ్చితాభిప్రాయాలు మాత్రమే తెలుసును - అవి సంతోషకరమైనవి గానీ, సంతోషకరం కానివి గానీ, ఉన్న వాటికి మరికొన్ని నిర్ణయాలనూ, అభిప్రాయాలనూ, మార్పులేని స్థిరపడిన అభిప్రాయాలు మరికొన్నిటినీ చేర్చుకోగలదంతే. ఏ నిర్ణయమైనా స్థిరపడిన అభిప్రాయమే. వ్యక్తంగా ఉన్న చేతన మనస్సు తప్పని సరిగా నిర్ణయాన్ని కోరుతుంది.

సంతృప్తికరమైన నిర్ణయాన్ని కనుక్కోలేకపోయినప్పుడు చేతన మనస్సు వెతకటం మానేస్తుంది. స్తిమితంగా ఉంటుంది. అంతశ్చేతన హఠాత్తుగా ఒక పరిష్కారాన్ని ఈ స్తిమితంగా ఉన్న చేతనకు సూచిస్తుంది. ఇప్పుడు అవ్యక్తంగా ఉన్న లోపలి మనస్సుకీ, వ్యక్తంగా ఉన్న మనస్సుకీ నిర్మాణంలో ఏదైనా తేడా ఉన్నదా? అవ్యక్తంగా ఉన్న మనస్సు కూడా జాతి గురించీ, వర్గం గురించీ, సంఘం గురించీ ఏర్పడిన నిశ్చితాభిప్రాయాలూ, జ్ఞాపకాలూ కలిసి నిర్మితమైనది కాదా? నిజానికి, అవ్యక్తంగా ఉన్న మనస్సు కూడా గతం ఫలితమే. ఎటొచ్చీ, అది కనిపించకుండా నిరీక్షిస్తూ ఉంది అంతే. అవసరమైన వెంటనే తన నిగూఢ నిశ్చితాభిప్రాయాలను బయట పెడుతుంది. అవి సంతృప్తికరంగా ఉంటే పై మనస్సు వాటిని స్వీకరిస్తుంది. లేని పక్షంలో గిజగిజలాడుతూ, ఒక అద్భుతం జరిగి, సమస్యకు పరిష్కారం జరుగుతుందని ఆశపడుతుంది. పరిష్కారం దొరక్కపోతే విసుక్కుంటూ ఆ సమస్యని భరిస్తుంది. ఇది క్రమంగా మనస్సుని తినేస్తుంది. దాంతో రోగం, మతి భ్రమణం మొదలవుతాయి.

పై మనస్సూ, లోపలి మనస్సూ పోలిక లేకుండా ఉండవు. అవి రెండూ కూడా నిశ్చితాభిప్రాయాలతోనూ, జ్ఞాపకాలతోనూ తయారైనవే. రెండూ గతం నుంచి ఏర్పడినవే. పై మనస్సూ, లోపలి మనస్సూ - రెండూ నిశ్శబ్దంగా ఉండి అనుకూలమైనవి గాని ప్రతికూలమైనవిగాని అయిన నిశ్చితాభిప్రాయాలను ప్రదర్శించకుండా ఉంటేనే సమస్య అంతమొందుతుంది. మనస్సంతా పూర్తిగా నిశ్చలంగా ఉండి, సమస్యని ఇష్టాయిష్టాలు లేకుండా తెలుసు కున్నప్పుడు సమస్యనుంచి విముక్తి లభిస్తుంది. అప్పుడే సమస్యని సృష్టించే ఆ స్థితి ఉండదు.

# 55. సమస్య, ప్రతిక్రియ (సవాలు చేయడం, సమాధానం)

నది నిండుగా, విసురుగా ఉంది. కొన్ని చోట్ల కొన్ని మైళ్ల వెడల్పులో ఉంది. అంత నీటిని చూడటం ఆనందదాయకంగా ఉంది. ఉత్తరం వైపు పచ్చని కొండలు తుఫాను తరవాత స్వచ్ఛంగా ఉన్నాయి. నదిలో ఆ పెద్ద వంపునీ, దానిమీద తెల్లని తెరచాపలతో ఉన్న పడవల్నీ చూడటం అద్భుతంగా ఉంది.

పడవలు పెద్దగా, ముక్కోణాకారంలో ఉన్నాయి. ఆ ఉదయారుణ కాంతిలో అవి రమణీయంగా కనిపిస్తున్నాయి - అవి ఆ నీటిలోంచే వచ్చాయా అన్నట్లు. పగటి చప్పుళ్లు ఇంకా మొదలవలేదు. పడవవాని పాట దరిదాపు అవతలి తీరం నుంచి నీటిమీద తేలుతూ వస్తోంది. ఆ సమయంలో అతని పాటతో అవని అంతా నిండినట్లుగా అనిపించింది. అన్ని శబ్దాలూ నిశ్శబ్దమై పోయాయి. రైలు కూత కూడా మృదువుగానూ, వినసొంపుగానూ అయింది.

క్రమంగా ఊళ్లో చప్పుళ్లు ప్రారంభమయాయి. కుళాయి దగ్గర తగువులూ, గొర్రెల అరుపులూ ఆవులు పాలు పిండమని పిలవటం, వీధిలో పోయే బరువైన బళ్లూ, కాకుల కూతలూ, పిల్లల కేకలూ, నవ్వులూ - మరోరోజు పుట్టింది. సూర్యుడు కొబ్బరి చెట్లమీద ఉన్నాడు. కోతులు గోడ మీద కూర్చున్నాయి. వాటి పొడుగాటి తోకలు భూమిని అంటేలా ఉన్నాయి. అవి పెద్దవే గాని పిరికివి. వాటిని పిలిస్తే నేల మీదికి గెంతి, పొలంలోని పెద్ద చెట్టు మీదికి పారిపోయాయి. వాటి ముఖాలూ, పంజాలూ నల్లగా ఉన్నాయి. చాలా తెలివైనవిలా ఉన్నాయి. కాని, గడుసుతనం, అల్లరీలేదు చిన్నవాటికున్నట్లు.

"ఆలోచన అదేపనిగా ఎందుకుంటుంది? విరామమెరుగనట్లుగా, విసుగు పుట్టించేలా వదలకుండా ఉంటుంది. మీరేం చేసినా సరే, అది పనిచేస్తూనే ఉంటుంది, ఆ కోతుల్లాగ. దాని కార్యకలాపం అలిసిపోయేలా చేస్తుంది. దాన్నుంచి తప్పించుకోలేరు. అవిరామంగా మీ వెంట పడుతుంది. దాన్ని అణచివెయ్యటానికి ప్రయత్నించండి. కొద్ది క్షణాల్లో మళ్లీ తలెత్తుతుంది. ఎప్పుడూ శాంతంగా ఉండదు. ఎప్పుడూ విశ్రాంతి తీసుకున్నట్లుండదు. ఎప్పుడూ దేని వెంటో పడుతుంది. ఎప్పుడూ విశ్లేషిస్తూనే ఉంటుంది. ఎప్పుడూ

తన్ను తాను చిత్రవధ చేసుకుంటూ ఉంటుంది. నిద్రపోతున్నా, నడుస్తున్నా ఆలోచన నిత్యకల్లోలితంగా ఉంటుంది. దానికి శాంతి గాని విశ్రాంతి గాని ఉన్నట్లు లేదు."

ఆలోచన ఎప్పుడైనా శాంతితో ఉండగలదా? శాంతి గురించి ఆలోచించ గలదు, శాంతియుతంగా ఉండాలని ప్రయత్నించగలదు, నిశ్చలంగా ఉండాలని తన్ను తాను నిర్బంధించుకోగలదు, కాని ఆలోచన అనేదే ప్రశాంతంగా ఉండగలదా? అవిరామంగా ఉండటమే ఆలోచన ప్రకృతి కాదా? నిత్య సమస్యకి నిత్య ప్రతిక్రియ కాదా అది? సమస్యకి ఆగిపోవటం అనిలేదు - జీవితంలోని ప్రతిక్షణమూ ఒక సవాలు కాబట్టి. ఆ సవాలు గురించి తెలుసుకుని ఉండనట్లయితే క్షీణించటం, నశించటం జరుగుతుంది. సవాలు చేయటం, దానికి ప్రతిక్రియ - ఇదే జీవనవిధానం. ప్రతిక్రియ చాలినంత ఉండవచ్చు. ఉండకపోవచ్చు. సమస్యకి ప్రతిక్రియ చాలనప్పుడే ఆలోచన రేకెత్తుతుంది, అవిశ్రాంతంగా. సమస్య చర్య తీసుకోమంటుంది - మాటలలో పెట్టటం కాదు. మాటలలో పెట్టటమే ఆలోచన. మాట, సంకేతం - ఇవి చర్యని సరిగ్గా రూపొందనివ్వవు. ఊహే మాట. జ్ఞాపకమూ మాటే. సంకేతం లేకుండా, మాట లేకుండా జ్ఞాపకం ఉండదు. జ్ఞాపకం అంటే మాట, ఆలోచన. సమస్యకి నిజమైన ప్రతిక్రియ ఆలోచనేనా? సమస్య ఒక ఊహా? సమస్య ఎప్పుడూ కొత్తగా స్వచ్ఛంగా ఉంటుంది. ఆలోచనా, ఊహా ఎప్పుడైనా కొత్తగా ఉంటాయా? ఆలోచన నిత్యనూతనమైన సమస్యని కలుసుకున్నప్పుడు ఏర్పడిన ప్రతిక్రియ పాతదాన్నుంచీ, గతించిన దాన్నుంచీ వచ్చినది కాదూ?

ఒక పాతదీ, ఒక కొత్తదీ కలిస్తే ఆ కలయిక సంపూర్ణంగా ఉండదు. సంపూర్ణత కోసం అవిరామంగా అన్వేషించే ఆలోచనే ఈ అసంపూర్ణత. ఆలోచనా, ఊహా ఎప్పుడైనా సంపూర్ణమవుతాయా? ఆలోచన, ఊహ జ్ఞాపకానికి ప్రతిక్రియ. జ్ఞాపకం ఎప్పుడూ అసంపూర్ణమైనదే. అనుభవం సమస్యకి ప్రతిక్రియ. ఈ ప్రతిక్రియ గతంచేతా, జ్ఞాపకం చేతా ప్రభావితం, నిబద్ధితం అయి ఉంటుంది. ప్రతిక్రియ ఆ ప్రభావాన్నీ, నిబద్ధతనీ పటిష్ఠం చేస్తుంది. అనుభవం విముక్తి కలిగించదు. నమ్మకాన్నీ, జ్ఞాపకాన్నీ పటిష్ఠం చేస్తుంది. ఈ జ్ఞాపకమే సమస్యకి ప్రతిక్రియ జరిగేటట్లు చేస్తుంది. అందువల్ల

అనుభవం ప్రభావితం చేసేదవుతుంది, నిబద్ధితం చేసేదవుతుంది.

"అయితే ఆలోచనకున్న స్థానం ఏమిటి?"

మీరనేది ఆలోచనకి చర్యలో స్థానం ఏమిటి అనేనా? చర్యకి ఊహతో ఏమైనా పని ఉందా? చర్యని మార్చటానికో, నిగ్రహించటానికో, రూపొందించటానికో ఊహ చర్యలో ఒక అంశం అవుతుంది. కాని, ఊహ చర్య కాదు. ఊహ, నమ్మకం చర్యనుంచి రక్షణ కలిగిస్తాయి. చర్యని మార్పుచేసే, రూపొందించే నిగ్రహకర్తగా ఊహకి స్థానం ఉంది. ఊహ చర్యకోసం తయారైన ఒక పథకం.

"ఆ పథకం లేకుండా చర్య సాధ్యమేనా?"

ఏదైనా ఫలితం ఆశించినట్లయితే, చర్య సాధ్యంకాదు, ముందుగానే నిర్ణయించుకున్న లక్ష్యం కోసం చేసే చర్య చర్య కాదు. ఒక పద్ధతి ప్రకారం నడవాలనుకున్నట్లయితే, అప్పుడు ఆలోచనకీ, ఊహకీ స్థానం ఉంటుంది. ఆలోచన యొక్క కర్తవ్యం చర్య అనబడేది ఎలా ఉండాలో ఒక పథకం సృష్టించి అటుపైన చర్యని నాశనం చెయ్యటమే. మనం చాలావరకు చర్యని నాశనం చెయ్యాలనే ఆలోచిస్తాం. ఊహ, నమ్మకం, అంధవిశ్వాసం చర్యని నాశనం చెయ్యటానికి దోహదం చేస్తాయి. చర్య అంటే తెలియని దాన్నుంచి రక్షణ లేకపోవటం, సున్నితంగా ఉండటం. ఆలోచన, నమ్మకం - అంటే తెలిసి ఉన్నది తెలియని దానికి ఆటంకం అవుతుంది. ఆలోచన తెలియని దానిలోకి చొరబడలేదు. ఆలోచన ఆగిపోతే గాని తెలియనిది ఉండదు. తెలియని దాని చర్య ఆలోచన ఫలితంగా జరిగే చర్యకి అతీతమైనది. ఆలోచనకి ఈ సంగతి తెలిసి, వ్యక్తంగా గాని, అవ్యక్తంగా గాని తెలిసినదాన్నే పట్టుకుని ఉంటుంది. తెలియని దానికి - సమస్యకి తెలిసినదే ఎప్పుడూ ప్రతిక్రియ అవుతుంది. ఈ అసంపూర్ణ ప్రతిక్రియ నుంచే సంఘర్షణ గందరగోళం, దుఃఖం మొదలవుతాయి. తెలిసినదీ, ఊహా అంతమైనప్పుడే తెలియని దానిపైన చర్య సాధ్యమవుతుంది. అది అపరిమితమైనది.

# 56. సొంతం చేసుకోవాలనే తత్వం

ఆయన భార్యని తన వెంట తీసుకువచ్చాడు. అది వారిద్దరికీ సంబంధించిన సమస్య కాబట్టి తీసుకు వచ్చానన్నాడాయన. ఆవిడ కళ్లు కళగా ఉన్నాయి. ఆవిడ పొట్టిగా చురుకుగా ఉంది. వాళ్లు ఎంతో మామూలుగా స్నేహపూర్వకంగా ఉన్నారు. ఆయన ఇంగ్లీషులో బాగానే మాట్లాడుతున్నాడు. ఆవిడ అర్థం చేసుకోగలదంతే. చిన్న చిన్న ప్రశ్నలు అడగగలదు. కొంచెం కష్టమనిపించినప్పుడు ఆవిడ భర్తకేసి తిరుగుతుంది. ఆయన తమ భాషలో అర్థం చెబుతున్నాడు. తమ వివాహం అయి పాతికేళ్లకు పైగా అయిందని చెప్పాడాయన. బోలెడు మంది పిల్లలున్నారట, వాళ్ల కున్న సమస్య ఆ పిల్లలు కాదు. తమ ఇద్దరి మధ్యా ఉన్న తగువేనట. ఆయనకి ఉద్యోగం ఉందనీ, ఏదో తగు మాత్రం వస్తుందనీ చెప్పి, ఈ ప్రపంచంలో బ్రతకటం ఎంత కష్టమో, ముఖ్యంగా సంసారం నడపటం ఎంత కష్టమో చెప్పుకొచ్చాడు. దానికి తను విసుక్కోవటం లేదుట, కాని ఉన్న సంగతది అన్నాడు. భర్తగా తన బాధ్యతలన్నీ నిర్వర్తిస్తున్నానన్నాడు. అధమం, అలా చేస్తున్నాననే అనుకుంటున్నాడు. అది ఎల్లప్పుడూ అంత సులభమనిపించలేదుట.

అసలు సంగతికి రావటానికి కష్టంగా ఉంది వాళ్లకి. ఎంతో సేపు ఏవేవో మాట్లాడారు - వాళ్ల పిల్లల చదువులూ, కూతుళ్ల పెళ్ళిళ్లూ, శుభకార్యాలకి అయిన వృథా ఖర్చులూ, కుటుంబంలో ఆ మధ్య ఎవరో పోవటం, ఇలా ఎంతో మామూలుగా, హడావిడి లేనట్లుగా ఉన్నారు - ఎందుకంటే, వినేవాళ్లూ, విని అర్థం చేసుకునే వాళ్లూ ఎవరైనా ఉంటే, వాళ్లతో చెప్పుకోవటానికి బావుంటుంది.

ఎదుటి వారి బాధల్ని శ్రద్ధగా వినేదెవరు? మన సమస్యలే మనకి ఎన్నో ఉండగా, ఇక ఇతరులవి కూడా వినటానికి మనకి తీరిక ఎక్కడ? ఎదుటి వారు మీ మాటలు వినాలనుకుంటే డబ్బులైనా ఇవ్వాలి, పూజ అయినా చేయించాలి. వారి నమ్మకమైనా స్వీకరించాలి. వినటమే ఉద్యోగమైన వాళ్లైతే వింటారు. కాని, అందులో శాశ్వతమైన విముక్తి ఉండదు. మన మీద ఉన్న భారాన్ని స్వేచ్ఛగా, అనాలోచితంగా తొలగించుకోవాలనుకుంటాం - మళ్లీ తరవాత విచారించేందుకు ఆస్కారం లేకుండా. మీరు మనస్సు విప్పి చెప్పినది, అంటే

పరిశుద్ధం కావటం వినేవారి మీద ఆధారపడి ఉండదు. హృదయాన్ని విప్పి చూపాలని కోరేవారిలోనే ఉంటుంది. తమ హృదయాన్ని విప్పి చూపటం ముఖ్యం - ఎవరో ఒకరు, ఏ ముష్టివాడో దొరుకుతాడు, వారి ముందు అంతా వెళ్లబోసుకోవటానికి. ఆత్మ పరిశీలన చేసుకునే వారు ఎన్నటికీ హృదయాన్ని విప్పి చూపలేరు. అది నాలుగు వైపులనుంచీ మూసేసి, నిస్పృహ కలిగించి, పూర్తిగా నిరుపయోగంగా ఉంటుంది. తెరవటమంటే వినటం - మిమ్మల్ని మీరే కాదు, మీపైన ఉన్న ప్రతి ప్రభావాన్నీ, మీలో కలిగే ప్రతి సంచలనాన్నీ వినాలి. మీరు విన్న దాన్ని గురించి మీరు ఇదమిద్ధంగా ఏదైనా చెయ్యటానికి అవకాశం ఉండొచ్చు, ఉండకపోవచ్చు. కాని, తెరిచి ఉన్నదనే యథార్థమే దాని చర్య అది తీసుకుంటుంది. ఆ విధంగా వినటం వల్ల మీ హృదయం పరిశుద్ధమవుతుంది; మనస్సుకి సంబంధించినవన్నీ ప్రక్షాళితమవుతాయి. మనస్సుతో వినటం అంటే కబుర్లు చెప్పుకోవటం. అందులో మీకు గాని, ఎవరికి గాని విముక్తి ఉండదు. అది బాధని ఇంకా కొనసాగిస్తుంది. అది తెలివి తక్కువతనం.

తాపీగా తాము చెప్పదలుచుకున్న విషయానికి వస్తున్నారు.

"మా సమస్య గురించి మాట్లాడాలని వచ్చాం. మేము అసూయా పరులం - నేను కాదు, ఈవిడ. ఇదివరకు ఇప్పుడంత బాహాటంగా అసూయ కనపరచక పోయినా, ఎప్పుడూ సూచనగా తెలుస్తూనే ఉండేది. ఆవిడ అసూయపడే కారణాన్ని నేనెప్పుడూ కలిగించలేదు. కాని ఆవిడకెప్పుడూ ఏదో ఒక కారణం కనిపిస్తూనే ఉంటుంది."

అసూయ పడటానికి ఏదైనా కారణం ఉండాలనుకుంటున్నారా? అసూయకి కారణం ఉంటుందా? కారణం తెలియగానే అసూయ మాయమైపోతుందా? కారణం తెలిసిన తరువాత కూడా అసూయ అలాగే ఉంటుందని మీరు గమనించలేదా? కారణం కోసం వెతకొద్దు మనం. అసూయ అనేదాన్నే అర్థం చేసుకుందాం. మీరన్నట్లు ఏదో ఒక వంక దొరకచ్చు ఈర్ష్య పడటానికి. ఈర్ష్య అనేదాన్ని అర్థం చేసుకోవాలి, అది దేనివల్ల వచ్చిందో కాదు.

"అసూయ నాలో చాలాకాలం నుంచి ఉంది. మాకు వివాహం

అయినప్పుడు నా భర్త గురించి నాకు బాగా తెలియదు. అదంతా ఎలా జరుగుతుందో మీకు తెలుసును. అసూయ క్రమంగా వ్యాపించిండ వంటింట్లో పొగలా."

పురుషుణ్ణి గాని, స్త్రీని గాని ఆకట్టుకుని ఉంచుకోవటానికి అసూయ ఒక మార్గం కాదా? ఎంత ఎక్కువ అసూయపడితే అంత ఎక్కువగా తన సొంతం చేసుకున్న భావన కలుగుతుంది. దేన్నైనా సొంతం చేసుకుంటే ఆనందం కలుగుతుంది. దేన్నైనా, కుక్కనైనా సరే మన ఒక్కరిదే అనుకుంటే ఎంతో హాయిగా సుఖంగా ఉన్నట్లుంటుంది. మన ఒక్కరి సొంతమే అయినప్పుడు ధైర్యం, విశ్వాసం కలుగుతాయి. దేన్నైనా మన సొంతం చేసుకుంటే, మనకి ప్రాముఖ్యం ఏర్పడుతుంది. ఈ ప్రాముఖ్యాన్నే పట్టుకు వ్రేలాడతాం. మనం సొంతం చేసుకున్నది ఒక పెన్సిలు కాదు, ఒక ఇల్లు కాదు, కాని, మనిషి అయినప్పుడు దానివల్ల శక్తి కలిగినట్లూ, వింతగా తృప్తికలిగినట్లూ అనిపిస్తుంది. ఈర్ష్య ఇంకొకరి మూలానకాదు. దాని విలువ మూలాన్నీ, మన ప్రాముఖ్యం మూలాన్నీ ఉంటుంది.

"కాని, నేను ముఖ్యమైన దాన్నికాదు. నేనేమీ కాను, నాకున్నదల్లా నాభర్తే. నా పిల్లలు కూడా లెక్కలోకి రారు."

మనమంతా, పట్టుకు వ్రేలాడేది ఒక్కదాని కోసమే - దాని రూపాలు వేరుకావచ్చు. మీరు మీ భర్తనీ, మరొకరు వారి పిల్లల్నీ, మరొకరు ఏదో నమ్మకాన్నీ పట్టుకు ప్రాకులాడతారు. ఉద్దేశం అందరిదీ ఒక్కటే. మనం దేనికోసం ప్రాకులాడుతున్నామో అది లేకుంటే మనం తప్పిపోయినట్లు భావిస్తాం. భావించమూ? మనం ఒంటరిగా ఉండాలంటే భయపడతాం. భయమే అసూయ, ద్వేషం, బాధ. అసూయకీ, ద్వేషానికీ అట్టే భేదం లేదు.

"కాని మాకు ఒకరిపై ఒకరికి ప్రేమ ఉంది."

అలా అయితే మీరు అసూయగా ఎలా ఉండగలరు? మనం ప్రేమించం. అదే దురదృష్టకరమైన విషయం. మీరు మీ భర్తని ఉపయోగించు కుంటున్నారు, ఆయన మిమ్మల్ని ఉపయోగించుకుంటున్నట్లు గానే - మీరు సుఖంగా ఉండటానికీ, మీకో తోడు ఉండటానికీ, ఒంటరిగా ఉన్న భావం

లేకుండా ఉండటానికీ. మీ సొంతంది అంటూ ఎక్కువగా లేకపోవచ్చు. కాని మీతో కలిసి ఉండటానికైనా ఎవరో ఒకరున్నారు. ఈ పరస్పర అవసరాన్నే, ఉపయోగాన్నే ప్రేమ అంటున్నాం.

"కాని అది ఘోరం"

అది ఘోరం కాదు. ఎటొచ్చీ మనం దానివైపు ఎప్పుడూ చూడం. దాన్ని ఘోరం అని చెప్పి, దానికో పేరు పెట్టి, వెంటనే చూపు మరోవైపుకి తిప్పుకుంటాం - అదే మీరు చేస్తున్నది.

"నాకు తెలుసు. కాని, నాకు చూడాలని లేదు. నేను ఉన్నట్లుగానే ముందుకూడా ఉండాలనుకుంటున్నాను. - అసూయ పడుతూనైనా సరే. నా జీవితంలో చూడగలిగిందంతకన్న ఏమీలేదు."

ఇంకో దాన్ని దేన్నైనా చూడగలిగితే అప్పుడు మీ భర్త అంటే మీకు ఆపైన అసూయ ఇక ఉండదా? అయితే, అప్పుడు దాన్ని పట్టుకు ప్రాకులాడుతారు, ఇప్పుడు మీ భర్తని పట్టుకుని ప్రాకులాడినట్లు. అంచేత, అదంటే కూడా మీకు అసూయ కలుగుతుంది. మీ భర్తకి ప్రయత్యామ్నాయంగా మరొకటి వెతుక్కోవాలనుకుంటున్నారు మీరు - అంతేగాని అసూయకి విముక్తికాదు. మనమంతా అంతే. ఒకటి వదిలేసేముందు ఇంకొకటి ఉంటుందన్నది నిశ్చయంగా తెలియాలనుకుంటాం. మీరు పూర్తిగా సందేహ స్థితిలో ఉన్నప్పుడే ఈర్ష్యకి తావుండదు. నిశ్చయంగా ఉన్నప్పుడు, మీ దగ్గర ఏదో ఉన్నదని అనుకుంటున్నప్పుడు ఈర్ష్య ఉంటుంది. తమ ఒక్కరి సొంతమే అనే భావమే నిశ్చయం. సొంతం చేసుకోవటం అంటే అసూయపడటమే. సొంతం చేసుకున్నది ఎప్పుడైతే ఉన్నదో అప్పుడు ప్రేమ ఉండదు. సొంతం చేసుకోవటమంటేనే ప్రేమని నాశనం చెయ్యటం.

"నేను ఇప్పుడే గ్రహించగలుగుతున్నాను. నా భర్తని ఎప్పుడూ నిజంగా నేను ప్రేమించలేదు. ఎప్పుడైనా ప్రేమించానా? నాకిప్పుడిప్పుడే అర్థమవుతోంది."

ఆవిడ ఏడ్చింది.

## 57. స్వాభిమానం

ఆవిడ ముగ్గురు స్నేహితులతో కలిసి వచ్చింది. చిత్తశుద్ధితో వచ్చారు. తెలివితేటలతో వచ్చే ఒక దర్పంతో ఉన్నారు వాళ్లందరూ. ఒకాయన చెప్పినది తొందరగా గ్రహించగలడు. ఇంకొకాయన తన తొందరలో అసహనంగా ఉంటాడు. మూడో ఆయన ఆత్రుతగా ఉన్నాడు గాని, ఆ ఆత్రుతని నిలుపుకోలేక పోతున్నాడు. వారు ముగ్గురూ కలిస్తే బాగానే ఉంది. ముగ్గురూ తమ స్నేహితురాలి సమస్యలో భాగం పంచుకుంటున్నారు. ఎవ్వరూ సలహా ఇవ్వలేదు. విలువైన అభిప్రాయాలు వెలిబుచ్చలేదు. సంప్రదాయం ప్రకారం గాని, నలుగురూ చెప్పిన ప్రకారంగాని, వ్యక్తిగతంగా తోచినట్లుగాని, ఆవిడ ఏది మంచిదనుకుంటే అది చెయ్యటంలో ఆవిడకి సహాయం చెయ్యాలని ముగ్గురూ కోరుతున్నారు. వచ్చిన కష్టమేమిటంటే, ఏది సరియైన పని? ఆవిడకే నిశ్చయంగా తెలియదు. ఆవిడకి ఇబ్బందిగానూ, కంగారుగానూ ఉంది. కాని తక్షణం ఏదో చర్య తీసుకోవాలనే ఒత్తిడి ఎక్కువగా ఉంది. ఏదో నిర్ణయానికి రావాలి. ఆవిడ దాన్ని ఇంకా ముందుకి నెట్టటానికింక కుదరదు. ఒక ప్రత్యేక సంబంధం నుంచి విముక్తి పొందాలన్నది సమస్య. విముక్తి పొందాలనే ఉందావిడకి. ఆవిడ దాన్ని అనేకసార్లు పదేపదే చెప్పింది.

గదిలో నిశ్శబ్దంగా ఉంది. ఆ మానసిక ఆందోళన తగ్గింది. ఏవిధమైన ఫలితం ఆశించకుండా సరియైన పని ఏమిటన్నది నిర్ణయించకుండా సమస్యని పరిశీలించటానికి వాళ్లంతా ఆత్రుత పడుతున్నారు. సమస్యని బయట పెట్టగానే సరియైన పని ఏమిటో సంపూర్ణంగా దానంతటదే తేలుతుంది. సమస్యలో ఉన్నదంతా ఆవిష్కరించటం ముఖ్యం, అంతేకాని, ఆఖరున వచ్చే ఫలితం కాదు. ఏ సమాధానం వచ్చినా అది మరో నిర్ణయం, మరో అభిప్రాయం, మరో చిన్న సలహా అవుతుందేగాని సమస్యని ఏవిధంగానూ పరిష్కరించలేదు. అసలు సమస్యనే అర్థం చేసుకోవాలి. అంతేగాని, ఆ సమస్యని ఎలా ఎదుర్కోవాలి, దానికోసం ఏం చెయ్యాలి అన్నది కాదు. సమస్యని సరియైన విధంగా సమీపించటం ముఖ్యం. ఎందువల్లనంటే సమస్యలోనే సరియైన చర్య ఇమిడి ఉంటుంది.

నదిలో నీళ్ళ నాట్యం చేస్తున్నాయి - సూర్యుడు వాటిమీద వెలుగు బాటని వేశాడని. తెల్లని తెరచాప కట్టిన పడవ ఒకటి ఆ త్రోవన వెళ్ళింది. కాని ఆ నాట్యానికి ఆటంకం కలగలేదు. పరిపూర్ణ ఆనందంతో చేసే నాట్యం అది. చెట్ల నిండా ఉన్నాయి పక్షులు - అరుస్తూ, ముక్కుల్తో ఈకలు సవరించు కుంటూ, ఎగురుతూ, మళ్ళీ వెనక్కి వస్తూ. ఎన్నో కోతులు లేత ఆకుల్ని తెంపి నోటినిండా కుక్కుకుంటున్నాయి. వాటి బరువుకి లేత కొమ్మలు పొడుగ్గా వంపులు తిరుగుతున్నాయి. అయినా వాటిని ఎంతో తేలిగ్గా పట్టుకుని ఉన్నాయి భయపడకుండా. ఎంతో సునాయాసంగా ఒక కొమ్మ మీంచి మరో కొమ్మ మీదికి జరుగుతున్నాయి. గెంతుతున్నా ప్రవహిస్తున్నట్లుంది - ఎగరటమూ మళ్ళీ దిగటమూ ఒక చలనంలా ఉంది. తోకలు వ్రేలాడేసుకుని కూర్చుని ఆకుల్ని అందుకుంటున్నాయి. అవి బాగా పైకి ఉన్నాయి. క్రింద వెడుతున్న మనుషుల్ని పట్టించుకోవటం లేదు. చీకటి పడుతూంటే వందలకొద్దీ చిలకలు ఆకుల గుబురుల్లో రాత్రికి తలదాచుకోవటానికి వస్తున్నాయి. అవి వస్తూనే చెట్ల ఆకుల్లో మాయమై పోతున్నాయి. పాడ్యమి చంద్రుడు కొద్దిగా కనిపిస్తున్నాడు. దూరంగా రైలు కూత పెట్టింది - నది వంపు తిరిగిన చోట వంతెనమీంచి దాటిపోతూ. ఈ నది పవిత్రమైనది. ఎంతో దూరాల నుంచి వస్తారు జనం అందులో స్నానం చెయ్యటానికి, తమ పాపాలు అందులో కొట్టుకు పోవచ్చునని. ప్రతి నదీ అందంగానూ పవిత్రంగానూ ఉంటుంది. ఈ నది అందమంతా దాని వెడల్పాటి పెద్ద వంపూ, లోతుగా పారే నీటిలో మధ్యమధ్య ఇసుక తిన్నెలూ, ప్రతిరోజూ నది మీద ఇటూ అటూ పోయే తెల్లని తెరచాపలున్న పడవలూ.

"ఆ బంధం నుంచి విముక్తి పొంది స్వేచ్ఛగా ఉండాలనుకుంటున్నాను" అందావిడ.

స్వేచ్ఛగా ఉండాలని కోరటంలో మీ ఉద్దేశం ఏమిటి? "నేను స్వేచ్ఛగా ఉండాలని కోరుతున్నాను" అనగానే మీరు స్వేచ్ఛగా లేరనే అర్థమవుతుంది. ఏవిధంగా మీరు స్వేచ్ఛగా లేరు?

"శారీరకంగా స్వేచ్ఛగానే ఉన్నాను. రావటానికీ, పోవటానికీ స్వేచ్ఛ ఉంది, నేను ఇప్పుడు భార్యని కాదు కాబట్టి. కాని నాకు సంపూర్ణ స్వేచ్ఛ

కావాలి. ఆ వ్యక్తితో ఏవిధమైన సంబంధమూ ఇష్టం లేదు నాకు."

ఏ విధంగా ఆ వ్యక్తితో సంబంధం ఉంది మీకు? శారీరకంగా ఇప్పటికే స్వేచ్ఛగా ఉన్నట్లయితే? మీకూ ఆయనకీ ఇంకే విధమైన సంబంధమైనా ఉందా?

"నాకు తెలియదు. ఆయనంటే నాకు చాలా ద్వేషం. ఆయనకి సంబంధించిన దాంతో నాకు ఏవిధమైన ప్రమేయమూ ఉండటం ఇష్టంలేదు."

మీకు స్వేచ్ఛ కావాలి. కాని ఆయన మీద మీకు ద్వేషం ఉందా? అయితే ఆయన నుంచి మీరు స్వేచ్ఛగా లేరన్న మాట. ఆయన మీద ఎందుకు ద్వేషం?

"ఆయన ఎటువంటాయనో ఈ మధ్యనే కనుక్కున్నాను - ఆయనకున్న అల్పబుద్ధి, ప్రేమ అనేది నిజంగా లేకపోవటం, ఆయనకున్న స్వార్థం. ఆయన గురించి ఎంత ఘోరమైన విషయం తెలుసుకున్నానో మీకు చెప్పలేను. ఆయన గురించి అసూయ పడేదాన్ననీ, ఆయన్ని ఆరాధించే దాన్ననీ, ఆయనకి లొంగాననీ తలుచుకుంటే! ఆయన ఆదర్శవంతమైన భర్త అనీ, ప్రేమగా దయగా ఉంటారనీ అనుకునేదాన్ని. అలాంటిది, ఆయనలో మూర్ఖత్వం, కపటత్వం ఉన్నవని తెలుసుకోగానే ఆయన మీద ద్వేషం ఏర్పడింది. ఆయనతో నాకసలు సంబంధం అనేది ఉండేదనుకుంటేనే నేను అపరిశుభ్రం అయినట్లుగా అనిపిస్తోంది. ఆయన్నుంచి పూర్తిగా స్వేచ్ఛగా ఉండాలని కోరుతున్నాను."

మీరు ఆయన్నుంచి శారీరకంగా స్వేచ్ఛగా అయి ఉండవచ్చు. కాని మీకు ఆయనపైన ద్వేషం ఉన్నంతకాలం మీకు ఆయన నుంచి స్వేచ్ఛ లభించదు. మీరు ఆయన్ని ద్వేషిస్తే ఆయనతో బంధింపబడే ఉంటారు. మీకు ఆయనంటే తలవంపులుగా ఉన్నట్లయితే ఆయన క్రింద మీరింకా బానిసగానే ఉంటారు. మీకు ఆయనమీద కోపమా, లేక మీమీదేనా? ఆయన ఉన్నట్లు ఆయన ఉన్నారు. దానికి ఆయనమీద కోపం దేనికి? మీ కోపం నిజంగా ఆయన మీదేనా, లేక ఉన్న స్థితిని చూసిన మీదట దానితో మీకు సంపర్కం ఉన్నందుకు మీరంటే మీకు తలవంపులుగా ఉందా? మీ ద్వేషం

నిజానికి, ఆయన మీద కాదు, మీ విచక్షణా జ్ఞానం మీద, మీ చర్యల మీదనే మీకు కోపం. మిమ్మల్ని చూసి మీరే సిగ్గుపడుతున్నారు. ఇది గ్రహించటం ఇష్టంలేక ఆయన ఉన్నస్థితికి ఆయన్ని నిందిస్తున్నారు. మీకు ఆయన మీద ఉన్న కోపం మీ ప్రణయారాధన నుంచి తప్పించుకునే మార్గం మాత్రమే అని మీరు గ్రహించినప్పుడు ఆయన ప్రసక్తే ఉండదు. ఆయన్ని గురించి మీరు సిగ్గుపడటం లేదు. ఆయనతో సంపర్కం పెట్టుకున్నందుకు మిమ్మల్ని చూసి మీరే సిగ్గుపడుతున్నారు. మీ మీదే మీకు కోపం, ఆయన మీద కాదు.

"అవును, అది నిజమే."

ఇది మీరు నిజంగా గ్రహించినట్లయితే, దాన్ని యథార్థంగా అనుభవం పొందినట్లయితే, మీరు ఆయన నుంచి స్వేచ్ఛగా ఉంటారు. ఆయనంటే మీకు శత్రుత్వం ఉండదు. ప్రేమ బంధించినట్లుగానే ద్వేషంకూడా బంధిస్తుంది.

"అయితే, నా సిగ్గు నుంచి, నా తెలివి తక్కువతనం నుంచీ నేను స్వేచ్ఛగా ఉండటం ఎలా? ఆయన ఉన్న విధంగా ఆయన ఉన్నారనీ, ఆయన్ని నిందించకూడదనీ గ్రహించాను స్పష్టంగానే. కాని నా తలవంపుల నుంచీ, నాలో పెరిగి పెద్దదై బ్రద్దలయే స్థితికి వచ్చిన నా కోపం నుంచీ స్వేచ్ఛగా ఉండటం ఎలా? గతాన్ని తుడిచి పెట్టెయ్యటం ఎలా?"

గతాన్ని ఎందుకు తుడిచి పెట్టెయ్యాలనుకుంటున్నారో అది ఎక్కువ ముఖ్యం - ఎలా తుడిచిపెట్టెయ్యాలన్న దాని కన్న. సమస్యని ఏ ఉద్దేశంతో సమీపిస్తున్నారో అది ఎక్కువ ముఖ్యం - దాని గురించి ఏంచెయ్యాలను కుంటున్నారో అనే దాని కన్న. ఆ సంబంధాన్ని గురించి జ్ఞాపకాన్ని ఎందుకు తుడిచి పెట్టెయ్యాలనుకుంటున్నారు?

"ఆ గడిచిన సంవత్సరాల జ్ఞాపకం నాకిష్టం లేదు. వాటివల్ల నా నోట్లో చేదు మాత్రమే మిగిలింది. అది తగినంత కారణం కాదంటారా?"

అంతగా కాదు, అవునా? ఈ గత జ్ఞాపకాలను ఎందుకు తుడిచి పెట్టెయ్యాలనుకుంటున్నారు? నిజానికి అవి మీనోట చేదు మిగిల్చా యన్నందుకు కాదు. ఏదో విధంగా ఆ గతాన్ని తుడిచి పెట్టెయ్యగలిగినా

మీకుతలవంపులు కలిగే మరోచర్యలో ఇరుక్కోవచ్చు. సంతోషం కలిగించని జ్ఞాపకాలను తుడిచి పెట్టేసినంత మాత్రాన సమస్య పరిష్కారం కాదు. అవుతుందా?

"అవుతుందనే అనుకున్నాను. కాకపోతే సమస్య ఏముంటుంది? మీరు దీన్ని మరింత గందరగోళం చెయ్యటం లేదూ? ఇప్పటికే గందర గోళంగా ఉంది, అంటే, నా జీవితం. దానికి ఇంకా కొంత బరువు చేర్చటం దేనికి?"

దానికి కొంత బరువు చేరుస్తున్నామా, లేక, ఉన్న స్థితిని అర్థం చేసుకోవటానికీ, దాని నుంచి స్వేచ్ఛ పొందటానికీ ప్రయత్నిస్తున్నామా? దయచేసి మరి కొంత ఓర్పు వహించండి. గతాన్ని తుడిచి పెట్టెయ్యాలన్న తపన దేనివల్ల కలుగుతోంది మీలో? అది సంతోషకరమైనది కాకపోవచ్చు. దాన్ని తుడిచి పెట్టెయ్యటమెందుకు? మీ గురించి మీరే ఏర్పరచుకున్న భావంగాని, మీరు చిత్రించుకున్న చిత్రంగాని ఉంది. ఈ జ్ఞాపకాలు దాన్ని వ్యతిరేకిస్తున్నాయి. అందువల్ల వాటిని వదిలించుకోవాలనుకుంటున్నారు. మీ గురించి మీకు గౌరవభావం ఉంది. లేదా?

"తప్పకుండా ఉంది. లేకపోతే ...."

మనమంతా మనల్ని వివిధ అంతస్తుల్లో పెట్టుకుంటాం. ఆ ఎత్తుల మీంచి నిత్యం క్రిందికి పడిపోతూ ఉంటాం. ఈ పడిపోవటాలవల్లనే మనకి అవమానకరంగా ఉంటుంది. మన అవమానానికీ, మనం పడిపోవటానికీ కారణం స్వాభిమానమే. మనం అర్థం చేసుకోవలసినది ఈ స్వాభిమానాన్నే. అంతేకాని, పడిపోవటాన్ని కాదు. మిమ్మల్ని మీరు నిలబెట్టుకున్న పీఠమే లేకపోతే దాన్నుంచి పడిపోవటం అనేదే ఉండదు. మిమ్మల్ని మీరు ఆత్మగౌరవం, మనిషికి ఉండే హోదా, ఆదర్శం వంటి పీఠం మీద ఎందుకు నిలబెట్టుకున్నారు? దీన్ని మీరు అర్థం చేసుకోగలిగితే గతం వల్ల అవమానం పొందటం ఉండదు. అది పూర్తిగా పోతుంది. మీరు మీ పీఠం లేకుండా ఎలా ఉంటారో అలాగే ఉంటారు. ఆ పీఠం లేనట్లయితే, దాన్నుంచి పైకి గాని, క్రిందికి కాని చూచే ఎత్తే ఉండదు. ఇక, మీరు ఏది గ్రహించకుండా తప్పించు కుంటున్నారో ఆ అసలైన మీ స్థితిని మీరు గ్రహిస్తారు. ఈ ఉన్నస్థితిని, మీరున్న

స్థితిని తప్పించుకోవటం మూలాన్నే గందరగోళం, వైరుధ్యం, అవమానం, కోపం, అన్నీ వస్తున్నాయి. మీరు ఏ స్థితిలో ఉన్నారో నాతో గాని, మరెవరితో గాని చెప్పనక్కరలేదు. కాని, మీరెలా ఉన్నారో మీకై మీరు తెలుసుకుని ఉండాలి - అది సంతోషకరమైనదైనా, సంతోషకరంకానిదైనా, ఎటువంటిదైనా. దానితోనే జీవించండి. దాన్ని సమర్థించటంగాని, ప్రతిఘటించటం గాని చెయ్యకుండా. దానికో పేరు పెట్టకుండా దానితో జీవించండి. పేరు పెట్టటమే దాన్ని ఖండించటమో, దానితో ఐక్యం కావటమో అవుతుంది. భయం లేకుండా దానితో జీవించండి. ఎందువల్లనంటే భయం దేన్నీ తెలుసుకోనివ్వదు. అదేమిటో తెలుసుకోకుండా దానితో జీవించలేరు. తెలుసుకుని ఉండటమంటే ప్రేమించటం. ప్రేమ లేకుండా గతాన్ని తుడిచి పెట్టలేరు. ప్రేమ ఉంటే గతం ఉండదు. ప్రేమే ఉంటుంది, కాలం ఉండదు.

## 58. భయం

ఆవిడ ఎంతో దూరం ప్రయాణం చేసింది. ప్రపంచంలో సగం భాగం దాటి వచ్చింది. ఎంతో జాగ్రత్త పడుతున్నట్లూ, రక్షించుకుంటూ ముందుకి సాగుతున్నట్లుగా ఉందావిడ. కొద్దిగా తెరుచుకుని, కాస్త లోతుగా తరచి చూచినట్లనిపిస్తే చాలు మూసుకుపోతోంది. ఆవిడ భీరువు కాదు. తన అంతరంగిక స్థితిని బయటపెట్టటం ఆవిడ కిష్టం లేదు, వ్యక్తం కాకపోయినా. అయినా, ఆవిడ తన గురించీ, తన సమస్యల గురించీ మాట్లాడాలని కోరుకుంటోంది. అసలు అంతదూరం నుంచి వచ్చింది కూడా అందుకే. ఏం మాట్లాడాలో స్పష్టంగా తెలియక ముడుచుకుపోతోంది. మళ్లీ తన గురించి చెప్పుకోవాలని ఆత్రుత. మనస్తత్వశాస్త్రం గురించి చాలా పుస్తకాలు చదివిందట. అయితే, ఎవరిచేతా విశ్లేషణ చేయించుకోలేదుట. తన్ను తాను విశ్లేషణ చేసుకోవటం బాగా చాతనవునుట. అసలు చిన్నప్పటి నుంచీ తన ఆలోచనలనూ, అనుభూతులనూ విశ్లేషణ చేసుకోవటం తనకు అలవాటేనని చెప్పిందావిడ.

మిమ్మల్ని మీరు విశ్లేషణ చేసుకోవాలని పట్టుదల ఎందుకు మీకు?

"నాకు తెలియదు. కాని, నాకు గుర్తు తెలిసినప్పటి నుంచీ ఎప్పుడూ చేస్తూనే ఉన్నాను."

మీనుంచి మిమ్మల్ని రక్షించుకోవటానికీ, మీ భావావేశాలు పొంగి పోకుండా ఉండటానికీ, దానివల్ల బాధలు లేకుండా ఉండటానికీ విశ్లేషణ ఒక మార్గమా?

"నాకు బాగా నిశ్చయంగా తెలుసును. అందుకే నేను విశ్లేషణ చేసుకుంటాను. నిత్యం ప్రశ్నించుకుంటూ ఉంటాను. నా విషయంలో గాని, ఇతర విషయాల్లోగాని నా చుట్టూ కనిపించేటటువంటి గందరగోళంలో ఇరుక్కోవటం నాకిష్టం లేదు. అదంతా భయంకరమైనది. దానికి దూరంగా ఉండాలని నా కోరిక. నన్ను నేను సంరక్షించుకోవటానికీ, సంఘం, సంసారం, అనే కల్లోలంలో చిక్కుకోకుండా ఉండటానికీ విశ్లేషణను ఒక సాధనంగా ఉపయోగించుకున్నానని నేనిప్పుడు గ్రహిస్తున్నాను."

చిక్కుకోకుండా తప్పించుకోగలిగారా?

"నిశ్చయంగా తెలియదు. కొన్ని దిశల్లో విజయవంతమయాను. మరి కొన్నిటిలో కాలేదనుకుంటాను. ఇదంతా చెబుతూంటే నేనెంత అద్భుతమైన పని చేశానో తెలుస్తోంది. దీన్ని నేనెప్పుడూ ఇంత స్పష్టంగా గ్రహించలేదు."

మిమ్మల్ని మీరు అంత తెలివిగా ఎందుకు కాపాడుకుంటున్నారు? దేన్ని గురించి? మీ చుట్టూ ఉన్న గందరగోళం అన్నారు. మిమ్మల్ని మీరు కాపాడుకోవలసినది ఏముంది ఆ గందరగోళంలో? అది గందరగోళమని మీరు స్పష్టంగా తెలుసుకున్నప్పుడు దాన్నుంచి మిమ్మల్ని మీరు కాపాడు కోవలసిన అవసరం ఉండదు. భయం ఉన్నప్పుడే ఎవరైనా తన్ను తాను రక్షించుకోవటం జరుగుతుంది, - అవగాహన ఉన్నప్పుడు కాదు. మీకు దేనివల్ల భయం?

"నేను భయపడుతున్నాననుకోను. బ్రతుకు బాధల్లో చిక్కుకోవటం నాకిష్టం లేదంతే. నాకు ఉద్యోగం ఉంది నాకు ఆధారంగా. కాని, తక్కిన బంధనాల నుంచి స్వేచ్ఛగా ఉండాలనుకున్నాను. ఉన్నాననే అనుకుంటున్నాను."

మీకు భయం లేనట్లయితే ఆ బంధనాలను ప్రతిఘటించటం దేనికి?

దేనితోనైనా ఎలా వ్యవహరించాలో తెలియనప్పుడే ప్రతిఘటన ఉంటుంది. మోటారు ఎలా పని చేస్తుందో మీకు తెలిస్తే మీరు స్వేచ్ఛగా ఉంటారు. ఏదైనా చెడిపోతే దాన్ని బాగుచేసుకోగలరు. మనకి అర్థంకాని దాన్నే ప్రతిఘటిస్తూ ఉంటాం. గందరగోళాన్నీ, పాపాన్నీ, దుఃఖాన్నీ ప్రతిఘటిస్తాం - దాని నిర్మాణం తెలియనప్పుడు, అదెలా రూపొందిందో తెలియనప్పుడు. గందరగోళం నిర్మాణం ఎలాంటిదో, ఎలా ఏర్పడిందో మీరు తెలుసుకోలేదు కాబట్టి మీరు ప్రతిఘటిస్తున్నారు. మీరు దాన్ని ఎందుకు తెలుసుకోలేదు?

"నేనెప్పుడూ ఆవిధంగా ఆలోచించలేదు."

గందరగోళం నిర్మాణంతో ప్రత్యక్ష సంబంధం మీకు ఉన్నప్పుడే అది పనిచేసే పద్ధతిని మీరు తెలుసుకోగలుగుతారు. ఇద్దరి మనుషుల మధ్య సంపర్కం ఉన్నప్పుడే ఒకరినొకరు అర్థం చేసుకోగలుగుతారు. ఒకరి నొకరు ప్రతిఘటిస్తూంటే అవగాహన కలగదు. భయం లేనప్పుడే సంపర్కంగాని సంబంధం గాని ఉంటుంది.

"మీ ఉద్దేశం గ్రహించాను."

అయితే మీరు దేన్నుంచి భయపడుతున్నారు?

"భయం అంటే ఏమిటి మీ ఉద్దేశంలో?"

భయం సంబంధంలోనే ఉంటుంది. భయం దానంతట అది విడిగా ఉండదు. నిష్కారణమైన భయం అంటూ ఏదీ ఉండదు. తెలిసిన దాన్ని గురించో, తెలియని దాన్ని గురించో, ఒకరు చేసిన దాన్ని గురించో, చెయ్యబోయే దాన్ని గురించో భయం ఉంటుంది. గతం గురించిగాని, భవిష్యత్తు గురించి గాని భయం ఉంటుంది. తాము ఉన్న స్థితికీ, ఉండదలుచుకున్న స్థితికీ మధ్యనున్న సంబంధం భయాన్ని కల్పిస్తుంది. తాము ఉన్న యథార్థస్థితిని బహుమాన రూపంలోగాని, శిక్షరూపంలో గాని అనువదించి చెబితే భయం పుడుతుంది. బాధ, సంతోషం - వీటి మధ్య నున్న వ్యత్యాసం వల్ల భయం ఉంటుంది. పరస్పర వ్యతిరేకమైన వాటి మధ్య సంఘర్షణలో భయం ఉంటుంది. విజయాన్ని ఆరాధిస్తే, అపజయం అంటేనే భయం వేస్తుంది. ఏదో అవాలనే పోరాటంలో జరిగే మానసిక ప్రక్రియ భయం.

మంచిగా అవటంలో పాపభీతి ఉంటుంది. సంపూర్ణంగా అవటంలో ఒంటరితనం అంటే భయం ఉంటుంది. గొప్పగా అవటంలో చిన్నతనం గురించి భయం ఉంటుంది. పోల్చటం, అవగాహన కాదు. తెలిసిన దానివల్ల తెలియనిదంటే ఉండే భయం వల్ల చేసే పని అది. రక్షణ కోసం వెతకటంలోని అనిశ్చితస్థితి భయం.

ఏదో అవాలనే ప్రయత్నంతోనే భయం ఆరంభమవుతుంది - ఉన్నదాని గురించీ, లేనిదాని గురించీ, మనస్సు అనే అనుభవశేషం ఇంతకు ముందెరుగని, పేరుపెట్టని సమస్య ఏదో ఎదురవుతుందనే భయంతో ఉంటుందెప్పుడూ. మనస్సు అనే పేరు, మాట, జ్ఞాపకం తెలిసిన జాగాలోనే పనిచెయ్యగలదు. తెలియని దాన్ని, అంటే క్షణక్షణానికీ ఎదురయే సమస్యని ప్రతిఘటించటమో, మనస్సు తనకి తెలిసిన మాటల్లోకి అనువదించటమో, జరుగుతుంది. ఈ ప్రతిఘటించటం, లేదా సమస్యని అనువదించటం - ఇదే భయం. ఎందువల్లనంటే, మనస్సు తెలియని దానితో సంపర్కం కలిగించు కోలేదు. తెలిసిన దానికి తెలియని దానితో సంపర్కం ఉండదు. తెలిసినది అంతమొందాలి తెలియనిది ఉండాలంటే.

మనస్సే భయాన్ని పుట్టిస్తుంది. అది భయాన్ని విశ్లేషించి, దాన్నుంచి తప్పించుకోవటానికి ప్రయత్నిస్తుంది. దానికి కారణాన్ని వెతికినట్లయితే, మనస్సు మరింత వేరుపడి, భయాన్ని అధికం చేస్తుంది. మీరు గందరగోళాన్ని ప్రతిఘటించటం వల్ల భయం ఎక్కువవుతుంది. దానివల్ల స్వేచ్ఛకు ఆటంకం ఏర్పడుతుంది. సంపర్కంలో స్వేచ్ఛ ఉంది - భయంలో కాదు.

## 59. నేను ఎలా ప్రేమించను?

మేము పర్వతం మీద బాగా ఎత్తున ఉన్నాం. క్రింద లోయ కనిపిస్తోంది. పెద్ద నదీ ప్రవాహం ఎండలో వెండితాడులా ఉంది. అక్కడక్కడ ఆకుల గుబురుల మధ్య నుంచి ఎండపడుతోంది. ఎన్నో రకాల పువ్వుల సువాసన వస్తోంది. ఆ ఉదయం రమణీయంగా ఉంది. నేలమీద మంచు ఇంకా ఒత్తుగా ఉంది. సువాసనతో కూడిన గాలి లోయ మీదుగా వస్తోంది. దాంతో

బాటు దూరాన్నుంచి మనుషుల చప్పుడూ, మువ్వల ధ్వనీ అప్పుడప్పుడు గంట చప్పుడూ వినవస్తోంది. లోయలోంచి పొగ తిన్నగా పైకి పోతోంది. దాన్ని చెల్లాచెదరు చేయటానికి తగినంత బలంలేదు గాలిలో. పొగపాయ చూడటానికి చాలా అందంగా ఉంది. లోయ క్రింద నుంచి పైకి లేచి ఆకాశాన్ని అందుకోవటానికి ప్రయత్నిస్తున్నట్లుగా ఉంది - ఆ పురాతన దేవదారు వృక్షం లాగ. ఒక పెద్ద నల్లని ఉడత మమ్మల్ని చూచి తిట్టి తిట్టి చివరికి మానేసి, చెట్టుమీంచి క్రిందికి వచ్చింది ఇంకా కనుక్కుందామని. తరవాత కొంత తృప్తిపడి చకచకా వెనక్కి వెళ్ళిపోయింది. ఒక చిన్న మబ్బు ఏర్పడుతోంది. అది మినహా ఆకాశం నిర్మలంగా, మృదువుగా లేత నీలం రంగులో ఉంది.

ఆయన కళ్లకిదేమీ కనిపించటంలేదు. ఆయన తన ముఖ్య సమస్య గురించి సతమతమవుతున్నాడు - అంతకు ముందు ఇతర సమస్యలతో సతమతమయినట్లుగానే. సమస్యలు ఏర్పడుతూ ఆయన చుట్టూ చేరి ఉన్నాయి. ఆయన బాగా ధనవంతుడు. సన్నగా కడ్డీలా ఉన్నాడు. కాని కులాసాగా ఉండి చిరునవ్వులు చిందిస్తాడు. ఇప్పుడాయన లోయకేసి చూస్తున్నాడు. కాని, చైతన్యవంతం చేసే ఆ అందం ఆయన్ని స్పృశించలేదు. ఆయన ముఖం మెత్తపడలేదు. ఆ గీతలు ఇంకా అలాగే కఠినంగా నిర్ణీతంగా ఉన్నాయి. ఆయన ఇంకా అన్వేషిస్తూనే ఉన్నాడు - డబ్బుకోసం కాదు, దేవుడు అని ఆయన అనుకునేదానికోసం. ఆయన ఎప్పుడూ ప్రేమ గురించీ, దేవుడి గురించే మాట్లాడతాడు. ఆయన ఎంతో దూరాలు వెళ్లి అన్వేషించాడుట. ఎంతో మంది గురువుల వద్ద ఉన్నాడుట. వయస్సు పైబడుతున్న కొద్దీ ఆయన అన్వేషణ మరింత తీవ్రంగా అవుతోందిట. ఆయన ఎన్నోసార్లు వచ్చాడు ఈ విషయాలు మాట్లాడటానికి. కాని, గడుసుగా ముందువెనకలు ఆలోచిస్తున్నట్లుగా కనిపించేవాడు. దేవుణ్ణి సాక్షాత్కరింపజేసుకోవటానికి ఎంత ఖర్చవుతుంది, ప్రయాణానికి ఎంత ఖర్చవుతుంది - అని నిత్యం లెక్కలు వేసుకుంటూ ఉండేవాడు. ఆయనకున్నదంతా తనతోపాటు తీసుకువెళ్లలేడని తెలుసును. ఇంకేదైనా తీసుకువెళ్లవచ్చునేమో, తను వెళ్లేచోట పనికొచ్చే నాణెం లాంటి దేదైనా? ఆయన కఠినాత్ముడు, హృదయంతోగాని, చేత్తోగాని ఎప్పుడూ ఔదార్యం చూపించడు. ఇంకా కొంచెం ఇవ్వాలంటే ఎంతో సందేహిస్తాడు.

ఎవడికి తగినట్లు వాడికి ఫలితం ముట్టాలంటాడు - తనకు తగినట్లు తనకు ముట్టినట్లుగా. ఆ రోజు ఉదయం తన్ను తాను ఇంకా తేటతెల్లం చేసుకోవటానికి వచ్చాడు. ఏదో కష్టం బాధిస్తోంది. చాలా వరకు విజయ వంతమైన ఆయన జీవితంలో ఏవో తీవ్రమైన ఇబ్బందులు వస్తున్నాయి. విజయలక్ష్మి ఆయన్ని పూర్తిగా వరించటం లేదు.

"నేను ఎటువంటి వాడినో నాకు తెలిసివస్తోంది" అన్నాడు. "ఇన్నేళ్ల నుంచీ మిమ్మల్ని తెలియకుండా వ్యతిరేకించి ప్రతిఘటించాను. మీరు ధనవంతులకు వ్యతిరేకంగా మాట్లాడతారు. మా గురించి ఎన్నింటినో పరుషంగా మాట్లాడుతారు. మీమీద నాకు కోపం వచ్చేది. కాని తిరిగి మిమ్మల్ని ఏమీ చెయ్యలేకపోయేవాణ్ణి. మిమ్మల్ని అందుకోవటం నావల్లకాదు. ఎన్నోవిధాల ప్రయత్నించాను. మిమ్మల్ని తాకలేకపోతున్నాను. ఇంతకీ నన్నేం చేయమంటారు? మీ మాటలు వినకుండా, మీ దరిదాపుల్లోకి ఎక్కడికీ రాకుండా దేవుడు చేసి ఉంటే బాగుండేదనుకుంటూ ఉంటాను. నాకిప్పుడు రాత్రులు నిద్ర ఉండదు. ఇదివరకు ఎంతో చక్కగా నిద్రపోయేవాడిని. భయంకరమైన కలలు వస్తున్నాయి నాకు. ఎప్పుడో గాని కలగనే వాణ్ణికాదు. మీరంటే భయం వేసేది. మిమ్మల్ని మౌనంగా శపించుకున్నాను. కాని, వెనక్కి తిరిగి పోలేను. నేనేం చెయ్యాలి? నాకు స్నేహితులు లేరు. మీరన్నట్లు ఇదివరకులా వాళ్లని కొనుక్కోలేను. జరిగిన దానివల్ల నేను పూర్తిగా బయటపడి పోయాను. నేను మీకైనా స్నేహితుణ్ణి కాగలనేమో. మీరు సహాయం చేస్తానన్నారు. అందుకే ఇక్కడికి వచ్చాను. నేనేం చెయ్యాలి?"

బయటపడటం అంత సులభం కాదు. అందులోనూ తన్నుతానే బయటపెట్టుకోవటమా? ఆ అలమారుని ఎప్పుడైనా తెరుస్తారా? దానిలో తాను చూడదలుచుకోనివన్నిటినీ కుక్కి జాగ్రత్తగా తాళం వేసి మూసి ఉంచినదాన్ని తెరుస్తారా? అసలు దాన్ని తెరవాలనీ, అందులో ఏముందో చూడాలనీ అనుకుంటారా?

"నేను చేస్తాను. కాని ఎలా మొదలుపెట్టాలి?"

నిజంగా చెయ్యాలనుకుంటున్నారా, లేక, ఆ ఉద్దేశంతో కేవలం

ఆటలాడుకుంటున్నారా? ఒకసారి తెరిస్తే కొంచెమైనా సరే, దాన్ని మళ్లీ మూయటం సాధ్యం కాదు. ఆ తలుపు ఎప్పుడూ తెరిచే ఉంటుంది. పగలూ, రాత్రీ, దానిలో ఉన్నవి పైకి ఒలికిపోతూ ఉంటాయి. పారిపోవటానికి ప్రయత్నించవచ్చు. ఎప్పుడూ చేసేదే ఆ పని. కాని, అది అలాగే ఉంటుంది నిరీక్షిస్తూ, గమనిస్తూ. నిజంగా తెరవాలని అనుకుంటారా ఎవరైనా?

"నిజంగానే నేను చేస్తాను. అందుకే వచ్చాను నేను. నేను దాన్ని ఎదుర్కోవాలి. అన్నీ ఆఖరైపోయే చోటికి చేరుతున్నాను - అందుకని. నేనేం చెయ్యాలి?"

తెరిచి చూడండి. ధనం కూడబెట్టటానికి గాయపరచాల, క్రూరంగా, ఔదార్యం లేకుండా ఉండాలి - నిర్దాక్షిణ్యత, గడుసుగా లెక్కలు వేసుకోవటం, నిజాయితీ లేకపోవటం ఉండాలి. బాధ్యత, కర్తవ్యం, సామర్థ్యం, హక్కులు వంటి - ఎంతో మధురంగా ధ్వనించే మాటలతో కప్పిపుచ్చి చేసే అహంకారపూరిత చర్య, అధికారం కోసం ప్రయత్నించడం కూడా ఉండాలి.

"అవును, అదంతా నిజమే. ఇంకేదన్నా నిజమే. ఎవ్వరి గురించీ ఆలోచించటం ఉండదు. మత సంబంధమైన వ్యాపకాలు మనకు గౌరవ ప్రతిష్ఠలనిచ్చే తొడుగులు మాత్రమే. ఇప్పుడు చూస్తే ప్రతీదీ నా చుట్టూ తిరిగినట్లుగా అనిపిస్తోంది. నేను కేంద్రాన్ని - కాదని నటించినా, అదంతా చూస్తున్నాను. కాని నేనేం చెయ్యాలి?"

మొట్టమొదట ఉన్నవాటిని ఉన్నట్లుగా చూడాలి. కాని, ఆ తరవాత వీటన్నిటినీ తుడిచి పారవెయ్యటం ఎలా కుదురుతుంది? ఆప్యాయత, ప్రేమ అనే పొగలేని జ్వాలలేనట్లయితే? ఈ జ్వాల ఒక్కటే ఆ అలమారులోని వాటినన్నిటినీ తుడిచి పారవెయ్యగలదు. ఇంకేదీ కాదు. విశ్లేషణగాని, త్యాగంగాని, పరిత్యాగంగాని చెయ్యలేదు. ఈ జ్వాల ఉన్నట్లయితే, అప్పుడది త్యాగంకాదు, పరిత్యాగం కాదు. అప్పుడు తుఫానుని ఢీకొంటారు, మీరు ఎదురు చూడకుండానే.

"కాని, నేను ప్రేమించటం ఎలా? మనుషులంటే నాకు ఆప్యాయత లేదని నేనెరుగుదును. నేను నిర్దాక్షిణ్యంగా ఉన్నాను. నాతో ఉండవలసిన

వాళ్లు నాతోలేరు. నేను కేవలం ఒంటరిగా ఉన్నాను. నేను ప్రేమించటం ఎలా నేర్చుకోను? చెయ్యాలని ఏదో చేస్తే వస్తుందనుకునేటంత మూర్ఖుణ్ణి కాను. ఏదో త్యాగం చేస్తేనో, ఏదో వదులుకుంటేనో వస్తుందనుకోవటం లేదు. నేనెప్పుడూ ప్రేమ చూపించలేదని నేనెరుగుదును. అలా చేసి ఉంటే ఇప్పుడు నేనీ స్థితిలో ఉండకపోదునని కూడా తెలుసును. నేనేం చెయ్యాలి? నా ఆస్తిపాస్తులన్నిటినీ, సంపదనీ వదిలేసుకోనా?"

మీరు ఎంతో జాగ్రత్తగా పెంచిన తోటలో విషపు మొక్కలు మాత్రమే పెరిగాయని మీరు తెలుసుకున్నట్లయితే వాటిని వేళ్లతో సహా పెకిలించి పారెయ్యాలి. వాటి చుట్టూ కట్టిన గోడలన్నిటినీ పడగొట్టాలి మీరు చెయ్యొచ్చు, చెయ్యకపోవచ్చు. మీకు పెద్దపెద్ద తోటలున్నాయి. ఎంతో తెలివిగా వాటిచుట్టూ గోడలు కట్టి సురక్షితంగా ఉంచారు. దానికి ప్రతిగా మరొకటి కోరకుండా ఉన్నప్పుడే ఆ పనిచేస్తారు. కాని చేసి తీరాలి. ధనవంతుడిగా చనిపోవటం వృథాగా జీవించినట్లే కాని, ఇదికాక, మనస్సునీ, హృదయాన్నీ ప్రక్షాళితం చేసి అన్నిటినీ కొత్తవిగా చేయగల జ్వాల ఉండాలి. ఆ జ్వాల మనస్సులోంచి వచ్చేది కాదు. అలవరచుకునేది కాదు. జాలిగుణం ప్రదర్శించి, దాన్ని మెరిసేటట్లు చేయవచ్చు. కాని, అది జ్వాల కాదు. సేవ అనే కార్యకలాపం లాభదాయకమూ, అవసరమూ అయినా అది ప్రేమకాదు. ఎంతో సాధన చేసి క్రమశిక్షణతో చూపే సహనం, చర్చిలో, దేవాలయంలో అలవరచుకున్న దయ, సరళ భాషణ, మృదు ప్రవర్తన, రక్షకుణ్ణీ, మూర్తినీ, ఆదర్శాన్నీ ఆరాధించటం - వీటిలో ఏదీ ప్రేమ కాదు.

"నేను విన్నాను. గమనించాను. వీటిలో దేనిలోనూ ప్రేమలేదని తెలుసుకున్నాను. కాని నా హృదయం శూన్యంగా ఉంది. దాన్ని నింపటం ఎలా? నేనేం చెయ్యాలి?"

బంధనం ప్రేమని నిలవనివ్వదు. బాధపడటంలో ప్రేమ దొరకదు. అసూయ శక్తిమంతమైనదైనా అది ప్రేమని బంధించి ఉంచలేదు. అనుభూతీ, దానివల్ల కలిగే తృప్తీ ఎప్పుడూ అంతమైపోతూనే ఉంటాయి. కాని, ప్రేమ అనంతమైనది.

"ఇది కేవలం మాటలు మాత్రమే నాకు. నేను ఆకలితో అలమటిస్తున్నాను. నాకు తిండిపెట్టండి."

తిండిపెట్టటానికి ఆకలి ఉండాలి. ఆకలిగా ఉంటే మీకు తిండి దొరుకుతుంది. మీకు ఆకలిగా ఉందా, లేక, మరోరకమైన తిండి రుచి కోసం పడే దురాశ మాత్రమేనా? మీకు దురాశగా ఉంటే, మీకు తృప్తి కలిగించేదే మీకు దొరుకుతుంది. కాని, అది త్వరలోనే అంతమవుతుంది. కాని, అది ప్రేమ అవదు.

"అయితే, నేనేం చెయ్యాలి?"

మీరా ప్రశ్న వేస్తూనే ఉండండి. మీరేం చెయ్యాలన్నది ముఖ్యం కాదు. మీరేం చేస్తున్నారన్నది తెలుసుకుని ఉండటం అత్యవసరం. మీరు భావి చర్య గురించే ఆలోచిస్తున్నారు. వెంటనే చర్య తీసుకోకుండా ఉండటానికి ఇదొక మార్గం. మీరు చర్య తీసుకోవాలనుకోవటం లేదు. అందుకే మీరు పదేపదే అడుగుతున్నారు మీరేం చెయ్యాలని. మీరు మళ్లీ గడుసుగా మిమ్మల్ని మీరు మోసం చేసుకుంటున్నారు. అందుకే మీ హృదయం శూన్యంగా ఉంది. మీ మనస్సుకి చెందిన వాటితో దాన్ని నింపాలనుకుంటున్నారు. కాని, ప్రేమ మనస్సుకి చెందినది కాదు. మీ హృదయాన్ని శూన్యంగా ఉండనివ్వండి. దాన్ని మాటలతో, మానసిక చర్యలతో నింపకండి. మీ హృదయాన్ని పూర్తిగా శూన్యంగా ఉండనివ్వండి. అప్పుడే అది నిండుతుంది.

## 60. ఫలితం యొక్క నిరర్థకత

వాళ్లు ప్రపంచంలోని వివిధ భాగాలనుంచి వచ్చారు. మనలో చాలా మందికి ఎదురయ్యే సమస్యల గురించి చర్చిస్తున్నారు. మాట్లాడుకోవటానికి బాగానే ఉంటుంది. కేవలం మాటలవల్లా, గడుసు వాదనలవల్లా, విస్తారమైన జ్ఞానం వల్లా బాధాకరమైన సమస్యల నుంచి విముక్తి లభించదు. గడుసుతనం, విజ్ఞానం తమ నిష్ఫలత్వాన్ని ఋజువు చెయ్యవచ్చు. ఆ నిష్ఫలత్వాన్ని కనిపెట్టినప్పుడు మనసు నిశ్శబ్దమౌతుంది. నిశ్శబ్దంలో సమస్య అవగాహన

అవుతుంది. కాని, ఆ నిశ్శబ్దాన్ని కోరటం మరొక సమస్యనీ, మరొక సంఘర్షణనీ పెంపొందిస్తుంది. విశదీకరించటాలూ, కారణాలు విప్పిచూపటాలూ, సమస్యలు విడదీసి పరీక్షించటాలూ దాన్ని ఏవిధంగానూ పరిష్కరించలేవు. ఎందువల్లనంటే, దాన్ని మానసిక పద్ధతుల్లో పరిష్కరించటానికి సాధ్యమవదు. మనస్సు మరికొన్ని సమస్యల్ని పెంచుతుందంతే. అది సమస్య నుంచి - విడిపించుకోలేదు. మనస్సే సమస్యలూ, సంఘర్షణలూ పెరిగి పెంపొందే స్థలం. ఆలోచన తన్నుతాను నిశ్శబ్దంగా ఉంచుకోలేదు. నిశ్శబ్దపు ముసుగును వేసుకోగలదు. అది కేవలం దాపరికం, వేషం మాత్రమే. ఒక నిశ్చిత లక్ష్యం కోసం క్రమశిక్షణతో కూడిన చర్య తీసుకోవటం ద్వారా ఆలోచన తన్ను తాను చంపుకోగలదు. కాని, చావు నిశ్శబ్దం కాదు. బ్రతుకు కన్న చావు మరింత అరిచి పెడబొబ్బలు పెడుతుంది. మనస్సులోని ఏవిధమైన సంచలనమైనా నిశ్శబ్దానికి భంగకరం.

తెరిచి ఉన్న కిటికీల్లోంచి ధ్వనులు గందరగోళంగా వినిపిస్తున్నాయి - ఊరిలో గట్టిగా మాట్లాడుకోవటం, తగువులాడుకోవటం, ఇంజను కూత పెట్టటం, పిల్లల ఏడుపులూ, కేరింతలూ, వెళ్లేలారీ రొదా, తేనెటీగలు ఝుమ్మనటం, కాకులగోలా. ఈ రణగణ ధ్వని మధ్యలో నిశ్శబ్దం గదిలోకి మెల్లిగా పరుచుకుంటోంది కోరకుండానే, పిలవకుండానే. మాటలమధ్య నుంచీ నిశ్శబ్దం రెక్కలు విప్పుకుంటోంది. ఆ నిశ్శబ్దం లక్షణం - చప్పుళ్లూ, కబుర్లూ, మాటలూ ఆగిపోవటం కాదు; నిశ్శబ్దాన్ని ఇముడ్చుకోవటానికి మనస్సు విస్తరించే శక్తిని పోగొట్టుకోవాలి. ఏ బలవంతాలూ, సర్దుకు పోవటాలూ, ప్రయత్నాలూ లేకుండా స్వేచ్ఛగా ఉండే నిశ్శబ్దం అది. అది అనంతమైనది. నిత్య నూతనమైనది. నిత్యనిర్మలమైనది. కాని, ఆ నిశ్శబ్దం మాటకాదు.

మనం ఫలితాలనూ, లక్ష్యాలనూ, ఎందుకు ఆశిస్తాం? మనస్సు ఎప్పుడూ ఏదో ఒక లక్ష్యాన్ని సాధించటానికి ఎందుకు ప్రయత్నిస్తుంది? లక్ష్యాన్ని సాధించటానికి ఎందుకు ప్రయత్నించకూడదు? ఇక్కడికి రావడంలో మనం దేన్నో, ఏ అనుభవాన్నో, ఏ ఆనందాన్నో కోరటం లేదా? మనం ఆడుకున్న ఎన్నో వాటిపైన విసుగుపుట్టింది. ఇప్పుడు మనకి ఇంకొక కొత్త ఆటవస్తువు

కావాలి. మనం ఒకదాని తరవాత మరొక దానివెంట పడతాం - స్త్రీ ఒక్కొక్క కొట్టూ చూసుకుంటూ పోయినట్లు. మనకి పూర్తిగా తృప్తి కలిగించేదేదో దొరికే వరకూ ప్రయత్నిస్తాం. ఆ తరవాత స్థిరపడిపోతారు, ఎదుగూ, బొదుగూ లేకుండా. మనం నిత్యం దేనికో ఒకదానికోసం తాపత్రయపడుతూనే ఉంటాం. చాలావరకు అసంతృప్తికరమైనవాటినెన్నిటినో రుచి చూసి ఉండటం వల్ల ఇప్పుడు మనకి ఆఖరికి అసలైనది కావాలి. దేవుడు, సత్యం, ఏదైనా అనుకోండి. మనకి ఫలితం కావాలి, నూతన అనుభవం, నూతన అనుభూతి, దేనికైనా తట్టుకోగలిగేదీ కావాలి. ఫలితం అనేదాని నిష్ప్రయోజకత్వాన్ని ఎప్పుడూ గ్రహించం - ఏదో ఒక ప్రత్యేక ఫలితాన్నే తప్ప. అందుకనే ఒక ఫలితం నుంచి మరో ఫలితానికి తిరుగాడుతూ ఉంటాం - అన్ని అన్వేషణలనూ అంతం చేయగలది దొరుకుతుందనే ఎప్పుడూ ఆశిస్తూ.

ఫలితం కోసం, విజయం కోసం చేసే ప్రయత్నం బంధించేదిగా, పరిమితం చేసేదిగా ఉంటుంది. ఎప్పుడూ ఆఖరవుతూనే ఉంటుంది. సాధించటంలోనే అంతమవటం ఉంటుంది. చేరుకోవటమే మరణించటం. అయినా, మనం కోరుతున్నది అదే, కాదా? మనం మరణాన్ని కోరుతున్నాం. దాన్ని అనటం మాత్రం ఫలితం అనీ, గమ్యం అనీ, లక్ష్యం అనీ అంటున్నాం. మనం గమ్యం చేరుకోవాలనుకుంటాం. ఈ అనంతమైన పోరాటంతో అలిసిపోయాం. అక్కడికి చేరుకోవాలి అనుకుంటున్నాం - "అక్కడికి" అనేది ఏ స్థాయిలోనైనా ఉండొచ్చు. వృథా అయిన ఈ పోరాటం యొక్క వినాశకత్వాన్ని గ్రహించకుండా ఒక ఫలితం సాధించటం ద్వారా దాన్నుంచి విముక్తి పొందాలని వాంఛిస్తాం. ఈ పోరాటంలోని, ఈ సంఘర్షణ లోని సత్యాన్ని గ్రహించం. అందువల్ల దాన్నొక సాధనంగా ఉపయోగించాలనుకుంటాం - అత్యంత సంతృప్తికరమైనది సాధించటం కోసం. ఏది అత్యంత సంతృప్తి నిస్తుందో అది మనకున్న అసంతృప్తి యొక్క ప్రగాఢతను బట్టి నిర్ణయమవుతుంది. ఫలితం ఆశించే కోరిక ఎప్పుడూ నెరవేరుతుంది. కాని, మనకి ఎప్పటికీ అంతంగాని ఫలితం కావాలి. అంచేత మన సమస్య ఏమిటి? ఫలితాలకోసం తాపత్రయ పడకుండా స్వేచ్ఛగా ఎలా ఉండాలన్నది కాదా?

"అదే అనుకుంటాను. స్వేచ్ఛగా ఉండాలనే కోరిక కూడా ఒక ఫలితాన్ని ఆశించేదే, కాదా?"

మనం ఆ మార్గంలో పడిపోతే పూర్తిగా చిక్కుకుపోతాం. ఫలితం యొక్క నిష్ప్రయోజకత్వాన్ని చూడటం మనకి సాధ్యం కాదా - దాన్ని ఏ స్థాయిలో ఉంచినప్పటికీ? అదేనా మన సమస్య? మన సమస్యని స్పష్టంగా చూద్దాం. అప్పుడు దాన్ని అర్థం చేసుకోవటానికి వీలవచ్చు. ఏదో ఒక ఫలితం యొక్క నిష్ప్రయోజకత్వాన్ని చూచిన మీదట ఫలితాలను ఆశించే కోరికలన్నిటినీ వదులుకోవటమా? తప్పించుకునే మార్గం ఒకటి నిరుపయోగం అని గ్రహించి నట్లయితే తప్పించుకునే మార్గాలన్నీ వృథాయే. మన సమస్య అదా? నిశ్చయంగా అది కాదు కదా? దాన్ని మరో విధంగా చూడొచ్చునేమో.

అనుభవం కూడా ఒక ఫలితం కాదా? మనం ఫలితాలనుంచి విముక్తి పొందాలంటే అనుభవం నుంచి కూడా విముక్తి పొందవద్దా? అనుభవం కూడా ఒక ఫలితం, ఒక అంతం కాదా?

"దేనికి అంతం?"

అనుభవం పొందుతూ ఉండటానికి అంతం.

అనుభవం పొందిన దాని జ్ఞాపకమే అనుభవం కాదా? అనుభవం పొందుతూ ఉండటం అంతమైపోయినప్పుడు అనుభవం ఉంటుంది. అదే ఫలితం. అనుభవం పొందుతూ ఉన్నప్పుడు అనుభవం అనేది లేదు. అనుభవం పొందిన దాని జ్ఞాపకమే అనుభవం. అనుభవం పొందిన స్థితి మరుగవగానే అనుభవం మొదలవుతుంది. అనుభవం ఎప్పుడూ అనుభవం పొందటానికీ, జీవించటానికీ ప్రతిబంధకమవుతుంది. ఫలితాలూ, అనుభవాలూ అంతమై పోతాయి. కాని అనుభవం పొందటం అనంతమైనది. అనంతమైన దానికి జ్ఞాపకం వల్ల ఆటంకం కలిగినప్పుడు ఫలితాల కోసం ప్రయత్నం ప్రారంభ మవుతుంది. మనస్సు - ఫలితం ఎప్పుడూ ఒక గమ్యాన్నీ, ఒక లక్ష్యాన్నీ ఆశిస్తూనే ఉంటుంది. అదే మరణం. అనుభవించేవాడు లేనప్పుడు మరణం లేదు. అప్పుడే అనంతమైనది ఉంటుంది.

# 51. ఆనందాన్ని కోరటం

ఆ విశాలమైన పచ్చని మైదానంలో ఉన్న ఆ ఒక్క చెట్టూ ఆ చిన్న ప్రపంచానికీ, అందులో ఉండే అడవులూ, ఇల్లూ, చిన్న సరస్సూ - వీటన్నిటికీ కేంద్రం. ఆ చుట్టుపక్కల ఉన్న ప్రదేశమంతా ఎత్తుగా విశాలంగా ఉన్న ఆ చెట్టువైపుకి ప్రవహిస్తున్నట్లుగా ఉంటుంది. అది చాలా పురాతనమైనదై ఉంటుంది. కాని, దానిలో ఏదో స్వచ్ఛత ఉంది, అప్పుడే పుట్టిందా అన్నట్లు. దానికి ఎండుకొమ్మలు ఎప్పుడూ ఉండవు. దాని ఆకులు ఎక్కడా మచ్చ లేకుండా పొద్దుట ఎండలో మెరుస్తూ ఉంటాయి. అది ఒంటరిగా ఉండబట్టి అన్నీ దానివైపుకి వస్తున్నట్లుగా కనబడుతుంది. లేళ్లూ, పులులూ, కుందేళ్లూ, ఆవులూ, మేకలూ మొదలైన మృగాలూ దాని నీడ క్రింద గుమిగూడుతాయి. ముఖ్యంగా మధ్యాహ్న వేళ. అందంగా తీర్చిదిద్దినట్లున్న ఆ చెట్టు ఆకాశానికి రూపుదిద్దింది. ఆ ఉదయపు కాంతిలో ఆ చెట్టు ఒక్కటే సజీవమైన దానిలా కనిపించింది. అడవుల్లోంచి చెట్టు చాలా దూరంగా ఉన్నట్లుగా కనిపిస్తుంది. కాని, ఆ చెట్టు దగ్గర్నుంచి అడవులూ, ఇల్లూ, ఆకాశమూ కూడా ఎంతో దగ్గరగా ఉన్నట్లనిపిస్తుంది. కదిలిపోయే మేఘాలను స్పృశించవచ్చుననిపిస్తుంది చూచినప్పుడల్లా.

ఆ చెట్టుక్రింద అప్పటికే చాలా సేపటినుంచి కూర్చున్నాం. ఆయన కూడా వచ్చి మాతో చేరాడు. ఆయనకి ధ్యానం చెయ్యటంలో తీవ్రమైన ఆసక్తి ఉంది అన్నాడు. చాలా ఏళ్లు సాధన చేశాడుట. ఓ ప్రత్యేకమైన సిద్ధాంతానికి చెందిన వాడు కాడుట. ఎందరో క్రిస్టియన్ తాత్వికుల గురించి చదివాడుట గాని, హిందూ, బౌద్ధమహాత్ములు బోధించిన ధ్యానం, క్రమశిక్షణా తన్ను ఎక్కువగా ఆకర్షించాయన్నాడు. సన్యసించటంలోనూ, పరిత్యాగశక్తిని అలవరచుకోవటంలోనూ ఉన్న విచిత్రమైన ఆకర్షణ ఎంత అపరిపక్వమైనదీ చిన్నప్పుడే గ్రహించాడుట. ఆయన మొదటినుంచీ మితిమీరిన వాటన్నిటికీ దూరంగా ఉన్నాడుట. అయితే, ఆయన క్రమశిక్షణా, హెచ్చుతగ్గులు లేని ఆత్మనిగ్రహం పాటించాడుట. ధ్యానాన్నీ, దానికి అతీతమైన దాన్నీ తెలుసుకోవాలని పట్టుదలతో ఉన్నాడుట. దీక్షగా నీతివంతమైన జీవితాన్ని

గడిపాడుట. కాని, అది చాలా స్వల్పవిషయం అన్నాడు. ప్రాపంచిక విషయాల పట్ల కూడా ఆయన ఆకర్షితుడు కాలేదుట. ఒకప్పుడు ప్రాపంచికమైన వాటితో ఆటలాడాడుట. కాని, ఆ ఆట కొన్నేళ్ల క్రిందటే ముగిసిపోయిందిట. ఏదో ఉద్యోగం లాంటిది ఉందిట. అది కూడా యథాలాపంగానేనట.

ధ్యానం యొక్క ఫలితం ధ్యానమే. ధ్యానం ద్వారా గాని, దానికింకా పైనగాని ఏదైనా ప్రయత్నించటం లక్ష్య సాధన అవుతుంది. సాధించినది మళ్లీ పోతుంది. ఫలితాన్ని ఆశించటం స్వయంకల్పనని కొనసాగించుకోవటమే. ఫలితం ఎంత ఉన్నతమైనదైనా, అది వాంఛారూపమే, ధ్యానం దేన్నో చేరటానికో, సాధించటానికో, సాక్షాత్కరింప చేసుకోవటానికో అయితే. అది ధ్యానం చేసేవానికి శక్తినిస్తుందంతే. ధ్యానం చేసేవాడే ధ్యానం. ధ్యానం చేసే వానిని అవగాహన చేసుకోవటమే ధ్యానం.

"నేను అంతిమ సత్యాన్ని కనుక్కోవటానికి, లేదా, ఆ సత్యం సాక్షాత్కారం కావటానికి ధ్యానం చేస్తున్నాను. నేను ఆశిస్తున్నది ఒక ఫలితం కాదు. సరిగ్గా చెప్పాలంటే - అదొక ఆనందం - అప్పుడప్పుడు అనుభూతి పొందేది. అది ఉంది. దాహం వేస్తున్నవాడు నీటికోసం తప్పించిపోయినట్లు ఆ అవ్యక్తమైన ఆనందాన్ని కోరుతున్నాను. అన్నిరకాల సంతోషం కన్న ఎన్నో రెట్లు గొప్పది ఆ ఆనందం. నా కత్యంత ప్రియమైన కోరిక తీర్చుకోవటం కోసమే ప్రయత్నిస్తున్నాను."

అంటే, మీరు కోరుతున్నదాన్ని పొందటానికి మీరు ధ్యానం చేస్తున్నారు. మీరు కోరిన దాన్ని పొందటానికి మిమ్మల్ని మీరు తీవ్రమైన క్రమశిక్షణలో పెట్టుకుంటారు. కొన్ని నియమాలూ, నిష్ఠలూ పాటిస్తారు. ఒక మార్గాన్ని తయారుచేసి, దాన్ని అనుసరిస్తారు, గమ్యాన్ని చేరుకోవటానికి. కొన్ని ఫలితాలనూ, కొన్ని నిర్ణీత అవస్థలనూ పొందగలరని ఆశిస్తారు. మీ కృషిలో చూపించే పట్టుదలను బట్టి క్రమక్రమంగా అధికమైన ఆనందాన్నీ, అంతకన్న అధికమైన ఆనందాన్నీ పొందుతారు. బాగా వేసుకున్న ఈ మార్గం మీకు అంతిమ ఫలితం లభిస్తుందని హామీ ఇస్తుంది. అందువల్ల మీ ధ్యానం చాలా ఆలోచించుకుని నడుపుతున్న వ్యవహారం కాదా?

"మీరలా అంటూంటే అవుననిపిస్తోంది పైకి - చాలా అర్థహీనమైన

దానిలా. కాని, గాఢంగా చూస్తే, అందులో దోషం ఏముంది? ఆ ఆనందాన్ని కోరటంలో ప్రధానంగా దోషం ఏముంది? నేను చేసిన ప్రయత్నాలన్నింటికీ ఫలితం కోరుతున్నాననుకోండి. అయితే, అలా ఎందుకు అనుకోకూడదు?"

ఆనందాన్ని ఆవిధంగా కోరటంలో ఆ ఆనందమే ఆఖరిదైనట్లు, అది ఎప్పటికీ శాశ్వతంగా ఉండిపోతుందన్నట్లూ సూచిస్తుంది. తక్కిన ఫలితాలన్నీ అసంతృప్తికరమైనవే. ప్రాపంచిక లక్ష్యాలను సాధించటానికి తీవ్రంగా ప్రయత్నించారు. వాటి క్షణికత్వాన్ని కూడా చూశారు. ఇప్పుడు ఒక అనంతమైన స్థితిని కోరుకుంటున్నారు. అంతంలేని గమ్యాన్ని కోరుతున్నారు. మనస్సు ఆఖరి అవినాశకరమైన ఆశ్రయాన్ని కోరుతోంది. అందుకోసం తన్నుతాను క్రమశిక్షణలో పెట్టుకుంటుంది. శిక్షణ నిచ్చుకుంటుంది. తను కోరినదాన్ని పొందటానికి కొన్ని సద్గుణాలను సాధన చేస్తుంది. అది ఒకసారి ఆ ఆనందాన్ని అనుభవించి ఉండవచ్చు. ఇప్పుడు దానికోసం ఒగురుస్తూ వెంటబడుతోంది. వేరే ఫలితాలకోసం ప్రయత్నించే ఇతరులలాగే మీరూ దానికోసం ప్రయత్నిస్తున్నారు. మీరు దాన్ని మరొక స్థాయిలో ఉంచారు. దాన్ని మీరు ఉన్నతం అనొచ్చు. కాని అది అప్రస్తుతం. ఫలితం అంటే అంతమవటం. చేరుకోవటంలో ఇంకేదో అవటానికి ప్రయత్నం ఉంటుంది. మనస్సు ఎప్పుడూ విశ్రాంతి తీసుకోదు. ఎప్పుడూ దేనికోసమో కష్టపడుతూనే ఉంటుంది. ఎప్పుడూ విజయం సాధిస్తూనే ఉంటుంది. ఎప్పుడూ లాభం పొందుతూనే ఉంటుంది, ఓడిపోతానని నిత్యం భయపడుతూనే ననుకోండి. ఈ ప్రక్రియనే ధ్యానం అంటున్నారు. అనంతంగా ఏదో అవుతూ ఉండటంలో చిక్కుకున్న మనస్సు ఆనందాన్ని తెలునుకుంటుందా? మనస్సు తనపై తాను విధించుకున్న క్రమశిక్షణ నుంచి ఎప్పటికైనా స్వేచ్ఛను పొందగలదా ఆ ఆనందాన్ని గ్రహించటానికి? ప్రయత్నం, పోరాటం ద్వారా, ప్రతిఘటన, పరిత్యాగాల ద్వారా మనస్సు తనలో సున్నితత్వం లేకుండా చేసుకుంటుంది. అటువంటి మనస్సు తెరుచుకుని తట్టుకోగలుగుతుందా? ఆ ఆనందాన్ని కోరటం ద్వారా ఊహాతీతమైనదీ, అపరిచితమైనదీ - ఏదీ లోనికి చొచ్చు కోకుండా మీ చుట్టూ మీరు గోడకట్టుకోలేదా? కొత్తదేదీ ప్రవేశించకుండా మిమ్మల్ని మీరు అన్నివిధాలా బంధించుకోలేదా? పాతదానిలో నుంచే

కొత్తదానికి బాటవేసుకున్నారు. పాత దాంట్లో కొత్తది ఇముడుతుందా?

మనస్సు ఎన్నటికీ కొత్తదాన్ని సృష్టించలేదు. మనస్సే ఒక ఫలితం. అన్ని ఫలితాలూ పాతవాటి నుంచి వచ్చినవే. ఫలితాలు ఎన్నటికీ కొత్తవి కాలేవు. ఫలితం కోసం ప్రయత్నించటం అనాలోచితంగా ఎన్నటికీ జరగదు. స్వేచ్ఛగా ఉన్నది ఒక లక్ష్యం కోసం ప్రయత్నించలేదు. లక్ష్యం, ఆదర్శం ఎప్పటికీ మనస్సు రూపొందించినదే. నిజానికి, అది ధ్యానం కాదు. ధ్యానం అనేది ధ్యానం చేసేవానికి స్వేచ్ఛ కలిగించటమే. స్వేచ్ఛగా ఉన్నప్పుడే సాక్షాత్కరింపజేసుకోవటం, గ్రహించే సున్నితత్వం ఉంటుంది. స్వేచ్ఛ లేనిదే ఆనందం లేదు. కాని, స్వేచ్ఛ క్రమశిక్షణ ద్వారా రాదు. క్రమశిక్షణ స్వేచ్ఛాపథకాన్ని తయారు చేస్తుంది. కాని, పథకం స్వేచ్ఛ కాదు. స్వేచ్ఛ ఉండాలంటే పథకాన్ని ముక్కలు చెయ్యాలి. పథకపు అచ్చుని ముక్కలు ముక్కలుగా చేయటమే ధ్యానం. కాని ఈ అచ్చుని ముక్కలు చేయటం ఒక లక్ష్యం, ఒక ఆదర్శం కాదు. ఈ అచ్చుని క్షణక్షణమూ ముక్కలు చేస్తూనే ఉండాలి. ముక్కలైన క్షణం మరిచిపోయిన క్షణం. జ్ఞాపకమున్న క్షణమే అచ్చుని రూపొందిస్తుంది. అప్పుడే అచ్చుని తయారుచేసేదీ, ఉద్భవిస్తుంది - అన్ని సమస్యలకూ, సంఘర్షణలకూ దుఃఖాలకూ మూలకారకమవుతుంది.

ధ్యానం అంటే మనస్సుని దాని ఆలోచనల నుంచి, అన్నిస్థాయిల్లోని ఆలోచనల నుంచీ విముక్తి చేయటమే. ఆలోచించేది వేరూ, ఆలోచన వేరూకాదు. అవి ఒకే ప్రక్రియ. రెండూ వేరువేరు ప్రక్రియలు కాదు. వేరువేరు ప్రక్రియలు అజ్ఞానానికీ భ్రమకీ మాత్రమే దారితీస్తాయి. ధ్యానం చేసేది ధ్యానం. అప్పుడు మనస్సు ఏకాంతంగా ఉంటుంది, నిశ్శబ్దంగా చేయబడి ఉండటం కాదు. ఏకాంతంగా ఉన్నదాని వద్దకే కారణరహితమైనది వస్తుంది. ఏకాంతంగా ఉన్నదానికే ఆనందం ఉంటుంది.

## 62. ఆలోచన, చైతన్యం

అన్నీ వేటికవి ముడుచుకుపోతున్నాయి. వృక్షాలు తమ్మతాము ఆవరించుకుంటున్నాయి. పక్షులు ఆనాటి తిరుగుళ్లను గుర్తుతెచ్చుకోవటానికి

రెక్కలు ముడుచుకుంటున్నాయి. నది తన మెరుపు పోగొట్టుకుంది. నీళ్లు ఇంక నాట్యం చెయ్యటం లేదు. ప్రశాంతంగా ఆగిపోయి ఉన్నాయి. పర్వతాలు దూరంగా, సమీపించటానికి వీల్లేకుండా ఉన్నాయి. మనిషి తన ఇంట్లోకి వెళ్ళిపోయాడు. రాత్రయింది. ఏకాంతంలో నిశ్చలత ఉంది. ఏవిధమైన సంపర్కం లేదు. దేనికది మూసేసుకుంది. తన్ను తాను వేరు చేసుకుంది. పువ్వు, ధ్వని, సంభాషణ - ఏదీ పైకి తెలియకుండా అభేద్యంగా ఉంది. నవ్వు ఉంది - కాని అదొక్కటే ఎక్కడో దూరంగా ఉంది. సంభాషణ అణచిపెట్టినట్లుగా లోపలగా ఉంది. ఒక్క నక్షత్రాలే ఆహ్వానిస్తున్నాయి - బాహాటంగా తెలియజేస్తూ. కాని అవి కూడా ఎంతో దూరంగా ఉన్నాయి.

ఆలోచన ఎప్పుడూ బాహ్యప్రతిక్రియే. దాని ప్రతిక్రియ ప్రగాఢంగా ఎప్పుడూ ఉండదు. ఆలోచన ఎప్పుడూ పైపైన ఉండేదే. ఆలోచన ఎప్పుడూ ఒక పరిణామమే. పరిణామాలను సర్దుబాటు చేయటమే ఆలోచించటం. ఆలోచన ఎప్పుడూ పైపైదే - వివిధ స్థాయిల్లో తన్ను తాను ఉంచుకున్నప్పటికీ. ఆలోచన ప్రగాఢమైన దానిలోకి, అంతర్గర్భితమైన దానిలోకి చొచ్చుకుని పోలేదెన్నటికీ. ఆలోచన తన్ను తాను దాటిపోలేదు. అందుకోసం ఎటువంటి ప్రయత్నం చేసినా దానికి నిస్పృహ కలుగుతుంది.

"మీ ఉద్దేశంలో ఆలోచన అంటే ఏమిటి?"

ఆలోచన ఎటువంటి సమస్య ఎదురైనా దానికి ఏర్పడే ప్రతిక్రియ. ఆలోచన చర్యకాదు, చెయ్యటంకాదు. ఆలోచన ఒక పరిణామం, ఫలితం యొక్క ఫలితం. అది జ్ఞాపకం యొక్క ఫలితం. జ్ఞాపకమే ఆలోచన. జ్ఞాపకాన్ని మాటల్లో వ్యక్తం చేయటమే ఆలోచన. జ్ఞాపకం అంటే అనుభవం. ఆలోచించటమనే ప్రక్రియ చైతన్యప్రక్రియ - అవ్యక్తమైనదీ, వ్యక్తమైనదీ కలిపి. ఈ ఆలోచనా ప్రక్రియ అంతా చైతన్యంగా ఉండటమే; మెలుకువగా ఉండటం, నిద్రపోవటం, పై స్థాయి, లోలోపలి స్థాయి అన్నీ జ్ఞాపకం యొక్క, అనుభవం యొక్క భాగాలే. ఆలోచన స్వతంత్రమైనది కాదు. స్వతంత్రంగా ఆలోచించటం అంటూ ఉండదు. "స్వతంత్రంగా ఆలోచించటం" అనే మాటలు పరస్పర విరుద్ధమైనవి. ఆలోచన ఒక ఫలితం కాబట్టి అది వ్యతిరేకిస్తుంది, లేదా ఒప్పుకుంటుంది, పోలుస్తుంది, లేదా సర్దుకుంటుంది,

ఖండిస్తుంది, లేదా సమర్థిస్తుంది. అందువల్ల అది ఎన్నటికీ స్వేచ్ఛగా ఉండదు. ఇటూ అటూ తిప్పుతుంది, నేర్పుతో ఉపయోగిస్తుంది, ఇటూ అటూ తిరుగుతుంది, కొంత దూరం పోతుంది. కాని దాని గొలుసుల్లోంచి అదే బయటపడలేదు. ఆలోచన జ్ఞాపకానికి లంగరువేసి ఉంటుంది. ఏ సమస్యలోని నిజాన్నీ కనుక్కోగలిగిన స్వేచ్ఛ దానికుండదు.

"మీ ఉద్దేశంలో ఆలోచనకి ఏవిధమైన విలువా లేదనా?"

పరిణామాలను సర్దుబాటు చేయటంలో దానికి విలువ ఉంది. కాని, చర్య తీసుకునేందుకు సాధనంగా మాత్రం దానంతట దానికి విలువలేదు. చర్య అంటే పరివర్తన, అంతేకాని, పరిణామాలను సర్దుబాటు చేయటం కాదు. ఆలోచనలతో, ఊహతో, నమ్మకంతో సంబంధం లేని చర్య ఒక మూసలో పోసినట్లుగా ఎన్నటికీ ఉండదు. ఒక పథకం ప్రకారం కార్యకలాపం ఉండొచ్చు. ఆ కార్యకలాపం హింసాత్మకం, రక్తమయం అయినా కావచ్చు, లేదా దానికి వ్యతిరేకం కావచ్చు. కాని, అది చర్య మాత్రం కాదు. వ్యతిరేకమైనది చర్యకాదు, కార్యక్రమాన్ని కొద్ది మార్పులు చేసి కొనసాగించటం. వ్యతిరేకమైనది కూడా ఫలితంలోని భాగమే. వ్యతిరేకమైన దాన్ని ప్రయత్నిస్తూ ఆలోచన తన ప్రతిక్రియల వలలో తానే చిక్కుకుంటుంది. చర్య ఆలోచన ఫలితం కాదు. చర్యకీ ఆలోచనకీ సంబంధం లేదు. ఆలోచన ఫలితం కాబట్టి కొత్తదాన్ని ఎన్నటికీ సృష్టించలేదు. కొత్తది క్షణక్షణానికీ పుడుతుంది. ఆలోచన ఎప్పుడూ పాతది, గతించినది, ప్రభావితమైనది. దానికి విలువ ఉంది, కాని స్వేచ్ఛ లేదు. విలువంతా పరిమితమే. అది బంధిస్తుంది. ఆలోచన బందనంలో ఉంచుతుంది, అది విలువైనది కాబట్టి.

"చైతన్యంగా ఉండటానికీ ఆలోచనకీ సంబంధం ఏమిటి?"

అవి రెండూ ఒకటే కాదా? ఆలోచించటానికీ, చైతన్యంగా ఉండటానికీ ఏదన్నా తేడా ఉందా? ఆలోచించటం ఒక ప్రతిక్రియ. చైతన్యంగా ఉండటం కూడా ప్రతిక్రియేకాదా? ఆ కుర్చీ గురించి తెలిసి ఉండటం ఏదో ప్రేరేపిస్తే కలిగిన ప్రతిక్రియ. దేన్నైనా ఎదుర్కొన్నప్పుడు జ్ఞాపకం వల్ల కలిగిన ప్రతిక్రియ కాదా ఆలోచన? ఈ ప్రతిక్రియనే అనుభవం అంటున్నాం. అనుభవం

పొందటం అంటే దేన్నైనా ఎదుర్కోవటం, దానికి ప్రతిక్రియ కలగటం. ఈ అనుభవించటం, దానితో బాటు దానికొక పేరుపెట్టటం, దాన్ని పదిలపరచటం - ఈ మొత్తం ప్రక్రియ వివిధ స్థాయిల్లో జరగటమే చైతన్యంగా ఉండటం, కాదా? అనుభవం ఒక ఫలితం, అనుభవం పొందటం యొక్క ఫలితం. ఆ ఫలితానికొక మాట నిర్ణయించబడుతుంది. ఆ మాటే నిర్ణయం. అటువంటి నిర్ణయాలెన్నో కలిసి జ్ఞాపకంగా అవుతుంది. ఈ నిర్ణయించే ప్రక్రియే చైతన్యంగా ఉండటం. నిర్ణయం, ఫలితం స్వీయ చైతన్యం. 'నేను' అనేది జ్ఞాపకం, ఎన్నో నిర్ణయాలూ. ఆలోచన జ్ఞాపకం యొక్క ప్రతిక్రియ. ఆలోచన ఎప్పుడూ నిర్ణయమే. ఆలోచించటం అంటే నిర్ణయానికి రావటం. అందువల్ల అది ఎప్పుడూ స్వేచ్ఛగా ఉండదు.

ఆలోచన ఎప్పుడూ పైపైదే, నిర్ణయమే. చైతన్యంగా ఉండటం అంటే పైపైదాన్ని పదిలపరచటం. పైపైన ఉన్నది తన్నుతాను విభజించుకుంటుంది. పైది అనీ, లోపలిది అనీ. కాని, ఈ విభజన ఆలోచనను పైపైది కాకుండా ఉండేట్లుగా ఎంత మాత్రం చేయలేదు.

"కాని ఆలోచన కతీతమైనదీ, కాలానికి అతీతమైనదీ. మనస్సు సృష్టించనిదీ వేరే ఏమీలేదా?"

అట్టి స్థితి గురించి మీకెవరైనా చెబితే విని ఉంటారు. లేదా దాని గురించి చదివి ఉంటారు. లేదా దాన్ని అనుభవించటం జరిగి ఉంటుంది. దాన్ని అనుభవం పొందటం అనుభవం కాదు, ఫలితం కాదు. దాన్ని గురించి ఆలోచించటం సాధ్యం కాదు. సాధ్యమయితే అది జ్ఞాపకమే గాని అనుభవించటం కాదు. మీరు చదివిన దాన్ని గాని, విన్నదాన్నిగాని పునశ్చరణ చేయవచ్చు. కాని మాట అసలైనది కాదు. మాట, పునశ్చరణ - అనుభవించ కుండా అడ్డుకుంటుంది. ఆలోచన ఉన్నంతవరకూ అనుభవించేస్థితి ఉండటం సాధ్యం కాదు. ఫలితం, పరిణామం ఎన్నటికీ అనుభవించే స్థితిని తెలుసుకోలేవు.

"అయితే, ఆలోచన ఎలా అంతమవుతుంది?"

ఆలోచన తెలిసిన దాని ఫలితం కాబట్టి అనుభవించే స్థితిలో ఎన్నటికీ ఉండలేదన్న సత్యాన్ని గ్రహించండి. అనుభవించటం ఎప్పుడూ కొత్తదాన్నే.

ఆలోచన ఎప్పుడూ పాత దాన్నుంచే. ఈ నిజాన్ని గ్రహించండి. నిజం ఎప్పుడూ స్వేచ్ఛను కలుగజేస్తుంది - ఆలోచన నుంచీ, ఫలితాన్నుంచీ స్వేచ్ఛను కలుగజేస్తుంది. అప్పుడు చైతన్యావస్థకి అతీతమైనది - అది నిద్రపోవటం కాదు, మెలుకువగా ఉండటం కాదు, దానికి పేరు లేదు. అది ఉంటుంది.

## 63. ఆత్మ త్యాగం

ఆయన బాగా లావుగా ఉన్నాడు, తన్ను చూసుకుని మురిసి పోతున్నాడు. ఆయన జైలుకి చాలాసార్లు వెళ్లాడుట. పోలీసులచేత దెబ్బలు తిన్నాడుట. ఇప్పుడు బాగా పేరు పొందిన రాజకీయవేత్త; మంత్రి కాబోయే స్థితిలో ఉన్నాడు. ఆయన ఎన్నో సమావేశాలకు వచ్చాడు. ఎవరి దృష్టినీ ఆకర్షించకుండా అందరితో బాటు కూర్చున్నాడు. కాని, అందరికీ ఆయనెవరో తెలుసును. ఆయన మాట్లాడినప్పుడు వేదిక మీద ఉన్నట్లు అధికార యుతమైన కంఠంతో మాట్లాడాడు. చాలామంది ఆయన వైపు చూశారు. ఆయన గొంతు వాళ్లస్థాయికి దిగిపోయింది. ఆయన వాళ్లతో బాటు కూర్చున్నా, తన్నుతాను ప్రత్యేకించుకున్నాడు. తనుపెద్ద రాజకీయవేత్త. తనగురించి అందరికీ తెలుసును. అంతా గౌరవిస్తారు. కాని, ఆ గౌరవం కొంతవరకే వెళ్లింది. ఆ పైన ఇకలేదు. చర్చ మొదలైన తరవాత ఇదంతా తెలిసింది. శ్రోతల మధ్య బాగా పేరుమోసిన ఒక వ్యక్తి ఉన్నప్పుడు ఉండే ఒక విచిత్ర వాతావరణం ఉంది. ఆశ్చర్యం, నిరీక్షణ, సాహచర్యం, అనుమానం, ప్రసన్నతతో వేరుగా ఉండటం, సంతోషం - ఇవన్నీ కూడిన వాతావరణం అది.

ఆయన ఒక స్నేహితుడితో కలిసి వచ్చాడు. ఆ స్నేహితుడు వివరించటం మొదలుపెట్టాడు - ఆయనెవరో, ఆయన ఎన్నిసార్లు జైలుకి వెళ్లాడో, ఎన్ని దెబ్బలు తిన్నాడో, దేశస్వాతంత్ర్యం కోసం ఎన్ని అపారమైన త్యాగాలు చేశాడో. ఆయనకి బాగా డబ్బుండేది. పాశ్చాత్య పద్ధతిలో పెరిగాడు - పెద్ద ఇల్లు, తోటలు, బోలెడు కార్లు మొదలైన వాటితో. ఆ స్నేహితుడు ఆ గొప్ప మనిషి ఘనకార్యాల గురించి చెబుతూంటే అతడి గొంతు అంతకంతకు మరింత ప్రశంసాపూర్వకంగా, గౌరవపూర్వకంగా అయింది. కాని, దాని

అడుగున మరో భావం కూడా ఉన్నట్లు - "ఆయన ఉండవలసినంత గొప్పవాడుగా ఉండకపోవచ్చు, అయినా ఆయన చేసిన త్యాగాలు చూడండి, అవి మాత్రం తక్కువా" అంటున్నట్లుగా తోచింది. ఆ గొప్పమనిషి కూడా దేశాభివృద్ధి గురించీ, నీటి పారుదల అభివృద్ధి గురించీ, ప్రజలకు భోగభాగ్యాలు కలుగజేయటం గురించీ, కమ్యూనిజం వల్ల రాబోయే ప్రమాదం గురించీ, బృహత్ప్రణాళికల గురించీ మాట్లాడాడు. మనిషిని మరిచిపోవటం అయింది. ప్రణాళికలూ, సిద్ధాంతాలూ మిగిలాయి.

ఒక లక్ష్యాన్ని సాధించటం కోసం పరిత్యాగం చేస్తే అది వస్తువుల మార్పిడి వ్యాపారమే. అందులో త్యాగం చేసేదేమీ ఉండదు. ఒకదానికొకటి మార్చితీసుకోవటమే. ఆత్మత్యాగం ఆత్మని విస్తృతం చేసుకోవటమే. ఆత్మని త్యాగం చేసుకోవటం అంటే ఆత్మకి మెరుగు పెట్టటమే. ఆత్మ తన్నుతాను ఎంత సూక్ష్మంగా చేసుకున్నప్పటికీ, అది ఇంకా మూసుకుపోయి, అల్పంగా పరిమితంగా ఉంటుంది. ఒక ప్రయోజనం కోసం త్యాగం చేస్తే, అది ఎంత గొప్పదైనా, ఎంత అపారమైనదైనా, ప్రధానమైనదైనా ఆ ప్రయోజనాన్ని ఆత్మకి ప్రత్యామ్నాయంగా చేయటమే అవుతుంది. ఆ ప్రయోజనమో, ఊహో "ఆత్మ", "నేను", "నా" అనేది అవుతుంది. తెలిసి త్యాగం చేయటం ఆత్మవిస్తరణమే. మళ్లీ సంపాదించుకోవటం కోసం వదిలివేయటమే. తెలిసి త్యాగం చేయటం ఆత్మని అవ్యక్తంగా బలపరచటమే. వదిలివేయటం మరోరకమైన సంపాదన. దాన్ని పొందటం కోసం దీన్ని వదులుకుంటారు. దీన్ని నీచస్థాయిలో ఉంచి, దాన్ని ఉన్నత స్థాయిలో ఉంచుతారు. ఉన్నత స్థాయిని పొందటానికి నీచస్థాయిని "వదులుకుంటారు." ఈ ప్రక్రియలో వదులుకోవటం అనేది ఉండదు. మరింత ఎక్కువ సంతృప్తిని పొందటానికి ప్రయత్నించటంలో త్యాగం అనేది ఉండదు. అందరూ మనసుపడి చేసే సంతృప్తికరమైన కార్యకలాపానికి అంత ధర్మప్రవర్తన ధ్వనించే పదాన్ని వాడటం ఎందుకు? మీ సాంఘిక పదవిని మీరు "వదులుకోవటం" మరోకరమైన పదవిని పొందటానికే. బహుశా, మీకది ఇప్పుడు ఉండే ఉండవచ్చు. అందుచేత మీ త్యాగం మీరు కోరిన ప్రతిఫలాన్నే ఇచ్చింది. కొంతమంది తమ ప్రతిఫలాన్ని స్వర్గంలో కోరుకుంటారు. తక్కినవాళ్లు ఇక్కడే ఇప్పుడే కావాలనుకుంటారు.

"ఈ ప్రతిఫలం పరిస్థితులతో బాటు వచ్చింది. అంతేకాని, నేను కావాలని తెలిసి ప్రతిఫలాన్ని కోరలేదు, నేను మొదట ఉద్యమంలో చేరినప్పుడు."

ప్రజాప్రియమైనది గాని, అప్రియమైనది గాని, ఒక ఉద్యమంలో చేరటం వల్లనే దాని ప్రతిఫలం దానికుంటుంది, కాదా? తెలిసి చేరకపోవచ్చు. కాని, చేరమని బలవంతం చేయించే ఆంతరంగిక ప్రేరేపణలు కలగా పులగంగా ఉంటాయి. వాటిని అర్థం చేసుకోకుండా ప్రతిఫలాన్ని కోరలేదని చెప్పటానికి వీల్లేదు. అసలు పరిత్యజించాలనీ, త్యాగం చెయ్యాలనీ పడే ఈ తపనని అర్థం చేసుకోవటం ముఖ్యమనేది నిస్సంశయం, కాదా? మనం ఎందుకు వదులుకోవాలనుకుంటాం? దానికి సమాధానం ఇవ్వటానికి ముందు, మనం ఎందుకు బంధనాలను పెంచుకుంటాం? మనకు మమకార బంధనాలు ఉన్నప్పుడే బంధనాలను వదిలించుకోవాలని అంటాం. అసలు బంధమే లేకపోతే వదిలించుకోవటానికి పోరాటమే ఉండదు. సొంతం చేసుకుని ఉండనట్లయితే, పరిత్యాగమే ఉండదు. ముందు సొంతం చేసుకుంటాం, తరవాత పరిత్యజిస్తాం - ఇంకేదో సొంతం చేసుకోవటానికి. ఈవిధంగా క్రమక్రమంగా అధికంగా పరిత్యజించటం మహనీయంగా, ఆధ్యాత్మిక ఔన్నత్యంగా పరిగణింప బడుతుంది.

"అవును, అది నిజమే. సొంతమనుకున్నదే లేకపోతే, పరిత్యజించ వలసిన అగత్యమే ఉండదు."

అందువల్ల పరిత్యజించటం, ఆత్మత్యాగం గొప్పతనానికి లక్షణం కాదు - దాన్ని కీర్తించటానికి గాని, అనుకరించటానికి గాని. మనం ఎందుకు సొంతం చేసుకుంటామంటే సొంతమనేది లేకపోతే మనం ఉండం. సొంతం చేసుకునేవి అనేకం, రకరకాలుగా. ప్రాపంచికమైనవి సొంతంగా లేని వారు జ్ఞానానికీ, ఊహలకీ మమకార బంధితులై ఉండొచ్చు. మరికొందరు సద్గుణానికీ, మరొకరు అనుభవానికీ, ఇంకొకరు పేరు ప్రతిష్ఠలకీ, ఆ రకంగా బంధితులు కావచ్చు. సొంతమైనవి లేకుండా "నేను" అనేది ఉండదు. "నా" అంటేనే సొంత ఆస్తి, సామాను, సద్గుణం, పేరు; ఏదున్నా ఏమీ కాకుండా ఉంటాననే భయంతో మనస్సు పేరుకీ, సామానుకీ, విలువకీ మమకార బంధం

ఏర్పరచుకుంటుంది. తరవాత వీటిని వదులుకుంటుంది, అంతకన్న ఉన్నత స్థాయిలో ఉండటానికి - ఉన్నతస్థాయి ఎక్కువ సంతృప్తి నిచ్చేదీ, ఎక్కువ శాశ్వతమైనదీ కనుక. సందిగ్ధతవల్ల కలిగే భయం, ఏమీ కానేమోననే భయం, మమకారబంధం పెంచుకునేట్లూ, సొంతం చేసుకునేట్లూ చేస్తుంది. సొంతం చేసుకున్నది అసంతృప్తికరంగా గాని, బాధాకరంగాగాని ఉంటే దాన్ని పరిత్యజిస్తాం - మరింత సంతోషకరమైన బంధంకోసం. అన్నిటికన్నా సంతృప్తి కరమైనదీ, ఆఖరున సొంతం చేసుకోవాలనుకునేదీ దైవం అనే పదం, లేదా, దాని స్థానంలో మరోటి - ప్రభుత్వం అనేది.

"కాని, ఏమీ కాకుండా ఉండటం గురించి భయపడటం సహజం. ఏమీ కాకుండా ఉండటానికే ఇష్టపడాలని మీ ఉద్దేశం అనుకుంటాను."

ఏదో అవాలని మీరు ప్రయత్నిస్తున్నంతవరకూ ఏదో మిమ్మల్ని ఆక్రమించినంతవరకూ, సంఘర్షణ, గందరగోళం, దుఃఖం అధికం కావటం తప్పదు. మీ మటుకు మీరు మీ సాధించిన గొప్పతనం, విజయం మూలాన్ని ఈ అధిగమిస్తున్న విధ్వంసంలో చిక్కుకోరనే అనుకుంటూండవచ్చు. కాని, మీరు దాన్ని తప్పించుకోలేరు - మీరూ అందులోని వారే కాబట్టి. మీ కార్యకలాపాలూ, మీ ఆలోచనలూ, మీ జీవన నిర్మాణం కూడా సంఘర్షణ పైనా, గందరగోళం పైనా ఆధారపడి ఉన్నాయి. ఏమీ కాకుండా ఉండటానికి ఇష్టం లేనంత కాలం మీరు దుఃఖాన్నీ, వైరుధ్యాన్నీ పెంపొందించుకోవటం తప్పదు. ఏమీ కాకుండా ఉండాలని సంసిద్ధం కావటం పరిత్యజించటమూ కాదు, ఆంతరంగికంగా గాని, బాహ్యంగా గాని బలవంతం చెయ్యటమూ కాదు. అది ఉన్న స్థితిలోని యథార్థాన్ని గ్రహించటమే. ఉన్నదానిలోని యథార్థాన్ని గ్రహించటంతో, రక్షణలేకపోవటం వల్ల ఏర్పడిన భయం నుంచి విముక్తి కలుగుతుంది. బంధాన్ని పెంపొందించి, బంధం తెంచుకోవటం, పరిత్యజించటం - అనే భ్రమకి దారితీసే భయం నుంచి విముక్తి కలుగుతుంది. ఉన్నస్థితిని ప్రేమించటమే వివేకానికి ఆరంభం. ప్రేమ ఒక్కటే పంచు కుంటుంది. అదొక్కటే సంపర్కం కలిగించుకోగలదు. కాని, పరిత్యజించటం, ఆత్మత్యాగం చేయటం ఒంటరితనానికీ, భ్రమకీ మార్గాలు.

# 64. జ్వాల, పొగ

రోజంతా వేడిగా ఉంది. బయటికి వెళ్లాలంటే బ్రహ్మ ప్రయత్నంగా ఉంది. అసలే, రోడ్డుమీదా, నీటిమీదా పడి కొట్టొచ్చేటట్లూ, గుచ్చుకుంటున్నట్లూ ఉన్నకాంతి తెల్లటి ఇళ్లమీదపడి మరింత తీవ్రంగా ఉంది. అంతకుముందు పచ్చగా ఉండే నేల ఇప్పుడు ఎండిపోయి, బంగారంలా మెరుస్తోంది. వానలు రావటానికి ఇంకా చాలా నెలలు పడుతుంది. ఆ చిన్న కాలవ ఎండిపోయి మెలికలు తిరిగిన ఇసుక పీలికలా ఉంది. కొన్ని పశువులు చెట్లనీడని ఉన్నాయి. వాటికి దూరంగా కూర్చుని ఓ కుర్రాడు వాటిని కాపలా కాస్తున్నాడు. గ్రామం కొన్నిమైళ్ల దూరంలో ఉంది. అతడు ఒక్కడూ ఉన్నాడు. బక్క పలచగా తిండి సరిగ్గా లేనట్లుగా ఉన్నాడు. కాని ఆనందంగా ఉన్నాడు. అతను పాడేపాట మరీ విషాదంగా లేదు.

కొండదాటితే ఇల్లు వస్తుంది. సూర్యాస్తమయం అయే సమయానికి ఇంటికి చేరుకున్నాం. డాబా మీంచి చూస్తే, కొబ్బరి చెట్ల పైభాగం ఆకు పచ్చగా ఉండి, క్రింద పసుపుపచ్చని ఇసుక దాకా వంగుతున్నాయి. కొబ్బరి చెట్ల నీడలు పసుపుపచ్చగా పడుతున్నాయి. వాటి ఆకులు బంగారం రంగులో ఉన్నాయి. ఆ పసుపు పచ్చని ఇసుక దిబ్బలకవతలగా ఆకుపచ్చ బూడిద రంగులో సముద్రం. తెల్లటికెరటాలు ఒడ్డుమీదికి పొగవుతున్నాయి. కాని, లోతుగా ఉన్న నీళ్ల ప్రశాంతంగా ఉన్నాయి. సూర్యుడు దూరాన అస్తమిస్తున్నా, సముద్రంపైన మేఘాలు రంగుపులుముకుంటున్నాయి. సాయంకాలపు నక్షత్రం అప్పుడే కనిపిస్తోంది. చల్లని గాలి వీచింది కాని, డాబా ఇంకా వేడిగా ఉంది. ఒక చిన్న గుంపు చేరిందక్కడ. వాళ్లక్కడ చాలాసేపటి నుంచీ ఉండి ఉంటారు.

"నాకు వివాహం అయింది. పిల్లల తల్లిని. కాని, నాకు ఎప్పుడూ ప్రేమ కలగలేదు. అసలు ప్రేమ అనేది ఉంటుందా అని ఆశ్చర్యపోతున్నాను. మనకు అనుభూతులూ, ఆవేశాలూ, ఉద్రేకాలూ, సంతృప్తినిచ్చే సుఖాలూ తెలుసును. ప్రేమ అనేది తెలుసునా అనిపిస్తుంది నాకు. మేము ప్రేమిస్తున్నాం అంటూంటాం తరుచు. కాని, ఏదో వెనక్కి తీసేట్లు చేస్తుంది.

శారీరకంగా వెనక్కి తియ్యక పోవచ్చు. మొదట్లో సర్వమూ అర్పించుకోవచ్చు. అప్పుడు కూడా వెనక తీయటం ఉంటుంది. ఇవ్వటం అనేది అనుభూతుల ప్రతిఫలం. కాని, నిజంగా ఇవ్వగలిగినది ఎక్కడో దూరంగా మేలుకోకుండా ఉంటుంది. మేము కలుసుకుంటాం. కానీ, పొగలో కూరుకుపోతాం. కాని, అది జ్వాల కాదు. మాలో ఆ జ్వాల ఎందుకుండదు? పొగ లేకుండా జ్వాల ఎందుకు మండటం లేదు? మేము మరీ తెలివి మీరి పోయామా అనిపిస్తోంది. మరీ తెలిసినందువల్లనేమో ఆ సౌరభం లభించటం లేదు. నేను మరీ ఎక్కువ చదువుకున్నందువల్ల మరీ అధునాతనంగా, పైపై తెలివితో, మూర్ఖంగా ఉన్నాననుకుంటాను. తెలివిగా మాట్లాడినా నిజంగా నాది మంద బుద్ధి అనుకుంటాను.''

ఇది మందకొడితనానికి సంబంధించిన విషయమా? ప్రేమ అంత బ్రహ్మాండమైన ఆదర్శమా? అంత సాధించలేకపోయేదీ, దానికి అన్ని అవసరాలూ సమకూరితేనే సాధించగలిగేదీనా? అన్ని అవసరాలూ సమకూర్చటానికి తీరిక ఉంటుందా ఎవరికైనా? మనం అందం గురించి మాట్లాడతాం, దాన్ని గురించి రాస్తాం, దాన్ని చిత్రిస్తాం, నాట్యం చేస్తాం, బోధిస్తాం. కాని, మనం అందంగా ఉండం. అలాగే, మనకి ప్రేమ తెలియదు. మనకి తెలిసినవి మాటలు మాత్రమే.

బాహాటంగా, దెబ్బతగిలేటట్లు ఉండటమంటే సున్నితంగా ఉండటం. వెనుదీయటం అనేది ఉన్నప్పుడు సున్నితత్వం ఉండదు. సుకుమారంగా ఉండేవారు రక్షణ లేకుండా, రేపు - అనేదాన్నుంచి స్వేచ్ఛగా ఉంటారు. బాహాటంగా ఉన్నదే గర్భితమై ఉన్నది, తెలియనది. బాహాటంగా సుకుమారంగా ఉండేది అందంగా ఉంటుంది. మూసిపెట్టి ఉన్నది మందకొడిగానూ, సున్నితత్వం లేకుండానూ ఉంటుంది. మందకొడితనం కూడా గడుసుతనంలాగే ఒక విధంగా ఆత్మరక్షణ కలిగించేదే. ఈ తలుపు తెరుస్తాం, కాని ఆ తలుపు మూసేసి ఉంచుతాం. స్వచ్ఛమైన గాలి ఒక ప్రత్యేకమైన ద్వారం గుండానే రావాలనుకుంటాం. మనం బయటికి వెళ్లం. అన్ని తలుపులూ, కిటికీలూ ఒక్కసారిగా తెరవనూ తెరవం. సున్నితత్వం కాలక్రమేణా పొందేది కాదు. మందకొడిది ఎన్నటికీ సున్నితంగా అవలేదు.

మందకొడిది ఎప్పుడూ మందకొడిగానే ఉంటుంది. తెలివి తక్కువతనం ఎన్నటికీ వివేకం కాలేదు. వివేకంగా అవాలని ప్రయత్నించటం తెలివితక్కువ తనం. మనకున్న ఇబ్బందుల్లో ఇదొకటి, కాదా? మనం ఎప్పుడూ ఏదో అవాలని ప్రయత్నిస్తూ ఉంటాం. మందకొడితనం అలాగే ఉండిపోతుంది.

"అయితే ఏం చెయ్యాలి?"

ఏమీ చెయ్యొద్దు. ఉన్నట్లుగానే ఉండండి - సున్నితత్వం లేకుండా. ఏదైనా చెయ్యటం అంటే ఉన్నస్థితిని తప్పించుకోవటం. ఉన్నదాన్ని తప్పించు కోవటం ఉత్తి తెలివితక్కువతనం. అది ఏం చేసినా తెలివితక్కువ తనం ఇంకా తెలివి తక్కువ తనం లాగే ఉంటుంది. సున్నితత్వం లేనిది సున్నితమైనది కాలేదు. అది చేయగలిగినదల్లా ఉన్నస్థితిని తెలుసుకుంటూ ఉన్నస్థితిలో దాని కథని నడవనివ్వాలి. సున్నితత్వం లేకపోవటం అనే దాంట్లో కలుగజేసుకోవద్దు. అలా కలుగజేసుకునేది సున్నితత్వం లేనిది, తెలివి తక్కువది అయి ఉంటుంది. వినండి. దాని కథ అదే చెబుతుంది. దాన్ని అనువదించవద్దు, చర్య తీసుకోవద్దు. కాని, అడ్డుపడకుండా, వ్యాఖ్యానం చెయ్యకుండా కథ చివరిదాకా వినండి. అప్పుడే చర్య జరుగుతుంది: చెయ్యటం ముఖ్యం కాదు, వినటమే.

ఇవ్వటానికి తరిగిపోనిది ఉండాలి. వెనుదీస్తూ ఇవ్వటంలో అయిపోతుందన్న భయం ఉంటుంది. అయిపోవటంలోనే తరిగిపోనిది ఉంటుంది. ఇవ్వటం అంటే అయిపోవటంకాదు. ఎక్కువలోంచో, తక్కువ లోంచో ఇవ్వటం జరుగుతుంది. ఎక్కువ అయినా, తక్కువ అయినా పరిమితమైనదే. అది పొగ - ఇవ్వటం, పుచ్చుకోవటం. కోరికలా, అసూయలా, కోపంలా, నిరాశలా పొగ. కాలమంటే భయం ఉండటం పొగ. జ్ఞాపకం, అనుభవం కూడా పొగే. ఇవ్వటం ఉండదు, పొగని విస్తరింప జేయటమే. వెనుదీయటం తప్పనిసరి, ఎందువల్లనంటే, ఇచ్చేదేమీ లేదు కనుక. పంచుకోవటం ఇవ్వటం కాదు. పంచుకుంటున్నాం, ఇస్తున్నాం అని తెలిసి చేయటం సంపర్కం అంతం అయేటట్లు చేస్తుంది. పొగ జ్వాలకాదు. కాని, అదే జ్వాల అని అపోహ పడతాం. అది పొగ అని తెలుసుకుని ఉండండి. జ్వాలని చూడాలనుకుని, దాన్ని ఊదెయ్యకండి.

"ఆ జ్వాల కలిగి ఉండటం సాధ్యమేనా, లేక, అది కొద్ది మంది కోసమేనా?"

అది కొద్దమంది కోసమో, అనేక మంది కోసమో అనేది అసలు విషయం కాదు కదా? ఆ మార్గానపోతే, అది మన అజ్ఞానానికీ భ్రమకీ దారితీస్తుంది. మనం ఆలోచించవలసినది జ్వాల గురించి. మీలో ఆ జ్వాల, ఆ పొగలేని జ్వాల ఉండగలదా? తెలుసుకోండి. పొగని నిశ్శబ్దంగా, ఓపిగ్గా గమనించండి. ఆ పొగని పోగొట్టలేరు. మీరే ఆ పొగ కనుక. పొగ పోగానే జ్వాల వస్తుంది. ఈ జ్వాల తరిగి పోనిది. ప్రతిదానికీ ఒక ఆది, ఒక అంతం ఉంటుంది. అది త్వరలోనే అలిసిపోతుంది, పాతబడిపోతుంది. మనస్సుకి సంబంధించినవి లేకుండా హృదయం శూన్యంగా ఉన్నప్పుడు, మనస్సు ఆలోచన లేకుండా శూన్యంగా ఉన్నప్పుడు, అప్పుడు ప్రేమ ఉంటుంది. శూన్యంగా ఉన్నది తరిగిపోదు.

ఉన్న పోరాటం జ్వాలకీ పొగకీ మధ్య కాదు. పొగలోనే వివిధ ప్రతిక్రియల మధ్య. జ్వాలకీ, పొగకీ మధ్య సంఘర్షణ ఎన్నటికీ ఉండదు. సంఘర్షణ రావటానికి సంబంధం ఉండాలి. వాటి మధ్య సంబంధం ఎలా ఉండగలదు? ఒకటి ఉంటే రెండోది ఉండదు.

## 65. మనస్సుకి వ్యాపకం

ఆ వీధి ఇరుకుగా ఉంటుంది జనంతో కిక్కిరిసినట్లుగా. కాని, బళ్ల రాకపోకలు తక్కువే. ఏ బస్సైనా, కారైనా వెడుతున్నప్పుడు బాగా పక్కకి తప్పుకోవాలి - దాదాపు కుళ్లు కాలవలో దాకా. కొన్ని చిన్నచిన్న దుకాణాలేవో ఉన్నాయి. ద్వారాల్లేని గుడి ఒకటుంది. గుడి అత్యంత పరిశుభ్రంగా ఉంటుంది. ఆ ఊరి వాళ్లే అక్కడ ఉన్నారు, చాలామంది కాకపోయినా. ఒక దుకాణం పక్కని ఒక కుర్రవాడు కూర్చుని పూలమాలలూ, పూలగుత్తులూ కడుతున్నాడు. వయస్సు పన్నెండో, పధ్నాలుగో ఉంటుంది. పక్కనే ఉన్న చిన్న నీళ్ల జాడీలో దారం ఉంది. అతని కెదురుగా తడిగుడ్డ మీద పువ్వులు చిన్నకుప్పలుగా పోసి ఉన్నాయి - మల్లెలు, కొంచెం గులాబీలు, బంతి

పువ్వులు, ఇంకా రకాలు. దారం ఒక చేత్తో పట్టుకుని, రెండో చేత్తో రకరకాల పువ్వులు ఏరుతాడు. ఒక చేతిలో దారం చురుకుగా మెలిక తిరుగుతూ, రెండో చేతిలో పువ్వుల్ని చకచకా కట్టేస్తుంది. పూలగుత్తులు తయారవుతాయి. తన చేతులకేసి అతడు ధ్యానం చూపించటమే లేదు. కళ్లు ఇటూ అటూ తిరుగుతూ వచ్చేపోయే వాళ్లని చూస్తూ ఉంటాయి, మధ్యమధ్య ఎవరినైనా గుర్తుపడితే చిరునవ్వు నవ్వుతాయి. మళ్లీ చేతుల వైపు తిరుగుతాయి, మళ్లీ ఇటూ అటూ తిరుగుతాయి. ఇంతలోనే ఇంకో కుర్రవాడు వచ్చి చేరాడు అతనితో. వాళ్లు కలిసి మాట్లాడుకోవటం మొదలు పెట్టారు. కాని, వాళ్ల చేతులు వాటి పనిని మాత్రం మానలేదు. ఇప్పుడు కట్టిన పువ్వుల పోగు పెద్దదయింది. కాని, అవి అమ్మటానికింకా వేళ కాలేదు. ఆ కుర్రవాడు ఆపేసి, లేచి ఎక్కడికో వెళ్లాడు. కాని తొందరగానే తిరిగి వచ్చాడు, తన కన్న చిన్న కుర్రవాణ్ణి వెంటపెట్టుకుని. తమ్ముడు కావచ్చు. మళ్లీ తనకిష్టమైన పనిని మొదలుపెట్టాడు సునాయాసంగా, గబగబా. ఇప్పుడు జనం కొనటానికి వస్తున్నారు - ఒక్కొక్కరో, గుంపులుగానో. నిత్యంవచ్చి అతని దగ్గర కొనే వాళ్లయి ఉండాలి, ఎందుకంటే, చిరునవ్వుతో ఏవో మాటలాడు కున్నారు. ఆ తరవాత ఒక గంట సేపటివరకూ అతడు అక్కణ్ణించి కదల్లేదు. అన్నిరకాల పువ్వులలోంచీ పరిమళం వస్తోంది. మేము ఒకరిని చూచి ఒకరం చిరునవ్వు నవ్వుకున్నాం.

ఆ వీధిలోంచి వెడితే ఒక సందువస్తుంది. ఆ సందులోంచి వెడితే ఇల్లు.

గతానికి ఎలా బంధింపబడి ఉంటాం మనం! కాని, గతానికి మనం బంధింపబడిలేము. మనమే గతం. గతం ఎంత గందరగోళంగా ఉంటుంది, పొరమీద పొరగా, హరాయించుకోలేని జ్ఞాపకాలు - ఆప్యాయంగా అట్టిపెట్టుకున్నవీ, విచారకరమైనవీ - రెండు రకాలూ. అది రాత్రీ, పగలూ మన వెంటపడుతోంది. అప్పుడప్పుడు విరామం ఉంటుంది, స్పష్టమైన వెలుగు కనిపిస్తూ. గతం ఒక నీడలాంటిది. అన్నిటినీ మందకొడిగానూ, అలిసిపోయే టట్లూ చేస్తుంది. ఆ నీడలో ప్రస్తుతం స్పష్టతనీ, స్వచ్ఛతనీ పోగొట్టుకుంటుంది. రేపు అనేది గతం యొక్క నీడ. గతం, ప్రస్తుతం, భవిష్యత్తు - మూడూ జ్ఞాపకం అనే పొడుగాటి తాడుతో కట్టి ఉంటాయి. ఆ మొత్తం కట్టిన మూటే జ్ఞాపకం.

దానిలో సువాసన ఎక్కడా ఉండదు. ఆలోచన ప్రస్తుతంలోంచి భవిష్యత్తులోకి వెళ్లి మళ్లీ వెనక్కి వస్తుంది. గుంజకి కట్టేస్తే పిచ్చెత్తిన పశువులా, దానికున్న కైవారంలో - చిన్నదైనా, పెద్దదైనా, కదులుతూ ఉంటుంది. దాని నీడని అది ఎన్నటికీ తప్పించుకోలేదు. ఈ కదలికే గతం గురించీ, ప్రస్తుతం గురించీ, భవిష్యత్తు గురించీ మనస్సు యొక్క వ్యాపకం. మనస్సే వ్యాపకం. మనస్సుకి వ్యాపకం లేనట్లయితే అది బ్రతకటం ఆగిపోతుంది. దాని వ్యాపకమే దాని బ్రతుకు. అవమానం, పొగడ్త, దేవుడు, తాగుడు, సద్గుణం, ఆవేశం, పని, వ్యక్తం చేయటం. పదిలపరచటం, ఇవ్వటం - వీటన్నిటితో ఉండే వ్యాపకం ఒక్కటే. అప్పటికీ అది వ్యాపకమే, వ్యాకులపడటమే, అశాంతిగా ఉండటమే. దేనితోనో ఒకదానితో సామానుతోనో, దేవుడితోనో వ్యాపకం పెట్టుకుని అల్పత్వం, వెలితి ఉండే స్థితిలో ఉంటుంది.

వ్యాపకం మనస్సుకి ఒక కార్యకలాపం ఉన్నట్లూ, జీవించి ఉన్నట్లూ భావన కలిగిస్తుంది. అందువల్లనే మనస్సు దాన్ని అంటిపెట్టుకుంటుంది. లేదా పరిత్యజిస్తుంది. వ్యాపకంతోనే తన్నుతాను పోషించుకుంటుంది. మనస్సు దేనితోనో ఒక దానితో హడావిడిగా ఉండాలి - దేనితో హడావిడిగా ఉందన్నది ముఖ్యం కాదు. ముఖ్యమైన దేమిటంటే, దానికి వ్యాపకం ఉండాలి. మంచి వ్యాపకాలకు సాంఘిక ప్రాధాన్యం ఉంటుంది. దేనితోనైనా వ్యాపకం పెట్టుకోవటం మనస్సుకి సహజం. దాని కార్యకలాపం దీన్నుంచే బయలుదేరుతుంది - దేవుడితో, ప్రభుత్వంతో, జ్ఞానంతో వ్యాపకం పెట్టుకోవటం అల్పమనస్సు యొక్క కార్యకలాపం. దేనితోనైనా వ్యాపకం పెట్టుకోవటంలో పరిమితత్వం ఉంటుంది. మనస్సుకి చెందిన దైవం అల్పదైవం - దాన్ని ఎంత ఉన్నత స్థానంలో ఉంచినా. వ్యాపకం లేకపోతే మనస్సే ఉండదు. ఉండనేమోనన్న భయం మనస్సుని విశ్రాంతి లేకుండా పనిలో మునిగి ఉండేటట్లు చేస్తుంది. ఈ విరామం లేని కార్యకలాపం జీవితంలా కనిపిస్తుంది. కాని, అది జీవితం కాదు. అది ఎప్పుడూ మరణానికి దారి తీస్తుంది - మరణం కూడా అదే రకమైన కార్యకలాపం - మరోరూపంలో.

కల మనస్సుకి మరో వ్యాపకం. దానికి విశ్రాంతి లేకపోవటానికి అదొక చిహ్నం. కలకనటం కూడా చైతన్యావస్థ కొనసాగటమే. మెలుకువగా

ఉన్నప్పుడు పని చేయనివి కలలోకి రావటంతో చైతనావస్థ విస్తరిస్తుంది. మనస్సు పైపైన, లోలోపల జరిగే కార్యకలాపం వ్యాపకం కోసమే. అటువంటి మనస్సుకి తెలిసిన అంతం - మొదలైనది కొనసాగటమే. అంతం అనేది అది తెలుసుకోలేదెన్నటికీ. దానికి ఫలితం మాత్రమే తెలుసును. ఫలితం నిత్యం కొనసాగుతూ ఉండేదే. ఫలితం కోసం ప్రయత్నించటం కొనసాగటానికి ప్రయత్నించటమే. మనస్సుకీ, వ్యాపకానికీ అంతంలేదు. అంతమైన దానికే కొత్తది రాగలుగుతుంది. మరణించిన దానికే జీవం వస్తుంది. వ్యాపకం మరణించటంతో, నిశ్శబ్దం ఆరంభమవుతుంది. సంపూర్ణ నిశ్శబ్దం. ఆలోచించటానికి వీల్లేని ఈ నిశ్శబ్దానికీ మానసిక కార్యకలాపానికీ సంబంధం ఉండదు. సంబంధం ఉండటానికి కలయిక ఉండాలి. మనస్సు నిశ్శబ్దంతో సంపర్కం పెట్టుకోలేదు. అది స్వయంకల్పిత స్థితితో, అది నిశ్శబ్దం అనుకునే దానితో మాత్రమే సంపర్కం పెట్టుకోగలదు. అది మరొక రకం వ్యాపకం. వ్యాపకం నిశ్శబ్దం కాదు. నిశ్శబ్దంతో వ్యాపకం కలిగించుకునే మనస్సు మరణించినప్పుడే, నిశ్శబ్దం ఉంటుంది.

నిశ్శబ్దం కలకీ, మనస్సు లోలోపలి వ్యాపకానికీ అతీతమైనది. లోలోపలి మనస్సు శేషం - గతశేషం - బాహాటమైనది గాని, నిగూఢమైనది గాని. ఈ గత శేషం నిశ్శబ్దాన్ని అనుభవం పొందలేదు. దాని గురించి కలగన లేదు - తరుచు అది చేసేటట్లు. కాని కల నిజం కాదు. కలని తరుచు నిజం అనుకుంటారు. కాని, కలా, కలగనేదీ కూడా మనోవ్యాపకమే. మనస్సు సంపూర్ణ ప్రక్రియ - ఒక్క భాగం మాత్రమే కాదు - కార్యకలాపం యొక్క సంపూర్ణ ప్రక్రియ. మిగిలి ఉన్నదీ, సేకరించుకున్నదీ ఆ అనంత నిశ్శబ్దంతో సంపర్కం పెట్టుకోలేవు.

## 66. ఆలోచన ఆగిపోవటం

అయన పండితుడు, ప్రాచీన సాహిత్యాన్ని బాగా చదువుకున్నవాడు. తన సొంత ఆలోచనలకు మెరుగులు దిద్దటానికి ప్రాచీనులను ఉదాహరించటం అలవాటు చేసుకున్నాడు. ఆ గ్రంథాల్లోవి కాకుండా అయన

స్వతంత్ర అభిప్రాయాలంటూ నిజంగా ఉన్నాయా అనిపిస్తుంది. నిజానికి, అసలు స్వతంత్ర ఆలోచన అనేదే లేదు. ఆలోచన అంతా ఆధారపడినదే, ప్రభావితమైనదే. ఆలోచన ఎన్నటికీ స్వేచ్ఛగా ఉండదు. కాని, ఆయన జ్ఞానార్జన గురించి ఆలోచిస్తున్నాడు. ఆయన జ్ఞాన భారంతో ఉన్నాడు. దాన్ని కష్టపడి మోస్తున్నాడు. ఆయన సంస్కృతంలోనే మాట్లాడటం మొదలు పెట్టాడు. సంస్కృతం ఏమీ అర్థం కాలేదని తెలుసుకుని ఆశ్చర్య పోయాడు. అదిరిపడ్డాడు కూడా. ఆయన నమ్మలేకపోయాడు. "ఎన్నో సమావేశాల్లో మీరు మాట్లాడిన దాన్నిబట్టి మీరు సంస్కృతంలో బాగా చదివి ఉంటారని, లేదా, మహా బోధకుల గురించి అనువాదాల్లోనైనా చదివి ఉంటారని అనిపిస్తుంది" అన్నాడు. అదేమీ కాదనీ, అంతేకాక, ఏ విధమైన మత, వేదాంత, మానసిక సంబంధమైన పుస్తకాలూ చదవలేదనీ తెలుసుకున్నప్పుడు తన అపనమ్మకాన్ని దాచుకోలేక పోయాడు.

ముద్రితమైన మాటకీ, పవిత్ర గ్రంథాలనబడే వాటికీ ఎంత విలువ నిస్తామో చిత్రంగా ఉంటుంది. పండితులుకూడా పామరుల్లాగే గ్రామఫోనులు. పునశ్చరణ చేస్తూనే ఉంటారు, రికార్డులు ఎన్నిమార్చినా. వారికి కావలసిన దల్లా జ్ఞానం. అంతేకాని, అనుభవంకాదు. అనుభవించటానికి జ్ఞానం ప్రతిబంధకం. కాని జ్ఞానం సురక్షితమైన ఆశ్రయం. కొద్దిమంది తెలియని వాళ్లు జ్ఞానానికి ముగ్ధులై, తెలిసిన వారిని గౌరవిస్తారు, సన్మానిస్తారు. జ్ఞానం కూడా ఒక దురలవాటే, తాగుడులాగ. జ్ఞానం వల్ల అవగాహన కలగదు. జ్ఞానాన్ని బోధించవచ్చు, కాని వివేకాన్ని కాదు. వివేకం కలగటానికి జ్ఞానం నుంచి స్వేచ్ఛ పొందాలి. జ్ఞానం నాణెం కాదు వివేకాన్ని కొనుక్కునేందుకు. జ్ఞానంలో ఆశ్రయం పొందినవాడు బయటికి రావటానికి ధైర్యం చేయడు, మాటలే అతని ఆలోచనలకు ఆహారం కనుక. ఆలోచించటంతోనే తృప్తి పొందుతాడు. ఆలోచించటం అనుభవించటానికి ప్రతిబంధకం. అనుభవించటం లేకుండా వివేకం ఉండదు. జ్ఞానం, ఊహ, నమ్మకం అనేవి వివేకం కలగకుండా అడ్డు నిలుస్తాయి.

వ్యాపకంతో ఉన్న మనస్సు స్వేచ్ఛగా అనాలోచితంగా ఉండదు. అనాలోచిత స్థితిలోనే ఏదైనా సాక్షాత్కారం కాగలదు. వ్యాపకంతో ఉన్న

మనస్సు తన చుట్టూ మూసేసుకుంటుంది. దాన్ని సమీపించటానికి కుదరదు. అభేద్యంగా ఉంటుంది. అందులోనే దానికి రక్షణ లభిస్తుంది. ఆలోచన స్వతస్సిద్ధంగా తన్నుతాను ప్రత్యేకించుకునేది. దాన్ని భేదించటం సాధ్యం కాదు. ఆలోచన అనాలోచితంగా ఉండజాలదు, అది ఎన్నటికీ స్వేచ్ఛగా ఉండదు. కొనసాగుతున్న గతమే ఆలోచన. కొనసాగుతున్నది స్వేచ్ఛగా ఉండలేదు. అంతమైనప్పుడే స్వేచ్ఛ ఉంటుంది.

వ్యాపకంతో ఉండే మనస్సు తను పనిచేస్తున్న దాన్ని తానే సృష్టించు కుంటుంది. ఎద్దుబండినిగాని, జెట్ విమానాన్ని గాని తయారు చేయగలదు. మనం తెలివి తక్కువ వాళ్లం అని అనుకోగలం. మనం తెలివి తక్కువ వాళ్లమే. మనమే దైవం అనుకోగలం. మనం ఊహించినదే మనం. "నేనే అది."

"ప్రాపంచిక విషయాల్లో కన్న దేవుని గురించిన వాటితో వ్యాపకం పెట్టుకోవటం నిశ్చయంగా మంచిది, కాదా?"

మనం ఏది ఆలోచిస్తామో అదే మనం. ఆలోచనా ప్రక్రియని అర్థం చేసుకోవటం ముఖ్యం, అంతేకాని, మనందేన్ని గురించి ఆలోచిస్తున్నామో అది కాదు. భగవంతుడి గురించి ఆలోచిస్తున్నామా లేదా ఒక పానీయం గురించి ఆలోచిస్తున్నామా అన్నది ముఖ్యం కాదు; ప్రతిదానికీ ఒక ప్రత్యేక ఫలితం ఉంటుంది. కాని, రెండింటిలోనూ స్వయం కల్పిమైన దాని గురించే ఆలోచనకి వ్యాపకం. ఊహలూ, ఆదర్శాలూ, లక్ష్యాలూ, మొదలైనవన్నీ ఆలోచన కల్పించినవే - విస్తరించిన ఆలోచనలే. ఏ స్థాయిలోనైనా సరే. స్వయం కల్పితమైన వాటి గురించి వ్యాపకం పెట్టుకోవటం 'నేను'ని ఆరాధించటమే. 'నేను' అనేది కూడా ఆలోచన రూపకల్పనే. ఆలోచన దేనితో వ్యాపకం పెట్టుకుంటే అదే అది. అది ఆలోచన తప్ప మరొకటి కానే కాదు. అందుచేత ఆలోచనా ప్రక్రియని అవగాహన చేసుకోవటం ముఖ్యం.

ఆలోచన సమస్యకి ప్రతిక్రియ, కాదా? సమస్య లేకుంటే ఆలోచన ఉండదు. సమస్య, ప్రతిక్రియ - వీటి ప్రక్రియే అనుభవం. అనుభవాన్ని మాటలలో రూపొందించటమే ఆలోచన. అనుభవం ఎప్పుడూ గతించినదే, కాని ప్రస్తుతంతో కలిసిన గతం. అది వ్యక్తంగానూ ఉంటుంది, నిగూఢంగానూ ఉంటుంది. ఈ అనుభవ శేషమే జ్ఞాపకం, ప్రభావం. జ్ఞాపకం యొక్క, గతం

యొక్క ప్రతిక్రియే ఆలోచన.

"ఆలోచన అంటే అంతేనా? జ్ఞాపకానికి ప్రతిక్రియగానే కాక ఆలోచనలో అంతకన్న ఎక్కువ ప్రగాఢమైనవి లేవా?"

ఆలోచన తన్నుతాను వివిధ స్థాయిల్లో పెట్టుకోగలదు, పెట్టుకుంటుంది - తెలివి తక్కువ అనీ, ప్రగాఢం అనీ, ఉన్నతమనీ, నీచమనీ. అయినా, అదంతా ఆలోచనే, కాదా? దేవుడి గురించి ఆలోచన మనస్సులోనిదే, మాటల్లోనిదే. దేవుడి గురించి ఆలోచన దేవుడు కాదు. అది జ్ఞాపకం యొక్క ప్రతిక్రియ మాత్రమే. జ్ఞాపకం చాలా కాలంపాటు ఉంటుంది. అందువల్ల అది ప్రగాఢమైనది అనిపించవచ్చు. కాని, స్వతస్సిద్ధంగా అది లోతైనది ఎన్నటికీ కాలేదు. జ్ఞాపకం దాగి ఉండవచ్చు, పైకి వెంటనే కనిపించకుండా. అంత మాత్రం చేత అది ప్రగాఢం కాదు. ఆలోచన ఎన్నటికీ ప్రగాఢం కాలేదు. అది ఉన్న దాని కన్న ఎక్కువ ఏమీ కాలేదు. ఆలోచన తనకు తాను ఎంతో విలువనిచ్చుకోవచ్చును, కాని అది ఆలోచనే. స్వయంకల్పితమైన దానితో మనస్సు వ్యాపకంపెట్టుకోవటం ఆలోచనకతీతంగా పోవటం కాదు. ఒక కొత్త పాత్ర వహిస్తుందంతే - ఒక కొత్తవేషం. వేషంలో ఉన్నది ఆలోచనే.

"అయితే, ఆలోచనకి ఎవరైనా అతీతంగా పోవటం ఎలా?"

అది కాదు అసలు విషయం. అవునా? ఆలోచనకి అతీతంగా ఎవరూ పోలేరు. ఆ "ఎవరు" అనే "ప్రయత్నం చేసేవాడు" ఆలోచన ఫలితమే. ఆలోచనా ప్రక్రియని అర్థం చేసుకోవటంతో, అంటే ఆత్మ జ్ఞానం ఉండటంతో ఉన్నస్థితి అనే సత్యం ఆలోచనా ప్రక్రియని అంతం చేస్తుంది. ఉన్నస్థితి అనే సత్యం ఏ పుస్తకాల్లోనూ ప్రాచీనమైనవిగాని, ఆధునికమైనవిగాని - వేటిలోనూ దొరకదు."

"అయితే సత్యాన్ని ఎలా కనుక్కోవటం?"

ఎవరూ కనుక్కోలేరు. సత్యాన్ని కనుక్కునేందుకు చేసే ప్రయత్నం స్వయం కల్పిత లక్ష్యాన్ని తెస్తుంది. ఫలితం విస్తృతమైన, కల్పితమైన ఆలోచన కొనసాగటమే. ఆలోచన అంతమైనప్పుడే సత్యం ఉంటుంది. బలవంతం మీదా, క్రమశిక్షణవల్లా, ఏవిధమైన ప్రతిఘటనవల్లా ఆలోచన అంతం కాదు.

ఉన్నస్థితి చెప్పే కథని వింటూంటే దానంతట అదే విముక్తి పొందుతుంది. సత్యమే విముక్తి కలిగిస్తుంది - స్వేచ్ఛగా ఉండాలని చేసే ప్రయత్నం కాదు.

## 67. కోరిక, సంఘర్షణ

వాళ్లంతా కలిసి ముచ్చట గొల్పుతున్నారు. అందులో చాలా మంది ఉత్సాహంగా వింటున్నారు. కొంతమంది ఖండించటం కోసమే వింటున్నారు. వినటం అనే కళ అంత సులభంగా రాదు. అందులో అందం ఉంటుంది. గొప్ప అవగాహన ఉంటుంది. మనలోని ఎన్నో లోతుల్లోంచి వింటాం. కాని, మనం వినటం ఎప్పుడూ అంతకు ముందు గ్రహించిన దానితోనూ, లేదా, ఒక ప్రత్యేక దృష్టితోనూ మాత్రమే. ఊరికే వినం. మధ్యలో ఎప్పుడూ మన సొంత ఆలోచనలూ, నిర్ణయాలూ, దురభిప్రాయాలూ తెరలా అడ్డు నిలుస్తాయి. మనం సంతోషంతో గాని, ప్రతిఘటిస్తూగాని, గ్రహిస్తూగాని, తిరస్కరిస్తూగాని వింటాం. కాని, వినటం ఉండదు. వినటానికి అంతరంగంలో నిశ్శబ్దం, సేకరణ భారంలేని స్వేచ్ఛ, విశ్రాంతితో కూడిన ధ్యానం ఉండాలి. ఈ మెలకువగా అనాసక్తంగా ఉండే స్థితిలో మాటల్లో నిర్ణయించటానికతీతమైన దాన్ని వినగలుగుతాం. మాటలు గందరగోళంగా ఉంటాయి. బయటికి తెలియజేయటానికి అదొక్కటే మార్గం. మాటల ధ్వనికి అతీతమైన సంపర్కం కలగటానికి వినటంలో మెలకువగానూ, అనాసక్తంగానూ ఉండాలి. ఇష్టం ఉన్నవాళ్లు వినొచ్చు. కాని, వినేవాళ్లు దొరకటం చాలా అరుదు. మనలో చాలా మంది ఫలితాల వెంట పడతారు; లక్ష్యాలు సాధిస్తూ, నిరంతరం తప్పించు కుంటూ, జయిస్తూ ఉంటారు. అందుకే వినటం ఉండదు. వింటున్నప్పుడే ఎవరికైనా మాటల్లోని పాట వినిపిస్తుంది.

"కోరిక నుంచి విముక్తి పొందటం సాధ్యమేనా? కోరిక లేకుండా జీవితం ఉంటుందా? కోరికే జీవితం కాదా? కోరిక నుంచి విముక్తి పొందాలనుకోవటం మరణాన్ని ఆహ్వానించటమే. కాదా?"

కోరిక అంటే ఏమిటి? దాని గురించి ఎప్పుడు తెలుస్తుంది మనకి?

మనం కోరుతున్నామని ఎప్పుడు అంటాం? కోరిక నిర్గుణంగా ఉండదు. దేనితోనైనా సంబంధం ఉన్నప్పుడే అది ఉంటుంది. సంపర్కంలో, సంబంధంలో కోరిక పుడుతుంది. సంపర్కం లేకుండా కోరిక ఉండదు. సంపర్కం ఏ స్థాయిలోనైనా కావచ్చు. కాని, అది లేకుండా అనుభూతీ, ప్రతిక్రియా, కోరికా ఉండవు. కోరిక విధానం మనకి తెలుసు, అది ఎలా పుడుతుందో : గ్రహించటం, సంపర్కం, అనుభూతి, కోరిక. కాని, మనం కోరిక ఉందని ఎలా తెలుసుకుంటాం? నాకు కోరిక ఉంది అని నేనెప్పుడు అంటాను? సుఖంగాని, దుఃఖంగాని ఇబ్బంది కలిగించినప్పుడే. సంఘర్షణ గాని ఇబ్బందిగాని ఉన్నదని తెలుసుకున్నప్పుడే కోరికని గుర్తించటం జరుగుతుంది. సమస్యకి తగిన ప్రతిక్రియ లేకపోవటమే కోరిక. అందమైన కారుని చూడటంతోనే సుఖానికి ఇబ్బంది కలుగుతుంది. ఈ ఇబ్బందే కోరికని తెలుసుకోవటం. ఇబ్బంది బాధ వల్ల కలిగినా, సుఖం వల్ల కలిగినా, దానిమీదే దృష్టి నిలపటం ఆత్మ చైతన్యం. ఆత్మ చైతన్యమే కోరిక. సమస్యకి తగిన ప్రతిక్రియ లేకపోవటం వల్ల ఇబ్బంది కలిగినప్పుడు మనం చైతన్యంగా ఉంటాం. సంఘర్షణ అంటే ఆత్మ చైతన్యం. ఈ ఇబ్బంది నుంచీ, కోరిక యొక్క సంఘర్షణ నుంచీ విముక్తి సాధ్యమా?

"మీరనేది కోరిక యొక్క సంఘర్షణ నుంచి విముక్తి పొందటమా, లేక కోరిక నుంచేనా?"

సంఘర్షణ, కోరిక - రెండు వేరు వేరు స్థితులా? అయినట్లయితే, మన విచారణ భ్రమకి దారితీయక తప్పదు. సుఖంనుంచి గాని, బాధనుంచి గాని, కావాలనుకోవటంనుంచి గాని, ప్రయత్నించటంనుంచి గాని, నెరవేరటం నుంచి గాని, వ్యక్తంగా కాని, అవ్యక్తంగా కాని ఇబ్బంది లేనట్లయితే కోరిక ఉంటుందా? ఇబ్బంది తొలగించుకోవాలనుకుంటాం, కాదా? దీన్ని అర్థం చేసుకున్నట్లయితే కోరిక అర్థాన్ని గ్రహించటానికి వీలవవచ్చు. సంఘర్షణ అంటే ఆత్మ చైతన్యం. ఇబ్బంది ద్వారా ధ్యానాన్ని కేంద్రీకరించటం కోరిక. ఇంతకీ మీరు కోరికలోని సంఘర్షణాంశాన్ని వదిలించుకుని సుఖప్రదమైన అంశాన్ని అట్టిపెట్టుకోవాలని అనుకుంటున్నారా? సుఖమూ, సంఘర్షణా, రెండూ ఇబ్బంది కలిగించేవే, కాదా? లేకపోతే, సుఖం ఇబ్బంది

పెట్టదనుకుంటున్నారా?

"సుఖం ఇబ్బంది పెట్టదు."

అది నిజమేనా? మీరెప్పుడూ సుఖంలోని బాధని అనుభవించలేదా? సుఖం కావాలనే తపన అంతకంతకు హెచ్చి ఇంకా ఇంకా కావాలని కోరదా? ఇంకా కావాలనే తపన కూడా, తప్పించుకోవాలని తొందర పడినట్లుగానే ఇబ్బంది కలిగించేది కాదా? రెండూ సంఘర్షణకి కారణమవుతాయి. మనం సుఖప్రదమైన కోరికని అట్టే పెట్టుకుని బాధాకరమైనదాన్ని తప్పించుకుంటాం. కాని, దగ్గర నుంచి పరీక్షగా చూసినట్లయితే, రెండూ ఇబ్బంది కలిగించేవే. కాని మీరు ఇబ్బంది నుంచి విముక్తి పొందాలనుకుంటారా?

"మనకి కోరికే లేకపోతే చచ్చిపోతాం; సంఘర్షణే లేకపోతే నిద్రపోతాం."

మీరు అనుభవంతో మాట్లాడుతున్నారా, లేక కేవలం దాని గురించి ఊహించా? సంఘర్షణ అనేది లేకపోతే ఎలా ఉంటుంది అని మనం ఊహిస్తున్నాం. అందుకని సంఘర్షణ ఆగిపోయాక ఉండే స్థితిని అనుభవించ కుండా అడ్డుకుంటున్నాం. మన సమస్యకీ, సంఘర్షణకీ ఏది కారణం అని కదా? ఏదైనా అందమైన దానివల్లకాని, అనాకారివల్లగాని సంఘర్షణ కలగకుండా చూడలేమా? ఆత్మ చైతన్యం లేకుండా మనం గమనించలేమా, వినలేమా? ఇబ్బంది కలగకుండా జీవించలేమా? కోరిక లేకుండా జీవించలేమా? నిస్సంశయంగా, మనం ఇబ్బందిని అర్థం చేసుకోవాలి - దాన్ని తప్పించుకునేందుకుగాని, ఆకాశానికెత్తడానికి గాని ప్రయత్నించకుండా. సంఘర్షణని అర్థం చేసుకోవాలి, దాన్ని మహోన్నతం చేయటంగాని, అణచిపెట్టటంగాని కూడదు.

సంఘర్షణకి కారకమయేదేమిటి? సమస్యకి ప్రతిక్రియ తగినట్లు లేకపోతే సంఘర్షణ జనిస్తుంది. ఈ సంఘర్షణే ఆత్మ అనే చైతన్యం కేంద్రీకృతం కావటం. సంఘర్షణ ద్వారా ఆత్మ అనే చైతన్యం కేంద్రీకృతం కావటమే అనుభవం. సమస్యకిగాని, ప్రేరేపణకిగాని ఏర్పడే ప్రతిక్రియే అనుభవం. మాటల్లోపెట్టని, పేరు పెట్టని అనుభవం ఉండదు. పేరు పెట్టటం, జ్ఞాపకం అనే సామానుగది లోంచి - ఈ పేరు పెట్టటం అంటే - మాటల్లో రూపొందించే పద్ధతి. సంకేతాలు చెయ్యటం, ఊహా చిత్రాలు, మాటలు - వీటితో జ్ఞాపకాన్ని

శక్తి సంపన్నం చేయటం. చైతన్యం, సంఘర్షణ ద్వారా ఆత్మని కేంద్రీకరించటం - ఇదే అనుభవం, పేరుపెట్టటం, పదిలపరచటం కలిసిన పూర్తి ప్రక్రియ.

"ఈ ప్రక్రియలో సంఘర్షణని రేపేదేమిటి? సంఘర్షణ నుంచి విముక్తి కాగలమా? సంఘర్షణకు అవల ఉన్నదేమిటి?"

పేరుపెట్టటమే సంఘర్షణకు దారితీస్తుంది. కాదా? ఏ సమస్యనైనా, ఏ స్థాయిలోనైనా, దాన్ని మీరు ఒక గతానుభూతితో ఒక ఊహతో ఒక నిర్ణయంతో, ఒక దురభిప్రాయంతో సమీపిస్తారు. అంటే, ఆ అనుభవానికి ఒక పేరు పెడుతున్నారు. ఈ పేరుపెట్టటం అనుభవానికి ఒక లక్షణాన్ని ఇస్తుంది. పేరు పెట్టటంలోంచే లక్షణం వస్తుంది. పేరు పెట్టటం అంటే జ్ఞాపకంగా దాచుకోవటం. గతం కొత్తదాన్ని కలుసుకుంటుంది. సమస్యని జ్ఞాపకం, అంటే గతం కలుస్తుంది. గతం యొక్క ప్రతిక్రియ సజీవమైన కొత్త సమస్యని అర్థం చేసుకోలేదు. గతం యొక్క ప్రతిక్రియలు సరిపోవు. దీంతో సంఘర్షణ ఉద్భవిస్తుంది. అదే ఆత్మ చైతన్యం. పేరు పెట్టటం అనేది లేనప్పుడు సంఘర్షణ ఆగిపోతుంది. ప్రతిక్రియతో బాటు పేరు పెట్టటం ఒకేసారి మీలో ఎలా జరుగుతుందో మిమ్మల్ని మీరు పరీక్షగా గమనించుకోండి. ప్రతిక్రియకీ, పేరుపెట్టటానికీ మధ్యనుండే విరామమే అనుభవించటం. అనుభవించేది గాని, అనుభవంగాని లేకుండా అనుభవించటం సంఘర్షణకి అతీతమైనది. సంఘర్షణ అంటే ఆత్మ కేంద్రీకరణం. సంఘర్షణ ఆగిపోవటంతో ఆలోచనలన్నీ అంతమవుతాయి. అనంతమైనది ఆరంభమవుతుంది.

## 68. ప్రయోజనం లేని చర్య

ఆయన ఎన్నో వివిధ రకాల సంస్థల్లో ఉన్నాడు. అన్నిటిలోనూ చురుకుగా పనిచేశాడు. ఆయన రచించాడు, ప్రసంగించాడు, డబ్బుపోగు చేశాడు, సంస్థలను నడిపాడు. ఆయన శక్తిమంతంగా, పట్టుదలగా, సమర్థవంతంగా ఉంటాడు. ఆయన చాలా ఉపయోగకరమైనవాడు. ఆయన అవసరం అందరికీ ఉంటుంది. ఎప్పుడూ దేశంలో ఇటూ అటూ తిరుగుతూ ఉంటాడు. ఆయన రాజకీయ ఉద్యమాల్లో పాల్గొన్నాడు, జైలుకి వెళ్లాడు,

నాయకులను అనుసరించాడు. ఇప్పుడు ఆయన కూడా తనుచేసే పనిలో ముఖ్యమైన వ్యక్తే. గొప్ప ప్రణాళికలను వెంటనే అమలు చెయ్యాలని ఆయనకీ ఉంది. తక్కిన విద్యావంతుల్లాగే ఆయన కూడా వేదాంతం గురించి చదివాడు. ఆయనది ఆచరించాలనే తత్త్వమట - ఆలోచించటం కాదుట. సంస్కృతంలో ఒక వాక్యం చెప్పాడు మొత్తం ఆచరణ తత్త్వాన్ని గురించి తెలియజేయటానికి. తను ఆచరణలో పెట్టాలనుకునే రకం మనిషిని అని ఉద్ఘాటించటంలో, జీవితానికి అవసరమైన ముఖ్యమైన వాటిల్లో తానొకడినని - వ్యక్తిగతంగా కాకపోయినా, ఆ రకం వాడినని చెప్పినట్లు అర్థం స్ఫురించింది. తన్నుతాను ప్రత్యేకించుకోవటంతో తన్నుతాను అవగాహన చేసుకోకుండా ఆటంకం ఏర్పరచుకున్నాడు.

ఏదో ఒక వర్గానికి చెందినట్లు చీటీ తగిలించుకుంటే తృప్తిగా ఉన్నట్లుంటుంది. మనం చెందుతామనుకున్న వర్గాన్ని స్వీకరించినట్లయితే జీవితానికొక సంతృప్తికరమైన తాత్పర్యం చెప్పినట్లవుతుంది. మనం మాటల్నీ పేరున్న చీటీనీ ఆరాధిస్తాం. ఆ సంకేతం యొక్క విలువని అర్థం చేసుకోవటానికి సంకేతానికి అతీతంగా ఎప్పుడూ వెళ్లం. మనం ఇదనీ, అదనీ చెప్పుకుంటూ ఇంకే ఇబ్బందీ కలుగకుండా స్థిరపడిపోతాం. ఈ సిద్ధాంతాలూ, మతాలూ ఇచ్చే శాపం ఏమిటంటే సౌఖ్యం, అవి అందించే భయంకరమైన తృప్తి. మనల్ని అవి నిద్రపుచ్చుతాయి. ఆ నిద్రలో కలగంటాం. ఆ కలయే ఆచరణ అవుతుంది. ఎంత సులభంగా మన దృష్టి మరోవైపుకి మరలిపోతుంది! మనలో చాలామంది కోరేది ఇతర ఆకర్షణల్లో పడాలనే. నిరంతర సంఘర్షణతో అలిసిపోయిన మనకి ఇతర ఆకర్షణలు అవసరమవుతాయి. ఉన్న స్థితి కన్న అవే ముఖ్యమైపోతాయి. ఇతర ఆకర్షణలతో ఆటలాడవచ్చు. ఉన్నస్థితితో కాదు. ఇతర ఆకర్షణలు, భ్రమలు, వాటివల్ల కలిగే ఆనందం వికటమైనది.

"ఆచరణ అంటే ఏమిటి? ఆచరణ క్రమం అంటే ఏమిటి? మనం ఎందుకు ఆచరిస్తాం? కేవలం కార్యకలాపం, కార్యనిర్వహణా కాదు నిశ్చయంగా. ఏదో వ్యాపకంతో ఉండటం ఆచరణ కాదు, అవునా? గృహిణి తీరిక లేకుండా ఉంటుంది. అది ఆచరణేనా?"

"కాదు, నిశ్చయంగా కాదు. ఆమె దైనందిన కార్యక్రమం గురించే

ఆలోచిస్తుంది. అవి చిన్న గొడవలు. కార్యనిర్వహణ చేసే మనిషికి పెద్ద సమస్యలతో, బాధ్యతలతో వ్యాపకం ఉంటుంది. పెద్ద సమస్యలతో, లోతైన సమస్యలతో వ్యవహరించటాన్ని కార్యనిర్వహణ, ఆచరణ అనొచ్చు - రాజకీయాల్లోనే గాక ఆధ్యాత్మికంగా కూడా. దానికి స్తోమతా, సమర్థతా, సక్రమ కృషీ, దీక్షతో ఒక లక్ష్యం కోసం పని చెయ్యటం అవసరం. అటువంటి మనిషి చింతనాపరుడూ, ఆధ్యాత్మిక శక్తి సంపన్నుడూ, యోగీ కాడు, అతడు కార్యాచరణ పరుడు."

పెద్ద పెద్ద సమస్యలతో వ్యాపకం ఉండటం కార్యాచరణ అంటారు మీరు. పెద్ద సమస్యలు అంటే ఏమిటి? దైనందిన జీవితం కాక వేరేగా ఉన్నాయా అవి? మొత్తం జీవిత ప్రక్రియతో సంబంధించకుండా కార్యాచరణ వేరుగా ఉంటుందా? అనేక అంతస్తుల్లో ఉన్న జీవితాన్ని సమైక్యం చేయకుండా కార్యాచరణ అవుతుందా? అవగాహన చేసుకోకుండా, సమస్త జీవన ప్రక్రియనీ సమైక్యం చేయకుండా జరిగే కార్యాచరణ కేవలం వినాశకరమైన కార్యకలాపం అవదూ? మనిషి సమగ్ర ప్రక్రియ. ఈ సమగ్రతలోనుంచే చర్య జరగాలి.

"అయితే దాని అర్థం చర్య తీసుకోకపోవటమే - ఎప్పుడో చెయ్యొచ్చు లెమ్మని ఊరుకోవటమే. చర్య తీసుకోవటం అత్యవసరం. దాని గురించి వేదాంతం చెబితే ప్రయోజనం లేదు."

మనం వేదాంతం చెబుతున్నామా? మీరు కార్యాచరణ అనుకుంటున్నది చెప్పలేనంత హాని కలిగించటం లేదా అనుకుంటున్నాం అంతే. పరివర్తన చేసినదాన్ని మళ్లీ ఎప్పుడూ పరివర్తన చెయ్యవలసి వస్తుంది. కొంత వరకు చర్య తీసుకోవటం సంపూర్ణ చర్యకాదు. అది వినాశానికే హేతువవుతుంది. మీకు ఓపిక ఉన్నట్లయితే, ఇప్పుడే, ముందెప్పుడోకాదు, సమగ్రమైన, సమైక్యమైన చర్య ఏమిటో గ్రహించవచ్చు.

ఒక ఉద్దేశంతో చేసేపని చర్య అవగలదా? ఒక ఉద్దేశం, ఒక ఆదర్శం ఉండటం, దాని కోసం పని చెయ్యటం చర్య అవుతుందా? చర్య ఒక ఫలితం కోసం చేస్తే అది చర్య అవుతుందా?

"మరి ఏ విధంగా చర్య తీసుకుంటారు?"

ఒక ఫలితం ఉన్నదాన్ని, ఒక లక్ష్యంతో ఉన్న దాన్ని మీరు చర్య అంటున్నారు, కాదా? లక్ష్యాన్ని గురించి ముందుగానే ఆలోచించుకుంటారు. మీకో ఊహ, ఒక నమ్మకం ఉంటుంది. దానికోసం పనిచేస్తారు.. యథార్థమైనది గాని, మానసికమైనది గాని, ఒక వస్తువు కోసం, ఒక గమ్యం కోసం, ఒక లక్ష్యం కోసం పని చేయటాన్ని చర్య అంటారు సాధారణంగా. భౌతికంగా వాస్తవమైనదాన్ని, ఒక వంతెన కట్టడం లాంటి దాని సందర్భంలో ఈ పద్ధతిని అర్థం చేసుకోవచ్చు. కాని, మానసిక ప్రయోజనాల సందర్భంలో ఇది సులభంగా అర్థం అవుతుందా? మనం మాట్లాడేది మానసిక ప్రయోజనం, సిద్ధాంతం, ఆదర్శం, లేదా నమ్మకం - వీటి కోసం పని చెయ్యటం గురించి. ఈ మానసిక ప్రయోజనం కోసం పనిచెయ్యటాన్ని కూడా చర్య అనే అంటారా?

"ప్రయోజనం లేని చర్య చర్యేకాదు. అది మరణం. జడత్వం, మరణం."

జడత్వం చర్య తీసుకోవటానికి వ్యతిరేకమైనది కాదు. అది వేరే స్థితి. ఈ క్షణానికి అది అప్రస్తుతం. దాన్ని గురించి మనం తరవాత చర్చించుకోవచ్చు. అసలు సంగతికి వద్దాం. ఒక లక్ష్యం కోసం, ఒక ఆదర్శం కోసం పనిచేయటాన్ని చర్య అంటున్నారు సాధారణంగా, కాదా? ఆ ఆదర్శం ఎలా వస్తోంది? ఉన్నస్థితి వేరు, అది పూర్తిగా వేరూనా? సిద్ధాంతం వేరు, దాని మీమాంస పూర్తిగా వేరూనా? హింస వేరు, అహింస పూర్తిగా వేరూనా? ఆదర్శం స్వయం కల్పితం కాదా? స్వయంగా సృష్టించుకున్నది కాదా? ఒక ప్రయోజనం కోసం, ఆదర్శం కోసం చర్య తీసుకోవటంతో స్వయం కల్పితమైన దాని కోసం మీరు ప్రయత్నిస్తున్నారు, కాదా?

"ఆదర్శం స్వయం కల్పితమా?"

మీరు దీనిలా ఉన్నారు, మీరు దానిలా అవాలనుకుంటారు. దానిలా అనేది మీ ఆలోచనా ఫలితమే కదా. అది మీ సొంత ఆలోచన నుంచి రాకపోవచ్చు. కాని ఆలోచన నుంచి వచ్చినదే కదా. ఆలోచన ఆదర్శానికి రూపకల్పన చేస్తుంది. ఆదర్శం ఆలోచనలో భాగమే. ఆదర్శం ఆలోచన కతీతమైనది కాదు. అది ఆలోచనే.

"ఆలోచించటంలో దోషం ఏముంది? ఆలోచన ఆదర్శాన్ని ఎందుకు సృష్టించకూడదు?"

మీరు దీనిలా ఉన్నారు. అది మీకు సంతృప్తినివ్వటం లేదు. అందుచేత మీరు దానిలా ఉండాలనుకుంటారు. ఇలా ఉన్నదాన్ని అర్థం చేసుకున్నట్లయితే అలా అనేది ఉద్భవిస్తుందా? మీరు దీన్ని అర్థం చేసుకోరు, అందుచేత దాన్ని సృష్టించారు - దాని ద్వారా దీన్ని అర్థం చేసుకోవటానికి గాని, దీన్ని తప్పించుకోవటానికి గాని. ఆలోచన ఆదర్శాన్నీ, సమస్యనీ కూడా సృష్టిస్తుంది. ఆదర్శం స్వయం కల్పితం. ఆ స్వయం కల్పితమైన దాని కోసం పని చెయ్యటాన్ని చర్య అంటున్నారు - ఒక ప్రయోజనం ఉన్న చర్య. అందువల్ల మీ చర్య మీరు కల్పించిన దాని హద్దుల్లోనే ఉంటుంది - అది దేవుడైనా, ప్రభుత్వమైనా. మీ హద్దుల్లోనే మీరు కదుల్తూ ఉంటే కార్యకలాపం కుక్క తన తోకని తరిమినట్లుంటుంది. అది చర్యేనా?

"కాని, ప్రయోజనం లేకుండా చర్య తీసుకోవటం సాధ్యమేనా?"

నిశ్చయంగా. ప్రయోజనంతో చేసే చర్యలోని నిజాన్ని మీరు గ్రహించినట్లయితే చర్య మాత్రమే జరుగుతుంది. అటువంటి చర్యే కార్య సాధకమైన చర్య. అదొక్కటే మూల పరివర్తన.

"అంటే మీరనేది ఆత్మకు వర్తించని చర్య, కాదా?"

అవును. భావం లేని చర్య. భావమే ఆత్మ - అది భగవంతుడితో ఐక్యం అయినా, ప్రభుత్వంతో ఐక్యం అయినా. ఆ విధంగా ఐక్యం చేసుకున్న చర్య మరింత సంఘర్షణనీ, గందర గోళాన్నీ, దుఃఖాన్నీ కలిగిస్తుందంతే. కాని కార్యాచరణపరుడు అనుకునే మనిషికి భావాన్ని తొలగించటం కష్టం. ఏదో సిద్ధాంతం లేకపోతే తప్పిపోయినట్లు భావిస్తాడు. తప్పిపోతాడు. అందుచేత అతడు కార్యాచరణ పరుడు కాడు - తన గొప్పలు ప్రదర్శించే, కార్యకలాపాల్లో చిక్కుకున్న మనిషి అతడు. అతని కార్యకలాపాలు విభేదానికీ, వినాశానికీ, దోహదం చేస్తాయి.

"అయితే, ఎవరైనా ఏం చెయ్యాలి?"

మీ కార్యకలాపం ఏమిటో అర్థం చేసుకోండి, అప్పుడే కార్యాచరణ జరుగుతుంది.

# 69. కారణం, ఫలితం

"మీరు ఎందరినో బాగు చేశారని నేనెరుగుదును. నా కొడుకుని కూడా బాగుచేయరా?" అన్నాడాయన. "వాడు దాదాపు గుడ్డివాడు. కొంత మంది డాక్టర్లను సంప్రదించాను. వాళ్లేమీ చెయ్యలేరు. యూరప్ గాని, అమెరికా గాని తీసుకువెళ్లాలని సలహా ఇచ్చారు. నేను డబ్బున్నవాణ్ణి కాదు. నాకంత స్తోమత లేదు. మీరేమైనా చెయ్యరా? వాడు నాకున్న ఒక్కడే కొడుకు. నా భార్య గుండె పగిలిపోతోంది."

ఆయన ఒక చిన్న ఉద్యోగి. బీదవాడేగాని, చదువుకున్నవాడు. ఆయన బోటి వాళ్లలాగే ఆయనక్కూడా సంస్కృతం, సంస్కృత సాహిత్యం తెలుసును. అది ఆ కుర్రవాడి కర్మ, వాళ్ల కర్మ అనీ, దాన్ని అనుభవించి తీరాలి అనీ మధ్య మధ్య అంటూనే ఉన్నాడు. ఈ శిక్ష అనుభవించటానికి తాము ఏం చేశారని? అంత బాధ అనుభవించటానికి ఏ పాపం చేశారు - తమ పూర్వ జన్మలోగాని, ఇంతవరకు ఈ జన్మలోగాని? ఈ ఘోర విపత్తు రావటానికి కారణం పూర్వ కర్మలో ఏదో ఉండే ఉంటుంది.

ఈ గుడ్డితనం రావటానికి ఏదో ముఖ్య కారణం ఉండే ఉంటుంది. డాక్టర్లు ఇంకా తెలుసుకోలేక పోయారు. వారసత్వం నుంచి వచ్చినది కావచ్చు. డాక్టర్లు శారీరక కారణాన్ని కనుక్కోలేక పోయినంత మాత్రాన మీరు ఎప్పుడో గతంలో ఉండి ఉంటుందని ఊహించటానికి ప్రయత్నిస్తారెందుకు?

"కారణం తెలుసుకోవటానికి ప్రయత్నించినట్లయితే ఫలితాన్ని అర్థం చేసుకోవటానికి ఎక్కువ వీలవవచ్చు."

కారణం తెలుసుకున్నంత మాత్రాన దేన్నైనా అర్థం చేసుకుంటారా? ఎందుకు భయపడుతున్నారో తెలుసుకున్నంత మాత్రాన భయం పోతుందా? కారణం తెలిసి ఉండొచ్చు. కాని, అంతమాత్రం చేతనే అవగాహన కలుగుతుందా? కారణం తెలిస్తే ఫలితాన్ని అర్థం చేసుకోగలుగుతానని మీరు అనటంలో అర్థం ఇది దేనివల్ల వచ్చిందో తెలుసుకుని తృప్తిపొందుదామనుకుంటున్నారు, కాదా?

"నిశ్చయంగా. అందుకే పూర్వం ఏ కర్మ చేయటం వల్ల ఈ అంధత్వం ప్రాప్తించిందో తెలుసుకోవాలనుకుంటున్నాను. దాని వల్ల ఎంతో తృప్తి కలుగుతుంది."

అందువల్ల మీకు కావలసినది తృప్తి; అవగాహన కాదు.

"రెండూ ఒకటే కాదా? అర్థం చేసుకోవటమంటే తృప్తి పొందటమే. అవగాహన వల్ల ఉపయోగం ఏముంది అందులో ఆనందం లేకపోతే?"

యథార్థాన్ని అవగాహన చేసుకోవటం వల్ల ఇబ్బంది కలగొచ్చు, ఆనందమే కలగాలని లేదు. మీ అబ్బాయికి రోగం వచ్చిందన్న యథార్థం మీకు బాధ కలిగించింది. మీకు ఓదార్పు కావాలి. ఓదార్పునే మీరు అవగాహన అంటున్నారు. మీరు బయలుదేరింది అవగాహన చేసుకోవటానికి కాదు; ఓదార్పు పొందటానికి. మీ బాధకి ఉపశమనం కలిగించుకోవటమే మీ ఉద్దేశం. దీన్నే మీరు కారణం కోసం అన్వేషించటం అంటున్నారు. మీకు కావలసినదల్లా మిమ్మల్ని నిద్రపుచ్చే మార్గం, మీకు ఇబ్బంది లేకుండా ఉండే మార్గం - దానికోసమే ప్రయత్నిస్తున్నారు. మనల్ని మనం అనేక విధాలుగా నిద్రపుచ్చుకుంటాం - దేవుడనీ, పూజలనీ, ఆదర్శాలనీ, తాగుడు అనీ, ఈ రకంగా. ఇబ్బంది నుంచి తప్పించుకోవాలనుకుంటాం. తప్పించుకునే మార్గాల్లో ఈ కారణం కోసం వెతకటం ఒకటి.

"ఇబ్బంది లేకుండా స్వేచ్ఛగా ఉండాలని ఎందుకు ప్రయత్నించ కూడదు? బాధని ఎందుకు తప్పించుకోకూడదు?"

తప్పించుకోవటం వల్ల బాధ నుంచి విముక్తి కలుగుతుందా? ఏదో అసహ్యకరమైనదో, ఏ భయంకరమైనదో కనిపించకుండా తలుపు మూసేసు కోవచ్చు. కాని అది తలుపు అవతలే ఉంటుంది, కాదా? అణచివేసిన దాన్నీ, ప్రతిఘటించిన దాన్నీ అర్థం చేసుకోలేము, అవునా? మీ బిడ్డని అణచి ఉంచొచ్చు, క్రమశిక్షణలో పెట్టొచ్చు, కాని, నిజానికి దానివల్ల మీ బిడ్డని మీరు అర్థం చేసుకోవటం మాత్రం కుదరదు. ఇబ్బంది వల్ల కలిగే బాధని తప్పించు కోవటానికి మీరు కారణాన్ని వెతుకుతున్నారు. ఆ ఉద్దేశంతో వెతికితే మీకు కావలసినదే మీకు దొరుకుతుంది. బాధ ఏ విధంగా కలుగుతుందో, అడుగ

డుగునా తెలుసుకుని, దాని మొత్తం నిర్మాణక్రమాన్ని గుర్తిస్తే బాధనుంచి విముక్తి పొందటానికి అవకాశం ఉంటుంది. బాధని తప్పించుకోవటం దాన్ని శక్తిమంతం చేయటానికే. కారణాన్ని వివరించటం వల్ల బాధనుంచి విముక్తి లభించదు. బాధ అలాగే ఉంటుంది. మాటలతో, నిర్ణయాలతో - మీవిగాని, ఇతరులవి గాని, దాన్ని కప్పి ఉంచుతారంతే. కారణాలను తెలుసుకోవటం వివేకం పొందటం కాదు. కారణాలు వివరించటం ఆగిపోయినప్పుడే వివేకం కలగటానికి అవకాశం ఉంటుంది. ఎంతో ఆత్రుతతో వెతుకుతున్న కారణాలు మిమ్మల్ని నిద్రపుచ్చేవి మీకు దొరుకుతాయి. కాని, కారణం సత్యంకాదు. ఏ విధమైన నిర్ణయాలూ, కారణాలూ, మాటలూ లేకుండా గమనించినప్పుడు సత్యం తెలుస్తుంది. గమనించేది మాటలతో తయారవుతుంది. కారణాలూ, నిర్ణయాలూ, ఖండనలూ, సమర్థనలూ మొదలైన వాటితో తయారవుతుంది 'నేను'. గమనించేది లేనప్పుడే గమనించబడే దానితో సంపర్కం ఏర్పడుతుంది. అప్పుడే అవగాహన కలుగుతుంది. సమస్య నుంచి విముక్తి లభిస్తుంది.

"ఇది గ్రహించాననుకుంటాను. కాని, కర్మ అనేదే లేదంటారా?"

మీరనే ఆ మాటకి అర్థం ఏమిటి?

"ప్రస్తుత పరిస్థితులు - పూర్వం, అంటే, అంతకుముందే గాని, చాలాకాలం క్రిందటగాని చేసిన కార్యాలకు ఫలితం. ఆ కారణం, ఫలితం అనే ప్రక్రియ ఎన్ని విధాలుగా ఉంటుందో అదే కర్మ అంటే" అని చెప్పాడాయన.

ఇది వివరణ మాత్రమే. ఈ మాటలన్నీ దాటి వెడదాం. ఒక నిర్ణీత ఫలితానికి ఒక నిర్ణీత కారణం ఉంటుందా? కారణం, ఫలితం నిశ్చితమైతే అది మరణం కాదా? స్థిరంగా, కదల్చటానికి వీల్లేకుండా, విశిష్టంగా ఉన్నది మరణించి తీరుతుంది. విశిష్ట జంతువులు త్వరలోనే అంతమొందుతాయి. కాదా? మనిషి విశిష్టత లేనివాడు. అందుచేత అతడి జీవనం కొనసాగే అవకాశం ఉంది. ఎలా పడితే అలా మలచటానికి వీలయేది చాలా కాలం ఉంటుంది. మెత్తగా లేనిది విరిగిపోతుంది. సింధూరం నుంచి సింధూర వృక్షం కాక మరొకటి రాలేదు. కారణం, ఫలితం సింధూరమే. కాని, మనిషి అంతగా పూర్తిగా అన్ని వైపులా మూసుకుని, ప్రత్యేక విశిష్టతతో ఉండడు. అందువల్ల

తన్ను తాను అనేక విధాల నాశనం చేసుకోకుండా ఉంటే అతడు జీవించి ఉంటాడు. కారణం, ఫలితం నిశ్చితమైనవీ, స్థిరమైనవీనా? కారణం, ఫలితం- అని విడిగా అనటం రెండూ స్థిరంగా ఉండేవనా? కారణం ఎప్పుడైనా స్థిరంగా ఉంటుందా? ఫలితం మార్చటానికి వీల్లేనట్లుగా ఉంటుందా? కారణం, ఫలితం, నిజానికి ఒకటి తరవాత ఒకటి సాగుతూ ఉండే ప్రక్రియ కాదా? ఈ రోజు నిన్నటి ఫలితం. రేపు ఈనాటి ఫలితం. ఇది వరకు కారణంగా ఉన్నది ఫలితం అవుతుంది, ఫలితంగా ఉన్నది కారణం అవుతుంది ఇది గొలుసులా జరిగే ప్రక్రియ కాదా? ఒకటి ఇంకో దానిలోకి ప్రవహిస్తుంది. ఎక్కడా ఆగదు. అదొక నిత్యచలనం - స్థిరపడటం అనేది లేకుండా, కారణం - ఫలితం - కారణం అనే చలనానికి అనేక అంశాలు దోహదం చేస్తాయి.

వివరణలూ, నిర్ణయాలూ స్థిరమైనవి - అవి దక్షిణ పక్షానివైనా, వామ పక్షానివైనా, మతం అనబడే వ్యవస్థగా మారిన నమ్మకమైనా. సజీవంగా ఉన్నదాన్ని కారణాలతో మీరు కప్పిపెట్టటానికి ప్రయత్నిస్తే సజీవమైనది మరణిస్తుంది. మనం చాలా మటుకు కోరేది అదే. మాటలతో, ఊహలతో, ఆలోచనతో మనల్ని నిద్రపుచ్చుకోవాలనుకుంటాం. నహేతుకంగా సమర్థించటం, ఇబ్బందిగా ఉన్న స్థితిని శాంతపరిచేందుకు మరోమార్గం మాత్రమే. నిద్రవచ్చేట్టు చెయ్యాలనీ, కారణాన్ని వెతకాలనీ, నిర్ణయాల కోసం ప్రయత్నించాలనీ కోరటం వల్ల మళ్లీ ఇబ్బంది కలుగుతుంది. దాంతో ఆలోచన తాను అల్లుకున్న వలలోతానే చిక్కుకుంటుంది. తన్ను తాను స్వేచ్ఛగా చేసుకోలేదు. ఆలోచన అనుభవ ఫలితం. అనుభవం ఎప్పుడూ ప్రభావం కలిగించేదే. అనుభవం సత్యానికి కొలమానం కాదు. అసత్యాన్ని అసత్యంగా తెలుసుకోవటమే సత్యంలో ఉండే స్వేచ్ఛ.

## 70. మందకొడితనం

రైలు బయలుదేరేటప్పటికి ఇంకా వెలుగుంది. నీడలు మాత్రం పొడుగవుతున్నాయి. ఊరు రైలు మార్గాన్ని చుట్టుకుని ఉంది. రైలు వెడుతూంటే చూడటానికి జనం బయటికొచ్చారు. ప్రయాణీకులు వాళ్ల

స్నేహితులకేసి చేతులూపుతున్నారు. పెద్ద రొద చేస్తూ వంతెనని దాటడం మొదలుపెట్టాం. విశాలంగా వంపుతిరిగిన నదిమీద ఉన్న వంతెన అది. ఆ జాగాలో నది కొన్ని మైళ్ల వెడల్పున ఉంది. అవతలి ఒడ్డు మసక వెలుతురులో కొద్దిగా కనిపిస్తోంది. రైలు వంతెన కున్న కడ్డీలను లెక్కపెడితే యాభైఎనిమిది ఉన్నాయి రెండు తీరాలకీ మధ్య. ఆ నీళ్లు ఎంత అందంగా ఉన్నాయి, నిశ్శబ్దంగా, నిండుగా, లోతుగా ప్రవహిస్తూ! ఇసుక తిప్పలు దూరం నుంచి హాయిగా చల్లగా ఉన్నట్లు కనిపిస్తున్నాయి. పట్టణమూ, దాని చప్పుళ్లూ, దుమ్మూ, మురికీ వెనక వదిలేసి, స్వచ్ఛమైన సాయంకాలపు గాలి కిటికీల్లోంచి వస్తోంది. కాని, పొడుగాటి ఆ వంతెన దాటగానే మళ్లీ దుమ్ముంటుంది.

క్రింద పక్కమీద ఉన్నాయన తెగమాట్లాడుతున్నాడు. మేము ఇంకా రాత్రంతా గడపాలి కాబట్టి ప్రశ్నలడిగే హక్కు తనకుందనుకున్నాడు. బాగా ఒడ్డూ పొడుగ్గా ఉన్నాడు, పెద్ద పెద్ద చేతులూ, పాదాలతో. తన గురించీ, తన జీవితం, తన సమస్యలూ, తన పిల్లల గురించీ, మాట్లాడటం మొదలు పెట్టాడు. భారతదేశం కూడా అమెరికాలాగే అభివృద్ధి పొందాలన్నాడు, ఈ జనాభా పెరుగుదలని అదుపులో ఉంచాలన్నాడు; ప్రజలు తమ బాధ్యతను తెలుసుకునేట్లు చెయ్యాలన్నాడు. రాజకీయ పరిస్థితి గురించీ, యుద్ధం గురించీ మాట్లాడి, తను చేసిన ప్రయాణాల గురించి చెప్పటంతో ముగించాడు.

మనం ఎంతగా సున్నితత్వం లేకుండా, చురుకుతనం లేకుండా, తగినంత ప్రతిక్రియ లేకుండా ఉంటాం - గమనించటానికి ఎంతగా స్వేచ్ఛ లేకుండా ఉంటాం! సున్నితత్వం లేకుండా మృదుత్వం ఎలా ఉంటుంది, చురుకుగా గ్రహించటం ఎలా ఉంటుంది, గ్రహణ శక్తి ఎలా ఉండగలదు, శ్రమలేని అవగాహన ఎలా సాధ్యం? శ్రమ పడటమే అవగాహన కాకుండా ఆటంకం కలిగిస్తుంది. ఎంతో సున్నితత్వం ఉన్నప్పుడే అవగాహన కలుగుతుంది. కాని, సున్నితత్వం అలవరచుకుంటే వచ్చేది కాదు. అలవరచు కున్నది అసహజ లక్షణమే, కృత్రిమంగా ఉన్న పై మెరుగే. ఈ పైపూత సున్నితత్వం కాదు. సున్నితత్వం సంస్కృతి ఫలితం కాదు, ప్రభావ ఫలితం కాదు. సున్నితంగా, విశాల హృదయంతో ఉండే స్థితి అది. బాహాటంగా ఉన్నదే లోనున్నది, తెలియనది, అభేద్యమైనది. కాని, మనం సున్నితంగా

ఉండకుండా జాగ్రత్త పడతాం. అది ఎంతో బాధాకరంగా, ఖండితంగా ఉంటుంది. నిత్యం సర్దుకు పోవల్సిన అగత్యం - అంటే, గమనించవలసిన అగత్యం ఉంటుంది. గమనించటం అంటే జాగ్రత్తగా వీక్షించటం, ఇందుకు బదులు మనల్ని ఓదార్చాలనీ, నిద్రపుచ్చాలనీ, మందకొడిగా చెయ్యాలనీ అనుకుంటాం. వార్తాపత్రికలూ, సచిత్రపత్రికలూ, పుస్తకాలూ చదవటానికి అలవాటు పడిపోవటంతో, వాటి ప్రభావానికి మందకొడితనం ఏర్పడుతుంది. తాగటం, పూజ చేయటం లాగే చదవటం కూడా తప్పించుకునేందుకొక బ్రహ్మాండమైన మార్గం - జీవితంలోని బాధనుంచి తప్పించుకోవాలనుకుంటాం. దానికి మందకొడితనం బాగా పనిచేసే మార్గం; సమర్థనల మూలంగా, ఎవరో ఒక నాయకుణ్ణి అనుసరించటం మూలంగా, ఒక ఆదర్శం మూలంగా, ఏదో సాధించిన దానితోగాని, పేరుతోగాని, లక్ష్యంతోగాని ఐక్యం చెందటం మూలాన్ని ఏర్పడిన మందకొడితనం అది. మనలో చాలామంది అలా మందకొడిగా అవాలనే కోరుతారు. అలవాటైనది మనస్సుని నిద్రపుచ్చుతుంది. అలవాటైన క్రమశిక్షణా, సాధనా, ఏదో అవాలని నిలకడగా చేసే ప్రయత్నం - ఇవన్నీ సున్నితత్వాన్ని పోగొట్టే గౌరవనీయమైన మార్గాలు.

"సున్నితంగా ఉంటే జీవితంలో ఏం సాధించగలరు? ముడుచుకుపోయి, వాడిపోతాం. ప్రయోజనకరమైన కార్యమే ఉండదు."

మందకొడిగా, సున్నితత్వం లేకుండా ఉన్నవాళ్లు ప్రపంచానికేం చేస్తున్నారు? వాళ్లు చేసే కార్యం ఏవిధంగా "ప్రయోజనకరం? "యుద్ధాలూ, లోపలా బయటా కూడా గందరగోళం, నిర్దాక్షిణ్యతా, తమకీ ప్రపంచానికీ కూడా అధికమవుతూన్న దుఃఖం. జాగ్రత్తగా వీక్షించకుండా ఉండేవారి చర్య విధ్వంసానికీ, భౌతికరక్షణ లేకపోవటానికీ, వినాశానికీ దారితీయక తప్పదు. కాని, సున్నితత్వం సులభంగా రాదు. సామాన్యమైన దాన్ని అర్థం చేసుకోవటమే సున్నితత్వం. అది చాలా క్లిష్టమైనది. అది వెనక్కి తప్పుకోవటం, ముడుచుకు పోవటం, ప్రత్యేకంగా వేరవటం కాదు. సున్నితత్వంతో ప్రవర్తించడమంటే ప్రవర్తించేవాడి సమస్త ప్రక్రియనీ తెలుసుకుంటూ ఉండటం.

"నా గురించి నేను పూర్తిగా తెలుసుకోవాలంటే చాలా కాలం

పడుతుంది. ఈలోగా నా వ్యాపారం సర్వనాశనమవుతుంది. నా కుటుంబం తిండిలేక మాడుతారు."

మీ కుటుంబం తిండిలేక మాడదు. మీరు తగినంత డబ్బు కూడబెట్టక పోయినా వారికి తిండి పెట్టే ఏర్పాటు చేయటం ఎప్పుడూ సాధ్యమవుతుంది. మీ వ్యాపారం నిస్సంశయంగా నష్టపోతుంది. కాని, బ్రతుకులోని ఇతర స్థాయిల్లో కూడా విధ్వంసం జరుగుతోంది ఇప్పటికే. మీరు ఈ విధ్వంసం గురించే విచారిస్తున్నారు. మీలో ఏమవుతోందో మీరు చూడదలుచుకోలేదు. మీరు లోపలిదాన్ని లెక్కచేయకుండా పై దాన్నే నిర్మించాలనుకుంటున్నారు. కాని, లోపలిదే ఎప్పుడూ పైదాన్ని అధిగమిస్తుంది. లోపలిది సంపూర్ణంగా లేకుండా పైది ఎంతోకాలం నిలవదు. కాని, లోపలిదాని సంపూర్ణత మతవ్యవస్థలోని అనుభూతిని పదేపదే పొందటం ద్వారానూ, జ్ఞానం అనే యథార్థవివరాల సమీకరణ ద్వారానూ ఏర్పడేది కాదు. బాహ్యమైనవన్నీ నిలవాలన్నా, ఆరోగ్యవంతంగా ఉండాలన్నా, ఈ ఆంతరంగిక ప్రయత్నాలు జరిగే పద్ధతులన్నింటినీ అవగాహన చేసుకోవాలి. మీకు తీరిక లేదని చెప్పకండి. మీకు బోలెడు తీరిక ఉంది. ఇది తీరిక లేకపోవటం అన్న విషయం కాదు, లెక్క చెయ్యకపోవటమూ, ఇష్టంలేక పోవటమూను. మీకు అంతరంగిక సంపన్నత లేదు. బాహ్య సంపన్నత వల్ల తృప్తి పొందినట్లుగానే ఆంతరంగిక సంపన్నత వల్ల కూడా తృప్తి పొందాలనుకుంటున్నారు. కాబట్టి మీ కుటుంబాన్ని పోషించేందుకు అవసరమైన డబ్బు కోసం మాత్రమే ప్రయత్నించటం లేదు మీరు. సొంతం చేసుకోవటంలోని తృప్తిని పొందటానికి మాత్రమే ప్రయత్నిస్తున్నారు. ఆస్తిని గాని, జ్ఞానాన్ని గాని సొంతం చేసుకున్న వాడికి సున్నితత్వం ఉండదు. సుకుమారంగా, విశాల హృదయంతో ఉండడు. సొంతం చేసుకోవటం అంటే మందకొడిగా అవటం - ఆ సొంతం చేసుకున్నది సద్గుణం అయినా, డబ్బులైనా. ఒక వ్యక్తిని సొంతం చేసుకోవటం అంటే, ఆ వ్యక్తిని అర్థం చేసుకోలేకపోవటమే. నిజాన్ని అభిలషించి సొంతం చేసుకోవటం అంటే దాన్ని వదులుకోవటమే. సద్గుణంతో ఉండాలని ప్రయత్నించినప్పుడు మీకింక ఆ సద్గుణం ఉండదు. సద్గుణాన్ని కోరటం మరొక స్థాయిలో సంతృప్తిని పొందాలనుకోవటమే. సంతృప్తి పొందటం సద్గుణం కాదు. సద్గుణం అంటే స్వేచ్ఛ.

మందకొడిగా, గౌరవనీయంగా, సద్గుణం లేకుండా ఉన్నవాళ్లు స్వేచ్ఛగా ఉండగలరా? ఏకాంతంలో ఉండే స్వేచ్ఛ అంటే తన చుట్టూ మూసుకుని ప్రత్యేకంగా వేరుగా ఉండటంకాదు. ధనంతో గాని, దారిద్ర్యంతో గాని, జ్ఞానంతోగాని విజయంతోగాని, భావంతోగాని, సద్గుణంతో గాని ప్రత్యేకంగా వేరుగా ఉండటం అంటే మందకొడిగా, సున్నితత్వం లేకుండా ఉండటమే. మందకొడిగా, గౌరవనీయంగా ఉండేవారు సంపర్కం కలిగించుకోలేరు. ఒకవేళ కలిగించుకుంటే, అది వారి స్వయంకల్పనలతోనే. సంపర్కం కలగటానికి సున్నితత్వం, సుకుమారత్వం, ఏదో అవాలనుకోవటంనుంచి - అంటే, భయంనుంచి స్వేచ్ఛా ఉండాలి. ప్రేమ అంటే ఏదో అవటం, "నేను అవాలి" అనుకోవటం కాదు. అవుతూ ఉండేది సంపర్కం కలిగించుకోలేదు - అది ఎప్పుడూ తన్ను తాను ప్రత్యేకపరుచుకుంటుంది కనుక.

ప్రేమ సుకుమారమైనది. ప్రేమ విశాలమైనది, అభేద్యమైనది, అపరిచితమైనది.

## 71. చర్యలో స్పష్టత

ఆ ఉదయం రమణీయంగా ఉంది. వర్షాలు కురిశాక స్వచ్ఛంగా ఉంది. చెట్లు లేత చిగుళ్లు తొడిగాయి. సముద్రపు గాలికి అవి నాట్యం చేస్తున్నాయి. గడ్డి పచ్చగా ఒత్తుగా ఉంది. పశువులు దాన్ని ఆవురావురుమని తింటున్నాయి. కొద్ది నెలలుపోతే నాలుగుపరకల గడ్డి కూడా మిగలదు. తోటలోని పరిమళంతో గది నిండింది. పిల్లలు అరుస్తూ నవ్వుతున్నారు. కొబ్బరి చెట్లని పచ్చని కొబ్బరి కాయలున్నాయి.

పెద్ద పెద్ద అరిటాకులు ఊగుతున్నాయి. ఇంకా గాలికి చిరిగిపోలేదు. భూమి ఎంత అందంగా ఉంది, వర్ణకవితలా ఉంది! ఊరవతల పెద్ద ఇళ్లు, తోటలు. అవి దాటిన తరవాత సముద్రం ఉంది, నిండువెలుగుతో, ఉట్టిపడే కెరటాలతో; దూరాన చిన్న పడవ ఉంది - బల్ల చెక్కలు పేర్చినది. ఒంటరిగా ఒకడు చేపలు పడుతున్నాడు.

ఆవిడ బాగా చిన్నది, ఇరవైపైన ఉంటుంది. కొత్తగా వివాహం అయిందిట. కాని వయస్సు మీరుతున్నట్లు ఉంది చూడటానికి. తను మంచి కుటుంబంలోంచి వచ్చానని చెప్పింది - సంస్కారం ఉన్న కుటుంబం, కష్టపడి పనిచేసే కుటుంబం తమది. ఎం.ఎ. చేసిందిట ఆనర్స్‌తో. తెలివైనదీ, చురుకైనదీ అని తెలుస్తూనే ఉంది. ఒకసారి మొదలుపెట్టాక, సునాయాసంగా, ధారాళంగా మాట్లాడింది. కాని, ఉన్నట్లుండి, సిగ్గుపడి మౌనంగా ఉండిపోతుంది. తన భారం తీర్చుకోవాలని ఉందిట. ఎవ్వరితోనూ తన సమస్య గురించి చెప్పలేదుట - తన తల్లితండ్రులకు కూడా చెప్పలేదుట. క్రమక్రమంగా కొద్దికొద్దిగా తన బాధని మాటల్లో పెట్టింది. మాటలు భావాన్ని కొంతవరకే తెలియజేస్తాయి. ఒక విధమైన అపార్థాన్ని కలిగించి, చెప్పదలుచుకున్న దాన్ని పూర్తిగా చెప్పవు. ఉద్దేశపూర్వకంగా కాకపోయినా, మోసం చేస్తాయి. ఆవిడ ఎంతో చెప్పదలుచుకుంది - ఆవిడ మాటలు చెప్పిన దానికన్న. ఆవిడే గెలిచింది. కొన్ని విషయాల గురించి చెప్పలేక పోయింది, ఎంత కష్టపడి ప్రయత్నించినా. కాని, ఆవిడ మౌనమే ఆవిడ బాధల్నీ, కేవలం ఒక బంధనంగా మిగిలిపోయిన ఆ బాంధవ్యంలో ఆవిడ పొందిన అవమానాల్నీ తెలియజేసింది. భర్త ఆవిణ్ణి కొట్టి వదిలేశాడుట. ఉన్న పిల్లలు మరీ చిన్నవాళ్లు - తనకు తోడుగా ఉండాలంటే. తను ఏం చెయ్యాలి? ఇప్పుడు వాళ్లు వేరుగా ఉంటున్నారు. వెనక్కి తిరిగి వెళ్లాలా?

మర్యాద ఎంత బలంగా నొక్కి పెడుతుంది మనల్ని! అంతా ఏమనుకుంటారు? ఒంటరిగా ఉండటం సాధ్యమేనా, ముఖ్యంగా ఆడది - అందరూ అడ్డమైన మాటలూ, అనకుండా? మర్యాద అనేది వంచకులు కప్పుకునే ముసుగు. ఆలోచనలో వీలైన నేరాలన్నీ చేస్తాం. కాని, పైకి వేలెత్తి చూపించటానికేమీ ఉండదు. ఆవిడ మర్యాదగా ఉండాలనుకుంటోంది. గందరగోళంలో పడింది. చిత్రమేమిటంటే, తన లోలోపల స్పష్టంగా ఉన్నప్పుడు ఏం జరిగినా సరియైనదే అనిపిస్తుంది - ఆంతరంగికంగా ఈ స్పష్టత ఉన్నప్పుడు. తాను కోరినట్లుగా చేసినది కాదు సరియైనది అంటే. ఎలా ఉన్నప్పటికీ ఉన్న స్థితే సరియైనది. ఉన్న స్థితిని అర్థం చేసుకోవటంతో తృప్తి కలుగుతుంది. కాని స్పష్టంగా ఉండటం ఎంత కష్టం!

"నేనేం చెయ్యాలో ఎలా స్పష్టంగా తెలుసుకోగలను?"

స్పష్టమైన తరవాత చర్య తీసుకోవటం జరగదు. స్పష్టతే చర్య. మీరేం చెయ్యాలన్న విషయమే ఆలోచిస్తున్నారు గాని, స్పష్టంగా ఉండాలని కాదు. మర్యాద అనే దానికీ, మీరు చెయ్యవలసిన దానికీ మధ్య కొట్టుమిట్టాడు తున్నారు - ఆశకీ, ఉన్నస్థితికీ మధ్య. మర్యాద కావాలి, ఒక ఆదర్శ వంతమైన చర్య తీసుకోవాలి అనే రెండు కోరికలుండటం వల్ల సంఘర్షణ, గందరగోళం ఏర్పడతాయి. ఉన్నస్థితిని చూడగలిగినప్పుడే స్పష్టత ఏర్పడుతుంది. ఉన్నస్థితి ఉండవలసిన స్థితి కాదు. ఉండవలసిన స్థితి ఒక మూసలో పోసిన కోరిక మాత్రమే. ఉన్న స్థితి వాస్తవమైనది, కోరవలసినది కాదు, యథార్థమే. మీరు బహుశా ఈ విధంగా యోచించి ఉండకపోవచ్చు. ఇది మంచిదా, అది మంచిదా అని బేరీజు వేసుకుంటూ, గడుసుగా లెక్కలు వేసుకుంటూ ఆలోచించి, పథకాలూ, మారు పథకాలూ యోచించుకుని ఉంటారు. అందువల్లనే అది మిమ్మల్ని ఈ గందరగోళ స్థితికి లాక్కురావటంతో మీరేం చెయ్యాలి అని అడుగుతున్నారు. గందరగోళ స్థితిలో ఏది ఎంచుకున్నా అది మరింత గందరగోళానికి దారితీస్తుంది. దీన్ని మామూలుగా, సూటిగా చూడండి. అలాచేస్తే, ఉన్నస్థితిని ఏవిధమైన వికృతం లేకుండా గమనించ గలుగుతారు. దానిలోని అర్థమే దాని చర్య. ఉన్న స్థితి స్పష్టంగా ఉన్నట్లయితే, ఇక ఎంచుకునేందుకేమీ ఉండదు, చర్య తప్ప. మీరేం చెయ్యాలి అన్న ప్రశ్నేరాదు. ఎంచుకోవటంలో సందిగ్ధత ఉన్నప్పుడే ఏంచెయ్యాలి అన్న ప్రశ్న వస్తుంది. చర్య ఎంచుకోవలసినది కాదు. ఎంచుకుని చేసే చర్య గందరగోళంలో చేసేది.

"మీరు చెప్పేది తెలుస్తోంది. నాలో నేనే స్పష్టంగా ఉండాలి. మర్యాద అనేదాని ప్రోద్బలం లేకుండా, నాకు ఏది లాభమో అని లెక్కవేసుకోకుండా, బేరం చేసే తత్త్వం లేకుండా ఉండాలి. నాకు స్పష్టంగానే ఉంది. కాని, ఈ స్పష్టతని నిలబెట్టుకోవటం కష్టం కాదా?"

కానే కాదు. నిలబెట్టుకోవటమంటే ప్రతిఘటన. స్పష్టతని నిలబెట్టు కుంటున్నారంటే గందరగోళాన్ని వ్యతిరేకించటం. గందరగోళాన్ని అనుభవిస్తు న్నారు. ఆ స్థితిలో ఏ చర్య తీసుకున్నా గందరగోళానికే దారి తీస్తుంది. ఇదంతా

మీరు అనుభవించినప్పుడు, ఎవరో చెప్పారని కాకుండా మీ అంతట మీరే సూటిగా గ్రహించినట్లయితే ఉన్న స్థితి స్పష్టంగా తెలుస్తుంది. స్పష్టతని నిలబెట్టుకోనక్కరలేదు. అది ఉంటుందంతే.

"మీరు చెప్పింది గ్రహించాను. అవును, నాకు స్పష్టంగా ఉంది. అది బాగానే ఉంది. కాని ప్రేమ మాటేమిటి? మేము ప్రేమంటే ఎరగం. నేను ప్రేమించాననుకున్నాను. కాని లేదని తెలుసును."

మీరు నాకు చెప్పినదాన్ని బట్టి మీరు ఒంటరితనం అంటే భయం తోనూ, శారీరక వాంఛలు, అవసరాల కోసమూ వివాహం చేసుకున్నారు. అదంతా ప్రేమ కాదని తెలుసుకున్నారు. మర్యాదకోసం దాన్ని ప్రేమ అని ఉండవచ్చు. కాని, నిజానికి అది "ప్రేమ" అనే మాట - అవసరానికి తొడిగిన ముసుగు. చాలామందికి అదే ప్రేమ - గందరగోళం అనే పొగతో నిండినది. రక్షణ లేకపోవటంవల్ల, ఒంటరితనంవల్ల, నిస్పృహవల్ల, వృద్ధాప్యంలో జరిగే ఉపేక్ష, మొదలైన వాటివల్ల భయమే ఆ గందరగోళం. కాని ఇదంతా ఆలోచనా ప్రక్రియే - ప్రేమకాదు నిశ్చయంగా. ఆలోచన పదేపదే మళ్లీ చేయిస్తుంది. పదేపదే మళ్లీ చేసేది బాంధవ్యాన్ని పాతబడి పోయేటట్లు చేస్తుంది. ఆలోచన నిరర్థక ప్రక్రియ. అది వినూత్నం చేసుకోదు. కొనసాగుతూ ఉండగలదంతే. కొనసాగుతున్నది కొత్తదీ, స్వచ్ఛమైనదీ కాలేదు. ఆలోచన అనుభూతి. ఆలోచన వాంఛ. ఆలోచన సృజనాత్మకం కావటానికి తన్ను తాను అంతం చేసుకోలేదు. ఆలోచన, అనుభూతి మినహా మరొకటి అవలేదు. ఆలోచన ఎప్పుడూ వాడిపోయినదే, గతించినదే, పాతదే. ఆలోచన ఎప్పటికీ కొత్తది కాలేదు. మీరు గ్రహించినట్లు, ప్రేమ ఆలోచన కాదు. ఆలోచించేది లేనప్పుడు ప్రేమ ఉంటుంది. ఆలోచించేది వేరూ, ఆలోచన వేరూ కాదు. ఆలోచనా, ఆలోచించేదీ ఒకటే. ఆలోచించేదే ఆలోచన.

ప్రేమ అనుభూతి కాదు. అది పొగలేని జ్వాల. మీరు ఆలోచించే దానిగా ఉండనప్పుడు ప్రేమని తెలుసుకుంటారు. ప్రేమకోసం మిమ్మల్ని మీరు, ఆలోచించే దాన్ని త్యాగం చెయ్యలేరు. ప్రేమకోసం కావాలని చర్యతీసుకోలేరు - ప్రేమ మనస్సుకి చెందినది కాదు కనుక. క్రమశిక్షణ, ప్రేమించాలనే ఇచ్ఛా ప్రేమించాలనే ఆలోచన మాత్రమే. ప్రేమ గురించిన

ఆలోచన అనుభూతి మాత్రమే. ఆలోచన ప్రేమ గురించి ఆలోచించలేదు - ప్రేమ మనస్సుకి అందుబాటులో ఉండదు కనుక. ఆలోచన కొనసాగుతూ ఉంటుంది. ప్రేమ తరగనిది, అనంతమైనది, ఎప్పుడూ కొత్తగా ఉంటుంది. కొనసాగుతున్న దానికి ఎప్పుడూ ఆగిపోతుందన్న భయం ఉంటుంది. అంతమొందేదానికి ప్రేమ అనంతంగా ఆరంభం కావటం తెలుస్తుంది.

## 72. సిద్ధాంతం

"ఈ మనస్తత్వం గురించీ, మనస్సులోపల జరిగే కార్యకలాపాల గురించీ మాట్లాడినదంత సమయం వృథా చేయటానికే. జనానిక్కావలసినది పని, తిండి, మొట్టమొదట ఎదుర్కోవలసినది ఆర్థిక పరిస్థితి అని స్పష్టమైనప్పుడు మీరు శ్రోతల్ని ప్రయత్నపూర్వకంగా పెడదారి పట్టించటం లేదా? మీరు చెప్పేదానికి ఆఖరున ప్రయోజనం ఉంటే ఉండొచ్చు. కాని జనం మలమలమాడిపోతూంటే ఈ చెత్తంతా ఏ ప్రయోజనకరం? కడుపు నిండుగా లేకపోతే మీరు ఏమీ ఆలోచించలేరు. ఏమీ చెయ్యలేరు."

గడుపుకు పోవటానికి కడుపులో కొంత ఏదో పడాలన్నది నిజమే. కాని, అందరికీ తిండి దొరకాలంటే మన ఆలోచనా విధానంలోనే మూల పరివర్తన రావాలి. అందువల్లనే మానసిక రంగాన్ని ఎదుర్కోవటం ముఖ్యం. మీకు తిండి సరుకులు తయారుచేయటం కన్న సిద్ధాంతమే ఎంతో ఎక్కువ ముఖ్యం. బీద జనులకి తిండి ఉండాలనీ, వారి గురించి విచారించాలనీ మీరు మాట్లాడవచ్చు. కాని మీరు మీ ఉద్దేశం గురించీ, మీ సిద్ధాంతం గురించే ఎక్కువ విచారించటంలేదా?

"అవును, అదే చేస్తున్నాం. కాని, సామూహిక చర్య తీసుకోవటానికీ, జనాన్ని పోగుచెయ్యటానికీ సాధనం మాత్రమే సిద్ధాంతం. ఒక ఉద్దేశం లేకుండా అందరూ కలిసి పనిచెయ్యటం కుదరదు. ఉద్దేశం, ప్రణాళిక మొదట వస్తాయి. తరవాత ఆచరణ జరుగుతుంది."

అందువల్ల మానసిక అంశాలను మీరూ మొదట విచారిస్తున్నారు.

వాటిని తరవాత ఆచరించటం జరుగుతుంది అంటున్నారు. అందుకని మానసిక అంశాల గురించి మాట్లాడటం జనాన్ని ప్రయత్నపూర్వకంగా పెడదారిని పట్టించటం అనరు కదా. మీరనేదేమిటంటే, మీదొక్కటే సహేతుకమైన సిద్ధాంతం అనీ, అందుకని ఇంకో దానితో ఇబ్బంది పడటం ఎందుకనీ, కదా? మీ సిద్ధాంతం కోసం అంతా కలిసి చర్య తీసుకోవాలనుకుంటున్నారు. అందుకని మానసిక ప్రక్రియ గురించి ఇంకా ఆలోచించటం సమయాన్ని వృథా చేయటమే, అసలు విషయాన్ని వదిలి పెడమార్గాన్ని పట్టడమే అంటున్నారు. మీ ప్రకారం అసలు విషయం వర్గభేదం లేని సమాజాన్ని నెలకొల్పటం, అందరికీ పని కల్పించటం మొదలైనవి.

"మా సిద్ధాంతం విస్తృత చారిత్రాత్మక పరిశోధనా ఫలితం. జరిగిన యథార్థాల ప్రకారం చరిత్రను వ్యాఖ్యానించినది. అది వాస్తవిక సిద్ధాంతం, మతానికి చెందిన మూఢ విశ్వాసాల వంటిది కాదు. మా సిద్ధాంతానికి వెనుక అనుభవం ఉంది, కేవలం ఊహా దృశ్యాలూ, భ్రమలూ కాదు."

మత సంస్థల సిద్ధాంతాలూ, మూఢ విశ్వాసాలూ కూడా అనుభవం మీద ఆధారపడినవే - ఎవరు బోధనలు చేశారో వారివి కావచ్చు. అవి కూడా చారిత్రాత్మక సత్యాలపైన ఆధారపడినవే. మీ సిద్ధాంతం పరిశోధనలవల్లా, కొన్ని యథార్థాలను పోల్చటం వల్లా, వాటిలో కొన్ని యథార్థాలను స్వీకరించి కొన్నిటిని వదిలివేయటం వల్లా ఫలించినది కావచ్చు. మీ నిర్ణయాలు అనుభవం వల్ల కలిగినవి కావచ్చు. కాని మిగిలిన సిద్ధాంతాలు కూడా అనుభవం వల్లనే కలిగినప్పుడు వాటిని తిరస్కరిస్తారెందుకు? మీ సిద్ధాంతం చుట్టూ ఒక గుంపుని చేర్చుకుంటారు, ఇంకొకరు వాళ్ల సిద్ధాంతం చుట్టూ చేర్చుకున్నట్లు. మీరు సామూహిక చర్య కావాలంటారు. వాళ్లూ మరోవిధంగా అదే కావాలంటారు. ప్రతి సందర్భంలోనూ సామూహిక చర్య ఒక భావం నుంచి ఉత్పన్నమవుతుంది. మీ ఇరువురికీ భావాల గురించే ఆలోచన - వ్యక్తంగా కాని, అవ్యక్తంగా కాని - సామూహిక చర్య తీసుకు రావటం కోసం. ప్రతి సిద్ధాంతం వెనుకా అనుభవం ఉంది. ఎటొచ్చీ, మీరు వారి అనుభవంలోని నిజాన్ని ఖండిస్తున్నారు. వారు మీ నిజాన్ని ఖండిస్తారు. వాళ్లు మీ వ్యవస్థ ఆచరణ యోగ్యం కాదనీ, బానిసత్వానికి దారి తీస్తుందనీ, ఇంకా ఎన్నో

అంటారు. మీరు వాళ్లని యుద్ధప్రియులనీ, వారి వ్యవస్థ ఆర్థిక వినాశానికి దారితీయక తప్పదనీ అంటారు. అందుచేత మీ ఇరువురూ సిద్ధాంతాల గురించే విచారిస్తున్నారు, జనానికి తిండిపెట్టాలనీ, వారికీ ఆనందాన్ని కలిగించాలనీ కాదు. రెండు సిద్ధాంతాల మధ్య యుద్ధం జరుగుతోంది - మనిషి సంగతి మరుగునపడిపోయి.

"మనిషిని రక్షించటానికే మనిషిని మరిచిపోవటం జరుగుతుంది. భావి మానవుని కోసం నేటి మనిషిని త్యాగం చేస్తాం."

భవిష్యత్తుకోసం ప్రస్తుతాన్ని హింసామార్గంలో అంతం చేస్తారు. భవిష్యత్తుని నిర్ణయించే అధికారాన్ని మీరు ప్రభుత్వం పేరుతో వహిస్తారు. చర్చి దేవుడి పేరుతో చేసింది. మీ ఇరువురికీ దేవుళ్లున్నారు, పవిత్ర గ్రంథాలున్నాయి. మీ ఇరువురికీ వ్యాఖ్యాన కర్తలూ, మతప్రవక్తలూ ఉన్నారు - సత్యాన్నీ, అసలైన దాన్నీ వదిలి పెడత్రోవని పట్టిన వాళ్లని శపిస్తారు! మీ ఇరువురి మధ్యా ఎంతో తేడా లేదు. ఇరువురికీ చాలా పోలిక ఉంది. మీ సిద్ధాంతాలు వేరు కావచ్చు, కాని పద్ధతి దాదాపు ఒక రకమే. మీ ఇరువురూ భావి మానవుని రక్షించటం కోసం ప్రస్తుతం ఉన్న మనిషిని త్యాగం చెయ్యాలనుకుంటారు - మీకు భవిష్యత్తు అంతా తెలిసినట్లూ, భవిష్యత్తు ఒక విధంగా నిశ్చితమైనదన్నట్లూ, దాని మీద మీకు సర్వాధికారాలూ ఉన్నట్లూ! కాని, భవిష్యత్తు గురించి ఎవరైనా సందిగ్ధంలో ఉన్నట్లే మీరూ ఉన్నారు. భవిష్యత్తుని రూపొందించే ఎన్నో అభేద్యమైన సత్యాలున్నాయి ప్రస్తుతంలో. మీ ఇరువురూ ఒక ప్రతిఫలాన్నీ, ఒక ఆదర్శ వ్యవస్థనీ, ఒక ఆశ్రయాన్నీ, భవిష్యత్తులో ఇస్తామని మాటిస్తారు. కాని, భవిష్యత్తు సిద్ధాంతపూర్వకమైన నిర్ణయం కాదు. ఊహలెప్పుడూ గతాన్ని గురించీ, భవిష్యత్తు గురించే ఉంటాయి. ప్రస్తుతం గురించి ఎప్పుడూ ఉండవు. ప్రస్తుతం గురించి ఊహించలేరు. ఆచరణే జరుగుతుంది. తక్కినదంతా ఆచరణని ఆలస్యం చేయటం, ముందెప్పుడో చేయవచ్చు ననుకోవటం. అందువల్ల అది ఆచరణ కాదు. చర్య తీసుకోకుండా తప్పించు కోవటం. గతం గురించి గాని, భవిష్యత్తు గురించి కాని ఒక చర్యను ఊహించటం అంటే చర్య తీసుకోకుండా ఉండటమే. చర్య తీసుకోవటం ప్రస్తుతంలోనే జరుగుతుంది ఇప్పుడే. ఊహ ఎప్పుడూ గతం గురించిగాని,

భవిష్యత్తు గురించి కాని ఉంటుంది. ప్రస్తుతం గురించి ఊహ ఉండటం కుదరదు. సిద్ధాంతవాదికి గతంగాని, భవిష్యత్తుగాని ఒక నిశ్చితస్థితి - అతడు కూడా గతానికీ, భవిష్యత్తుకీ చెందినవాడే కనుక. సిద్ధాంతవాది ప్రస్తుతంలో ఎప్పుడూ ఉండడు. అతడికి జీవితం ఎప్పుడూ గతంలోనైనా ఉంటుంది, భవిష్యత్తులోనైనా ఉంటుంది. ఇప్పుడున్న దాంట్లో ఉండనే ఉండదు. ఊహ ఎప్పుడూ గతంలోంచి వచ్చి ప్రస్తుతంగుండా భవిష్యత్తులోకి పోతుంది. సిద్ధాంతవాదికి ప్రస్తుతం అనేది భవిష్యత్తుకి దారితీసే మార్గం మాత్రమే. అందుచేత అది అంత ముఖ్యం కాదు. మార్గంతో నిమిత్తం లేదు. గమ్యం మాత్రమే. గమ్యం చేరటానికి ఏ మార్గాన్నైనా అనుసరించండి. గమ్యం నిశ్చితమైనది. భవిష్యత్తు తెలిసినదే. అంచేత ఆ గమ్యానికి అడ్డొచ్చే వాళ్లెవరినైనా అంతం చెయ్యండి.

"ఆచరణకి అనుభవం ముఖ్యం. భావాలూ, వివరణలూ అనుభవం నుంచే వస్తాయి. మీరు అనుభవాన్ని కాదనటం లేదు, నిశ్చయంగా. ఊహా ప్రణాళిక లేకుండా చర్య తీసుకుంటే అది అరాజకంగా ఉంటుంది. అది గందరగోళంగా ఉంటుంది. తిన్నగా పిచ్చాసుపత్రికి తీసుకువెడుతుంది. అదుపులో పెట్టే ఒక ఉద్దేశం అనేది లేకుండా చర్య తీసుకోమని మీరు వాదిస్తున్నారా? ముందు ఒక ఉద్దేశం లేకుండా ఏ పనైనా ఎలా చేస్తారు?"

మీరన్నట్లుగా భావం, వివరణ, నిర్ణయం అనుభవం వల్ల వచ్చినదే. అనుభవం లేనిదే జ్ఞానం ఉండదు. జ్ఞానం లేకుండా ఆచరణ ఉండదు. భావం చర్య తరవాత వస్తుందా, లేక భావం ముందొచ్చి చర్య తరవాత జరుగుతుందా? మీరు అనుభవం ముందు వస్తుందంటున్నారు, తరవాత చర్య, అవునా? అనుభవం అంటే మీ ఉద్దేశం ఏమిటి?

"అనుభవం ఒక బోధకుడికో, ఒక రచయితకో, విప్లవకారునికో ఉన్న జ్ఞానం. ఆ జ్ఞానం అతడు చదివినవాటి నుంచీ, అనుభవాల నుంచీ - తనవి గాని, ఇతరులవిగాని కూడబెట్టినది. జ్ఞానం, లేదా, అనుభవం నుంచి ఊహలు నిర్మితమవుతాయి. ఈ ఊహానిర్మాణంలో నుంచే ఆచరణ జరుగుతుంది."

అనుభవం ఒక్కటే కొలమానమా? నిజమైన కొలమానమా? అనుభవం అంటే మన ఉద్దేశం ఏమిటి? మనం కలిసి మాట్లాడుకోవటం అనుభవం;

ప్రేరేపణకు ప్రతిక్రియ జరుపుతున్నారు. ఈ విధంగా ఎదుర్కొన్నదానికి ప్రతిక్రియను జరుపుతున్నారు. ఈ విధంగా ఎదుర్కొన్నదానికి ప్రతిక్రియను జరపటం అనుభవం. కాదా? ప్రేరేపణ, ప్రతిక్రియ - రెండూ ఒకేసారి జరిగే ప్రక్రియ. పూర్వరంగపు పరిధిలో అవి రెండూ నిత్యం మెదుల్తూ ఉంటాయి. అంతకు ముందు జరిగినదే ఎదుర్కొన్నదానికి జవాబు చెబుతుంది. ఈ విధంగా ఎదుర్కొన్నదానికి ప్రతిక్రియ జరపటమే అనుభవం కాదా? ప్రతిక్రియ అంతకు ముందున్న దాన్నుంచి వస్తుంది, ప్రభావితమైన దాన్నుంచి వస్తుంది. అనుభవం కూడా ఎప్పుడూ ప్రభావితమవుతుంది, అందువల్ల ఊహకూడా. ఊహపైన ఆధారపడిన చర్య ప్రభావితమైనదీ, పరిమితమైనదీ అవుతుంది. ఒక అనుభవం, ఊహ మరొక అనుభవానికీ ఊహకీ వ్యతిరేకంగా ఉన్నప్పుడు ఐక్యత సిద్ధించదు, మరింత వైరుధ్యం మాత్రమే పెరుగుతుంది. రెండు విరుద్ధమైన వాటికి ఐక్యత ఏర్పడదు. వ్యతిరేకత లేనప్పుడే ఐక్యత ఏర్పడుతుంది. కాని భావాలు ఎప్పుడూ వైరుధ్యాన్ని పెంపొందింపజేస్తాయి. వ్యతిరేకమైన వాటిమధ్య సంఘర్షణ ఏర్పడుతుంది. ఎట్టి పరిస్థితుల్లోనూ సంఘర్షణ నుంచి ఐక్యత సిద్ధించదు.

ఏదైనా ఎదుర్కొన్నప్పుడు పూర్వరంగం నుంచి ప్రతిక్రియ జరగటమే అనుభవం. పూర్వరంగం గతం యొక్క ప్రభావం. గతం అంటే జ్ఞాపకం. జ్ఞాపకం యొక్క ప్రతిక్రియే భావం. అనుభవం, జ్ఞానం అనబడే జ్ఞాపకంలో నుంచి తయారైన సిద్ధాంతం ఎన్నటికీ విప్లవకారకం కాదు. అది కేవలం మార్పుచెందిన గతం మాత్రమే. విరుద్ధమైన సిద్ధాంతం, సూత్రం కూడా భావమే. భావం ఎప్పుడూ గతం నుంచి వచ్చినదే. ఏ సిద్ధాంతమూ ఏకైక సిద్ధాంతం కాదు. మీ సిద్ధాంతం కూడా తక్కిన వాటిలాగే పరిమితమైనదీ, దురభిప్రాయాలతో కూడుకున్నదీ, ప్రభావితమైనదీ అని చెబితే ఎవ్వరూ మిమ్మల్ని అనుసరించరు. మనలో చాలామంది సూత్రాలకూ నిర్ణయాలకూ అలవాటు పడిపోయినందువల్ల వాటిని అనుసరిస్తాం, పూర్తిగా వినియోగింపబడతాం - స్వలాభానికి వినియోగించుకునేవాడు తానుకూడా వినియోగింపబడినట్లుగానే. ఒక భావం మీద ఆధారపడిన చర్య ఎప్పటికీ స్వేచ్ఛాయుతమైన చర్య కాజాలదు. ఎప్పుడూ బంధించే ఉంచుతుంది. ఒక గమ్యం

కోసం, ఒక లక్ష్యం కోసం చర్య తీసుకోవటం భవిష్యత్తు దృష్టిలో చర్య తీసుకోకపోవటమే. అప్పటికప్పుడు చూస్తే చర్య తీసుకుంటున్నట్లే తోస్తుంది. కాని అటువంటి చర్య ఆత్మవిధ్వంసకమైనది. అది మన దైనందిన జీవితంలో స్పష్టపడుతూనే ఉంది.

"కాని ఎవరైనా ఏవిధమైన ప్రభావానికీ లోనుకాకుండా ఉండగలరా? అది సాధ్యం కాదనిపిస్తుంది మాకు."

మళ్లీ ఒక ఊహ, ఒక నమ్మకం మిమ్మల్ని బంధిస్తోంది. మీరు నమ్ముతారు, మరొకరు నమ్మరు. మీరిద్దరూ నమ్మకానికి బంధితులే. మీరు ప్రభావితమైన దాన్ని బట్టే మీరు అనుభవం పొందుతారు. ప్రభావితం కావటం యొక్క, ప్రభావం యొక్క ప్రక్రియ మొత్తాన్ని గమనిస్తేనే స్వేచ్ఛగా ఉండటానికి సాధ్యమవుతుంది. ఈ ప్రక్రియని అర్థం చేసుకోవటమే స్వీయ జ్ఞానం. ఒక్క స్వీయజ్ఞానం వల్లనే బంధం ఉంచి స్వేచ్ఛ ప్రాప్తిస్తుంది. ఈ స్వేచ్ఛ ఎటువంటి నమ్మకమూ లేకుండా, ఎటువంటి సిద్ధాంతమూ లేకుండా ఉంటుంది.

## 73. అందం

గ్రామం మురికిగా ఉంది, కాని ప్రతి గుడిసె చుట్టూ శుభ్రంగా ఉంది. వాకిలి కడిగి రోజూ ముగ్గువేసినట్లుంది. గుడిసె లోపల కూడా పరిశుభ్రంగానే ఉంది, వంటవల్ల వచ్చే పొగ తప్పించి. ఇంటిల్లిపాదీ అక్కడే ఉన్నారు - తండ్రి, తల్లి, పిల్లలు, ఒకముసలావిడ, నాయనమ్మ అయిఉండొచ్చు. అందరూ సంతోషంగా, చిత్రంగా తృప్తిపడుతున్నట్లుగా ఉన్నారు. మాటలద్వారా తెలుసుకోవటం కష్టం. మాకు వాళ్ల భాష రాదు. మేము కూర్చున్నాం. ఎవరికీ ఇబ్బందిగా అనిపించలేదు. వాళ్ల పనులు వాళ్లు చూసుకుంటున్నారు. పిల్లలు దగ్గరికి వచ్చారు. ఒక పిల్లవాడూ, ఒక పిల్లా కూర్చున్నారు చిరునవ్వు నవ్వుతూ. సాయంకాలం భోజనం తయారయినట్లే ఉంది. అంత ఎక్కువగా ఏం లేదు. మేము వెళ్ళిపోతూంటే అందరూ బయటికి వచ్చి చూస్తూ నిలబడ్డారు. సూర్యుడు నది మీదికి వచ్చాడు ఒకే ఒక పెద్ద మేఘం వెనుక నుంచి. మేఘం

మంటల్లో ఉంది. నీళ్లు అడవి మంటల్లాగా మెరుస్తున్నాయి.

వరుసగా పొడుగునా ఉన్న గుడిసెల మధ్య నుంచి ఒక విశాలమైన దారి ఉంది. ఆ దారికిరువైపులా బాహాటంగా మురికి కాలువలు ఉన్నాయి ఊహించలేనన్ని రకాల పురుగులతో. నల్లటి బురద మీద తెల్లటి పురుగులు పెనుగులాడటం స్పష్టంగా కనిపిస్తోంది. పిల్లలు దారిలో ఆడుకుంటున్నారు, పూర్తిగా ఆటల్లో మునిగిపోయి నవ్వుకుంటూ అరుస్తున్నారు, దారినపోయే వాళ్లని పట్టించుకోకుండా. నది ఒడ్డున కొబ్బరిచెట్లు ఎర్రని ఆకాశంలో కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి. పందులూ, మేకలూ, గొడ్లూ గుడిసెల చుట్టూ తిరుగు తున్నాయి. పిల్లలు మేకో, ఆవో అడ్డొస్తే తోలేస్తున్నారు. చీకటి పడుతూంటే గ్రామంలో సద్దుమణుగుతోంది. పిల్లలు కూడా నిశ్శబ్దంగా ఉన్నారు తల్లులు పిలుస్తూంటే.

ఆ పెద్ద ఇంటి చుట్టూ అందమైన తోట ఉంది, చుట్టూ తెల్లని గోడలతో. తోట రంగురంగుల్లో పూసి ఉంది. బోలెడు డబ్బు ఖర్చుచేసి జాగ్రత్త తీసుకుని ఉండాలి. అత్యంత ప్రశాంతంగా ఉంది. ప్రతీదీ కళకళలాడుతోంది. ఆ పెద్ద చెట్టు అందం తక్కిన వాటన్నిటి పెరుగుదలకీ రక్షణ కల్పిస్తున్నట్లుగా ఉంది. ఆ నీటి ధార పక్షులకు ఆహ్లాదం గొల్పుతూ ఉండి ఉండాలి. కాని ఇప్పుడు నిశ్శబ్దంగా తనలో తనే పాడుకుంటోంది, ఏ గొడవా లేకుండా ఒంటరిగా ఉండి. రాత్రికి అన్నీ మూసేసుకుంటున్నట్లుగా ఉన్నాయి.

ఆవిడ నాట్యం చేస్తుంది. సంపాదన కోసం కాదు, ఇష్టం కొద్దీ. ఆవిడ బాగానే నాట్యం చేస్తుందని కొందరి ఉద్దేశం. తన కళ గురించి ఆవిడ గర్వపడుతూ ఉండి ఉండొచ్చు. ఆవిడలో దర్పం ఉంది. తాను సాధించిన దాని గురించిన దర్పమే కాదు, ఆధ్యాత్మికంగా తనకున్న విలువ గురించి కూడా లోలోపల గుర్తింపు ఉన్నట్లుంది. ఇంకెవరైనా బాహ్యవిజయానికి తృప్తి పడినట్లుగానే, తన ఆధ్యాత్మిక పురోగతికి ఆవిడ తృప్తిచెందుతోంది. ఆత్మ పురోగతి చెందటం అంటే ఆత్మవంచన చేసుకోవటమే. కాని, అది చాలా తృప్తికరంగా ఉంటుంది. ఆవిడ నగలు పెట్టుకుని ఉంది. ఆవిడ గోళ్లు ఎర్రగా ఉన్నాయి. పెదవులకు తగిన రంగువేసుకుంది. ఆవిడ నాట్యం చెయ్యటమే కాక, కళగురించీ, అందం గురించీ, ఆధ్యాత్మిక సాధన గురించీ ఉపన్యాసా

లిస్తూ ఉంటుంది. స్వాతిశయం, ఆకాంక్షా ఆవిడ ముఖంమీదే కనిపిస్తున్నాయి. ఆధ్యాత్మికంగానూ, కళాకారిణిగానూ కూడా కీర్తి సంపాదించాలనుకుంటోంది. ఇప్పుడు ఆధ్యాత్మికతే గెలుస్తోంది.

తనకేమీ వ్యక్తిగత సమస్యలు లేవంది. కాని అందం గురించీ, ఆధ్యాత్మికత గురించీ మాట్లాడాలనుకుంటోంది. వ్యక్తిగత సమస్యల్ని లెక్క చెయ్యదుట, ఎంతైనా అవి అర్థరహితమైనవేనని. పెద్ద పెద్ద సమస్యల గురించే విచారిస్తుందిట. అందం అంటే ఏమిటి? అది అంతర్గతమైనదా, బాహ్యమైనదా? ఊహా విషయమూ, వాస్తవిక విషయమా, రెండూ కలిసినదా? తనకు తెలిసినదే నిశ్చయమనుకుంటోంది. నిశ్చయంగా ఉండటమే అందాన్ని కాదనటం. నిశ్చయంగా ఉండటం అంటే సంకుచితంగా అభేద్యంగా ఉండటం. విశాల హృదయం లేకుండా సున్నితత్వం ఎలా ఉంటుంది?

"అందం అంటే ఏమిటి?"

ఒక నిర్వచనం కోసం గాని, సూత్రం కోసం గాని ఎదురుచూస్తున్నారా, లేక పరిశీలించాలని కోరుతున్నారా?

"అయితే పరిశీలనకు సాధనం ఉండనక్కరలేదా? తెలుసుకోకుండా, వివరణల్లేకుండా పరిశీలించటం ఎలా? మనం ఎక్కడికి వెడుతున్నామో తెలుసుకోవాలి కదా వెళ్లే ముందు?"

జ్ఞానం పరిశీలనకి అవరోధం కాదా? మీకు తెలిసినప్పుడు ఇక పరిశీలన ఎలా సాధ్యం? "తెలిసి ఉండటం" అనే పదమే పరిశీలించడం ఆగిపోయిందని సూచించదా? తెలిసి ఉండటమంటే పరిశీలించకపోవటమే. అందువల్ల మీరు కేవలం ఒక నిర్ణయాన్నీ, ఒక నిర్వచనాన్నీ మాత్రమే అడుగుతున్నారు. అందానికి కొలమానం ఉంటుందా? అందం తెలిసిన దాన్నిగాని, ఊహించిన నమూనానిగాని పోలి ఉంటుందా? అందం చట్రం లేకుండా ఉన్న ఊహా చిత్రమా? అందం ప్రత్యేకమైనదా? ప్రత్యేకమైనది సమగ్రమైనది కాగలదా? అంతర్గతంగా స్వేచ్ఛ లేనిదే బాహ్యమైనది అందంగా ఉండగలదా? అందం అలంకారమా? ముస్తాబా? అందాన్ని బయట ప్రదర్శించటం సున్నితత్వాన్ని సూచిస్తుందా? మీరు కోరుతున్నదేమిటి? బాహ్యమైనదీ, ఆంతరంగికమైనదీ

కలిసినదా? ఆంతరంగికంగా లేకుండా బాహ్యంగా ఎలా ఉండగలదు? దేనికి మీరు ప్రాముఖ్యాన్నిస్తున్నారు?

"నేను రెండింటికీ ప్రాముఖ్యానిస్తున్నాను. పరిపూర్ణ రూపం లేనిదే పరిపూర్ణ జీవితం ఎలా ఉండగలదు? బాహ్యమైనదీ, ఆంతరంగికమైనదీ కలిస్తేనే అందం.

అందుచేత అందంగా అవటానికి మీ దగ్గరొక సూత్రం ఉంది. ఆ సూత్రం అందం కాదు. కేవలం కొన్ని మాటలు మాత్రమే. అందంగా ఉండటం అంటే అందంగా అయే పద్ధతి కాదు. మీరు ప్రయత్నిస్తున్న దేమిటి?

"ఆకారం, ఆత్మ - రెండింటిలోని అందాన్నీ. చక్కని పువ్వుని పెట్టటానికి అందమైన పాత్ర కావాలి."

ఆంతరంగిక సామరస్యం, దానితో బాటు బాహ్య సామరస్యం సున్నితత్వం లేకుండా ఉండగలవా? అనాకారిగా ఉన్నదాన్ని గాని అందంగా ఉన్నదాన్నిగాని గ్రహించటానికి సున్నితత్వం ముఖ్యావసరం కాదా? అందం అంటే అనాకారితనాన్ని తప్పించుకోవటమా?

"నిశ్చయంగా అంతే."

సద్గుణం అంటే తప్పించుకోవటమూ, ప్రతిఘటించటమూనా? ప్రతిఘటించటంలో సున్నితత్వం ఉంటుందా? సున్నితత్వం స్వేచ్ఛగా ఉండవద్దా? స్వార్థపూరితంగా ఉన్నవారు సున్నితంగా ఉండి, అందాన్ని తెలుసు కోగలరా? ఉన్న స్థితిపట్ల సున్నితంగా, సుకుమారంగా ఉండటం అత్యవసరం కాదా? మనం అందంగా ఉందనే దాన్ని మనతో ఐక్యం చేసుకుని, అనాకారిగా ఉండే దాన్ని తప్పించుకుంటారు. అందమైన తోటతో మనల్ని ఐక్యం చేసుకోవాలని కోరుతూ, దుర్గంధంతో ఉండే గ్రామాన్ని చూడకుండా కళ్లు మూసుకుంటాం. ఒకటి ప్రతిఘటిస్తూ మరొకటి స్వీకరించాలను కుంటాం. ఐక్యం చేసుకోవటమంతా ప్రతిఘటన కాదా? గ్రామాన్నీ, తోటనీ కూడా ప్రతిఘటించకుండా, ఒకదానితో మరొకదాన్ని పోల్చకుండా వాటిని తెలుసు కోవటమే సున్నితంగా ఉండటమంటే. మీరు అందానికీ, సద్గుణానికీ మాత్రమే సున్నితంగా ఉండి, చెడ్డదాన్నీ, అనాకారినీ ప్రతిఘటించాలను

కుంటున్నారు. సున్నితత్వం, సుకుమారత్వం మొత్తం ప్రక్రియ. దాన్ని ఒక ప్రత్యేకమైన, తృప్తికరమైన స్థాయిలో తెగకొట్టటానికి వీల్లేదు.

"కాని నేను అందాన్నీ, సున్నితత్వాన్నీ కోరుతున్నాను."

నిజంగానా? అదే అయితే, అందం గురించి ఆలోచించటమంతా మానెయ్యాలి. ఈ ఆలోచనా, ఈ అరాధనా, ఉన్నస్థితి నుంచి, అంటే మీనుంచి మీరు పారిపోవాలని చేసే ప్రయత్నం కాదా? మీరు ఏవిధంగా ఉన్నారో, ఉన్నస్థితి ఏమిటో తెలుసుకోకుండా ఉన్నట్లయితే మీరు సున్నితంగా ఎలా ఉండగలరు? అభివృద్ధి చెందాలనే ఆకాంక్ష ఉన్నవాళ్లూ, నైపుణ్యం ఉన్నవాళ్లూ, అందాన్ని అభిలషించేవాళ్లూ తమ స్వయం కల్పిత రూపాలను ఆరాధిస్తారంతే. వాళ్లు పూర్తిగా తమ చుట్టూ తాము ఆవరించుకుని, తమ చుట్టూ గోడ కట్టుకుని ఉంటారు. ఒంటరిగా ఏదీ ఉండలేదు కనుక బాధ కలుగుతుంది. అందం కోసం ఈ అన్వేషణ, కళ గురించి నిరంతరం మాట్లాడుతూ ఉండటం జీవితం నుంచి, అంటే తన నుంచి తానే పారిపోవటానికి గౌరవనీయంగా, ఉన్నతంగా పరిగణింపబడే మార్గం.

"కాని సంగీతం పారిపోయే మార్గం కాదు"

తన్ను తాను అవగాహన చేసుకునేందుకు బదులు దాన్ని అనుసరిస్తే అదీ అంతే. తన్ను తాను అర్థం చేసుకోకపోతే అన్ని కార్యకలాపాలూ గందరగోళానికీ, బాధకీ దారితీస్తాయి. 'నేను' నీ ఆలోచన పనిచేసే పద్ధతుల్నీ అవగాహన చేసుకున్నప్పుడే స్వేచ్ఛ ఏర్పడుతుంది. స్వేచ్ఛ ఉన్నప్పుడే సున్నితత్వం ఉంటుంది.

## 74. సమైక్యత

ఆ చిన్న కుక్కపిల్లలు బొద్దుగా శుభ్రంగా ఉన్నాయి. వెచ్చని ఇసుకలో ఆడుకుంటున్నాయి. అరున్నాయి అవి. అన్నీ తెల్లగా, మట్టిరంగు మచ్చలతో ఉన్నాయి. తల్లి వాటికి కొంచెం దూరంలో నీడలో పడుకుంది. సన్నగా బక్కచిక్కి ఎంత గజ్జిపట్టి ఉందంటే ఒంటిమీద ఒక్క వెంట్రుక కూడా లేదు.

దాని శరీరం నిండా పుళ్లే. కాని తోక ఆడిస్తోంది తన పిల్లల్ని చూసుకుని గర్వంగా. ఓ నెలో ఎంతో తప్ప బ్రతక్కపోవచ్చు. వీధమ్మట తిరుగుతూ మురికి వీధుల్లోనో, గ్రామంలోనో కనిపించినదల్లా ఏరుకుంటూ ఆకలితో ఎప్పుడూ ముందుకి ఉరికే కుక్కల్లో అదొకటి. మనుషులు దానిమీదకి రాళ్లు విసురుతూ తలుపు దగ్గరనుంచి తరిమేస్తారు. వాటిని తప్పించుకోవాలి. కాని ఇక్కడ నీడలో పాత జ్ఞాపకాలు ఎంతో దూరమై పోయాయి. అలిసిపోయి ఉంది. కుక్కపిల్లల్ని ముద్దు చేసి వాటితో కబుర్లు చెప్పటం జరుగుతోంది. అది మధ్యాహ్నం; విశాలమైన నది మీంచి వచ్చేగాలి స్వచ్ఛంగానూ చల్లగానూ ఉంది. ఆ క్షణంలో తృప్తిగా ఉంది. తరవాత తిండి ఎక్కడ నుంచి వస్తుందన్నది వేరే విషయం. దానికోసం ఇప్పటినుంచీ బాధపడటం ఎందుకు?

గ్రామం అవతల నది ఒడ్డున పచ్చని పొలాలకవతల దుమ్ముా రొదతో ఉండే బాటకి దిగువున ఉన్న ఇంట్లో జనం ఎదురుచూస్తున్నారు మాట్లాడటానికి. అన్నిరకాల వాళ్లూ ఉన్నారు. ఆలోచనాపరుయూ, ఆత్రుతలో ఉన్నవారూ, బద్ధకంగా ఉన్నవారూ, నిర్వచనాల ప్రకారం, నిర్ణయాల ప్రకారం జీవించేవారూ, ఆలోచనాపరులు శాంతంగా ఉన్నారు. సమయస్ఫూర్తి ఉన్నవారు మెల్లిగా ననుగుతున్నవాళ్లను చూసి వినుక్కుంటున్నారు. నెమ్మదిగా ఉన్నవాళ్లు తొందరపడేవాళ్లతో కలిసిరావలసి వచ్చింది. అవగాహన మెరుపులా వస్తుంది. మెరుపుకీ మెరుపుకీ మధ్య నిశ్శబ్ద విరామం ఉండాలి. అర్థం చేసుకోవటం మాటల్లో కాదు. మేధా సంబంధమైన అవగాహన అనేది లేదు. మేధా సంబంధమైన అవగాహన మాటల స్థాయిలోనే జరుగుతుంది. ఆలోచనా ఫలితం కాదు అవగాహన. ఆలోచన అనేది మాటల్లో, సంకేతాల్లో, రూపకల్పనా ప్రక్రియలో ఉంటుంది. జ్ఞాపకం లేకుండా ఆలోచన ఉండదు. జ్ఞాపకమే మాట, సంకేతం, మనశ్చిత్రం. ఈ స్థాయిలో అవగాహన కలగదు. రెండుమాటల మధ్య ఏర్పడిన ఖాళీలో మాట ఆలోచనగా రూపొందే లోపున అవగాహన కలుగుతుంది. అవగాహన సమయస్ఫూర్తి ఉన్నవారికి గాని, నెమ్మదిగా ఉన్నవారికి గాని కలుగుతుందని కాదు, అపరిమితమైన ఈ విరామస్థితిని తెలుసుకున్నవారికి మాత్రమే కలుగుతుంది.

"విధ్వంసం అంటే ఏమిటి? ప్రపంచంలోని మానవ సంబంధాల్లోనూ,

మనలోనూ కూడా ఈ విధ్వంసం త్వరత్వరగా జరుగుతూండటం చూస్తున్నాం. ఈ ముక్కముక్కలైపోవటాన్ని ఎలా ఆపటం? మనలో సమైక్యత కలగటానికి ఎలా వీలవుతుంది?"

విధ్వంసం జరిగే విధానాలను మనం జాగ్రత్తగా పరిశీలించగలిగినట్లయితే, సమైక్యత కలుగుతుంది. సమైక్యత మన జీవితంలోని ఒకటి రెండుస్థాయిల్లో మాత్రమే లేదు. అన్నీ కలిసి సమకూడటంలోనే ఉంటుంది. అది జరగగలిగే ముందు, విధ్వంసం అంటే ఏమిటో మనం తెలుసుకోవాలి, వద్దా? సంఘర్షణ విధ్వంసానికి సూచనా? మనం నిర్వచనం కోసం ప్రయత్నించటం లేదు, ఆమాట వెనక ఉన్న అర్థాన్ని తెలుసుకోవటమే.

"పోరాటం అనివార్యం కాదా? బ్రతుకంతా పోరాటమే. పోరాటం లేకపోతే క్షీణత ఏర్పడుతుంది. ఒక లక్ష్యం కోసం నేను పోరాడకపోతే నేను ధ్వంసమైపోతాను. ఊపిరి తీసుకోవటం లాగే పోరాటం కూడా అత్యవసరం."

కచ్చితంగా చెప్పటంతో పరిశీలన అంతా ఆగిపోతుంది. విధ్వంసం అవటానికి సంబంధించిన అంశాలేమిటి అని తెలుసుకోవటానికి ప్రయత్నిస్తున్నాం మనం. వాటిలో సంఘర్షణ, పోరాటం ఒకటి కావచ్చు. సంఘర్షణ, పోరాటం అంటే మన ఉద్దేశంలో ఏమిటి?

"పోటీ పడటం, కష్టపడటం, కృషి చెయ్యటం, సాధించాలనే ఇచ్ఛ, అసంతృప్తి మొదలైనవి."

పోరాటం బ్రతుకులోని ఒక స్థాయిలోనే కాదు, అన్ని స్థాయిల్లోనూ. ఏదైనా అవుతూ ఉండటం పోరాటం కాదా? గుమాస్తా యజమాని అవటం, పూజారి మతగురువు అవటం, శిష్యుడు గురువు అవటం - ఇలా మానసికంగా అవటమే కృషి, పోరాటం.

"ఈ అవటం అనేది లేకుండా ఉండగలమా? అదొక అవసరం కాదా? సంఘర్షణ నుంచి ఎవరైనా విముక్తి ఎలా పొందగలరు? ఈ కృషికి వెనక భయం లేదా?"

మనం కేవలం మాటల్లోనే కాక అనుభవంలో ఈ విధ్వంసం ఎలా జరుగుతుందో తెలుసుకోవటానికి ప్రయత్నిస్తున్నాం, అంతేకాని, సంఘర్షణ

నుంచి ఎలా ముక్తిపొందటమా, దాని వెనక ఏముందా అని కాదు. జీవించటం, అవటం అనేవి రెండు వేరువేరు స్థితులు, కావా? బ్రతకటానికి కృషి అవసరం కావచ్చు. కాని మనం అవటం అనే ప్రక్రియ గురించి విచారిస్తున్నాం, ఇంకా బాగా అవాలని, ఏదో అవాలని పొందే మానసిక తపన, ఉన్నస్థితిని దానికి విరుద్ధంగా మార్చటానికి జరిగే పోరాటం. మానసికంగా అవాలనుకోవటం వల్లనే మన దైనందిన జీవితం బాధాకరంగా పోటీతో కూడినదిగా, ఒక పెద్ద సంఘర్షణగా తయారవుతోందేమో. అవటం అంటే మనం అర్థం చేసుకున్న దేమిటి? పూజారి దేవాలయాధికారి అవాలనుకోవటం, శిష్యుడు గురువు అవాలనుకోవటంలాగ మానసికంగా అవాలనుకోవటం. ఈ అవాలనుకునే ప్రక్రియతో కృషి జరుగుతుంది. వ్యక్తంగా గాని, అవ్యక్తంగా గాని, ఉన్న స్థితిని ఇంకోలా మార్చాలనే పోరాటమే ఇది. కాదా? నేను ఇది, నేను అది అవాలనుకుంటున్నాను. ఈ అవటంలో అనేక సంఘర్షణలు ఉంటాయి. ఒకదాని తరవాత మరొకటి. అది అయిన తరవాత మరొక అది, దాని తరవాత మరొకటి, అనంతంగా ఉంటుంది. ఈ ఇది అది అవటం అనేదానికి అంతం లేదు. అందుచేత, సంఘర్షణ అనంతమవుతుంది. నేను ఉన్నట్లుగా కాకుండా వేరుగా ఎందుకవాలనుకుంటున్నాను?

"మనం ప్రభావితం కావటం వల్లా, సాంఘిక ప్రభావాల వల్లా, మన ఆదర్శాల వల్లా. మనం చెయ్యగలిగిందేమీ లేదు. అది మన స్వభావం."

మనం చెయ్యగలిగిందేమీ లేదు అనేసరికి చర్చ ముగిసిపోతుంది. బద్ధకంగా ఉండే మనస్సే ఇలా ఉద్ఘాటించి బాధని భరిస్తూ ఉంటుంది. అది తెలివి తక్కువతనం. మనం ఆ విధంగా ఎందుకు ప్రభావితం అయి ఉన్నాం? మనల్ని ఎవరు ప్రభావితం చేస్తున్నారు? మనం ప్రభావితం కావటానికి తలవొగ్గుతాం కాబట్టి మనమే ఆ ప్రభావాలను తయారుచేస్తాం. మనం ఇది అయి ఉన్నప్పుడు అది అవటానికి పోరాటం సలిపేలా చేసేది ఆదర్శమా? లక్ష్యమూ, ఆదర్శ స్థితీనా సంఘర్షణ కల్పించేది? ఒక లక్ష్యం కోసం పోరాటం జరపకపోతే మనం ధ్వంసం అయిపోతామా?

"నిస్సంశయంగా నిలవుండిపోతాం, చెడునుంచి మరింత చెడుగా అవుతాం. నరకంలో పడటం సులభం, స్వర్గాన్ని అధిరోహించటం కష్టం."

మళ్లీ మనకి ఊహలూ, ఉద్దేశాలూ, ఏమవుతుందోననేదాన్ని గురించి, అంతేకాని జరిగేదాన్ని ప్రత్యక్షంగా అనుభవించం. ఊహలు అవగాహనకి అడ్డు తగుల్తాయి - నిర్ణయాలూ, సమర్థనల్లాగే. ఊహలూ, ఆదర్శాలూ మనం సాధించటానికీ, అవటానికీ పోరాడేటట్లు చేస్తున్నాయా? నేను ఇది, ఆదర్శం నన్ను అది అవటానికి పోరాడేటట్లు చేస్తుందా? ఆదర్శమే సంఘర్షణకి కారణమా? ఆదర్శం ఉన్న స్థితికి పూర్తిగా విరుద్ధమైనది కాదా? అది పూర్తిగా వేరైనదైతే, దానికీ ఉన్నస్థితికీ సంబంధం ఉండదు, అలాంటప్పుడు ఉన్నస్థితి ఆదర్శంలా కాలేదు. అవటానికి ఉన్నస్థితికీ, ఆదర్శానికీ గానీ లక్ష్యానికి గానీ సంబంధం ఉండాలి. ఆదర్శం మనం పోరాడేలా ప్రోత్సహిస్తుందంటున్నారు మీరు. అంచేత ఆదర్శం ఎలా వస్తుందో తెలుసుకుందాం. ఆదర్శం మనస్సు కల్పించినది కాదా?

"నేను మీలా ఉండాలనుకుంటున్నాను. అది కల్పితమా?"

నిశ్చయంగా. మనస్సులో ఒక భావం కలుగుతుంది, సంతోషకరమైనది కావచ్చు. అది ఆ భావం లాగ ఉండాలనుకుంటుంది. అదే మీ కోరికకి రూపకల్పన చేయటం. మీరు ఇది. ఇది మీకు ఇష్టం లేదు. మీరు అది అవాలనుకుంటున్నారు. మీ కిష్టమైనది అది. ఆదర్శం స్వయం కల్పితమే. దానికి వ్యతిరేకంగా ఉన్నస్థితి విస్తృతం కావటం. అది వ్యతిరేకమైనది కానేకాదు. ఉన్నస్థితి కొనసాగుతూ ఉండటమే, కొన్ని మార్పులతో కావచ్చు. కల్పన స్వయం ఇచ్ఛానుసారంగా జరిగినది. ఆ కల్పిత రూపాన్ని చేరుకోవటానికి జరిపే పోరాటమే సంఘర్షణ. ఉన్నస్థితి ఆదర్శరూపాన్ని కల్పించుకుని దాని కోసం పోరాటం సల్పుతుంది. ఈ పోరాటాన్నే అవటం అంటున్నాం. ఈ సంఘర్షణ ఉన్నస్థితి తను కాని స్థితిలాగ అవటానికి ప్రయత్నించటమే. కాని స్థితి ఆదర్శమూ, స్వయం కల్పితమూ. మీరు ఏదో అవాలనుకుని కష్టపడుతున్నారు. కాని, ఆ ఏదో అన్నది మీలోని భాగమే. ఆదర్శం మీరు కల్పించినదే. మీ మనస్సు మీమీద ఎలా చమత్కారం చేసిందో చూడండి. మీరు మాటలకోసం కష్టపడుతున్నారు. మీరు కల్పించినదాన్నే, మీ నీడనే వెంటాడుతున్నారు. మీరు హింసాత్మకంగా ఉన్నారు. అహింసాయుతంగా అవాలని పోరాటం సల్పుతున్నారు. అది ఆదర్శం. ఆదర్శం

ఉన్నస్థితికి కల్పితరూపమే, మరో పేరుతో - అంతే. ఈ పోరాటం అవసరమనీ, ఆధ్యాత్మికమనీ, అభివృద్ధిదాయకమనీ, ఇంకా ఎన్నో అనుకుంటున్నారు. కాని, అదంతా మనఃపంజరంలో ఉన్నదే, భ్రాంతికి దారితీసేదే.

మీమీద మీరే ప్రయోగించుకునే ఈ చమత్కారాన్ని మీరు తెలుసుకుని ఉంటే అసత్యం అసత్యంగా గోచరిస్తుంది. భ్రాంతికోసం పోరాటం జరపటమే విధ్వంస కారకం. సంఘర్షణ అంతా, అవటం అంతా విధ్వంసమే. మనస్సు తనపై తాను ప్రయోగించుకున్న చమత్కారాన్ని తెలుసుకొన్నప్పుడు - అప్పుడు ఉన్నస్థితి మాత్రమే ఉంటుంది. అవటం అంతటినీ, ఆదర్శాలన్నిటినీ, పోల్చుకోవటాన్నీ, ఖండించటాన్నీ మనస్సు నుంచి జారవిడిచినప్పుడు, దాని నిర్మాణమే కూలిపోయినప్పుడు ఉన్నస్థితిలో సంపూర్ణ పరివర్తన కలుగుతుంది. ఉన్నస్థితికి పేరు పెట్టినంతకాలం, దానికీ మనస్సుకీ సంబంధం ఉంటుంది. ఈ పేరు పెట్టటం అనే ప్రక్రియ అంటే, జ్ఞాపకం. మనస్సు నిర్మాణమే లేనప్పుడు ఉన్నస్థితి ఉండదు. ఈ పరివర్తనలోనే సమైక్యత ఉంటుంది.

సమైక్యత ఇచ్ఛా పూర్వకమైన క్రియకాదు. సమైక్యం అయే విధానం కాదు. విధ్వంసం లేనప్పుడు, అవటానికై సంఘర్షణ, పోరాటం లేనప్పుడు - అప్పుడు మాత్రమే మొత్తంగా ఉండటం అనేది, సంపూర్ణంగా ఉండటం అనేది జరుగుతుంది.

# 75. భయం, తప్పించుకునే మార్గం

మేము క్రమంగా అధిరోహిస్తున్నాం కదలిక అనేది తెలియకుండా. మా క్రింద పెద్ద మేఘాల సముద్రం. కంటికి కనిపించినంత మేరా తెల్లగా మెరిసే తరంగాలు ఒకదానిపైనొకటి ఎంతో స్థిరంగా ఆకర్షణీయంగా ఉన్నాయి. మధ్య మధ్య ఒక చుట్టు తిరిగి మరింతపైకి ఎక్కుతున్నాం. ఈ కాంతివంతమైన నురుగులో మధ్య మధ్య ఖాళీలున్నాయి. బాగా దిగువున పచ్చని భూమి. మా పైన నిర్మలంగా ఉన్న శీతాకాలపు నీలాకాశం, మృదువుగా, అనంతంగా ఉంది. మంచు నిండిన పర్వతశ్రేణి ఉత్తరం నుంచి దక్షిణందాకా పరుచుకుని ఉంది తీక్షణమైన సూర్యకాంతిలో మెరుస్తూ. ఈ పర్వతాలు పధ్నాలుగు వేల

అడుగుల ఎత్తులో ఉన్నాయి. వాటికన్నా పైకి లేచి ఇంకా ఎక్కుతున్నాం. అది పరిచితమైన శిఖర శ్రేణి. ఎంతో సమీపంగా, నిర్మలంగా ఉన్నాయి. మేం దక్షిణంవైపు దూసుకువెళ్ళాం, చేరవలసిన ఇరవైవేల అడుగుల ఎత్తుకి చేరిన తరవాత.

పక్కన కూర్చున్న ప్రయాణీకుడు తెగమాట్లాడతాడు. ఆయనకి ఆ పర్వతాలు అపరిచితమైనవి. మేము పైకెక్కుతున్నప్పుడు ఆయన కునుకు తీశాడు. ఇప్పుడు మేలుకొని మాట్లాడటానికి ఆత్రుత పడుతున్నాడు. వ్యాపారం గురించి మొదటిసారిగా విదేశాలు వెడుతున్నట్లుంది. ఆయనకి ఎన్నింటిమీదో ఆసక్తి. వాటి గురించి బాగా తెలిసినట్లే మాట్లాడాడు. మా క్రింద ఇప్పుడు సముద్రం ఉంది దూరాన నల్లగా. కొన్ని ఓడలు ఇక్కడా అక్కడా చుక్కలు పెట్టినట్లు ఉన్నాయి. దాని ఒడ్డుమీదుగా దీపాలతో వెలుగుతున్న ఒక్కొక్క నగరం దాటాం. రెక్కలు తొణకనైనా లేదు. భయం లేకుండా ఉండటం ఎంత కష్టమో చెబుతున్నాడాయన - ఒక్క కూలిపోవటం గురించే కాదు, జీవితంలో జరిగే దుర్ఘటనలన్నిటి గురించీ. ఆయనకి వివాహమైంది. పిల్లలున్నారు. ఎప్పుడూ భయమే - భవిష్యత్తు గురించే కాదు, మొత్తంమీద అన్నింటికీ. ఆ భయానికి ప్రత్యేక కారణం లేదు. ఎంతో విజయం సాధించినా, ఈ భయం ఆయన జీవితాన్ని శక్తిహీనంగా బాధామయంగా చేస్తున్నదిట. అసలు ఆయనకి ఎప్పుడూ భయమే, కాని ఈ మధ్య మరీ ఎక్కువగా ఉంటున్నదిట. భయంకరమైన కలలు కూడ వస్తున్నాయట. ఆయన భయం గురించి భార్యకి కూడ తెలుసుట. కాని అది ఎంత తీవ్రంగా ఉన్నదో మాత్రం ఆవిడకి తెలియదుట.

భయం అనేది దేనికైనా సంబంధించే ఉంటుంది. ఊహా రూపంలో అది ఒక మాట మాత్రమే. భయం అనేమాట నిజమైన భయం కాదు. మీకు ప్రత్యేకంగా దేన్ని గురించి భయమో తెలుసునా?

"ఫలానా అని ఎప్పుడూ తెలుసుకోలేకపోతున్నాను. నా కలలు కూడా అస్పష్టంగానే ఉంటున్నాయి. వాటన్నిటిలోనూ ఉండేది భయమే. స్నేహితుల తోనూ, వైద్యులతోనూ ఆ విషయం మాట్లాడాను. వాళ్లు నవ్వేసైనా ఊరుకున్నారు, లేదా, ఏవిధంగానూ సహాయపడనైనా లేదు. అంతా మాయగా

ఉంది. ఈ భయంకరమైన స్థితినుంచి విముక్తి పొందాలని కోరిక."

మీరు నిజంగా విముక్తి పొందాలనుకుంటున్నారా, లేక ఊరికే అంటున్నారా?

నేను యథాలాపంగా మాట్లాడుతున్నట్లు అనిపించవచ్చు మీకు. ఈ భయం పోవటానికి ఏమైనా చేస్తాను. "నేను అంత దైవభక్తి ఉన్నవాణ్ణి కాదు, కాని, అది నాలో లేకుండా చెయ్యమని దేవుని ప్రార్థించాను కూడా. నేను పనిలోనో, ఆటల్లోనో ఆసక్తికరంగా ఉన్నప్పుడు అది ఉండదు. కాని భీకర మృగం లాగ ఎదురు చూస్తూ ఉంటుంది. అంతలోనే నాతో కూడా ఉంటుంది మళ్ళీ."

ఇప్పుడు మీకా భయం ఉందా? అది ఇప్పుడు ఎక్కడ ఉందో తెలుస్తోందా? ఆ భయం వ్యక్తంగా ఉందా? నిగూఢంగా ఉందా?

"ఉందన్న అనుభూతి కలుగుతుంది. కాని అది వ్యక్తంగా ఉందో, అవ్యక్తంగా ఉందో తెలియదు."

ఎంతో దూరంలో ఉన్నట్లు అనుభూతి కలుగుతుందా, దగ్గరలో ఉన్నట్లా - కైవారంలో, దూరం దృష్టిలో కాదు, భావన రూపంలో?

"దాన్ని గురించి తెలుస్తున్నప్పుడు ఎంతో దగ్గరలో ఉన్నట్లుంటుంది. కాని దానికీ దీనికీ ఏమిటి సంబంధం?"

దేనితోనైనా సంబంధం ఉన్నప్పుడే భయం కలుగుతుంది. అది మీ కుటుంబం, మీపనీ, మీ భవిష్యత్తు గురించీ, మరణం గురించీ ఆలోచిస్తూ ఉండటం, ఏదైనా కావచ్చు. మీకు మరణం అంటే భయమా?

"ప్రత్యేకంగా లేదు. అయితే, చాలాకాలం తీసుకోకుండా త్వరగా చచ్చిపోవాలని మాత్రం ఉంది. నా కుటుంబం గురించి గాని, నా ఉద్యోగం గురించి గాని. నాకు ఆదుర్దా లేదు."

అలా అయితే, పైపై సంబంధాలు భయానికి కారణం కానట్లయితే, ఏదో లోలోపలిదై ఉండాలి. అదేమిటో సూచించవచ్చు ఎవరైనా. కాని, దాన్ని మీ అంతట మీరే తెలుసుకోగలిగితే దానికి మరింత విలువ ఉంటుంది. పైపై సంబంధాల గురించి మీరు ఎందువల్ల భయపడటంలేదు?

"నాకు నా భార్యకీ పరస్పర ప్రేమ ఉంది. తను ఇంకో మగవాడి వైపు చూడాలని కూడా అనుకోదు. నేను పరస్త్రీలవైపు ఆకర్షితుణ్ణి కాను. మేము ఒకరితో ఒకరం పరిపూర్ణతను పొందుతాం. పిల్లల గురించి ఆదుర్దా ఉంటుంది. చెయ్యగలిగిందంతా చేస్తాం. ఆర్థికంగా ఈనాటి గందరగోళంలో వాళ్ళకి ధనరక్షణ ఎవ్వరూ కల్పించలేరు. వాళ్ళకి చేతనైన బాగు వాళ్ళు చేసుకోవాలి. నా ఉద్యోగం సురక్షితంగా ఉంటుంది. కాని నా భార్యకి ఎప్పుడైనా ఏదైనా జరగవచ్చుననే భయం ఉండటం సహజం."

అందుచేత మీరు మీ ప్రగాఢ బాంధవ్యం గురించి నిశ్చయంగానే ఉన్నారు. ఎందువల్ల అంత నిశ్చయంగా ఉన్నారు?

"నాకు తెలియదు. ఉన్నానంతే. కొన్ని విషయాలు అలాగే ఉంటాయను కోవాలి. ఉండవా?"

అదికాదు అసలు విషయం. మనం దాన్ని గురించి తెలుసు కుందామా? మీ అంతరంగిక సంబంధం గురించి దేనివల్ల మీరు అంత నిశ్చయంగా ఉన్నారు? మీరూ మీ భార్యా ఒకరితో ఒకరు సంపూర్ణతని పొందుతున్నారని మీరు అనటంలో అర్థం ఏమిటి?

"ఒకరివల్ల ఒకరం పరస్పరం ఆనందం పొందుతున్నాం; తోడుగా ఉండటం, అర్థం చేసుకోవటం, ఇలా. గాఢంగా ఆలోచిస్తే మేం ఒకరిమీద ఒకరం ఆధారపడుతున్నాం. మా ఇద్దరిలో ఏ ఒక్కరికి ఏం జరిగినా అది పెద్ద ఆఘాతం అవుతుంది. ఆ ఉద్దేశంలో మేము పరస్పరం ఆధారపడి ఉన్నాం."

"ఆధారపడటం" అనేదానికి మీరు చెప్పే అర్థం ఏమిటి? ఆవిడ లేకపోతే మీరు తప్పిపోయినట్లుగా అవుతారనీ, ఒంటరిగా ఉన్నట్లు భావన కలుగుతుందనీనా? అదేనా? ఆవిడకూడా అలాగే భావిస్తారు. అందుచేత మీరు ఒకరిపైన ఒకరు ఆధారపడి ఉన్నారు.

"అందులో తప్పేముంది?"

మనం నిరసించటం లేదు, నిర్ణయించటం లేదు. పరిశీలిస్తున్నాం. అంతే. ఇదంతా తెలుసుకోవాలని మీరు నిజంగా అనుకుంటున్నారా? సరే, అయితే తెలుసుకుందాం.

మీ భార్య లేకపోతే మీరు ఒంటరిగా అయిపోతారు. నిశితంగా చూస్తే మీరు తప్పిపోయినట్లవుతారు. ఆవిడ మీకు అత్యవసం, కారా? మీ ఆనందం కోసం ఆవిడపైన ఆధారపడుతున్నారు. ఈ ఆధారపడటాన్నే ప్రేమ అంటున్నారు. మీరు ఒంటరిగా ఉండటానికి భయపడుతున్నారు. మీ ఒంటరితనాన్ని కప్పిపుచ్చటానికి ఆవిడ ఎప్పుడూ ఉన్నారు, మీరు ఆవిడకి ఉన్నట్లు. కాని ఆ యథార్థం ఇంకా అలాగే ఉంది, కాదా? ఒంటరితనాన్ని కప్పిపుచ్చుకోవటానికి మనం ఒకరినొకరు ఉపయోగించుకుంటాం. అనేక మార్గాల్లో దాన్నుంచి తప్పించుకుంటాం వివిధ బాంధవ్యరూపాల ద్వారా. అటువంటి ప్రతి బాంధవ్యం ఒక ఆధారం అవుతుంది. సంగీతం నాకు ఆనందాన్నిస్తుంది. కాబట్టి రేడియో వింటాను. అది నానుంచి నన్ను దూరంగా తీసుకుపోతుంది. పుస్తకాలూ, జ్ఞానం కూడా నానుంచి నేను పారిపోయేందుకు ఎంతో వీలైన మార్గాలు. వీటన్నిటి మీదా ఆధారపడతాం.

"నా నుంచి నేను ఎందుకు తప్పించుకోకూడదు? నేను గర్వపడేందు కేమీ లేదు నాలో. నా భార్యతో ఐక్యం అయితే, ఆవిడ నాకన్న ఎంతో నయం కనుక, నన్ను నేను తప్పించుకుంటాను."

నిజమే. మూడొంతుల మంది అలాగే తమ్ముతాము తప్పించుకుంటారు. కాని మిమ్మల్ని మీరు తప్పించుకోవటం వల్ల మీరు ఆధారపడుతున్నారు. ఆధారపడటం అంతకంతకు ఎక్కువవుతుంది. పారిపోయే మార్గాలు మరింత అత్యవసరమవుతాయి, ఉన్నస్థితి అంటే ఉండే భయానికి తగినట్లుగా. భార్య, పుస్తకం, రేడియో అత్యంత ముఖ్యంఅవుతాయి. పారిపోయే మార్గాలు అతి ముఖ్యం, అతి విలువైనవి అయిపోతాయి. నన్ను నేను తప్పించుకుపోవటానికి నా భార్యని ఉపయోగించుకుంటాను. అందువల్లనే ఆవిడపై మమత. ఆవిణ్ణి సొంతం చేసుకోవాలి. ఆవిణ్ణి పోగొట్టుకోకూడదు. ఆవిడ కూడా మీ సొంతం కావాలనుకుంటుంది. ఆవిడ కూడా మిమ్మల్ని ఉపయోగించుకుంటున్నారు కనుక. తప్పించుకునే అవసరం ఇద్దరికీ ఉంది. ఒకరినొకరు ఉపయోగించుకుంటున్నారు. ఈ ఉపయోగించుకోవటాన్నే ప్రేమ అంటారు. మీరు ఉన్నట్లుగా మీకిష్టం లేదు. అందుచేత ఉన్నస్థితి నుంచి, అంటే మీ నుంచి మీరు పారిపోతున్నారు.

"అది స్పష్టమైంది. అందులో ఏదో ఉందని గ్రహించాను. అది సబబుగానే ఉంది. కాని పారిపోవటం ఎందుకు? దేన్నుంచి పారిపోవటం?"

మీ ఒంటరితనం నుంచి, మీ శూన్యత నుంచి, మీరున్న స్థితి నుంచి. ఉన్నస్థితిని చూడకుండా మీరు పారిపోతే దాన్ని నిజంగా మీరు అర్థం చేసుకోలేరు. అందుచేత ముందు మీరు పారిపోవటం, తప్పించుకోవటం ఆపెయ్యాలి. అప్పుడే మిమ్మల్ని మీరు జాగ్రత్తగా పరిశీలించుకోగలుగుతారు. మీరు ఎప్పుడూ దాన్ని విమర్శిస్తూంటేనూ, దాన్ని ఇష్టపడితేనూ, అసహ్యించుకుంటేనూ దాన్ని గమనించలేరు. దాన్ని మీరు ఒంటరితనం అని చెప్పి, దాన్నుంచి పారిపోతారు. ఉన్నస్థితి నుంచి పారిపోవటమే భయం. ఈ ఒంటరితనం అంటేనూ, ఈ శూన్యత అంటేనూ భయపడుతున్నారు మీరు. ఆధారపడటం దాన్ని కప్పి ఉంచటానికే. అందుచేత అది నిత్యం ఉంటుంది. దాన్ని పూర్తిగా దేనితోనో ఐక్యం చేసుకోవటం వల్ల ఒక మనిషితో గాని, ఊహతో గాని, పూర్తిగా తప్పించుకు పారిపోగలమన్న హామీ ఉండదు. భయం ఎప్పుడూ వెనకాతలే ఉంటుంది. వేరే దేనితోనూ ఐక్యం చేసుకోకుండా ఉన్నప్పుడు, కలల్లోంచి బయట పడుతూ ఉంటుంది. ఐక్యం కాకుండా మధ్యమధ్య ఆగిపోవటం జరుగుతూ ఉంటుందెప్పుడూ - మతిస్తిమితం లేనివాళ్లయితే తప్ప.

"అయితే, నా భయం నాలోని వెలితివల్లా, నాలోని అశక్తి వల్లా వస్తోంది. అది బాగానే తెలిసింది. అది నిజమే. కాని దాన్ని గురించి నేనేం చెయ్యాలి?"

మీరేమీ చెయ్యలేరు. మీరేం చేసినా అది తప్పించుకోవటానికి చేసే కార్యకలాపమే. తెలుసుకోవలసిన అత్యంత ముఖ్యవిషయం అదే. అప్పుడే గ్రహిస్తారు. మీరూ, ఆ వెలితీ వేరువేరు కాదని. మీరే ఆ అశక్తి. గమనించిన శూన్యతే గమనించేది. ఇంకా ముందుకి సాగండి. దాన్ని ఒంటరితనం అనటం ఉండదు. దానికొక పేరు పెట్టటం ఆగిపోతుంది. ఇంకా ముందుకి సాగండి. అది కొంత కష్టమే. ఒంటరితనం అనేదే ఉండదు. ఒంటరితనం, శూన్యత పూర్తిగా అంతమయిపోతుంది. ఆలోచించేదీ, ఆలోచనా అంతమవుతాయి. ఇదొక్కటే భయాన్ని అంతమొందిస్తుంది.

"అయితే ప్రేమ అంటే ఏమిటి?"

ప్రేమ ఐక్యం చేసుకోవటం కాదు; ప్రేమించేవారి గురించి ఆలోచన కాదు. ప్రేమ ఉన్నప్పుడు దాన్ని గురించి ఆలోచించరు. అది లేనప్పుడే మీకూ, మీరు ప్రేమించేదానికీ మధ్య దూరం ఉన్నప్పుడే దాన్ని గురించి ఆలోచిస్తారు. ప్రత్యక్ష సంపర్కం ఉన్నప్పుడు ఆలోచన ఉండదు, కల్పితరూపం ఉండదు, పోటీపడే జ్ఞాపకం ఉండదు. సంపర్కం తెగిపోయినప్పుడే, ఏ స్థాయిలోనైనా సరే, ఆ ఆలోచనా ప్రక్రియ, ఊహించటం మొదలవుతుంది. ప్రేమ మనస్సుకి చెందినది కాదు. మనస్సు, ఈర్ష్య, పట్టుకుని వ్రేలాడటం, గతాన్ని జ్ఞప్తికి తెచ్చుకోవటం, పోగొట్టుకోవటం, రేపు గురించి తపించటం - వీటి వల్ల దుఃఖం, ఆదుర్దా అనే పొగ సృష్టింపబడుతుంది. ఈ పొగ జ్వాలని అణచివేస్తుంది. పొగ లేనప్పుడు జ్వాల ఉంటుంది. రెండూ ఒకచోట ఉండలేవు. అవి కలిసి ఉంటాయనే ఆలోచన కేవలం ఇచ్ఛ మాత్రమే. ఇచ్ఛ ఆలోచనా రూపమే. ఆలోచన ప్రేమ కాదు.

## 76. స్వలాభం కోసం వినియోగించుకోవటం, కార్యకలాపం

తెల్లవారటంతోనే పక్షులు కిలకిలమంటూ తెగ గొడవ చేస్తున్నాయి. సూర్యకాంతి చెట్లపైన మాత్రమే పడుతోంది. చిక్కని నీడల్లో ఇంకా వెలుగు పడటం లేదు. గడ్డిమీద అంతక్రితమే పాము వెళ్లి ఉంటుంది. మంచుమీద సన్నగా పొడుగ్గా చారపడింది. ఆకాశం రంగు ఇంకా పోలేదు. పెద్ద పెద్ద తెల్లని మేఘాలు పోగవుతున్నాయి. ఉన్నట్లుండి పక్షులచప్పుడు ఆగిపోయింది. మళ్లీ హెచ్చరికతో, అరుపులతో ఎక్కువైంది. ఒక పిల్లి వచ్చి పొద క్రింద పడుకుంది. పెద్ద డేగ ఒకటి తెలుపు నలుపు రంగుల్లో ఉన్న ఒక పక్షిని పట్టుకుని పదునుగా వంపుతిరిగిన ముక్కుతో చీల్చేస్తోంది. దొరికిన ఆహారాన్ని శక్తికొద్దీ ఆత్రుతగా పట్టుకుని, రెండు మూడు కాకులు దగ్గరకు రాబోతే బెదిరించింది. డేగ కన్నులు పసుపు పచ్చగా ఉన్నాయి మధ్యని నల్లని చారలతో. ఆ కళ్లు మమ్మల్నీ, కాకుల్నీ రెప్పవాల్చకుండా గమనిస్తున్నాయి.

"నేను ఎందుకు వినియోగింపబడకూడదు? ఒక ప్రయోజనం కోసం

నన్ను ఉపయోగించుకుంటే నాకు అభ్యంతరం లేదు. దానికి ఎంతో విలువ ఉంది. దానితో ఐక్యం పొందాలని ఉంది నాకు. నన్ను వాళ్లు ఏం చేసుకుంటా రన్నది అంత ముఖ్యం కాదు - నాకేమీ విలువ లేదు కనుక. ఈ లోకంలో నేను చెయ్యగలిగిందాట్టే లేదు. అందుచేత చెయ్యగలిగేవాళ్లకి సహాయం చేస్తున్నాను. కాని, నా వ్యక్తిగతమైన మమకారం ఒకటి నా దృష్టిని ఆ పనిమీద నిమగ్నం కాకుండా చేస్తోంది. ఈ మమకారాన్నే అర్థం చేసుకోవాలను కుంటున్నాను.''

కాని, మిమ్మల్ని ఎవరైనా ఎందుకు వినియోగించుకోవాలి? మిమ్మల్ని వినియోగించుకునే వ్యక్తిగాని, సంఘంగాని - వారంత ముఖ్యమూ కాదా మీరు?

''ఒక ప్రయోజనం కోసం నేను ఉపయోగపడితే నాకభ్యంతరం లేదు. అందులో ఎంతో అందం ఉంది. దానికి ఈ లోకంలో విలువ ఉంది. నేను ఎవరితో పని చేస్తున్నానో వాళ్లు ఆధ్యాత్మికంగా ఉన్నతాదర్శాలున్నవాళ్లు. ఏం చెయ్యాలో వాళ్లకే బాగా తెలుసును.''

మీకన్న వాళ్లకే మంచి చెయ్యగల స్తోమత ఉన్నదని ఎందుకను కుంటారు మీరు? మీరన్నట్టు వారు ఆధ్యాత్మికమైనవారని మీకెలా తెలుసు? వారికి ఎక్కువ వివేకదృష్టి ఉన్నదని మీకెలా తెలుసును? మీరు మీ సేవల్ని అంకితం చెయ్యాలనుకున్నప్పుడు ఈ విషయం గురించి ఆలోచించే ఉంటారు కదా. లేక, ఆకర్షితులై, భావావేశంతో చలించిపోయి మిమ్మల్ని మీరు ఆ కార్యానికి అర్పించుకున్నారా?

''అది చక్కని ప్రయోజనం. దానికి సహాయ పడాలనిపించింది కాబట్టి నా సేవల్ని అర్పించుకున్నాను.''

ఒక ఉన్నత ప్రయోజనం కోసం చంపటానికి గాని, చావటానికి గాని సైన్యంలో చేరే వాళ్లలాంటి వారే మీరు కూడా. వాళ్లేం చేస్తున్నారో వాళ్లకి తెలుసునా? మీరేం చేస్తున్నారో మీకు తెలుసునా? మీరు అర్పిస్తున్న సేవ ''ఆధ్యాత్మిక ప్రయోజనం'' కోసమేనని మీకు ఎలా తెలుసును?

''మీరన్నది నిజమే. క్రిందటి యుద్ధంలో నాలుగేళ్లపాటు నేను

సైన్యంతో ఉన్నాను. తక్కిన వాళ్లలాగే నేను కూడా దేశభక్తి భావంతో దాంట్లో చేరాను. ఆ సమయంలో చంపటంలోని అర్థాన్ని గురించి ఆలోచించలేదు. అది చెయ్యవలసిన పని. మేము చేరాం అంతే. కాని, ఇప్పుడు నేను సహాయం చేస్తున్నది ఆధ్యాత్మికంగా ఉన్నవారికి."

ఆధ్యాత్మికంగా ఉండటం అంటే మీకు అర్థం తెలుసునా? ఒకటి మాత్రం నిజం. అభివృద్ధి చెందాలనే ఆకాంక్ష కలిగి ఉండటం ఆధ్యాత్మికత కానేకాదు. వాళ్లకి అభివృద్ధి చెందాలనే ఆకాంక్షలేదా?

"ఉందనే అనుకుంటాను. ఈ విషయాలు నేనెప్పుడూ ఆలోచించ లేదు. ఒక చక్కని ప్రయోజనానికి తోడ్పడాలని మాత్రమే అనుకున్నాను."

అభివృద్ధి చెందాలనే ఆకాంక్ష ఉండటం, దాన్ని దివ్య ప్రభువులు, మానవత్వం, కళ, సౌభ్రాతృత్వం, అంటూ ఎన్నో గొప్పగా ధ్వనించే పదాలతో కప్పి ఉంచటం చక్కతనమా? తనతో బాటు పక్కనున్న వాళ్లనీ, అవతలి తీరాన ఉన్న వాళ్లనీ అందరినీ కలుపుకునే ఆత్మకేంద్రీకరణ భారంతో ఉండటం ఆధ్యాత్మికతా? ఆధ్యాత్మికంగా ఉన్నవారికి మీరు సహాయపడుతున్నానను కుంటున్నారు. అదంతా ఏమిటో తెలుసుకోకుండానే మిమ్మల్ని వాళ్లు వినియోగించుకోవటానికి ఇష్టపడుతున్నారు.

"అవును. అదంతా తెలివితక్కువే కదా? నేను చేసే దానికి అంత రాయం కలగటం నాకిష్టంలేదు. కాని నాదో సమస్య ఉంది. మీరు చెప్పేది మరింత కలవరపరుస్తూ ఉంది."

మీకు కలవరం కలగవద్దా? మనకి కలవరం కలిగినప్పుడే, మనం మేల్కొన్నప్పుడే, గమనించటం, తెలుసుకోవటం మొదలుపెడతాం. మన తెలివితక్కువతనం వల్లనే మనల్ని వాళ్ల లాభానికి వినియోగించుకుంటారు. గడుసు వాళ్లు దేశం పేరుతోనూ, దేవుడి పేరుతోనూ, మరికొందరు సిద్ధాంతం పేరుతోనూ మనల్ని ఉపయోగించుకుంటారు. చాకచక్యం ఉన్నవాళ్లే వినియోగించుకున్నప్పటికీ తెలివితక్కువతనం లోకానికి మంచినెలా చేయ గలదు? గడుసువాళ్లు తెలివితక్కువవాళ్లే - ఎందుకంటే, వాళ్ల కార్యకలాపాలు వాళ్లని ఎక్కడికి లాక్కుపోతాయో వాళ్లకే తెలియదు. వాళ్ల ఆలోచన

లెటుపోతున్నాయో తెలియకుండా ఉన్న తెలివితక్కువ వాళ్లు చేసేపని సంఘర్షణకీ, గందరగోళానికీ, దుఃఖానికీ దారితీస్తుంది.

మీ సమస్య అన్యమనస్కతకు లోనవటం కాకపోవచ్చు. అది ఉన్నప్పుడు ఏమవుతుంది?

"నేను అంకితమైన కార్యాసకిది ఇబ్బంది కలిగిస్తోంది."

మీరు సంపూర్ణంగా అంకితం కాలేదు - మీ సమస్య మీ ఏకాగ్రతని భంగం చేస్తున్నది కనుక. మీరు అంకితం కావటం ఆలోచనారహితమైన చర్య కావచ్చు. ఈ సమస్య దానికి సూచన - ఈ కార్యకలాపాల్లో చిక్కుకోవద్దని హెచ్చరిక.

"నేను చేస్తున్నది నాకిష్టమే."

అదే అసలు చిక్కు అయి ఉండవచ్చు. ఏదో ఒక రకమైన కార్యకలాపంలో మనల్ని మనం మరిచిపోవాలనుకుంటాం - ఆ కార్యకలాపం ఎంత సంతృప్తినిస్తే దాన్ని అంతగా పట్టుకు వ్రేలాడతాం. సంతృప్తి కలగాలని కోరటం తెలివితక్కువ. సంతృప్తి ఏస్థాయిలోనైనా ఒకటే. సంతృప్తిలో ఉన్నతమైనదనీ, నీచమైనదనీ లేదు. మనం సంతృప్తిపడటాన్ని వ్యక్తంగా గాని అవ్యక్తంగా గాని ఉత్కృష్టమైన మాటల్లో కప్పిపుచ్చవచ్చు, కాని సంతృప్తి పొందాలనే కోరికే మనల్ని మందకొడిగానూ, సున్నితత్వం లేకుండానూ చేస్తుంది. ఏదో ఒక కార్యకలాపం ద్వారా మనం సంతృప్తి, సౌఖ్యం, మానసిక రక్షణా పొందుతాం. అది పొందుతూనో, పొందుతున్నట్లు ఊహించుకుంటూనో మనకి ఏవిధమైన ఇబ్బందీ కలుగకూడదని వాంఛిస్తాం. కానీ, ఇబ్బంది ఎప్పుడూ ఉంటుంది - మనం చచ్చిపోతేనో, సంఘర్షణ, పోరాటం అనే ప్రక్రియ మొత్తం అర్థం చేసుకుంటేనోతప్ప. మనలో చాలామంది చచ్చిపోవాలనీ, సున్నితత్వం లేకుండా ఉండాలనీ కోరుకుంటారు - జీవించటం బాధాకరం కనుక. ఆ బాధని ఎదుర్కొంటూ, ప్రతిఘటించడానికీ, నిబద్ధులై ఉండటానికీ గోడలు కట్టుకుంటారు. రక్షణ కల్పించేటట్లు కనిపించే ఈ గోడలు మరింత సంఘర్షణనీ, దుఃఖాన్నీ పెంపొందిస్తాయి. సమస్యని తప్పించుకునే మార్గం వెతకటం కన్న సమస్యని అర్థం చేసుకోవటం ముఖ్యం కాదా? మీ సమస్య

నిజమైనదే కావచ్చు. మీరు చేసే కార్యం అర్థం లేని పారిపోయే మార్గం కావచ్చు.

"ఇదంతా చాలా కలవరపెడుతోంది. దీని గురించి నేను చాలా జాగ్రత్తగా ఆలోచించాలి."

చెట్లక్రింద వేడెక్కువవుతూంటే అక్కడ నుంచి లేచాం. అయితే, లోతులేని మనస్సు మంచినెలా చేస్తుందెప్పుడైనా? "మంచి" చేయటమే లోతైన మనస్సుని సూచిస్తుందా? మనస్సు ఎంత గడుసుగా, సూక్ష్మంగా, జ్ఞానమయంగా ఉన్నా లోతు లేనిదే కదా ఎప్పుడూ? లోతులేని మనస్సు ఎన్నటికీ అగాధమైనది అవలేదు. అవటమే లోతులేకుండా ఉండటం. స్వయం కల్పితమైన దాన్ని అందుకోవాలని ప్రయత్నించటమే అవటం. కల్పిత రూపం మాటల్లో అత్యంత ఉన్నతం కావచ్చు; విశాల దృక్పథం కావచ్చు, పథకంగాని ప్రణాళిక గాని కావచ్చు. కాని అది అప్పటికీ లోతులేని దానిలో ఉద్భవించినదే. ఏం చెయ్యాలని చేసినా సరే, మనస్సంచలనం ఏ స్థాయిలోనైనా సరే, లోతులేనిదిగానే ఉంటుంది. లోతులేని మనస్సు తన కార్యకలాపాలు వృథా అనీ, ఉపయోగం లేనివనీ గ్రహించలేదు. లోతులేని మనస్సే కార్యకలాపంలో మునిగి ఉంటుంది. ఈ కార్యకలాపమే దాన్ని ఆ స్థితిలో ఉంచుతుంది. దాని కార్యకలాపమే దాన్ని ప్రభావితం చేస్తుంది. ప్రభావితం అవటం వ్యక్తంగా అయినా, అవ్యక్తంగా అయినా సంఘర్షణ నుంచీ, పోరాటం నుంచీ విముక్తి పొందాలని కోరుతుంది. ఈ కోరికే జీవన సంచలనాన్నీ, అపరిచిత వాయువులనీ అడ్డుకోవటానికి గోడలు కడుతుంది. నిర్ణయాలూ, నమ్మకాలూ, సమర్థనలూ, సిద్ధాంతాలూ అనే గోడలతో మనస్సు స్థిరంగా ఉండిపోతుంది. లోతులేనిది నిలవుండి అంతమైపోతుంది.

నిబద్ధం చేయటం ద్వారా రక్షణ కల్పించుకోవాలనే కోరికే మరింత సంఘర్షణనీ, సమస్యల్నీ పెంపొందిస్తుంది. నిబద్ధం చేయటమే వేరు చేయటం. వేరుగా ఉన్నదీ ఒంటరిగా ఉన్నదీ బ్రతకలేదు. వేరుగా ఉన్నది తక్కిన వేరుగా ఉన్నవాటితో కలిసి మొత్తం ఒకటి కాలేదు. వేరుగా ఉన్నది ఎప్పటికీ ఒంటరిగానే ఉంటుంది - అది కూడబెట్టటానికీ, చేరవేయటానికీ, విస్తృతం చేయటానికీ, ఇముడ్చుకోవటానికీ, ఐక్యం చేసుకోవటానికీ ప్రయత్నించినప్పటికీ. నిబద్ధం చేయటం విధ్వంసకరం. వినాశకరం. కాని,

లోతులేని మనస్సు దీనిలోని సత్యాన్ని గ్రహించలేదు. సత్యం కోసం వెతకటంలో మునిగి ఉంటుంది. ఈ కార్యకలాపమే సత్యాన్ని గ్రహించకుండా చేస్తుంది. సత్యం అంటే ఆచరణ, అంతేకాని లోతులేని మనస్సు వాంఛించేదీ, అభివృద్ధిని కాంక్షించేదీ కాదు. సత్యంలోనే మంచితనం, అందం ఉంటుంది, నాట్యంలోనూ ప్రణాళికల్లోనూ మాటల్లోనూ కాదు. లోతు లేని వానికి సత్యమే స్వేచ్ఛ కలిగిస్తుంది, అంతేకాని, స్వేచ్ఛగా ఉండాలనుకునే పథకం కాదు. లోతులేనిది - అంటే మనస్సు తనకై తాను స్వేచ్ఛ పొందలేదు. ఒక ప్రభావం నుంచి మరొక ప్రభావానికి జరుగుతూ ఉంటుంది - ఇంకొకటి ఎక్కువ స్వేచ్ఛగా ఉంటుందనుకుని. ఇంకోటి ఎప్పటికీ స్వేచ్ఛగా ఉండదు. అదొక ప్రభావం, తక్కువ దాన్ని మించినది. అవుతూ ఉండటం - బుద్ధుడు, లేదా యజమాని అవాలనుకునే వాని కార్యకలాపం లోతు లేనిది. లోతులేని వారు ఎప్పుడూ తామున్న స్థితి గురించి భయపడుతూనే ఉంటారు. కాని, వారున్న స్థితే సత్యం. ఉన్నస్థితిని నిశ్శబ్దంగా గమనించటమే సత్యం. సత్యమే ఉన్నస్థితిలో పరివర్తన తీసుకొస్తుంది.

## 77. జ్ఞానులా, వివేకవంతులా?

ఎన్నో నెలల నుంచీ ఉన్న దుమ్మునీ, ఎండనీ వానలు తుడిచి పెట్టేశాయి. ఆకులు స్వచ్ఛంగా మెరుస్తున్నాయి. చిగుళ్ల తొడగటం మొదలు పెట్టాయి. రాత్రి పొడుగుతా కప్పల బెకబెకలతో నిండింది వాతావరణం. కొంచెం సేపు విశ్రాంతి తీసుకుని మళ్లీ మొదలుపెడతాయి. నది వేగంగా ప్రవహిస్తోంది. గాలి మృదువుగా ఉంది. వానలు అయిపోలేదింకా. నల్లని మబ్బులు గుమిగూడుతున్నాయి. సూర్యుడు మరుగున ఉన్నాడు. నేలా చెట్లూ, ప్రకృతీ - అంతా మరొకసారి పరిశుద్ధం కావటానికి నిరీక్షిస్తున్నట్లుగా ఉంది. రోడ్డు నల్లమన్ను రంగులో ఉంది. పిల్లలు నీటిమడుగుల్లో ఆడుతున్నారు చుట్టూ గోడలుపెట్టి. నెలల తరబడి వేడిమి తరవాత వాతావరణం హాయిగా ఉంది. నేలనిండా పచ్చగడ్డి పెరుగుతోంది. ప్రతిదీ పునఃసృష్టి చెందుతోంది.

పునఃసృష్టిలో అమాయకత్వం ఉంటుంది. తాను విశేషజ్ఞానం ఉన్న వాణ్ణని ఆయన అనుకుంటాడు. ఆయనకి జీవితసారమే జ్ఞానం. జ్ఞానం లేని జీవితం మరణం కన్న చెడ్డదిట. ఆయనకున్న జ్ఞానం ఒకటి రెండు విషయాల్లో కాదు, జీవితంలోని ఎన్నోదశలకు సంబంధించినది. అణువు గురించీ, ఆహారం గురించీ, కమ్యూనిజం గురించీ, ఖగోళశాస్త్రం గురించీ, నదిలో సంవత్సరానికి ప్రవహించే నీరు గురించీ, ఆహారం గురించీ, జనాభా పెరుగుదల గురించి ధీమాగా మాట్లాడగలిగాడు. తనకున్న జ్ఞానానికి గర్విస్తున్నాడాయన. ప్రదర్శనా చతురుడిలా తన ప్రభావాన్ని కనపరచాడు. ఇతరులు మౌనంగా, గౌరవప్రదంగా ఉండేట్లు చేశాడు. మనకి జ్ఞానం అంటే ఎంత భయం! తెలిసిన వాణ్ణి మనం ఎంత గౌరవిస్తాం! ఆయన ఇంగ్లీషు కొన్నిసార్లు అర్థం చేసుకోవటం కష్టమనిపించింది. తన దేశాన్ని విడిచి ఎప్పుడూ వెళ్లలేదుట. కాని ఇతరదేశాల పుస్తకాలున్నాయట ఆయన దగ్గర. కొందరు తాగుడుకో, ఇంకేదో ఆకలి తీర్చుకోవటానికో అలవాటు పడిపోయినట్లు ఆయన జ్ఞానార్జనకి అలవాటు పడ్డాడు.

"వివేకం అంటే ఏమిటి జ్ఞానం కాకపోతే? జ్ఞానాన్నంతటినీ అణచి వెయ్యాలని ఎందుకు చెబుతారు మీరు? జ్ఞానం అత్యవసరం కాదా? లేకపోతే మనం ఎక్కడ ఉండేవాళ్లం? ఇంకా ఆదిమవాసుల్లా, మన చుట్టూ ఉన్న అద్భుత ప్రపంచం గురించి ఏమీ తెలుసుకోకుండా ఉండిపోయేవాళ్లం. జ్ఞానం లేకపోతే ఏస్థాయిలో బ్రతకాలన్నా అసాధ్యం. అవగాహన కావటానికి జ్ఞానం అవరోధం అని ఎందుకు చెబుతున్నారు?"

జ్ఞానం ప్రభావితం చేస్తుంది. జ్ఞానం స్వేచ్ఛనివ్వదు. విమానంలో ఎగరటం, కొద్దిగంటల్లో ప్రపంచపు అవతలికొనకి వెళ్లటం తెలియవచ్చు, కాని అది స్వేచ్ఛ కాదు. జ్ఞానం సృజనాత్మకమైనది కాదు - జ్ఞానం కొనసాగుతూ ఉండేది కనుక. కొనసాగుతూ ఉండేది నిగూఢమైనదానికీ, అభేద్యమైనదానికీ, అపరిచితమైన దానికీ దారితీయలేదు. విశాలమైన దానికీ, అపరిచితమైన దానికీ, జ్ఞానం ప్రతిబంధకం. అపరిచితమైనదాన్ని పరిచితమైన దానితో కప్పి ఉంచటానికి కుదరదు. తెలిసినది ఎప్పుడూ గతంలోకి జరుగుతూ ఉంటుంది. గతం ప్రస్తుతాన్నీ, తెలియని దాన్నీ తన నీడలో ఉంచుతుంది.

స్వేచ్ఛ లేకుండా, విశాలమైన మనస్సు లేకుండా అవగాహన సాధ్యం కాదు. అవగాహన జ్ఞానంవల్ల కలగదు. మాటల మధ్యా, ఆలోచనల మధ్యా ఏర్పడే విరామంలో అవగాహన కలుగుతుంది. ఈ విరామం జ్ఞానం భేదించలేని నిశ్శబ్దం. అది విశాలమైనది, అభేద్యమైనది, నిగూఢమైనది.

"జ్ఞానం ఉపయోగకరం, అత్యవసరం కాదా? జ్ఞానం లేకుండా కనిపెట్టటం ఎలా జరగగలదు?"

ఆవిష్కారం జరిగేది మనస్సు జ్ఞానంతో కిక్కిరిసినప్పుడు కాదు, జ్ఞానం లేనప్పుడే. అప్పుడే నిశ్చలత, విరామం ఉంటుంది. ఈ అవగాహన అయ్యే స్థితిలోనే ఆవిష్కరణ జరుగుతుంది. జ్ఞానం ఒక స్థాయిలో ఉపయోగకరమే నిస్సందేహంగా. కాని మరొక దాంట్లో అది స్పష్టంగా హానికరమైనది. తన గొప్పతనాన్ని పెంపొందించుకోవటానికీ, తానుపైకి రావటానికీ, జ్ఞానాన్ని వినియోగించటం విభేదాన్నీ, విరోధాన్నీ పెంపొందింపజేసే దుష్టకార్యం. దేవుడు పేరుతో చేసినా, ప్రభుత్వం పేరుతో చేసినా, సిద్ధాంతం పేరుతో చేసినా ఆత్మవిస్తరణ వినాశమే. జ్ఞానం ప్రభావితం చేసేదైనప్పటికీ, ఒక స్థాయిలో అవసరమే: భాష, సాంకేతిక సామర్థ్యం మొదలైన వాటిల్లో. వీటివల్ల ప్రభావితం కావటం రక్షణ దాయకం, మన బాహ్య జీవనానికి అవసరమూను. కాని, ఇలా ప్రభావితం కావటాన్ని మానసికంగా ఉపయోగించుకున్నట్లయితేనూ, మానసిక సౌఖ్యానికీ, సంతృప్తికీ జ్ఞానం సాధనం అయినట్లయితేనూ, అప్పుడు జ్ఞానం సంఘర్షణనీ, గందరగోళాన్నీ పెంపొందించటం అనివార్యం. అది అలా ఉంచి, ఇంతకీ తెలుసుకోవటం అంటే అర్థం ఏమిటి? మీకు వాస్తవంగా తెలిసినది ఏమిటి?

"నాకు చాలా విషయాలు తెలుసు."

మీ ఉద్దేశం, మీకు చాలా విషయాల గురించి భోగట్టా తెలుసును, వివరాలు తెలుసును. కొన్ని యథార్థాల గురించి వివరాలు పోగుచేశారు; అయితే ఏమిటి? యుద్ధభీభత్సం గురించిన వివరాలు యుద్ధం రాకుండా చేస్తాయా? కోపం వల్లా, హింసవల్లా వ్యక్తిలోనూ, సంఘంలోనూ ఏర్పడే ఫలితాల గురించి మీ దగ్గర ఎన్నో వివరాలుండి ఉంటాయి నిశ్చయంగా. ఈ వివరాలు ద్వేషాన్నీ, వైరుధ్యాన్నీ అంతం చేయగలిగాయా?

"యుద్ధం వల్ల కలిగే ఫలితాల గురించిన జ్ఞానం యుద్ధాలను తక్షణం అంతం చెయ్యకపోవచ్చు. కాని, చిట్టచివరికి శాంతిని నెలకొల్పుతుంది. జనానికి తెలియజెప్పాలి. వారికి యుద్ధఫలితాలనూ, సంఘర్షణ ఫలితాలనూ చూపించాలి."

జనం అంటే మీరు, ఇంకొకరూను. మీ దగ్గర ఇన్ని వివరాలున్నాయి. అందువల్ల మీరు తక్కువ ఆకాంక్షాపరులూ, తక్కువ హింసాపరులూ, తక్కువ స్వార్థపరులూనా? మీరు ఎన్నో విప్లవాల గురించి చదివారు. అసమానత్వం యొక్క చరిత్ర చదివారు. కాని, మీరు అధికులమనే భావం లేకుండానూ, మీకు మీరు ప్రాముఖ్యాన్ని ఇచ్చుకోకుండానూ ఉన్నారా? ప్రపంచంలోని దుఃఖాల గురించీ, దుర్ఘటనల గురించీ అపారమైన జ్ఞానం మీకున్నందువల్ల మీరు ప్రేమ చూపిస్తున్నారా? మనకి జ్ఞానం ఉన్నదనుకునే విషయాల గురించి మనకేం తెలుసును?

"యుగయుగాల నుంచీ కూడబెట్టిన అనుభవమే జ్ఞానం. ఒక రకంగా అది సంప్రదాయం, రెండోది వ్యక్తంగానూ అవ్యక్తంగానూ ఉండే సహజ ప్రవృత్తి. దాగి ఉన్న జ్ఞాపకాలూ, అనుభవాలూ, సంక్రమించినవిగాని, సంపాదించినవి గాని మార్గదర్శకులై మన చర్యలను తీర్చిదిద్దుతాయి. ఈ జ్ఞాపకాలు - జాతీయమైనవీ, వ్యక్తిగతమైనవీ ముఖ్యావసరం - మానవుడికి సహాయపడుతూ రక్షణనిస్తాయి కనుక. అటువంటి జ్ఞానాన్ని వదిలేసు కోమంటారా?"

భయం వల్ల రూపొందిన చర్య, భయం మూలంగా తీసుకోబడిన చర్య చర్యేకాదు. జాతీయ దురభిప్రాయాలూ, భయాలూ, ఆశలూ, భ్రమలూ - వీటి ఫలితంగా తీసుకున్న చర్య ప్రభావితమైనది. ప్రభావితమైనదంతా మనం చెప్పినట్లు, మరింత సంఘర్షణనీ, దుఃఖాన్నీ పెంపొందిస్తుంది. తరతరాల నుంచీ వస్తున్న సంప్రదాయాల ప్రకారం బ్రాహ్మణుడిగా మీరు ప్రభావితం అయారు. ఏ ప్రేరేపణకైనా, సాంఘిక పరివర్తనలకైనా, సంఘర్షణలకైనా మీ ప్రతిక్రియ బ్రాహ్మణుడిగానే ఉంటుంది. మీ ప్రతిక్రియ మీరు ప్రభావితమైన దాన్ని బట్టీ, మీ గతానుభవాలను బట్టీ, జ్ఞానాన్ని బట్టీ ఉంటుంది. అందుచేత కొత్త అనుభవం మరింత ప్రభావితం చేస్తుంది. ఒక నమ్మకం ప్రకారం, ఒక

సిద్ధాంతం ప్రకారం అనుభవం పొందటం ఆ నమ్మకం, అభిప్రాయం మరింత కొనసాగేటట్లు జరగటం మాత్రమే. అటువంటి అనుభవం నమ్మకాన్ని పటిష్ఠం చేస్తుంది. అభిప్రాయం వేరుచేస్తుంది. ఒక అభిప్రాయం ప్రకారం, ఒక పథకం ప్రకారం మీరు పొందిన అనుభవం మిమ్మల్ని మరింత వేరుచేస్తుంది. జ్ఞానం, మానసికంగా కూడబెట్టినదయిన అనుభవం ప్రభావితం చేస్తుందంతే. అనుభవం పొందటం మరోరకంగా తన్ను తాను గొప్పగా చేసుకోవటమే. అనుభవం వల్ల కలిగిన జ్ఞానం మానసిక స్థాయిలో అవగాహనకి అంతరాయం కలిగిస్తుంది.

"మన నమ్మకం ప్రకారమే మనం అనుభవం పొందుతామా?"

అది స్పష్టమే, కాదా? ఒక రకమైన సమాజం వల్ల మీరు ప్రభావితం అయారు - అంటే మరొక స్థాయిలో - దేవుడిలో నమ్మకం, సాంఘిక విభేదాల్లో నమ్మకం; మరొకరు దేవుడు లేడనీ, ఒక ప్రత్యేక సిద్ధాంతాన్నీ అనుసరించాలనీ ప్రభావితం అవుతాడు. మీరిద్దరూ మీమీ నమ్మకాల ప్రకారమే అనుభవం పొందుతారు. కాని, అటువంటి అనుభవం తెలియని దాన్ని తెలుసుకోనివ్వ కుండా ప్రతిబంధకమవుతుంది. అనుభవం, జ్ఞానం రూపంలో కొన్ని స్థాయిల్లో ఉపయోగకరమే. కాని అనుభవం మానసికమైన "నా" అనే అహాన్ని శక్తిమంతం చెయ్యటం ద్వారా భ్రాంతికీ, దుఃఖానికీ దారి తీస్తుందంతే. మనస్సు అనుభవాలతో, జ్ఞాపకాలతో, జ్ఞానంతో నిండిపోయి ఉన్నట్లయితే మనం ఏం తెలుసుకోగలం? మనం తెలుసుకుని ఉంటే, దాన్ని అనుభవం పొంద గలమా? అనుభవించటానికి తెలిసినది అడ్డురాదా? మీకా పువ్వుపేరు తెలిసి ఉండొచ్చు. అంత మాత్రం చేత ఆ పువ్వుని అనుభవం పొందినట్లేనా? అనుభవం ముందు కలుగుతుంది. తరవాత దానికొక పేరుపెట్టి అనుభవానికి బలాన్ని చేకూర్చటం జరుగుతుంది. ఈ పేరు పెట్టటం ఇంకా అనుభవించ కుండా ఆటంకపడుతుంది. అనుభవించే స్థితిలో పేరు పెట్టకుండా జ్ఞాపకంతో సంపర్కం లేకుండా స్వేచ్ఛగా ఉండొద్దా?

జ్ఞానం పైపైదే. పైపైనే ఉన్నది ప్రగాఢమైనదానికి దారితీయగలదా? తెలిసి ఉన్నదాని ఫలితమైన మనస్సు, గతం యొక్క ఫలితమైన మనస్సు అది స్వయంగా తాను కల్పించుకున్న వాటికి అతీతంగా పోగలదా? కొత్తదాన్ని

కనుక్కోవటానికి కల్పించటం మానెయ్యాలి. తన కల్పనలు లేకపోతే మనస్సే ఉండదు. జ్ఞానమూ, గతమూ తనకు తెలిసినదాన్నే రూపకల్పన చేయగలదు. తెలిసిన దానికి సాధనమైనది కొత్తదాన్ని కనిపెట్టేదిగా కాలేదు ఎన్నటికీ. కొత్తది కనుక్కోవటానికి తెలిసినదంతా అంతమైపోవాలి. అనుభవించటానికి అనుభవం అంతమవాలి. జ్ఞానం అవగాహనకు ఆటంకం.

"ఇంక మనకి ఏం మిగులుతుంది జ్ఞానం, అనుభవం, జ్ఞాపకం లేకపోతే? అప్పుడు మనం ఏమీ కాదు."

ఇప్పుడు మనం ఉన్నది అంతకన్న ఎక్కువ ఏమైనానా? "జ్ఞానం లేకపోతే మనం ఏమి కాదు" అని మీరు అనటం ఊరికే మాటల్లో ఉద్ఘాటిస్తున్నారంతే - ఆ స్థితిని అనుభవించకుండా. కాదా? మీరామాటలు అంటున్నప్పుడు భయానుభూతి కలిగింది - నగ్నంగా మిగిలిపోవాలన్న భయం. ఈ కూడబెట్టినవన్నీ లేకపోతే మీరు ఏమీకాదు - అదే సత్యం. అలాగే ఎందుకు ఉండకూడదు? ఎందుకీ వేషాలూ మోసాలూ? ఈ ఏమీ లేకపోవటాన్ని మనం కల్పనలతో, ఆశలతో, సౌఖ్యదాయకమైన ఊహలతో కప్పి ఉంచాం. ఈ కప్పిన వాటి క్రింద ఉన్న మనం ఏమీ కాదు. ఏదో వేదాంత భావం కాదు, వాస్తవంగానే ఏమీ కాదు. ఆ ఏమీ కాకపోవటమనే దాన్ని అనుభవించటమే వివేకానికి ఆరంభం.

మనకి తెలియదని చెప్పటానికి ఎంత సిగ్గుపడతాం! తెలియదన్న వాస్తవాన్ని మాటలతో వివరాలతో కప్పిపుచ్చుతాం. వాస్తవంగా మీరు మీ భార్యని తెలుసుకోరు, మీ ఇరుగుపొరుగుని తెలుసుకోరు. ఎలా తెలుసుకుంటారు. మిమ్మల్ని మీరే తెలుసుకోనప్పుడు? మీవద్ద మీగురించి బోలెడు వివరాలూ, నిర్ణయాలూ, సమర్థనలూ ఉన్నాయి. కాని, నిగూఢమైన దాన్ని మీరు తెలుసుకోలేదు. జ్ఞానం అనబడే సమర్థనలూ, నిర్ణయాలూ ఉన్నస్థితిని అనుభవించకుండా ఆటంక పరుస్తాయి. అమాయకంగా లేకుండా ఉంటే వివేకం ఎలా కలుగుతుంది? గతం మరణించకుండా అమాయకత ఎలా పునరుద్భవిస్తుంది? మరణించటం క్షణక్షణానికీ జరుగుతుంది. మరణించటం అంటే కూడబెట్టకుండా ఉండటం. అనుభవించే వాని అనుభవం మరణించాలి అనుభవం లేకపోతే, జ్ఞానం లేకపోతే అనుభవించే

వాడే ఉండడు. తెలియటమంటే అజ్ఞానంగా ఉండటం. తెలియకుండా ఉండటమే వివేకానికి ఆరంభం.

## 78. నిశ్చలత, ఇచ్ఛ

పొడుగ్గా వంపుతిరిగి ఉన్న ఆ సముద్రతీరం మీద ఎవ్వరూ లేరు. కొద్దిమంది జాలరి వాళ్లు మాత్రం ఆ పొడుగాటి కొబ్బరిచెట్ల మధ్యనుంచి గ్రామానికి వెడుతున్నారు. నడుస్తూనే దారం వడుకుతున్నారు - తమ తొడల మీద దూదిని ఒత్తి, దారం బండికి చుడుతూ. ఆ దారం సన్నగా బలంగా ఉంది. కొంత మంది సునాయాసంగా ఒడుపుగా నడుస్తున్నారు. తక్కిన వాళ్లు కాళ్లు ఈడుస్తున్నారు. వాళ్లు సరియైన తిండి లేక, ఎండకి నల్లగా మాడి ఉన్నారు. ఓ కుర్రవాడు పాడుతూ వెళ్లాడు, పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ. సముద్రం పొంగుతూ లోపలికొచ్చింది. గాలి విసురుగా లేదు, కాని సముద్రం మాత్రం నిండుగా ఉంది, ఉధృత తరంగాలతో. నీలి, పచ్చరంగు నీళ్లలోంచి నిండు చంద్రుడు అప్పుడే పైకి లేస్తున్నాడు. పచ్చని ఇసుకకి ఎదురుగా తెల్లని అలలు.

జీవితం అసలు ఎంత సరళంగా ఉంటుందో, దాన్ని మనం అంత క్లిష్టం చేస్తాం! జీవితం క్లిష్టమైంది. కాని దానితో సరళంగా ఎలా ఉండాలో మనకి తెలియదు. క్లిష్టంగా ఉన్నదాన్ని సరళంగా సమీపించాలి, లేకపోతే దాన్ని ఎన్నటికీ అర్థం చేసుకోలేము. మనకి అతిగా తెలుసు, అందుకే జీవితం మనకి అందకుండా పోతోంది. అతిగా ఉంటే అసలు లేనట్లే. ఉన్న కొంచెంతో అపారమైన దాన్ని ఎదుర్కొంటాం. అపరిమితమైన దాన్ని ఎలా కొలవగలం? మన దర్పం మనల్ని మందకొడిగా చేస్తుంది. మన అనుభవం, జ్ఞానం మనల్ని బంధించి ఉంచుతాయి. జీవన ప్రవాహం మన పక్కనుంచే కొట్టుకుపోతుంది. ఆ కుర్రాడితో కలిసి పాడటం, ఆ జాలరి వాళ్లతో కలిసి కాళ్లీడుస్తూ నడవటం, తొడమీద దారం పేనటం, ఆ గ్రామస్థులతో ఉండటం, కారులో ఉన్న ఆ దంపతులతో ఉండటం, అవన్నీ చేయటానికి వారితో కలిసిపోయే చాకచక్యం కాదు. దానికి ప్రేమ కావాలి. ప్రేమ క్లిష్టమైనది కాదు. కాని, మనస్సు దాన్ని అలా చేస్తుంది. మనం మనస్సుతోనే మితిమిక్కిలిగా ఉంటాం. ప్రేమ

మార్గాలు మనకి తెలియవు. మనకి కోరిక రీతులూ, కోరికలోని పట్టుదలా తెలుసును. కాని మనకి ప్రేమ ఏమిటో తెలియదు. ప్రేమ పొగ లేని జ్వాల. మనకి పొగ బాగా తెలుసు. దానితో మన తలలూ, గుండెలూ నిండిపోతాయి. మనం చీకటిగా ఉంటాం. జ్వాల యొక్క సౌందర్యంతో మనం సరళంగా ఉండలేం. దానితో మనల్ని మనం చిత్రహింస పెట్టుకుంటాం. జ్వాలతో కలిసి, అది మనల్ని ఎక్కడికి చురుకుగా తీసుకుపోయినా, దానితో కలిసి జీవించం. మనకి మితి మిక్కిలిగా అంటే, బహుస్వల్పంగా తెలుసు. దాంతో ప్రేమపథాన్ని నిర్మిస్తాం. ప్రేమ మనకి అందకుండా మురిపిస్తుంది. మనకున్నది ఖాళీచట్రం మాత్రమే. తమకు తెలియదని తెలిసి ఉన్నవారు సరళమైన వారు. వారు ఎంతో దూరానికి పోతారు, వారికి జ్ఞానభారం ఉండదు కనుక.

ఆయన కొంతపేరు ప్రఖ్యాతులున్న సన్యాసి. కాషాయి వస్త్రాలు ధరించి ఉన్నాడు దూరంగా ఎటో చూస్తూ. ఆయన ఎన్నో సంవత్సరాల క్రితమే అన్నీ త్యజించానని చెప్పుకొస్తున్నాడు. ఇప్పుడు ఈ లోకంగాని, మరోలోకం గాని ఏదీ ఆసక్తి కలిగించని స్థితికి చేరుకున్నాడుట. ఆయన ఎన్నో కఠోర నియమాలను సాధన చేశాడుట. తన శ్వాసమీదా, మానసిక స్థితి మీదా అసాధారణమైన నిగ్రహం చూపేవాడుట. దీనివల్ల ఆయన కోరకపోయినా, గొప్ప శక్తీ, అనుభూతీ కలిగిందిట.

ఆకాంక్షకీ, దర్పానికీ ఉన్న శక్తి లాగే ఈ శక్తి కూడా అవగాహనకి హానికరం కాదా? దురాశ కూడా భయం లాగే శక్తివంతమైన చర్యకి కారకమవుతుంది. శక్తీ, ఆధిపత్యం అనే అనుభూతీ అంతా ఆత్మని, "నేను" అనేదాన్ని "నా" అనే దాన్ని శక్తివంతం చేస్తుంది. సత్యానికి "నేను" ప్రతిబంధకం కాదా?

"అధమంగా ఉన్నదాన్ని అణచిపెట్టటమో, లేదా ఉన్నతమైనదానికి అనుగుణంగా ఉండేట్లో చెయ్యాలి. వివిధ మనో, శారీరక వాంఛల మధ్య సంఘర్షణ లేకుండా నిశ్చలంగా చెయ్యాలి. ఇలా నిగ్రహించటంలో స్వారి చేసేవాడు శక్తిని చవిచూస్తాడు. అయితే, ఈ శక్తి మరింత ఉన్నతంగానో, మరింత ప్రగాఢంగానో పోవటానికి ఉపయోగిస్తాడు. శక్తిని స్వార్థంకోసం వినియోగిస్తే హానికరం. అంతేకాని, మహోన్నతమైనదాని కోసం మార్గాన్ని సిద్ధం చేసినందువల్లకాదు. ఇచ్ఛ అనేది శక్తి. అది ఆదేశం, వ్యక్తిగత లక్ష్యం కోసం

ఉపయోగిస్తే వినాశకరం, కాని సరియైన మార్గంలో వినియోగిస్తే లాభదాయకం. ఇచ్ఛ లేకుండా చర్య అనేదే జరగలేదు."

ప్రతి నాయకుడూ అధికారాన్ని ఒక లక్ష్యానికి సాధనంగానే వినియోగిస్తాడు. మామూలు మనిషి కూడా అదే పని చేస్తాడు. కాని, నాయకుడు అందరి క్షేమం కోసం వినియోగిస్తున్నానని చెబుతాడు. మామూలు మనిషి తన కోసమే తాను చూసుకుంటాడు. నియంతా, అధికారీ, నాయకుడూ - వీరి లక్ష్యమూ, వారిని అనుసరించేవారి లక్ష్యమూ ఒకటే, ఒకలాంటివే. ఒకటి విస్తృతమైతే మరొకటి అవుతుంది. రెండూ స్వయం కల్పితాలే. మనం ఒకదాన్ని నిరసించి రెండవదాన్ని మెచ్చుకుంటాం. కానీ, లక్ష్యాలన్నీ తమకున్న దురభిప్రాయాలూ, ఉద్దేశాలూ, భయాలూ, ఆశలూ వీటి ఫలితంగా వచ్చినవే కాదా? మీరు ఇచ్ఛా, కృషీ, శక్తీ వినియోగిస్తారు మహోత్కృష్టమైన దాని కోసం. మహోత్కృష్టమైనది కోరిక - అంటే ఇచ్ఛ రూపొందించినదే. ఇచ్ఛ తన లక్ష్యాన్ని తాను సృష్టించుకుని దానికోసం ప్రతిదాన్నీ త్యాగం చెయ్యటమో, అణచిపెట్టటమో చేస్తుంది. లక్ష్యం తానే. కాని, దాన్ని మహోత్కృష్టమైనది అనీ, ప్రభుత్వం అనీ, సిద్ధాంతం అనీ పేర్లు పెడుతుంది.

"ఇచ్ఛాశక్తి లేకుండా సంఘర్షణ అంతం కాగలదా?"

సంఘర్షణ తీరుల్నీ, అది ఎలా బయలుదేరిందనేదాన్నీ అవగాహన చేసుకోకుండా ఊరికే సంఘర్షణని అణిచి పెట్టటంలోగాని, దాన్ని మహనీయంగా చేయటంలో గాని, దాని స్థానంలో మరొకదాన్ని ప్రత్యామ్నాయంగా ఉంచటంలో గాని విలువ ఏముంటుంది? ఒక రోగాన్ని మీరు అణచిపెట్టవచ్చు. కాని, అది మరోరూపంలో తలెత్తుతుంది. ఇచ్ఛ అనేదే సంఘర్షణ. పోరాటంలోంచి పుట్టినదే అది. ఇచ్ఛ అంటే ఒక ప్రయోజనాన్ని, ఒక మార్గాన్ని అనుసరించే కోరిక. కోరిక పనిచేసే రీతిని అర్థం చేసుకోకుండా కేవలం దాన్ని నిగ్రహించటం మాత్రమే చేయటం వల్ల మరింత మంటా, బాధా కొనితెచ్చుకున్నట్లవుతుంది. నిగ్రహం అంటే తప్పించుకోవటం - ఒక చిన్నపిల్లవాణ్ణిగాని, ఒక సమస్యని గాని అణచిపెట్టవచ్చు. కాని దానివల్ల పిల్లవాణ్ణే గాని సమస్యనిగాని అర్థం చేసుకున్నట్లుకాదు. ఒక లక్ష్యాన్ని చేరుకోవటం కన్న దాన్ని అర్థం చేసుకోవటం ఎక్కువ ముఖ్యం. ఇచ్ఛానుసారం చేసిన క్రియ

వినాశకరం. ఎందుకంటే, ఒక లక్ష్యంతో చేసిన పని స్వార్థపూరితంగా, అందరినీ వేరు చేసేట్లుగానూ, విడిగా, ఒక్కరుగా ఉండేట్లూ చేస్తుంది. సంఘర్షణనీ, కోరికనీ అణచిపెట్టలేరు. ఎందువల్లనంటే, ఆ కృషి చేసేవాడు కూడా సంఘర్షణ నుంచీ, కోరిక నుంచీ పుట్టిన వాడే కనుక. ఆలోచించేవాడూ, అతని ఆలోచనలూ కూడా కోరిక నుంచి వచ్చినవే. కోరికని, అంటే ఆత్మని, దాన్ని ఉన్నతస్థానంలో ఉంచినా, నీచ స్థానంలో ఉంచినా, దాన్ని అర్థం చేసుకోకుండా ఉన్నట్లయితే మనస్సు ఎప్పటికీ అజ్ఞానంలో చిక్కుకుని ఉంటుంది. మహోత్కృష్టమైన దానికి మార్గం ఇచ్ఛలోనూ, కోరికలోనూ లేదు. కృషి చేసేవాడు లేనప్పుడే మహోత్కృష్టమైనది ఉద్భవిస్తుంది. ఇచ్ఛ అనేదే సంఘర్షణనీ, ఏదో అవాలనే కోరికనీ, లేదా, మహోత్కృష్టం కావటానికి మార్గం వేసుకోవటాన్నీ పెంపొందిస్తుంది. కోరిక ద్వారా సంఘటితమైన మనస్సు కృషి లేకుండా అంతమొందినప్పుడే, అప్పుడే, ఆ నిశ్చలతలోనే యథార్థం - లక్ష్యం కానిది - ఆవిర్భవిస్తుంది.

"కాని ఆ నిశ్చలతకి నిరాడంబరత్వం అత్యవసరం కాదా?"

నిరాడంబరత్వం అంటే మీ ఉద్దేశం ఏమిటి? అంటే నిరాడంబరత్వంతో ఏకీభవించటమా, లేక నిరాడంబరంగా ఉండటమా?

"నిరాడంబరమైన వాటితో బాహ్యంగా గాని, అంతర్గతంగా గాని తాదాత్మ్యం చెందకుండా నిరాడంబరంగా ఉండలేరు."

మీరు నిరాడంబరంగా అవుతారు. అంతేనా? మీరు గందరగోళంగా ఉంటారు. కాని తాదాత్మ్యం చెందటం ద్వారా, రైతులాగో, సన్యాసిలాగో దుస్తులు వేసుకోవటం ద్వారా, మిమ్మల్ని వాటితో కలుపుకోవటం ద్వారా మీరు నిరాడంబరంగా అవుతారు. నేను ఇది, నేను అది అవుతాను. కాని, ఈ అయే విధానం నిరాడంబరత్వానికి దారి తీస్తుందా, లేక నిరాడంబరత్వం అనే భావానికి మాత్రమేనా? నిరాడంబరత్వం అనే భావంతో తాదాత్మ్యం కావటం నిరాడంబరత్వం కాదు, అవునా? నేను పనికట్టుకుని నిరాడంబరుడనని చెప్పుకున్నందువల్లనో, నిరాడంబరత్వం అనే రీతితో నన్ను నేను కలుపుకోవటం వల్లనో నేను నిరాడంబరంగా ఉన్నట్లా? ఉన్నస్థితిని అర్థం చేసుకోవటంలోనే నిరాడంబరత ఉంటుంది, అంతేగాని ఉన్నస్థితిని నిరాడంబరత్వానికి

మార్చటంలో కాదు. ఉన్నస్థితిని అది కాని స్థితికి మార్చగలరా? దేవుని కోసం గాని, ధనం కోసంగాని, తాగుడు కోసం గాని ఉండే ప్రలోభం ఎన్నటికైనా ప్రలోభంకానిది అవుతుందా? మనం దేనితో ఏకం అవాలనుకుంటామో అది ఎప్పుడూ స్వయం కల్పితమైనదే - అది మహోత్కృష్టమైనదైనా, ప్రభుత్వమైనా, కుటుంబమైనా. ఏ స్థాయిలో ఏకం కావాలనుకుంటున్నా అది స్వార్థంతో కూడుకొన్నదే.

నిరాడంబరత్వం అంటే ఉన్నస్థితిని అవగాహన చేసుకోవటం, అది ఎంత గందరగోళంగా ఉన్నా సరే. ఉన్నస్థితిని అర్థం చేసుకోవటం కష్టంకాదు. కాని అవగాహనకి అడ్డువచ్చేదేమిటంటే, పోల్చటం ద్వారా, ఖండించటం ద్వారా, దురభిప్రాయం ద్వారా, వ్యక్తమయినా, కాకపోయినా, ఈవిధంగా దృష్టి మరో వైపుకి మరలటమే. ఇవే గందరగోళానికి కారణం. ఉన్నస్థితి దానంతట అది ఎప్పుడూ గందరగోళంగా ఉండదు. అది ఎప్పుడూ సులభంగానే ఉంటుంది.

మీరున్న స్థితిని అర్థం చేసుకోవటం సులభమే. కాని, దాన్ని మీరు సమీపించే పద్ధతి దాన్ని గందరగోళం చేస్తోంది. అందుచేత గందరగోళాన్ని సృష్టించే ఆ మొత్తం పద్ధతి అవగాహన కావాలి. పిల్లవాణ్ణి నిందించకుండా ఉంటే పిల్లవాడు ఉన్నవాడు ఉన్నట్లుంటాడు. అప్పుడు ఏదైనా చెయ్యటానికి అవకాశం ఉంటుంది. నిందించటం గందరగోళానికి దారితీస్తుంది. ఉన్నస్థితిలో వర్తించటం నిరాడంబరత.

నిశ్చలత్వానికి ముఖ్యంగా కావలసినది నిశ్చలత్వం తప్ప మరేదీ కాదు. దానికి మొదలూ, తుదీ అదే. దాన్ని తెచ్చేందుకు అత్యవసరమైనవేవీ లేవు. అది ఉంటుంది. అంతే. ఏ సాధనాలూ నిశ్చలత్వానికి దారితీయలేవు. నిశ్చలత్వం ఏదో విధంగా సాధించవలసిన దానిలా అయినప్పుడు మాత్రమే సాధనాలు అత్యవసరమవుతాయి. నిశ్చలత్వాన్ని కొనుక్కోవాలనుకున్నది నిశ్చలత్వం కాదు. సాధనాలు గొడవగా, హింసాత్మకంగా, పైకి తెలియకుండా లాభకరంగా ఉంటాయి. గమ్యం కూడా అలాగే ఉంటుంది, గమ్యం కూడా సాధనాల్లోనే ఉంటుంది కనుక. ఆదిలో నిశ్శబ్దం ఉంటుంది. చప్పుడు, మరింత చప్పుడు చేయటం వల్ల - కృషీ, క్రమశిక్షణా, కఠోర నియమాలూ,

ఇచ్ఛా - వీటి చప్పుడు వల్ల అంతం కాదు. దీనిలోని సత్యాన్ని గ్రహించండి, నిశ్శబ్దం ఉంటుంది.

## 79. వృద్ధిలోకి రావాలనే ఆకాంక్ష

చంటిపిల్లవాడు రాత్రంతా ఏడుస్తూనే ఉన్నాడు. పాపం తల్లి తన చాతనైనదంతా చేసింది - పిల్లవాణ్ణి ఊరుకోబెట్టటానికి. విసుక్కుంది, లాలించింది, ఉయ్యాల ఊపింది. ఏం చేసినా లాభంలేకపోయింది. పిల్ల వాడికి పళ్లొస్తూ ఉండి ఉండాలి. రాత్రంతా ఇంట్లో ఎవరికీ నిద్ర లేదు. చీకటిగా ఉన్న చెట్లపైన ఇప్పుడు తెల్లవారుతోంది. చిట్టచివరికి చంటిపిల్లాడు శాంతించాడు. ఆకాశం వెలుగొందుతున్నకొద్దీ ఒక చిత్రమైన నిశ్చలత ఆవరించింది. ఎండిపోయిన కొమ్మలు సన్నగా బోసిగా, స్పష్టంగా ఉన్నాయి ఆకాశం ముందు. ఓ కుర్రవాడు కేకేశాడు. కుక్క మొరిగింది. లారీ ఒకటి రొదచేస్తూ వెళ్లింది. మరోరోజు మొదలైంది. అంతలోనే ఆతల్లి పిల్లవాణ్ణి ఎత్తుకుని జాగ్రత్తగా కప్పి బయటికి తీసుకువచ్చింది. గ్రామం అవతల ఉన్న దారివెంట తీసుకువెడుతూండి ఉండవచ్చు. ఆవిడ అలసిపోయి పీక్కుపోయి నట్లుగా ఉంది రాత్రి నిద్రలేక. చంటిపిల్లవాడు మాత్రం బాగా నిద్రపోతున్నాడు.

త్వరలోనే సూర్యుడు చెట్లమీదికి వచ్చాడు. పచ్చగడ్డి మీద మంచు బిందువులు మెరుస్తున్నాయి. ఎంతో దూరం నుంచి రైలు కూతపెట్టింది. దూరాన ఉన్న పర్వతాలు చల్లగా నీడలా ఉన్నాయి. ఒక పెద్దపక్షి చప్పుడు చేస్తూ ఎగిరిపోయింది. మేము దాని ఏకాంతానికి భంగం కలిగించాం. హఠాత్తుగా సమీపించి ఉంటాం. దాని గుడ్లమీద ఎండుటాకులు కప్పేందుకు సమయం చాలలేదు దానికి. కప్పకపోయినా కొద్దిగా కూడా కనిపించటం లేదు. వాటిని అంత తెలివిగా దాచింది. ఇప్పుడు వాటిని అది దూరాన ఉన్న ఒక చెట్టుమీంచి చూస్తోంది. మేము కొద్దిరోజుల తరవాత ఆ తల్లిని పక్షిపిల్లలతో చూశాం. గూడు ఖాళీగా ఉంది.

దారి పొడుగునా నీడగా చల్లగా ఉంది. ఆ దారి తడిసిన అడవుల గుండా దూరాన ఉన్న కొండ పైదాకా పోతుంది. వెదుళ్లు బాగా వచ్చాయి.

కొద్దిరోజుల క్రితం బాగా ఎక్కువగా వాన కురిసింది. మట్టి మెత్తగా దిగబడుతోంది. లేత బంగాళాదుంపల పంటలున్నాయి. లోయకి బాగా దిగువున ఊరు ఉంది. ఆ సువర్ణోదయం అందంగా ఉంది. కొండ దాటిన తరవాత మళ్లీ ఇంటికి వెళ్లే త్రోవ ఉంది.

ఆవిడ చాలా తెలివైనది. కొత్తగా వచ్చిన పుస్తకాలన్నీ చదువుతుందిట. కొత్తగా వేసిన నాటకాలన్నీ చూస్తుందిట. ఈ మధ్య బాగా వెర్రెక్కించిన ఏదో వేదాంతం గురించి చాలా వివరాలు తెలుసుకుందిట. ఆవిడ మానసికంగా పరిశీలింపబడిందిట. మనస్తత్వ శాస్త్రం గురించి బాగా చదివినట్లే తోస్తోంది - ఆవిడ ఉపయోగించే ప్రత్యేక శబ్దాలను బట్టి. ప్రముఖ వ్యక్తులందరినీ తప్పకుండా కలుసుకుంటుందిట. ఎవరినో యథాలాపంగా కలుసుకున్నప్పుడు వారు ఆవిణ్ణి ఇక్కడికి తీసుకొచ్చారుట. సునాయాసంగా మాట్లాడుతుందావిడ. హుందాగానూ, ఆకట్టుకునేట్లూ మాట్లాడుతుంది. వివాహం అయిందావిడకి. కాని పిల్లల్లేరు. అదంతా వెనకటి విషయం అన్నట్లుగా ఉంది. ఇప్పుడు ఆవిడ ప్రయాణం వేరు. బాగా డబ్బున్నావిడే అయి ఉండవచ్చు, ఆవిడ దగ్గర కూడా ఆ ధనవంతుల దగ్గర ఉండే చిత్రమైన ధోరణి ఉంది. ఆవిడ మొదలుపెట్టటమే "ప్రస్తుత క్లిష్టపరిస్థితిలో మీరే విధంగా ప్రపంచానికి సహాయపడుతున్నారు" అనే ప్రశ్నతో మొదలుపెట్టింది. ఆవిడ అలవాటుగా వేసే ప్రశ్నల్లో అదొకటి కావచ్చు. ఇంకా ఎన్నో ఆత్రుతగా అడిగింది - యుద్ధాన్ని నిరోధించటం గురించీ, కమ్యూనిజం వల్ల కలిగే ఫలితాల గురించీ, మానవుని భవిష్యత్తు గురించీ.

యుద్ధాలూ, అధికమవుతూన్న దుర్ఘటనలూ, దుఃఖాలూ, అన్నీ నిత్య జీవితంలోనుంచి వచ్చినవే కాదా? ఈ క్లిష్ట పరిస్థితికి మనలోని ప్రతి ఒక్కరూ బాధ్యులు కారా? భవిష్యత్తు ప్రస్తుతంలోనే ఉంది. ప్రస్తుతాన్ని అర్థం చేసుకోనట్లయితే భవిష్యత్తులో మార్పేమీ ఉండదు. ఈ సంఘర్షణకీ, గందరగోళానికీ మనలో ప్రతి ఒక్కరూ బాధ్యులని మీరు అనుకోరా?

"కావచ్చు. కాని ఆ బాధ్యతని గుర్తించినందువల్ల ఏమవుతుంది? అంత అపారమైన వినాశక చర్యలో నేను తీసుకున్న చిన్న చర్యకి ఏం విలువ ఉంటుంది? నా ఆలోచన మానవుడి తెలివి తక్కువతనాన్ని ఏ విధంగా

మార్చగలదు? ప్రపంచంలో జరిగేది ఉత్త తెలివి తక్కువే. నా తెలివి దాన్ని ఏమాత్రం మార్చలేదు. అదీకాక, ఒక వ్యక్తి తీసుకునే చర్య ప్రపంచం మీద ప్రభావాన్ని కలిగించటానికి ఎంతకాలం పడుతుందో ఆలోచించండి."

ప్రపంచం వేరూ, మీరు వేరూనా? సమాజం మీవంటి, నావంటి వారిచేత నిర్మించబడినది కాదా? నిర్మాణంలో మూల పరివర్తన తీసుకురావటానికి మీలో, నాలో మూల పరివర్తన రావద్దా? విలువలలో ప్రగాఢ పరివర్తన ఎలా వస్తుంది అది మీతోనూ నాతోనూ మొదలవకపోతే? ప్రస్తుత క్లిష్ట పరిస్థితిలో సహాయ పడటానికి ఒక కొత్త సిద్ధాంతం కోసం, ఒక కొత్త ఆర్థిక ప్రణాళిక కోసం వెతకాలా? లేక తనలోని సంఘర్షణా, గందరగోళమే తాను కల్పించిన ప్రపంచం కూడా కాబట్టి తనలోని సంఘర్షణనీ, గందరగోళాన్నీ అర్థం చేసుకోవటం మొదలుపెట్టాలా? కొత్త సిద్ధాంతాలు మనిషికీ మనిషికీ మధ్య ఐక్యతను కలుగజేస్తాయా? నమ్మకాలు మనిషికీ మనిషికీ మధ్య విరోధాన్ని కలిగించవా? మన మధ్య ఉన్న సిద్ధాంతాలు అనే ఆటంకాలను తొలగించవద్దా - అన్ని ఆటంకాలూ సిద్ధాంత సంబంధమైనవే - మన సమస్యల గురించి ఆలోచించండి, నిర్ణయాలూ, సూత్రాల దృష్టిలో కాదు, సూటిగా దురభిప్రాయమనేది లేకుండా ఆలోచించండి. మన సమస్యలతో మన కెప్పుడూ తిన్నగా సంబంధం ఉండదు. ఎప్పుడూ ఏదో నమ్మకం ద్వారానో, సూత్రీకరణ ద్వారానో ఏర్పడుతుంది. మన సమస్యలతో మనకి ప్రత్యక్ష సంబంధం ఉన్నప్పుడే వాటిని మనం పరిష్కరించగలుగుతాం. మనిషికీ మనిషికీ మధ్య వైరుధ్యం రావటం మన సమస్యల వల్ల కాదు, వాటి గురించి మనకున్న అభిప్రాయాల వల్ల. సమస్యలు మనల్ని దగ్గరకి తెస్తాయి, అభిప్రాయాలు దూరం చేస్తాయి.

మీరసలు ఈ ప్రస్తుత క్లిష్ట పరిస్థితి గురించి విచారిస్తున్నట్లుగా ఎందుకున్నారో అడగవచ్చునా?

"ఓ, నాకు తెలియదు. అంత బాధ, అంత దుఃఖం, చూస్తూంటే దాని గురించి ఏమన్నా చెయ్యాలనిపిస్తుంది."

మీరు నిజంగా దాని గురించి విచారిస్తున్నారా, లేక కేవలం ఏదో ఒకటి చెయ్యాలనే ఆకాంక్షతో ఉన్నారా?

"మీరు చెప్పినట్లు ఏదో చేసి విజయం సాధించాలనే ఆకాంక్ష ఉందనుకుంటాను."

మనలో ఎంతో కొద్దిమంది యొక్క ఆలోచన మాత్రమే నిజాయితీగా ఉంటుంది. మనం విజయవంతం కావాలనుకుంటాం. మనకోసమే అయినా కావచ్చు, ఒక ఆదర్శం కోసం, మనం ఏకీభవించిన నమ్మకం కోసం అయినా కావచ్చు. ఆదర్శం మనం కల్పించుకున్నదే. మన మనస్సులో పుట్టినదే. మన మనస్సు ప్రభావితం అయిన దాన్ని బట్టి అనుభవం పొందుతుంది. ఈ స్వయం కల్పితమైన వాటికోసం మనం పనిచేస్తాం, బానిస చాకిరీ చేసి చచ్చిపోతాం. జాతీయత కూడా దైవభక్తి లాగే స్వయం సంకీర్తనమే - తనకు తానే ముఖ్యం. వాస్తవంగా గాని, సిద్ధాంత రీత్యాగాని; అంతేకాని, దుర్ఘటనా, దుఃఖమూ కావు. క్లిష్ట పరిస్థితి గురించి మనం నిజంగా ఏమీ చెయ్యాలనుకోము. తెలివైన వాళ్లకి అదొక కొత్త విషయం మాత్రమే, అది సమాజంలో చురుకుగా పనిచేసేవారికీ, ఆదర్శవాదులకీ అనువైన రంగం.

మనం వృద్ధిలోకి రావాలని ఎందుకు ఆకాంక్షిస్తాం?

"మనం అలా ఉండకపోతే ఈ ప్రపంచంలో ఏమీ జరగదు. మనకి ఆ ఆకాంక్ష లేనట్లయితే ఈపాటికింకా గుర్రపుబళ్లనే నడుపుతూ ఉండి ఉండేవాళ్లం. ఆకాంక్ష అభివృద్ధికి మరో పేరు. అభివృద్ధి లేకపోతే మనం క్షీణించి పోతాం, రూపులేకుండా పోతాం."

ప్రపంచంలో పనులు జరిపించటంలో యుద్ధాల్నీ, చెప్పలేనన్ని దుఃఖాల్నీ పెంపొందిస్తున్నాం. ఆకాంక్ష అభివృద్ధా? ఈ క్షణంలో మనం అభివృద్ధి గురించి ఆలోచించటం లేదు, ఆకాంక్ష గురించే. మనం ఆకాంక్షతో ఎందుకుంటాం? మనం విజయవంతం కావాలనీ, ఎవరో అవాలనీ ఎందుకు కోరుకుంటాం? ఇంకా ఉన్నతంగా ఉండాలని ఎందుకు పోరాటం సల్పుతాం? తను ముందుకి తీసుకుని రావటానికి ఎందుకింత కృషి - ప్రత్యక్షంగా గాని, సిద్ధాంతం ద్వారా గాని, ప్రభుత్వం ద్వారా గాని? ఈ విధంగా తన్నుతాను ముందుకి తోసుకుని రావటమే మన సంఘర్షణకీ, గందరగోళానికీ కారణం కాదా? వృద్ధిలోకి రావాలనే ఆకాంక్ష లేకపోతే పాడైపోతామా? వృద్ధిలోకి రావాలనే ఆకాంక్ష లేకుండా భౌతికంగా బ్రతికి ఉండలేమా?

"గెలుపు లేకుండా గుర్తింపు లేకుండా ఎవరు బ్రతికి ఉండాలనుకుంటారు?"

ఈ గెలుపునీ, మెప్పునీ వాంఛించటం వల్లనే మనలోనూ, మన బయటా సంఘర్షణ రావటం లేదా? ఆకాంక్ష లేకుండా ఉంటే క్షీణించినట్లేనా అర్థం? సంఘర్షణ లేకుండా ఉండటమంటే వృద్ధి లేకుండా స్థిరపడి పోవటమేనా? మందులు పుచ్చుకుని మన నమ్మకాలతో, సిద్ధాంతాలతో సహా మనల్ని మనం నిద్రపుచ్చుకుంటాం. అందువల్ల ఏ గాఢ సంఘర్షణలూ ఉండవు. మనలో చాలా మందికి ఏదో ఒక కార్యకలాపం మందులా పని చేస్తుంది. నిజానికి అటువంటి పరిస్థితిలోనే క్షయం, వినాశం ఉంటాయి. అసత్యమైన దాన్ని అసత్యమని తెలుసుకోవటంతో మరణం వస్తుందా? వృద్ధిలోకి రావాలనే ఆకాంక్ష ఏ రకమైనదైనా, అది దేవుడికోసమైనా, గెలుపు కోసమైనా, అట్టి ఆకాంక్ష లోపల నుంచి బయట పడకుండా సంఘర్షణ తీసుకొస్తుందని తెలుసుకుంటే, నిజానికి దాని అర్థం - సమస్త కార్యాలకీ, జీవితానికీ అంతం అని కాదు.

మనం వృద్ధిలోకి రావాలనే ఆకాంక్షతో ఎందుకున్నాం?

"ఏదో ఒక ఫలితాన్ని సాధించటానికి కష్టపడే వ్యాపకం లేనట్లయితే, నాకు విసుగెత్తి పోతుంది. నా భర్త అభివృద్ధినే ఆకాంక్షించేదాన్నిదివరకు. నా భర్త కోసం అన్నప్పటికీ, ఆయన ద్వారా నా కోసమే అనుకుంటాను. ఇప్పుడు నా వృద్ధి కోసమే నేను ఆకాంక్షిస్తున్నాను ఒక ఉద్దేశంతో. వృద్ధిలోకి రావాలనే ఆకాంక్ష గురించి నేనెప్పుడూ ఆలోచించలేదు. ఆకాంక్షించానంతే."

మనం ఎందుకు గడుసుగా ఉంటాం, వృద్ధిలోకి రావాలని ఎందుకు ఆకాంక్షిస్తాం? వృద్ధిలోకి రావాలనే ఆకాంక్ష ఉన్నస్థితి నుంచి తప్పించుకోవటానికి కాదా? ఈ గడుసుతనం నిజానికి తెలివి తక్కువతనం కాదా? అసలు మనం తెలివి తక్కువ వాళ్లమే కాదా? ఉన్నస్థితి ఎప్పుడూ ఉండేదే అయితే, దాన్నుంచి పారిపోవటం వల్ల ఏం లాభం? తప్పించుకోవటంలో మనం గెలుపొందవచ్చు. కాని మనం ఉన్నస్థితి అలాగే ఉంటుంది సంఘర్షణనీ దుఃఖాన్నీ పెంపొందిస్తూ. మన ఒంటరితనం అన్నా, శూన్యత అన్నా ఎందుకంత భయపడతాం? ఉన్నస్థితి నుంచి దూరంగా పారిపోవాలని

జరిపే ఏ కార్యకలాపమైనా దుఃఖాన్నీ, వైరుధ్యాన్నీ తెస్తుంది. సంఘర్షణ అంటే ఉన్న స్థితిని కాదనటం, ఉన్నస్థితి నుంచి పారిపోవటం - అంతకన్న వేరే సంఘర్షణ ఏమీ ఉండదు. మన సంఘర్షణ అంతకంతకు మరింత గందరగోళంగా, పరిష్కారం లేకుండా ఉంటుంది - మనం ఉన్నస్థితిని ఎదుర్కోము కనుక. ఉన్నస్థితిలో ఏ గందరగోళమూ ఉండదు, దాన్ని తప్పించుకోవటానికి మనం వెతికే మార్గాల్లోనే ఉంటుంది.

## 80. సంతృప్తి

ఆకాశం మబ్బులతో నిండి ఉంది, పగలు వేడిగా ఉంది, ఆకులతో గాలి ఆటలాడుతున్నప్పటికీ. ఎక్కడో దూరాన ఉరిమింది. వానజల్లుకి రోడ్డుమీద దుమ్ముపడుతోంది. చిలకలు విచ్చలవిడిగా ఎగురుతున్నాయి, వాటి చిన్న తలకాయలు పగిలేటట్లు అరుస్తూ. పెద్ద డేగ ఒకటి చెట్టుపై కొమ్మమీద కూర్చుని క్రింద జరుగుతున్న ఆటని తిలకిస్తోంది. ఒక చిన్న కోతి మరో కొమ్మమీద కూచునుంది. ఆ రెండూ ఒకదానిపైన మరోటి కన్నేసి క్షేమంగా ఉండేటంత దూరంలో కూర్చున్నాయి. అంతలోనే ఒక కాకి వాటితో కలిసింది, ఉదయం దాని కాలకృత్యాలు అయిన తరవాత. ఆ డేగ కొంతసేపు నిశ్చలంగా ఉండి తరవాత ఎగిరిపోయింది. మానవమాత్రులికి మినహాయించి, అది ఒక క్రొత్తదినం. ఏదీ నిన్నటిలా లేదు. ఆ చెట్టూ, ఆ చిలకలూ అవేకాదు. గడ్డీ, పూలమొక్కలూ వేరే లక్షణంతో ఉన్నాయి. నిన్నటి జ్ఞాపకం ఈ రోజుని చీకటిగా చేస్తుంది. పోల్చటం, గ్రహించకుండా ఆటంక పరుస్తుంది. ఈ ఎరుపు, పసుపు పువ్వులు ఎంత రమణీయంగా ఉన్నాయి! రమణీయత ఒక సమయానికి చెందినది కాదు. మనం మన బరువుల్ని ఒకరోజు నుంచి మరో రోజుకి మోసుకుపోతూ ఉంటాం. ఎన్నో నిన్నల నీడ పడని రోజుండదు. మన రోజులన్నీ కొనసాగుతూ ఉండే ఒక చలనం, నిన్న ఈనాటితో, రేపటిలో కలుస్తూ. ఎప్పుడూ అంతం అంటూ ఉండదు. అంతమవుతుందంటే మనకి భయం. అంతం అవకుండా కొత్తది ఎలా ఉండగలదు? మరణం లేకపోతే జీవం ఎలా ఉండగలదు? ఆ రెండింటి గురించీ ఎంత కొంచెం తెలుసు

మనకి! మన దగ్గర అన్ని మాటలూ, వివరణలూ ఉన్నాయి. అవి మనకి తృప్తినిస్తాయి. మాటలు అంతాన్ని వికృతం చేస్తాయి. మాట ఉండకుండా ఉన్నప్పుడే అంతం ఉంటుంది. అంతం అనేది మనకి తెలిసిన మాటలకే. మాటల్లేకుండా జరిగే అంతం, మాటలతో ప్రమేయం లేని నిశ్శబ్దం మనం ఎప్పటికీ తెలుసుకోలేము. తెలుసుకోవటమంటే జ్ఞాపకం. జ్ఞాపకం ఎప్పుడూ కొనసాగుతూ ఉంటుంది. కోరిక అనేది ఒక రోజునీ, మరొక రోజునీ బంధించే దారం. కోరిక అంతమైతేనే కొత్తది ఉంటుంది. మరణమే కొత్తది. కొనసాగే జీవితం జ్ఞాపకం మాత్రమే అది శూన్యంగా ఉంటుంది. కొత్తదానిలో ఉండే జీవితం మరణం ఒక్కటే.

ఓ కుర్రవాడు పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ నడుస్తున్నాడు, నడుస్తూ పాడుతున్నాడు. దారిపొడుగునా ఎదురైన వాళ్లందరినీ చూసి చిరునవ్వు నవ్వుతున్నాడు. చాలామంది స్నేహితులున్నట్లు కనిపిస్తోంది. ఒంటిమీద సరియైన దుస్తుల్లేవు. తలకి ఒక మాసిన గుడ్డ చుట్టుకున్నాడు. కాని ముఖం కాంతివంతంగా ఉంది. కళ్లు మెరుస్తున్నాయి. పెద్ద పెద్ద అంగల్లో, టోపీ పెట్టుకున్న ఒక లావుపాటి ఆయన దాటి వెళ్ళాడు. లావుపాటాయన కాళ్లు ఎడంగా పెట్టి ఊగిసలాడుతూ నడుస్తున్నాడు ముఖం వ్రేలాడేసుకుని - వ్యాకుల పాటుతో, ఆదుర్దాతో. ఆ కుర్రవాడు పాడుతున్న పాటని వినలేదు. పాట పాడిన వాడివైపు ఒక్కసారి చూడనైనా లేదు. ఆ కుర్రవాడు పెద్ద గేటు మధ్యనుంచి అంగలు వేసుకుంటూ పోయి, అందమైన తోట దాటి నది మీది వంతెన దాటుకుని, వంపు తిరిగి సముద్రం వైపుకి వెళ్లాడు. అక్కడ అతని తోటివాళ్లు కలిశారు. చీకటి పడ్డంతో, వాళ్లంతా కలిసి పాడటం మొదలు పెట్టారు. ఒక కారు దీపాల వెలుగు వాళ్ల ముఖాల మీద పడింది. వాళ్ల కన్నులు ఏదో తెలియని ఆనందంతో నిండి ఉన్నాయి. ఇప్పుడు బాగా దట్టంగా వర్షం కురుస్తోంది. అన్నీ తడిసి నీళ్లు కారుతున్నాయి.

ఆయన వైద్యంలో డాక్టరే కాదు, మనస్తత్వ శాస్త్రంలో కూడా. బక్క పలచగా, ప్రశాంతంగా తృప్తిగా ఉన్న ఆయన, కొన్ని సముద్రాలు దాటి వచ్చాడు. ఈ దేశంలో చాలా కాలంపాటే ఉన్నందుల్ల ఎండకీ, పెద్ద వానలకీ

అలవాటు పడ్డాడు తను యుద్ధంలో డాక్టరుగానూ, మనస్తత్వ పరిశీలకుడు గానూ పనిచేశానని చెప్పాడు. తనకు చాతనయినంత సహాయం చేశాడుట. కాని తను ఇచ్చిన దాంతో తనకు తృప్తి కలగలేదుట. ఇంకా ఎంతో ఇవ్వాలనీ, ఇంకా ఎక్కువగా సహాయపడాలనీ కోరుతున్నాడుట. తను ఇచ్చినది చాలా తక్కువట. అందులో ఏదో లోపం ఉందిట.

చాలాసేపటి వరకూ ఒక్కమాట కూడా మాట్లాడకుండా కూర్చున్నాం - ఆయన తన మనస్తాపం వల్ల కలిగే ఒత్తిడులన్నిటినీ కూడగట్టుకుంటున్నంత సేపూ. నిశ్శబ్దం చిత్రంగా ఉంటుంది. నిశ్శబ్దం ఆలోచనవల్ల రాదు. ఆలోచన దాన్ని రూపొందించదు. నిశ్శబ్దాన్ని ఒకచోట కూడబెట్టటం కుదరదు. ఇచ్ఛా పూర్వకమైన క్రియ ద్వారా అది రాదు. నిశ్శబ్దం గురించిన జ్ఞాపకం నిశ్శబ్దం కాదు. నిశ్చలంగా స్పందించే నిశ్శబ్దం ఉంది గదిలో. సంభాషణ దాన్ని భంగం చేయలేదు. ఆ నిశ్శబ్దంలో సంభాషణకీ అర్థం ఉంది. మాటల వెనక నిశ్శబ్దం ఉంది. నిశ్శబ్దం ఆలోచనకి మాటల రూపాన్నిచ్చింది. కాని ఆలోచన నిశ్శబ్దం కాదు. ఆలోచన లేదు. నిశ్శబ్దం ఉంది. నిశ్శబ్దం భేదించుకుంటూ పోయి ప్రోగుచేసి, మాటల రూపాన్నిచ్చింది. ఆలోచన ఎన్నటికీ చొచ్చుకుంటూ పోలేదు. నిశ్శబ్దంలోనే సంపర్కం ఉంటుంది.

డాక్టరు చెబుతున్నాడు ప్రతి దాంట్లోనూ తనకు అసంతృప్తి కలిగిందని; తన పనితోనూ తన సామర్థ్యంతోనూ, ఎంతో జాగ్రత్తగా పోషించుకున్న తన అభిప్రాయాలతోనూ. ఎన్నో రకాల సిద్ధాంతాలను ప్రయత్నించాడుట. కాని వాటన్నిటితోనూ అసంతృప్తి కలిగిందట. ఇక్కడికి వచ్చిన తరవాత ఎన్నో నెలల పాటు ఎన్నో రకాల గురువుల వద్దకు వెళ్లాడుట. కాని మరింత అసంతృప్తితో వచ్చేశాడుట. ఎన్నో సిద్ధాంతాలను ప్రయత్నించాడుట. నిత్యశంకాతత్వాన్ని కూడా. కాని ఇంకా అసంతృప్తి అలాగే ఉందిట.

ఇంతకీ మీరు సంతృప్తికోసం వెతికి దాన్ని కనుక్కోలేకపోయారా? సంతృప్తిని కోరటం వల్లనే అసంతృప్తి కలుగుతోందా? వెతకటం అనగానే తెలిసిన దానికోసం అని అర్థం వస్తుంది. మీరు అసంతృప్తిని పొందా నంటున్నారు, అయినా ఇంకా అన్వేషిస్తున్నారు. మీకింకా అది దొరకలేదు

మీకు సంతృప్తి కావాలి. అంటే మీకు అసంతృప్తి లేదు. మీకు నిజంగా అసంతృప్తి ఉంటే దాన్నుంచి పారిపోయే మార్గం కోసం ప్రయత్నించరు. సంతృప్తి పడాలని ప్రయత్నిస్తే ఏదో విధమైన బాంధవ్యంలో - సొంతమైన వాటితోగాని, ఒక మనిషితోగాని, ఒక సిద్ధాంతంతోగాని ఏర్పడిన బాంధవ్యంలో అసంతృప్తి దొరుకుతుంది మీకు.

"అవన్నీ చూడటం అయింది. అయినా నాకు అసంతృప్తి ఉంది."

"మీకు బాహ్య సంబంధాలతో అసంతృప్తి కలిగి ఉండవచ్చు. కాని సంపూర్ణ సంతృప్తిని కలిగించే మానసిక బంధం కోసం మీరు అన్వేషిస్తూ ఉండవచ్చు."

"అదీ అనుభవం అయింది. అయినా ఇంకా అసంతృప్తిగానే ఉంది."

నిజంగా అలా ఉన్నారా అని నా అనుమానం? మీరు పూర్తిగా అసంతృప్తిగా ఉంటే ఏ దిశలోనైనా కదలటం అంటూ ఉండదు, ఉంటుందా? మీకు గదిలో ఉండటమే పూర్తిగా అసంతృప్తికరంగా ఉంటే మరో పెద్ద గది కోసం, మంచి సామానుతో ఉన్న గదికోసం వెతకరు. కాని ఇంతకంటె మంచి గది కావాలనే కోరికనే మీరు అసంతృప్తి అంటున్నారు. మీరు అన్ని గదులతోనూ అసంతృప్తి పొందలేదు - ఈ ప్రత్యేకమైన గదితో మాత్రమే. దాన్నుంచి మీరు తప్పించుకోవాలనుకుంటున్నారు. మీరు నిజంగా తృప్తి కోసమే వెతుకుతున్నారు. అందుకనే మీరు నిత్యం నిర్ణయిస్తూ, పోలుస్తూ, బేరీజు వేసుకుంటూ, కాదంటూ తిరుగుతున్నారు. అందువల్ల సహజంగా అసంతృప్తి పడుతున్నారు. అంతేకాదా?

"అలాగే కనిపిస్తోంది, కాదా?"

అందువల్ల మీరు నిజంగా అసంతృప్తి పడటం లేదు. ఇంతవరకు ఎందులోనూ మీకు సంపూర్ణమైన, శాశ్వతమైన సంతృప్తి దొరకటం లేదు, అంతే. మీకు కావలసినదదే. సంపూర్ణ సంతృప్తి, ఏదో ప్రగాఢమైన అంతర్గత తృప్తి, శాశ్వతంగా ఉండేది.

"కాని, నాకు సహాయం చెయ్యాలని ఉంది. అయితే, ఈ అసంతృప్తి నన్ను నేను సంపూర్ణంగా అర్పించుకోకుండా అడ్డుపడుతోంది."

మీ లక్ష్యం సహాయం చెయ్యటం, ఆ చెయ్యటంలో సంపూర్ణ తృప్తి పొందటం. మీరు నిజంగా కోరేది సహాయం చెయ్యాలని కాదు, సహాయ పడటంలో సంతృప్తి కోసం. సహాయపడటంలో సంతృప్తికోసం వెతుకుతున్నారు. ఇంకొకరు ఏదో సిద్ధాంతంలోనో మరొక అలవాటులోనో వెతుకుతారు. సంపూర్ణంగా సంతృప్తిని కలిగించే మందుకోసం వెతుకుతున్నారు. ప్రస్తుతానికి ఆ మందుని సహాయపడటం అంటున్నారు. సహాయ పడటానికి కావలసినవన్నీ సమకూర్చుకోవటానికి ప్రయత్నించటంలో సంపూర్ణంగా తృప్తి పొందటానికి కావలసినవి మీకు మీరు సమకూర్చుకుంటున్నారు. మీకు నిజంగా కావలసినది శాశ్వత ఆత్మ సంతృప్తి.

మనలో . చాలామందిలో అసంతృప్తి ఉంటే సులభంగా తృప్తి లభిస్తుంది. అసంతృప్తిని త్వరలోనే నిద్రపుచ్చుతారు. దానికి మందువేసి ప్రశాంతంగా మర్యాదగా ఉండేటట్లు చేస్తారు. బాహ్యంగా మీరు అన్ని సిద్ధాంతాలనూ కొట్టివేసి ఉండవచ్చు. కాని, మానసికంగా లోలోపల శాశ్వతంగా పట్టుకుని ఉండేలా ఏదైనా ఉందేమోనని వెతుకుతున్నారు. ఇతరులతో అన్ని వ్యక్తిగత సంబంధాలూ తెంచేసుకున్నానని చెబుతున్నారు. వ్యక్తిగత బాంధవ్యంలో మీకు శాశ్వతమైన సంతృప్తి లభించకపోయి ఉండొచ్చు, అందువల్లనే మీరు ఒక భావనలో సంబంధాన్ని వెతుకుతున్నారు. భావన ఎప్పుడూ స్వయంకల్పితమైనదే. పూర్తిగా తృప్తి కలిగించే అనుబంధం కోసం, అన్ని తుఫానులనూ తట్టుకునే సురక్షితమైన ఆశ్రయం కోసం వెతకటంలో తృప్తినిచ్చే అసలైన దానినే మీరు పోగొట్టుకోరా? తృప్తిపడటం అనేది అసహ్యకరమైన మాట కావచ్చు. కాని నిజంగా తృప్తిపడటం అంటే ఎదుగూ బొదుగూ లేకుండా స్థిరపడిపోవటం, సమాధానపడటం, అనున యింపబడటం, సున్నితత్వం లేకుండా ఉండటం అని అర్థం రాదు. తృప్తి పడటం అంటే ఉన్నస్థితిని అర్థం చేసుకోవటం. ఉన్నస్థితి ఎప్పుడూ స్థిరమైనది కాదు. ఉన్నస్థితికి అర్థాలు వివరించే మనస్సు, అనువాదం చేసే మనస్సు సంతృప్తి గురించి తనకున్న దురభిప్రాయంలో తానే చిక్కుకుంటుంది. అర్థాలు వివరించటం అవగాహన చేసుకోవటం కాదు.

ఉన్నస్థితిని అవగాహన చేసుకోవటంతో అనంతమైన ప్రేమా, మార్దవం,

నమ్రతా కలుగుతాయి. బహుశా మీరు అన్వేషించేది అదే కావచ్చు. కాని దాన్ని వెతకటం, కనుక్కోవటం సాధ్యం కాదు. కావాలని మీరేం చేసినా సరే మీరు కనుక్కోలేరు ఎన్నటికీ. అన్వేషణ అంతా అంతమైనప్పుడు అది ఉంటుంది. మీకు తెలిసిన దాన్ని గురించే, అంటే మరింత తృప్తికోసమే ఎప్పుడూ మీరు వెతకగలరు. అన్వేషించటం, జాగ్రత్తగా గమనించటం వేరువేరు ప్రక్రియలు. ఒకటి బంధిస్తుంది. రెండవదానివల్ల అవగాహన కలుగుతుంది. అన్వేషణకి ఎప్పుడూ ఒక గమ్యం దృష్టిలో ఉంటుంది. కాబట్టి ఎప్పటికీ బంధంలోనే ఉంటుంది. అనాసక్తంగా జాగ్రత్తగా గమనించటం వల్ల క్షణక్షణమూ ఉన్నస్థితి అవగాహన అవుతుంది. ఉన్నస్థితి క్షణక్షణానికీ అంతమవుతుంది. అన్వేషణలో కొనసాగటం జరుగుతుంది. అన్వేషణ వల్ల కొత్తది ఎప్పుడూ దొరకదు. అంతమైనప్పుడే కొత్తది ఉంటుంది. కొత్తది అనంతమైనది. ప్రేమ ఒక్కటే నిత్యనూతనమయ్యేది.

## 81. వివేకం పోగుచేసుకునే జ్ఞానం కాదు

కుటీరం ఎత్తుగా పర్వతాలపైన ఉంది. అక్కడికి చేరటానికి కారులో బంజరు భూమి దాటి ఎన్నో ఊళ్లమధ్యనుంచీ, చక్కని తోటల్లోంచీ, చిక్కని పొలాల్లోంచీ వెళ్లాలి. నీటి సదుపాయం చేసి కష్టపడి పనిచేసే సాగుచేసిన బంజరులో పెంచిన తోటలూ, పొలాలూ అవి. అందులో ఒక ఊరు మరీ ఆహ్లాదకరంగా ఉంది పచ్చని మైదానాలతో, పెద్ద పెద్ద నీడనిచ్చే చెట్లతో; దగ్గర లోనే ఒక నది ఉంది. అది దూరాన ఉన్న పర్వతాల్లోంచి బయలుదేరి బంజరు మధ్యదాకా వస్తుంది. ఈ ఊరుకి అవతల నదీ జలపాతం వైపునుంచి వెళ్లేదారి మంచు శిఖరాలవరకూ దారితీస్తుంది. ఇక్కడ నేలంతా రాళ్లు, బోడిగా ఎండకు మాడి ఉన్నాయి. నదీ తీరాల పొడుగునా మాత్రం చెట్లున్నాయి. దారిలోపలికీ, పైకీ మలుపులు తిరుగుతూ పైకంటా పోతోంది, పురాతనమైన సరుగుడు చెట్లతో నిండిన అడవుల మధ్య నుంచి. ఎండ వాసన వేస్తోంది వాటినుంచి. గాలి చల్లగా స్వచ్ఛంగా అయింది. త్వరలోనే కుటీరానికి చేరుకున్నాం.

రెండురోజులయాక, మాకు బాగా అలవాటు పడిన తరవాత ఒక

ఎరుపు, నలుపు రంగుల చారలున్న ఉడత వచ్చి కిటికీలో కూర్చుని మమ్మల్ని చూసి అరుస్తూ ఉండేది. దానికి పప్పులు కావాలి. అక్కడికి చూడటానికి వచ్చిన ప్రతివారూ తినిపించి ఉంటారు దానికి. ఇప్పుడు చూడటానికి వచ్చేవాళ్లు చాలా తక్కువ. వచ్చే శీతాకాలానికి దాచుకోవాలని అది ఆత్రుత పడుతోంది. అది చాలా చురుకుగా ఉత్సాహంగా ఉండే ఉడత. అది ఎప్పుడూ కూడబెట్టటానికి సిద్ధంగా ఉంటుంది, ముందు రాబోయే చల్లని మంచు నిండే నెలల కోసం. దాని నివాసం ఒక చెట్టు తొర్రలో ఉంది. అది ఎండిపోయి చాలా ఏళ్లయి ఉంటుంది. ఒక పప్పుని చటుక్కున నోటకరుచుకుని ఆ పెద్ద చెట్టు మొదలువైపుకి పరుగెత్తి చప్పుడు చేస్తూ పైకెక్కుతూ, అరుస్తూ, బెదిరిస్తూ ఆ కన్నంలోకి దూరిపోతుంది. మళ్లీ ఎంత వేగంగా దిగి వస్తుందంటే జారి క్రిందపడి పోతుందేమోననిపిస్తుంది. కాని ఎప్పుడూ పడలేదు. ఒక ఉదయం దానికి ఒక సంచీడు పప్పులు ఇస్తూ గడిపాం. అది ఎంతో స్నేహంగా అయి బాగా గది లోపలి దాకా వచ్చేది. దాని బొచ్చు మెరుస్తూ, దాని పెద్ద పూసల్లాంటి కళ్లు మిలమిల లాడుతుండేవి. దాని పంజాలు మొనదేరి ఉన్నాయి. దాని తోక కుచ్చులా ఉంది. అది ఆనందంగా బాధ్యతాయుతంగా ఉన్న చిన్న జంతువు. అది ఆ చుట్టుపక్కల ఉన్నదాన్నంతా సొంతం చేసుకున్నట్లుగా ఉంది, ఎందుకంటే అది తక్కిన ఉడతల్ని అక్కడికి రాకుండా దూరంగా ఉండేట్లు చేసింది.

ఆయన సరదాగా ఉన్నాడు. వివేకం కోసం ఆత్రుత పడుతున్నాడు. దాన్ని ఆ ఉడత పప్పులు పోగుచేసుకున్నట్లుగా సేకరించాలనుకుంటున్నాడు. బాగా డబ్బున్నవాడు కాకపోయినా ఆయన చాలా చోట్లకే వెళ్లి ఉంటాడు. ఎందుకంటే, ఆయన ఎన్నో దేశాల్లో ఎంతోమందిని కలుసుకున్నట్లుగా కనిపిస్తున్నాడు. బాగా చదివినట్లు కూడా కనిపిస్తున్నాడు, ఏ తత్త్వవేత్త గురించో, యోగి గురించో ఒకటి రెండు వాక్యాలు ఉదాహరిస్తున్నాడు. గ్రీకు భాషలో బాగా చదవగలడన్నట్లు చెప్పాడు. సంస్కృతంలో కూడా స్వల్ప పరిజ్ఞానం ఉంది. ఆయనకి ముసలితనం వస్తోంది, అందుకని వివేకాన్ని సేకరించాలని ఆత్రుతపడుతున్నాడు.

వివేకాన్ని సేకరించగలరా ఎవరైనా?

"ఎందుకు వీలుకాదు? అనుభవమే మనిషిని వివేకవంతుణ్ణి చేస్తుంది. వివేకం ఉండటానికి జ్ఞానం ముఖ్యావసరం."

పోగుచేసుకున్న మనిషి వివేకవంతుడు కాగలడా?

"జీవితమంటేనే పోగుచేయటం. వ్యక్తి గుణం క్రమక్రమంగా రూపొందుతుంది. మెల్లిగా వికసిస్తుంది. అనుభవం అంటే జ్ఞానాన్ని కూడబెట్టుకోవటమే కదా. ఏది అర్థం చేసుకోవాలన్నా జ్ఞానం అత్యవసరం."

జ్ఞానంతోనూ, అనుభవంతోనూ అవగాహన కలుగుతుందా? జ్ఞానం అనుభవ శేషం, గతాన్ని సేకరించటం; జ్ఞానం, అనుభవం ఎప్పుడూ గతమే. గతం ఎప్పటికైనా అవగాహన చేసుకోగలదా? ఆలోచన నిశ్శబ్దంగా ఉన్న విరామసమయాల్లో కాదా అవగాహన కలిగేది? ఆ విరామ స్థలాల్ని పొడిగించటానికీ, కూడబెట్టటానికీ చేసిన కృషివల్ల అవగాహన కలుగుతుందా?

"సేకరణ లేకపోతే మనమే ఉండం. ఆలోచనకీ, ఆచరణకీ కొనసాగింపే ఉండదు. సేకరణే వ్యక్తి గుణం, సేకరణ సద్గుణం. పోగుచేయకుండా మనం బ్రతకలేం. ఆ కారు నిర్మాణం గురించి నాకు తెలిసి ఉండకపోతే నేను దాన్ని అర్థం చేసుకోలేను. సంగీత క్రమం తెలియకపోతే దాని విలువని నేను లోతుగా తెలుసుకోలేను. లోతులేని వాళ్లే సంగీతాన్ని విని సంతోషిస్తారు. సంగీతం విలువని తెలుసుకోవటానికి అది ఎలా రూపొందిందో, ఎలా సమకూడిందో తెలుసుకోవాలి. తెలుసుకోవటమే సేకరించటం. వాస్తవంగా తెలుసుకోకుండా వాటి విలువను తెలుసుకోలేము. ఏదో ఒక విధమైన సేకరణ అవసరం అవగాహనకి - అదే వివేకం."

కనుక్కోవటానికి స్వేచ్ఛ ఉండాలి, ఉండొద్దా? మీరు బంధింపబడి ఉంటే ఎంతో దూరం పోలేరు. ఏ రకమైన సేకరణ ఉన్నా స్వేచ్ఛ ఎలా ఉండగలుగుతుంది? డబ్బుని గాని, జ్ఞానాన్ని గాని కూడబెట్టిన మనిషి స్వేచ్ఛగా ఎన్నటికీ ఉండలేడు. వస్తువులు కూడబెట్టుకోకుండా మీరు స్వేచ్ఛగా ఉండి ఉండవచ్చు. కాని జ్ఞానంకోసం ఆశపడటం కూడా బంధమే, మిమ్మల్ని పట్టుకొని ఉంటుంది. ఏరకంగా కూడబెట్టినా, దానికి కట్టివేయబడిన మనస్సు ఇటూ అటూ ఎంతో దూరం తిరిగి కనుక్కోగలదా? సద్గుణాన్ని సేకరించే

ఆలోచన ఎలా అవగాహన చేసుకోగలదు ఎప్పటికైనా? అర్థం చేసుకోవటం కావాలని జరిపే ప్రకియా? అర్థం చేసుకోవటానికి ప్రత్యేకం పూనుకుంటారా? ఒక సాయంకాలపు అందాన్ని ఆనందించాలని ఎంచుకుంటారా?

"అర్థం చేసుకోవటం చైతన్యంతో చేసే కృషి కాదా?"

చైతన్యం అంటే మన ఉద్దేశం ఏమిటి? మనం చైతన్యంగా ఎప్పుడుంటున్నాం? ఏదైనా ఎదురైనప్పుడు, ప్రేరణ కలిగినప్పుడు. సుఖప్రదమైనది గాని, బాధాకరమైనదిగాని, దానికి జరిగే ప్రతిక్రియేకాదా చైతన్యం అంటే? ఎదురైన దానికి జరిగే ప్రతిక్రియ అనుభవం. అనుభవం అంటే పేరుపెట్టటం, మాటల్లో పెట్టటం, దేనితోనో సంబంధం కలిగి ఉండటం. పేరుపెట్టకుండా ఏ అనుభవమూ ఉండదు, ఉంటుందా? ఎదురవటం, ప్రతిక్రియ, పేరు పెట్టటం, అనుభవం - ఈ మొత్తం ప్రక్రియ అంతా కలిస్తే చైతన్యం, కాదా? చైతన్యం ఎప్పుడూ గతానికి చెందిన ప్రక్రియే. తెలిసిన కృషి, అవగాహన చేసుకోవాలనే ఇచ్ఛ. పోగు చెయ్యాలనీ, ఉండాలనే ఇచ్ఛ కొనసాగుతున్న గతమే. కొంతమార్పుతో కావచ్చు, కాని అప్పటికీ గతమే. ఏదో ఉండాలనీ, ఏదో అవాలనీ మనం ప్రయత్నించటంలో, ఆ ఏదో అనేది మన కల్పనే. మనం అర్థం చేసుకోవటానికి తెలిసి కృషిచేస్తే మనం సేకరించిన వాటి చప్పుడే మనం వింటాం. ఈ చప్పుడే అవగాహనకి ఆటంకం.

"అయితే వివేకం అంటే ఏమిటి?"

జ్ఞానం అంతమైనప్పుడే వివేకం ఉంటుంది. జ్ఞానం కొనసాగుతుంది. కొనసాగింపు లేకపోతే జ్ఞానం ఉండదు. కొనసాగేది ఎప్పటికీ స్వేచ్ఛగా కొత్తగా ఉండలేదు. అంతం ఉన్నదానికే స్వేచ్ఛ ఉంటుంది. జ్ఞానం ఎప్పటికీ కొత్తది కాదు. అది ఎప్పుడూ పాతదవటమే. పాతది కొత్తదాన్ని ఇముడ్చుకుంటూ ఉంటుందెప్పుడూ. ఆ విధంగా శక్తిని పొందుతూ ఉంటుంది. పాతది అంతం అవాలి కొత్తది ఉండాలంటే.

"అంటే మీరనేది, ఇంకోరకంగా చెప్పాలంటే, ఆలోచన అంతమవాలి వివేకం ఉండాలంటే, కాని, ఆలోచన అంతమవటం ఎలా?"

ఏ రకమైన శిక్షణ ద్వారా గాని, సాధన ద్వారా గాని, బలవంతంతో గాని

ఆలోచన అంతంకాదు. ఆలోచించేవాడే ఆలోచన. తనమీద తానే ప్రయోగించుకోలేడు. అలా చేసుకుంటే అది ఆత్మవంచనే. అతడే ఆలోచన. అతడూ, ఆలోచనా వేరువేరు కాదు. తాను వేరనుకోవచ్చు. వేరుగా ఉన్నట్లు నటించవచ్చు. అది ఆలోచన యొక్క నైపుణ్యతే - తనకు తాను శాశ్వతత్వాన్ని ఆపాదించుకోవటానికి. ఆలోచన ఆలోచనని అంతం చేసుకోవటానికి ప్రయత్నించటం దాన్ని అది శక్తిమంతం చేసుకోవటమే. మీరు దాన్ని ఏంచేసినా, ఆలోచన దాన్ని అది అంతం చేసుకోలేదు. దీనిలోని సత్యాన్ని గ్రహించినప్పుడే ఆలోచన అంతమవుతుంది. ఉన్నస్థితి యొక్క సత్యాన్ని గ్రహించటంలోనే స్వేచ్ఛ ఉంటుంది. ఆ సత్యాన్ని గ్రహించటమే వివేకం. ఉన్నస్థితి ఎప్పుడూ స్థిరంగా ఉండదు. దాన్ని అనాసక్తంగా జాగ్రత్తగా గమనించటానికి ఏవిధమైన సేకరణా లేకుండా స్వేచ్ఛగా ఉండాలి.

## 82. పరధ్యానం

అది పొడుగ్గా వెడల్పుగా ఉన్న కాలవ - నదిలోంచి మొదలై నీళ్లులేని ప్రదేశాల్లోకి పోతుంది. కాలవ నదికన్న ఎత్తుమీద ఉంది. అందులోకి పోయే నీటికి ఆనకట్ట ఉంది. సరుకుతో నిండిన పడవలు ఇటూ అటూ పోతున్నాయి. వాటి ముక్కోణపు తెరచాపలు నీలాకాశంముందూ, నల్లటి కొబ్బరిచెట్ల ముందూ కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి. ఆ సాయంకాలం రమణీయంగా, ప్రశాంతంగా, స్వేచ్ఛగా ఉంది. నీరు చాలా నిశ్చలంగా ఉంది. కొబ్బరి చెట్ల నీడలూ, మామిడి చెట్ల నీడలూ దానిలో గీసినట్లుగా ఎంత స్పష్టంగా కనిపిస్తున్నాయంటే నిజమైనదేదో, ప్రతిబింబమేదో వేరుచేయలేనంత అస్పష్టంగా ఉంది. అస్తమిస్తున్న సూర్యబింబం నీటిలో అన్నీ స్పష్టంగా కనిపించేటట్లు చేస్తోంది. సాయంకాలం వెలుగంతా దాని ముఖంమీద ఉంది. ఆ ప్రతిబింబాలలో సాయంకాలపు నక్షత్రం కూడా కనిపించటం మొదలైంది. నీరు చలనం లేకుండా ఉంది. అటువెళ్లే గ్రామస్తులు కొందరు, సాధారణంగా గట్టిగా సాగదీస్తూ మాట్లాడుకునేవాళ్లు నిశ్శబ్దంగా ఉన్నారు. ఆకుల గుసగుసలు కూడా ఆగిపోయాయి. మైదానం లోంచి ఒక జంతువు వచ్చింది.

నీళ్లు తాగింది. ఎంత నిశ్శబ్దంగా వచ్చిందో అలాగే మాయమైంది. ఆ ప్రదేశాన్ని నిశ్శబ్దం ఆవరించింది. అందులో అన్నింటినీ ఇముడ్చుకున్నట్లుగా ఉంది.

చప్పుడు ఆఖరవుతుంది. కాని, నిశ్శబ్దం చొచ్చుకుపోయేటట్లుగానూ, అనంతంగానూ ఉంటుంది. చప్పుడు వినిపించకుండా మూసుక్కూర్చోవచ్చు. కాని నిశ్శబ్దాన్ని మూసివేయటానికేమీ ఉండదు. ఏ గోడా దాన్ని మూసి వెయ్యలేదు. దాన్ని ప్రతిఘటించటానికి ఉండదు. చప్పుడు అన్నిటినీ కప్పివేస్తుంది. అది ప్రత్యేకంగా విడిగా ఉంటుంది. నిశ్శబ్దం ప్రేమ లాగే అభేద్యమైనది. అందులో చప్పుడు అనీ, నిశ్శబ్దం అనీ విభజన ఉండదు. మనస్సు దాన్ని అనుసరించలేదు. దాన్ని గ్రహించటానికి నిశ్చలంగా చేయబడలేదు. నిశ్చలంగా చెయ్యబడిన మనస్సు తన రూపాలనే ప్రతిబింబింపజేస్తుంది. అవి గీసినట్లుగా స్పష్టంగా ఉండి, ప్రత్యేకంగా ఉండాలని గొడవ చేస్తాయి. నిశ్చలంగా చెయ్యబడిన మనస్సు ప్రతిఘటిస్తుందంతే. ప్రతిఘటన అంతా ఆందోళనే. నిశ్చలంగా చెయ్యబడినది కాక, నిశ్చలంగా ఉన్న మనస్సు నిశ్శబ్దాన్ని ఎప్పుడూ అనుభవిస్తూనే ఉంటుంది. ఆలోచనా, మాటా అప్పుడు నిశ్శబ్దం లోనివే అవుతాయి - అవతలివి కావు. ఎలాటి చిత్రమో, ఈ నిశ్శబ్దంలో మనస్సు ప్రశాంతంగా ఉంటుంది - కొనితెచ్చుకున్న ప్రశాంతత కాదు. ప్రశాంతత అమ్మకానికి వీలయేది కాదు. దానికి విలువలేదు. దాన్ని ఉపయోగించు కోవటానికి కుదరదు. దానిలో పారిశుధ్యం, ఏకాంతం ఉండే లక్షణం ఉంటుంది. ఉపయోగించటానికి వీలయేది త్వరలోనే అరిగి పోతుంది. ప్రశాంతత ఆరంభం అవదు, అంతం అవదు. ఆవిధంగా ప్రశాంతంగా ఉన్న మనస్సుకి ఆనందం అంటే ఏమిటో తెలుస్తుంది. అది దాని కోరిక యొక్క ప్రతిబింబం కాదు.

ఆవిడ దేన్ని గురించో ఒక దాని గురించి ఆందోళన పడుతూనే ఉంటుందని చెప్పిందావిడ. కుటుంబం గురించి కాకపోతే పక్కింటివాళ్ల గురించి, లేకపోతే ఏదో సాంఘిక కార్యకలాపం. ఆందోళనతో ఆవిడ జీవితం నిండిపోయింది. నిత్యం ఇటువంటి కల్లోలాలు ఏకారణం వల్ల వస్తున్నాయో ఇంతవరకు కనుక్కోలేకపోయిందిట. ఆవిడకి ఏమీ ఆనందం లేదుట. ప్రపంచం అలా ఉంటే ఎవరైనా ఎలా ఆనందంగా ఉండగలరు? ఏదో

తాత్కాలికంగా కొంత ఆనందం ఆవిడకి కలగకపోలేదుట. కాని అదంతా గతంలో. ఇప్పుడు ఆవిడ వెతుకుతున్నది జీవితానికి అర్థాన్నిచ్చేదేదైనా ఉన్నదేమోననిట. ఆవిడ ఎన్నిటినో ప్రయత్నించి చూసిందిట. ఆ సమయానికి అవి లాభదాయకంగా కనిపించాయిట. ఎన్నో ముఖ్య సాంఘిక కార్య కలాపాల్లో పాల్గొన్నదిట. మత సంబంధమైన విషయాల్లో మనస్ఫూర్తిగా నమ్మిందిట. కుటుంబంలో వారి మరణం కూడా అనుభవమైందిట. ఆవిడకి పెద్ద ఆపరేషను ఒకటి జరిగిందిట. మొత్తం మీద జీవితం సులభంగా గడపలేదని చెప్పింది. తన వంటివాళ్లు ప్రపంచంలో కోటానుకోట్లు ఉండవచ్చు నంది. తెలివితక్కువైనా, అవసరమైనదైనా, ఈ గొడవంతటికీ అతీతంగా, నిజంగా చేయదగిన మంచిది ఏదైనా ఉన్నదేమో కనుక్కోవాలని కోరుతోంది.

మంచివి వెతికితే దొరకవు. వాటిని కనుక్కోవటం కుదరదు. అవి జరగాలి. జరిగేటట్లు గడుసుగా పథకం వెయ్యటానికి కుదరదు. తీవ్ర ప్రాముఖ్యం కలదేదైనా సరే - జరుగుతుంది గాని ఎన్నటికీ సృష్టింపబడదన్న విషయం నిజం కాదా? జరగటం ముఖ్యం. కనుక్కోవటం కాదు. కనుక్కోవటం అంతకన్న సులభమే కాని జరగటం అనేది వేరే విషయం. అది కష్టమైనది కాదు. వెతకాలనీ, కనుక్కోవాలనీ తపించటం పూర్తిగా ఆగిపోవాలి - ఏదైనా జరగాలంటే. దొరకటంలో పోగొట్టుకునే అర్థం కూడా ఉంటుంది. పోయేందుకు మీ దగ్గర ఉండాలి. సొంతం చేసుకోవటం వల్ల గాని, సొంతం కావటం వల్లగాని, అవగాహన అవటానికి స్వేచ్ఛ ఉండదు.

కాని, ఈ ఆందోళన, అస్తిమితం ఎప్పుడూ ఎందుకుంటోంది? దాని గురించి తీవ్రంగా పరిశీలించారా ఇంతకు ముందు?

"ఏదో యథాలాపంగా ప్రయత్నించానంతే. ప్రయోజనకరంగా కాదు. ఎప్పుడూ పరధ్యానంలో పడుతూ ఉండేదాన్ని."

పరధ్యానంలో పడటం కాదు నిజం చెప్పాలంటే. అది మీకు ఎప్పుడూ ప్రధానమైన సమస్య అనిపించలేదంతే. ప్రధానమైన సమస్య ఉన్నప్పుడు పరధ్యానం ఉండదు. పరధ్యానం అనేది లేదు. పరధ్యానం అంటే ఒక ముఖ్య ఆసక్తి నుంచి మనస్సు ఇటూ అటూ తిరగటం అని అర్థం వస్తుంది. కాని

ముఖ్య ఆసక్తి ఉన్నప్పుడు పరధ్యానమే ఉండదు. మనస్సు ఒకదాని నుంచి మరొక దానికి తిరుగుతూ ఉండటం పరధ్యానం కాదు - ఉన్న స్థితిని తప్పించుకోవటం. సమస్య అతి సమీపంలో ఉన్నప్పుడు మనం దాన్ని వదిలి ఇక్కడికీ అక్కడికీ తిరగాలనుకుంటాం. ఈ తిరగటం వల్ల మనం ఏదో ఒకటి చేసేందుకు దొరుకుతుంది - వ్యాకులపడటం, వృథాగా కబుర్లు చెప్పటం వంటివి. తిరుగుతూ ఉండటం తరుచు బాధాకరం అనిపించినా దాన్నే నయమనుకుంటాం ఉన్నస్థితి కన్న.

దీన్ని గురించి మీరు తీవ్రంగా పరిశీలించాలనుకుంటున్నారా, లేక ఊరికే దానిచుట్టూ ఆటలాడుతున్నారా?

"నిజంగా దాన్ని పూర్తిగా చివరంటా తెలుసుకోవాలని ఉంది నాకు. అందుకే వచ్చాను."

మీరెందుకు ఆనందంగా లేరంటే, నూతిని నింపే జల లేదని, అందుకనేనా? గులకరాళ్లమీద నీటి గుసగుసల్ని మీరెప్పుడో ఓసారి విని ఉంటారు. కాని ఇప్పుడు నదిపాయ ఎండిపోయింది. మీరు ఆనందాన్ని ఎరుగుదురు. కాని అది ఎప్పుడూ వెనక్కి వెళ్ళిపోయేదే. అది ఎప్పుడూ గతానికి చెందినదే. ఆ జలనేనా మీరు వెతుకుతున్నది. దాన్ని మీరు వెతకాలా? లేక దానంతట అది అనుకోకుండా ఎదురవాలా? అది ఎక్కడుందో తెలిస్తే మీరు దాన్ని పొందే సాధనాలు కనుక్కుంటారు. కాని, తెలియదు కాబట్టి దానికి మార్గంలేదు. తెలిసి ఉండటం అంటే జరిగే దాన్ని ఆపటమే. ఉన్న సమస్యల్లో అదొకటా?

"నిశ్చయంగా అదే. జీవితం ఎంత మందకొడిగా క్రియావిహీనంగా ఉందంటే, అది కనక జరిగితే ఇంకేదీ అడగటం జరగదు."

ఒంటరితనం సమస్యగా ఉందా?

"ఒంటరిగా ఉండటానికి నాకభ్యంతరం లేదు. దాంతో ఎలా వ్యవహరించాలో నాకు తెలుసు. వాహ్యాళికైనా వెడతాను, లేదా, ఒంటరితనం పోయేవరకూ నిశ్శబ్దంగా కూర్చుంటాను, అంతేగాక, నాకు ఏకాంతంగా ఉండటం ఇష్టం."

ఒంటరిగా ఉండటం ఏమిటో మనందరికీ తెలుసు. ఉపశమనం లేని, బాధాకరమైన, భయంకరమైన శూన్యం. దాన్నుంచి అవతలికి పారిపోవటం ఎలాగో మనకి తెలుసును, ఎందుకంటే పారిపోయే మార్గాలెన్నింటినో పరిశోధించాం. కొంతమంది ఒక మార్గంలో చిక్కుకుంటారు. తక్కినవాళ్లు ఇంకా మార్గాలకోసం వెతుకుతూనే ఉంటారు. కాని, వారిలో ఎవ్వరూ ఉన్న స్థితిలో తిన్నగా సంపర్కం పెట్టుకోరు. మీకు ఒంటరితనంలో వ్యవహరించటం ఎలాగో తెలుసునంటున్నారు. నిజం చెప్పాలంటే, ఒంటరితనం గురించి చర్య తీసుకోవటమే దాన్ని తప్పించుకోవటం. మీరు నడవటానికి వెడతారు, లేదా, ఒంటరితనం పోయే వరకూ దాంతో కూర్చుంటారు. మీరు ఎప్పుడూ దాంతో ఏదో చేస్తూనే ఉన్నారు. దాని కథని చెప్పుకోనివ్వటం లేదు మీరు. దానిపైన మీరు ఆధిపత్యం వహించాలనుకుంటారు, దాన్ని అధిగమించాలనుకుంటారు, దాన్నుంచి పారిపోవాలనుకుంటారు. అందుచేత దానితో మీకున్న సంబంధం అదంటే మీకు గల భయం.

సాఫల్యం పొందటం కూడా ఒక సమస్యేనా మీకు? ఏదో ఒక దానిలో తాను సఫలం కావాలనుకోవటానికి అర్థం ఉన్నస్థితిని తప్పించుకోవటం అని కాదా. నేను అల్పుణ్ణి, -కాని నేను దేశంతోనో, కుటుంబంతోనో, ఏదో నమ్మకంతోనో నన్ను నేను ఐక్యం చేసుకుంటే నేను సాఫల్యం పొందినట్లూ, సంపూర్ణత పొందినట్లూ అనుభూతి పొందుతాను. ఈ సంపూర్ణతకోసం ప్రయత్నించటమే ఉన్నస్థితి నుంచి పారిపోవటం.

"అవును, అది నిజమే. అది కూడా నా సమస్యే."

మనం ఉన్నస్థితిని అర్థం చేసుకోగలిగితే అప్పుడు ఈ సమస్యలన్నీ అంతమవుతాయి. ఏ సమస్యనైనా మనం సమీపించే పద్ధతి ఏమిటంటే దాన్ని తప్పించుకోవటం. దాన్ని గురించి ఏదో చెయ్యాలనుకుంటాం. ఆ చెయ్యటం మనకి సమస్యతో ప్రత్యక్ష సంపర్కం కలగకుండా ఆటంకం కలిగిస్తుంది. ఈ మార్గం సమస్యని అవగాహన చేసుకోవటానికి అడ్డుపడుతుంది. సమస్యతో ఏం చెయ్యాలా అనేదే మనస్సు వ్యాపకం, అంటే నిజానికి దాన్ని ఎలా తప్పించుకోవాలా అనేది. అందువల్ల సమస్యని అర్థం చేసుకోవటం ఎప్పుడూ జరగదు. అది అలాగే ఉంటుంది. ఎందువల్లనంటే, సమస్య, అంటే ఉన్నస్థితి,

తేటతెల్లం కావటానికి, దాని కథ పూర్తిగా చెప్పుకోవటానికి మనస్సు సున్నితంగా ఉండి, వెంటనే అర్థం చేసుకోగలిగి ఉండాలి. తప్పించుకునే మార్గాల ద్వారానో, సమస్యతో ఏం చెయ్యాలో తెలుసుకోవటం ద్వారానో, దానికి సహేతుక వివరణో, కారణమో తెలుసుకోవటానికి ప్రయత్నించటం, అంటే మాటల్లో నిర్ణయించటం ద్వారానో, మనస్సుకి మత్తు కలిగేటట్లు చేస్తే అప్పుడు ఆ మనస్సు మందకొడిగా అయి, ఆ సమస్య, అంటే ఉన్నస్థితి విప్పిచెప్పే కథని తక్షణం అర్థం చేసుకోలేదు. దీనిలోని సత్యాన్ని గ్రహించండి. మనస్సు సున్నితంగా ఉన్నప్పుడే అది గ్రహించగలుగుతుంది. ఆ సమస్య గురించి మానసికంగా ఏ విధమైన కార్యకలాపం జరిగినా దానివల్ల మనస్సు మందకొడిగానూ, అర్థం చేసుకోలేనిదిగానూ, అది చెప్పేది వినిపించుకోలేనట్లు గానూ అవుతుంది. మనస్సు సున్నితంగా ఉన్నప్పుడు - సున్నితంగా చేయ బడటం కాదు, అది మరోవిధంగా మందకొడిగా చేయటమే - సున్నితంగా ఉన్నప్పుడు ఉన్నస్థితికి, అంటే శూన్యతకి ఉండే ప్రాధాన్యమే పూర్తిగా వేరు.

మనం మాట్లాడుతున్నంతసేపూ అనుభవం పొందుతూ ఉండండి, మాటల స్థాయిలోనే ఉండిపోకండి.

మనస్సుకీ, ఉన్న స్థితికీ సంబంధం ఏమిటి? ఇంతవరకూ, ఉన్నస్థితికి ఒక పేరుపెట్టి, మాటల్లో పెట్టి, పరిచిత సంకేతంగా చేసింది. ఇలా దానికి పేరు పెట్టటం మూలంగా దానితో ప్రత్యక్ష సంబంధం ఏర్పడకుండా ఆటంకపరిచి మనస్సుని మందకొడిగా, సున్నితత్వం లేకుండా చేసింది. మనస్సూ, ఉన్నస్థితీ - రెండూ వేరువేరు ప్రక్రియలు కాదు. పేరు పెట్టటంతో వేరవుతాయి. ఈ పేరుపెట్టటం ఆగిపోతే ప్రత్యక్ష సంబంధం ఉంటుంది. మనస్సూ, ఉన్నస్థితీ ఒక్కటే. ఉన్నస్థితి ఇప్పుడు గమనించేవాడే - దానికో మాట లేకుండా. అప్పుడే ఉన్నస్థితి పరివర్తన చెందుతుంది. భయంతోనూ, తదితరమైనవాటితోనూ కూడిన శూన్యం అని పిలవబడేదింక ఉండదు. అప్పుడు మనస్సు - అంటే, అనుభవించే స్థితి మాత్రమే ఉంటుంది. అందులో అనుభవించేదీ, అనుభవింపబడేదీ ఉండవు. అప్పుడు అపరిమితమైన ప్రగాఢత ఉంటుంది - కొలిచేది లేదు కనుక. గాఢంగా ఉన్నది నిశ్శబ్దంగా, ప్రశాంతంగా ఉంటుంది. ఈ ప్రశాంతతలో అనంతంగా నీరు పొంగుతుంది. మాటలు వాడటమే మనస్సులోని ఆందోళన. మాట లేకపోతే ఉండేది అపరిమితమైనది.

# 83. కాలం

ఆయన వార్ధక్య లక్షణాలతో ఉన్నాడు, కాని ఆరోగ్యవంతంగా ఉన్నాడు పొడుగాటి, నెరిసిన జుట్టుతో, తెల్లని గడ్డంతో. ప్రపంచం లోని అనేక భాగాల్లో విశ్వవిద్యాలయాల్లో వేదాంతం గురించి ఉపన్య సించాడుట. పాండిత్యం ఉన్నవాడు. నెమ్మదస్తుడు. తను ధ్యానం చెయ్యనని చెప్పాడాయన. ఆయన పట్టించుకునేది జ్ఞానం ఒక్కటేనట. వేదాంతం గురించీ, ధార్మిక అనుభవాల గురించీ ఉపన్యాసాలిచ్చినా, ఆయనకు స్వయంగా జరిగిన సంఘటనలేమీ లేవుట. వాటికోసం ఆశపడటం కూడా లేదుట. కాలం గురించి వివరంగా చర్చించటానికి వచ్చాడు.

ఆస్తిపాస్తులున్న మనిషికి స్వేచ్ఛగా ఉండాలంటే ఎంత కష్టం! ధనవంతుడు తనకున్న ధనాన్ని అవతలికి త్రోసి వెయ్యటం మహాకష్టం. వేరే ఇంకేవైనానో, మరింత గొప్ప లాలసత్వం కలిగించేవో ఉన్నప్పుడే గాని ధనవంతుడు తన సంపదలిచ్చే సౌఖ్యాన్ని వదులుకోడు. తన ఆకాంక్ష ఫలించే మరొక స్థాయి దొరికితే గాని ఉన్నదాన్ని వదులుకోడు. ధనవంతుడికి ధనమే అధికారం. దాన్ని అతడు చలాయిస్తాడు. పెద్ద పెద్ద మొత్తాలు ఇచ్చివెయ్య వచ్చు. కాని ఇచ్చేవాడు అతడే.

జ్ఞానం మరో రకరమైన ఆస్తి. జ్ఞానం ఉన్నవాడు దానితో తృప్తి పొందుతాడు. అతడికి అంతకన్న కావలసినది లేదు. అతడికి ఉన్న భావన - అధమం ఈయన అనుకునేది జ్ఞానమే కనుక ప్రపంచంలో అన్ని చోట్లా కొద్దో గొప్పో విస్తరింపగలిగితే అది అన్ని సమస్యల్నీ ఎలాగోలాగ పరిష్కరిస్తుందని. ధనం ఉన్న వానికన్న జ్ఞానం సంపాదించినవానికే మరింత ఎక్కువ కష్టం - తనకున్న వాటిని వదులుకుని స్వేచ్ఛగా ఉండటం. అవగాహన, వివేకం ఉండే స్థానాన్ని జ్ఞానం ఎంత సులభంగా ఆక్రమిస్తుందో చిత్రంగా ఉంటుంది. వేటి గురించైనా మన దగ్గర వివరాలుంటే అవి మనకి అర్థమయాయనుకుంటాం. సమస్యకి కారణం తెలుసుకున్నందువల్లనో, దాని వివరాలు తెలిసినందు వల్లనో ఇక ఆ సమస్య ఉండదనుకుంటాం మనం. మన సమస్యకి కారణం కోసం వెతుకుతాం. ఈ వెతకటం వల్లనే వెంటనే అవగాహన కాకుండా మనం

ముందుకెప్పటికో నెట్టటం జరుగుతుంది. మనలో చాలా మందికి కారణం తెలుసును. ద్వేషానికి కారణం కనిపించనంత మరీ నిగూఢంగా ఉండదు. కారణం వెతుకుతూనే ద్వేషంవల్ల కలిగే ఫలితాలను ఆనందంగా అనుభవిస్తూనే ఉంటాం. ఫలితాలతో సమాధాన పడటమే తప్ప మొత్తం ప్రక్రియని అర్థం చేసుకోవటం కాదు మనక్కావలసింది. మనలో చాలా మంది సమస్యల్నే పట్టుకుని ఉంటారు. అవి లేకపోతే మనకి దారితోచదు. సమస్యలు మనకి పని కల్పిస్తాయి. సమస్యలకి సంబంధించిన కార్యకలాపాలతోనే మన జీవితాలు నిండి ఉంటాయి. మనమే సమస్య, దాని కార్యకలాపాలూను.

కాలం చాలా చిత్రమైన ప్రకృతివిశేషం. స్థలం, కాలం ఒక్కటే. ఒకటి ఉంటే గాని ఇంకోటి ఉండదు. కాలం మనకి అత్యంత ముఖ్యం. ప్రతి ఒక్కరూ దానికి తమ ప్రత్యేక అర్థాన్నిస్తారు. అనాగరికుడికి కాలంతో ప్రమేయం ఉండదు. కాని, నాగరికులకు అది అత్యంత ప్రధానమైనది. అనాగరికుడు ఏరోజు కారోజు మరిచిపోతాడు. కాని, విద్యావంతుడలా చేస్తే పిచ్చాసుపత్రిలో పెడతారు, లేదా, ఉద్యోగం పోతుంది. శాస్త్రజ్ఞుడి ఉద్దేశంలో కాలం ఒకలా ఉంటుంది. మామూలు మనిషికి మరొకలా ఉంటుంది. చరిత్రకారుడికి కాలం అంటే అర్థం గతాన్ని అధ్యయనం చేయడం, స్టాక్ మార్కెట్‌లో టిక్కు టిక్కుమనటం, తల్లికి కొడుకు జ్ఞాపకం, అలిసిపోయిన వాడికి నీడలో విశ్రాంతి. ప్రతి ఒక్కరూ తమ తమ అవసరాన్ని బట్టి, తృప్తి కలగటాన్ని బట్టీ అనువదించుకుని, తమ గడుసు మనస్సుకి సరిపోయేలా మలుచుకుంటూ ఉంటారు. అయితే, మనం కాలం లేకుండా ఉండలేం. మనం జీవించాలంటే ఋతువు అవసరమైనంతగానూ తేదీల ప్రకారం కాలం అవసరం. కాని, మానసిక కాలం అంటూ ఏదైనా ఉందా, లేక అది మనస్సు తనకు వీలయేటట్లుగా చేసిన వంచన మాత్రమేనా? తేదీల వారీగా ఉండేకాలం తప్ప తక్కినదంతా వంచనే, నిశ్చయంగా. పెరగటానికీ, చనిపోవటానికీ, విత్తనం నాటడానికీ, ఫలం అందుకోవటానికీ కాలం పడుతుంది. కాని, మానసిక కాలం, అంటే ఏదో అవటం అనే ప్రక్రియ పూర్తిగా అసత్యమైనది కాదా?

"మీకు కాలం ఏమనిపిస్తుంది? మీరు కాలం గురించి ఆలోచిస్తారా? కాలాన్ని తెలుసుకున్నారా మీరు?"

తేదీల వారీగా జరిగే కాలం తప్ప ఇంకో కాలం గురించి ఎవరైనా ఆలోచించగలరా? దాని మటుకు దానికి ఏవిధమైన ప్రాధాన్యం లేదు. అస్పష్టకాలం కేవలం ఊహమాత్రమే. ఊహామాత్రమైనదేదైనా వ్యర్థమే. కాలాన్ని మనం సాధించేందుకు మార్గంగా వినియోగించుకుంటాం - వాస్తవంగా గాని, మానసికంగాని. స్టేషనుకి వెళ్లటానికి పట్టేకాలం అవసరం. కాని మనలో చాలామంది కాలాన్ని మానసిక లక్ష్యానికి సాధనంగా ఉపయోగిస్తారు. అటువంటి లక్ష్యాలు అనేకం. మనం సాధించవలసిందానికి ఆటంకం కలిగినప్పుడూ, విజయవంతం అవటానికి కొంత విరామం ఉన్నప్పుడూ, కాలం తెలుసుకుంటాం. ఉన్నస్థితికీ, ఉండబోయిన, ఉండవలసిన, ఉండాలను కున్న స్థితికీ మధ్యనున్న స్థలమే కాలం. ఆరంభం అంతాన్ని చేరుకునేదే కాలం.

"వేరే ఇంకేవిధమైన కాలమూ లేదా? శాస్త్రరీత్యా కాలం, విరామం వీటికి అంతరార్థాలేమిటి?"

తేదీల వారీగా ఉండేకాలం ఉంది, మానసిక కాలం ఉంది. తేదీల వారీ కాలం అవసరం. అది ఉన్నది. కాని ఇంకోటి వేరే విషయం. కారణం, ఫలితం కాలప్రక్రియ అంటారు. భౌతికంగానే కాదు, మానసికంగా కూడా. కారణానికీ ఫలితానికీ మధ్య ఉన్న విరామమే కాలమనుకోబడుతుంది. కాని విరామం ఉన్నదా? రోగం విషయంలో కారణాన్నీ ఫలితాన్నీ విడదీయవచ్చునేమో. అదికూడా తేదీలవారీ కాలమే. కాని మానసిక కారణానికీ, ఫలితానికీ మధ్య విరామం ఉంటుందా? కారణం, ఫలితం ఒకే ప్రక్రియ కాదా? కారణానికీ ఫలితానికీ మధ్య విరామం లేదు. ఈ రోజు నిన్నటి ఫలితం, రేపటికి కారణం. అది ఒకే కదలిక, కొనసాగే ప్రవాహం. కారణానికీ ఫలితానికీ మధ్య ఎడంలేదు, విడదీసే రేఖ లేదు. కాని అంతరంగికంగా వాటిని విడదీస్తాం, ఏదో అవటానికీ, సాధించటానికీ, నేను ఇది, నేను అది అవాలి. అది అవటానికి నాకు సమయం కావాలి - తేదీలవారీ కాలం మానసిక ప్రయోజనాలకోసం ఉపయోగించబడు తుంది. నేను మూర్ఖుణ్ణి, నేను వివేకిని అవాలి. మూర్ఖత్వం వివేకంగా అవటం అంటే మూర్ఖత్వం క్రమంగా ఎక్కువవటమే, ఎందుకంటే మూర్ఖత్వం ఎప్పటికీ వివేకం కాలేదు - ఆశ ఆశకాకపోవటం అవనట్లుగానే. ఏదో అవాలను కోవటమే మూర్ఖత్వం.

ఆలోచన కాలం ఫలితం కాదా? జ్ఞానం అంటే కాలం కొనసాగటం. కాలం అంటే కొనసాగింపు. అనుభవం అంటే జ్ఞానం. అనుభవం జ్ఞాపకంగా కొనసాగడమే కాలం. ఇలా కొనసాగే కాలానికి రూపం లేదు. ఊహాగానాలు చేయడం అజ్ఞానం. అనుభవం అంటే జ్ఞాపకం, మనసు అనేది కాలయంత్రం. మనస్సు అంటే గతం. ఆలోచన ఎప్పుడూ గతానికి చెందేదే. గతం కొనసాగితేనే జ్ఞాపకం. జ్ఞానం ఎప్పుడూ గతానికి చెందినదే. జ్ఞానం కాలానికి చెందకుండా ఎప్పుడూ ఉండదు, ఎప్పుడూ కాలంలోనే, కాలానికి చెందే ఉంటుంది. ఇలా జ్ఞాపకం, జ్ఞానం కొనసాగటమే చైతన్యం. అనుభవం ఎప్పుడూ గతంలోనిదే; అదే గతం. ఆ గతం ప్రస్తుతంతో కలిసి భవిష్యత్తులోకి జరుగుతోంది. భవిష్యత్తు గతమే, కొంత మార్పుచెంది ఉండవచ్చు, అయినప్పటికే గతమే. ఈ ప్రక్రియ అంతా కలిసే ఆలోచన, మనస్సు. ఆలోచన కాలం పరిధిలో తప్ప ఇంకెందులోనూ పనిచెయ్యలేదు. కాలరహితమైన దాన్ని గురించి ఆలోచన ఊహించవచ్చు, కాని అది దాని కల్పన మాత్రమే. ఊహా, కల్పనా అంతా మూర్ఖత్వం.

"అయితే మీరు కాలరహితమైన దాన్ని గురించి మాత్రం ప్రస్తావించట మెందుకు? కాలరహితమైనది ఎప్పటికైనా తెలుస్తుందా? కాలరహితమైనదని దాన్ని గుర్తించటానికి వీలవుతుందా?"

గుర్తించటం అంటే అనుభవించేవాడున్నట్లు అర్థం వస్తుంది. అనుభవించేవాడు ఎప్పుడూ కాలానికి చెందినవాడే. దేన్నైనా గుర్తుపట్టటానికి, దాన్ని అంతకుముందు అనుభవం పొంది ఉండాలి. అనుభవం పొంది ఉంటే అది తెలిసినదే. తెలిసినది కాలరహితమైనది కాదు, నిశ్చయంగా. తెలిసినది ఎప్పుడూ కాలం అనే వలలోనిదే. ఆలోచన కాలరహితమైన దాన్ని తెలుసు కోలేదు. అది మరింత సేకరించటం కాదు, మరికొంత సాధించటం కాదు. దానివైపుకి వెళ్లటం అంటూ ఉండదు. ఆలోచన గాని, కాలం గాని లేకుండా ఉండే స్థితి అది.

"దానికి ఏమిటి విలువ?"

ఏమిలేదు. విలువ కట్టవీలుకానిది. ఒక ప్రయోజనం కోసం దాని విలువ ఎంచలేము. దాని విలువ తెలియనిది.

"కాని జీవితంలో దానివల్ల ప్రయోజనం ఏమిటి?"

జీవితం ఆలోచనే అయితే, ఏమీ లేదు. దానిద్వారా మనం శాంతీ, ఆనందం పొందాలనీ, అన్ని కష్టాలనూ అడ్డుకునే రక్షకసాధనంగా ఉండాలనీ, మనుష్యులలో ఐకమత్యాన్ని నెలకొల్పే సాధనంగా ఉండాలనీ కోరుకుంటాం. దాన్ని ఏవిధమైన ప్రయోజనానికీ ఉపయోగించుకోవటం కుదరదు. ప్రయోజనం అనగానే లక్ష్యసాధన అని అర్థం వస్తుంది. అప్పుడు మళ్లీ వెనక్కి వస్తాం - ఆలోచనా ప్రక్రియతో సహా, మనస్సు కాలరహితమైన దాన్ని రూపొందించలేదు, తన లక్ష్యం కోసం దాన్ని మలుచుకోలేదు. దాన్ని ఉపయోగించుకోలేదు. కాలరహితమైనది ఉన్నప్పుడే జీవితానికి అర్థం ఉంటుంది. లేకపోతే, జీవితం అంటే దుఃఖం, సంఘర్షణా, బాధా. ఆలోచన ఏ మానవసమస్యనీ పరిష్కరించలేదు - ఎందుకంటే ఆలోచనే సమస్య కనుక. జ్ఞానం అంతం కావటమే వివేకానికి ఆరంభం. వివేకం కాలానికి చెందినది కాదు. అనుభవం, జ్ఞానం కొనసాగటం కాదు వివేకం. కాలమయ జీవితం అంటే గందరగోళం, దుఃఖం. కాని, ఉన్నస్థితి కాలరహితంగా ఉన్నప్పుడు ఆనందం ఉంటుంది.

## 84. దుఃఖం

చచ్చిపోయిన ఒక పెద్ద జంతువు నదిలో కొట్టుకుపోతోంది. దానిమీద కొన్ని రాబందులు కూర్చుని దాని చర్మాన్ని ఒలిచేస్తున్నాయి; తక్కిన రాబందుల్ని చెదరగొడుతున్నాయి - తమ కడుపులు నిండేదాకా. నిండిన తరవాత ఎగిరి పోతాయి. తక్కినవి కొన్ని చెట్లమీదా, ఒడ్డుమీదా ఉన్నాయి. కొన్ని నెత్తిమీద తిరుగాడుతున్నాయి. సూర్యుడు అప్పుడే ఉదయించాడు. గడ్డి మీద మంచు బిందువులున్నాయి. నదికి అవతల ఒడ్డున ఉన్న పచ్చని పొలాలు మసగ్గా కనిపిస్తున్నాయి. రైతుల గొంతులు నీటికవతల నుంచి స్పష్టంగా వినవస్తున్నాయి. అది రమణీయమైన ఉదయం, స్వచ్ఛంగా, కొత్తగా ఉంది. ఒక కోతిపిల్ల తల్లి చుట్టూ ఆడుకుంటోంది చెట్ల కొమ్మల్లో. కొమ్మ పొడుగుతా పరుగెత్తి పక్క కొమ్మమీదికి గెంతుతోంది. మళ్లీ పరుగెత్తుకుంటూ

వస్తోంది. తల్లి దగ్గరగా పైకి ఎగరటం, క్రిందికి దూకటం. ఈ చేష్టలన్నిటితో విసుగెత్తాక ఆ చెట్టుమీంచి దిగి మరోటి ఎక్కుతోంది. క్రిందికి దిగుతూనే మధ్యలో వెళ్ళి తల్లిని కరుచుకుంటోంది. వీపుమీదకెక్కటం, దాని క్రింద ఊగిసలాడటం చేస్తోంది. దాని ముఖం ఎంతో బుల్లిది. దాని కళ్లు ఆటతో, భయంతో చేసే అల్లరితో నిండి ఉన్నాయి.

కొత్తదన్నా, తెలియనిదన్నా ఎంత భయపడతాం మనం! మనకి నిత్యం ఉండే ఆలవాట్లలో దైనందిన చర్యల్లో, దెబ్బలాటల్లో, ఆదుర్దాలో మూసుకు పోయి ఉంటాం. అదే పాత పద్ధతిలో ఆలోచించాలనుకుంటాం. అదే దారిలో వెళ్లాలనుకుంటాం. అవే ముఖాలు చూస్తాం. అవే ఆందోళనలు పెట్టు కుంటాం. క్రొత్తవారిని కలుసుకోవటానికి ఇష్టపడం. ఒకవేళ కలుసుకున్నా ముభావంగా వ్యాకులపాటుతో ఉంటాం. తెలియని జంతువేదైనా ఎదురైతే ఎంత భయపడతాం! ధైర్యం చేసి బయటికి వచ్చినా అది ఆ గోడలు ఇంకా విస్తృతం చేసుకుని వాటి మధ్యనే. మనకి అంతం అంటూ ఉండదు. ఎప్పుడూ కొనసాగే దాన్నే పోషిస్తూ ఉంటాం. రోజురోజుకీ నిన్నటి భారం మోసుకుపోతూ ఉంటాం. మన జీవితం సుదీర్ఘంగా కొనసాగే చలనం. మన మనస్సులు మందకొడిగా సున్నితత్వం లేకుండా ఉంటాయి.

అతను ఏడుపు ఆపులేకపోయాడు. అది అణుచుకుంటూ నిగ్రహించు కుంటూ ఏడ్చిన ఏడుపుకాదు - ఒళ్లంతా అదిరి పోయేటట్లు వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. ఇంకా చిన్న వాడిలా ఉన్నాడు, ఊహా చిత్రాలు చూసిన కళ్లతో. కొంతసేపటి వరకూ మాట్లాడలేకపోయాడు. చివరికి మాట్లాడగలిగేటప్పటికి అతని గొంతు వణికింది. మళ్లీ పెద్దగా వెక్కుతూ ఏడుపు, సిగ్గుపడకుండా స్వేచ్ఛగా ఏడ్చాడు. అంతలోనే చెప్పాడు.

"నా భార్యపోయిన రోజు తరవాత మళ్లీ ఏడవలేదు నేను. అలా ఎందుకేడ్చానో నాకే తెలియదు. కాని తేలికపడింది. ఇంతకుముందు నా భార్య బ్రతికి ఉన్నప్పుడు తనతో కలిసి ఏడ్చాను. కాని, అప్పుడు నవ్వులాగే ఏడుపు కూడా ప్రక్షాళితం చేసేది. తన మరణం తరవాత ప్రతిదీ మారిపోయింది. నేనిదివరకు చిత్రలేఖనం చేసేవాణ్ణి. కాని, ఇప్పుడు కుంచెలు ముట్టుకోలేక పోతున్నాను. నేను గీసిన వాటికేసి చూడలేక పోతున్నాను. గత

ఆరుమాసాల్లోనూ నేను చచ్చిపోయానా అనిపిస్తోంది. మాకు పిల్లల్లేరు. కాని, అప్పుడు గర్భిణీగా ఉంది. వెళ్ళిపోయింది. ఇప్పటికి కూడా నమ్మలేక పోతున్నాను. ఎందుకంటే ప్రతీదీ మేమిద్దరం కలిసిచేసేవాళ్లం. తను ఎంత అందమైనదో, ఎంత మంచిదో - నేనేం చెయ్యాలిప్పుడు? అలా ఆపుకోలేకుండా ఏడ్చినందుకు చింతిస్తున్నాను. అలా ఎందుకు జరిగిందో భగవంతుడికే తెలియాలి. అలా ఏడవటం మంచిదే అయిందని తెలుసు. కాని, మళ్లీ ఇదివరకులా ఎప్పటికీ ఉండదు. నా జీవితంలోంచి ఏదో వెళ్ళిపోయింది. మొన్నోరోజు కుంచెలు తీసుకున్నాను. కాని, అవి అపరిచితంగా తోచాయి. ఇదివరకు చేతిలో కుంచె ఉన్న సంగతి కూడా తెలిసేది కాదు. ఇప్పుడు అది బరువుగా, భారంగా ఉంటోంది. తరుచు నదివైపుకి వెళ్ళాను తిరిగి రాకూడదనుకుంటూ. కాని, ప్రతిసారీ తిరిగి వచ్చాను. జనాన్ని చూడలేక పోతున్నాను. ఆమె ముఖమే కనిపిస్తోంది. ఆమెతోనే నిద్రపోతున్నాను. కలగంటున్నాను, కలిసి తింటున్నాను. కాని, మళ్లీ ఇదివరకులా ఎన్నటికీ ఉండదని నాకు తెలుసు. దాని గురించి తర్కించుకున్నాను, ఆ సంఘటనని సహేతుకంగా చూసి అర్థం చేసుకోవటానికి ప్రయత్నించాను, కాని, నాకు తెలుసు ఆమె ఇంకలేదని; ప్రతి రాత్రీ ఆమె గురించే కలగంటున్నాను; కాని, ఎంతకీ నిద్రపోలేను ప్రయత్నించినా. ఆమె వస్తువులు ముట్టుకోవటానికి భయం. వాటి వాసన కొంచెం తగిలినా పిచ్చెత్తిపోతోంది. మరిచిపోవటానికి ప్రయత్నించాను. కాని, ఏంచేసినా మళ్లీ ఇదివరకులా ఉండదెన్నటికీ. ఇదివరకు పక్షులగానాన్ని వినేవాణ్ణి. ఇప్పుడు ప్రతివస్తువునీ నాశనం చెయ్యాలనిపిస్తోంది. ఇంక ఇలా ఉండటం నావల్ల కావటం లేదు. అప్పటి నుంచీ నా స్నేహితుల్ని ఎవర్నీ కలుసుకోలేదు. ఆమె లేకుండా వాళ్లు నాకు ఏమీ కారనిపిస్తోంది. నేనేం చెయ్యను?''

మేము చాలాసేపు మౌనంగా ఉన్నాం.

దుఃఖానికీ ద్వేషానికీ దారితీసే ప్రేమ ప్రేమ కాదు. మనకి ప్రేమంటే తెలుసునా? అడ్డం వస్తే ఆగ్రహంగా మారేది ప్రేమేనా? లాభం, నష్టం ఉన్నప్పుడు ప్రేమ ఉంటుందా?

''ఆమెని ప్రేమించటంలో అవేమీ లేవు. వాటన్నిటినీ పూర్తిగా మరిచి

పోయాను. నన్ను నేను మరిచిపోయాను. నాకు ప్రేమ తెలుసును. ఆమె పట్ల నాకింకా అదే ప్రేమ. కాని, ఇప్పుడు తక్కినవి కూడా తెలుసుకుంటున్నాను. నా గురించీ, నా దుఃఖం గురించీ, నా దుర్దినాల గురించీ."

ఎంత త్వరలో ప్రేమ ద్వేషంగా, అసూయగా, దుఃఖంగా మారి పోతుంది! ఆ పొగలో ఎంత లోతుగా కొట్టుకుపోతాం! అంత దగ్గరగా ఉండేది ఎంత దూరమై పోతుంది! ఇప్పుడు మన ఇతర విషయాలన్నీ కూడా తెలుసుకున్నాం. హఠాత్తుగా తెలుసుకున్నాం. హఠాత్తుగా అవి ఎంతో ఎక్కువ ముఖ్యమైపోయాయి. ఇప్పుడు మనం ఒంటరిగా ఉన్నామనీ, తోడు లేకుండా ఉన్నామనీ, చిరునవ్వూ, చనువుగా తిట్టటం లేవనీ తెలుసుకున్నాం. ఇంకొకరి గురించే కాకుండా మన గురించి కూడా మనం తెలుసుకున్నాం. ఇది వరకు ఇంకొకరే సర్వమూ, మనం ఏమీకాదు. ఇప్పుడు ఇంకొకరు లేరు. మనం ఉన్నది ఉన్నట్లుగా ఉన్నాం. ఇంకొకరు కల, వాస్తవమైనది మనం ఉన్న స్థితే. ఇంకొకరు ఎప్పుడైనా వాస్తవంగా ఉన్నారా? లేక మనం సృష్టించుకున్న కలేనా? త్వరలో మాయమైపోయే మన ఆనందం అనే అందమైన వస్త్రం కప్పిన కలేనా అది? మాయమైపోవటమే మరణం. మనం ఉన్నదే జీవితం. మరణంలో ఎప్పుడూ జీవితం ఇమిడి ఉండదు - మనం ఎంత కోరుకున్నా. జీవితమే మరణం కన్న శక్తిమంతమైనది. లేనిదానికన్న ఉన్నదానికే శక్తి ఎక్కువ. కాని మనం మరణాన్నే ఎంతగా ప్రేమిస్తాం, జీవితం కన్న! జీవితాన్ని కాదనటం ఎంతో సంతోషదాయకంగా, విస్మరణీయంగా ఉంటుంది. ఇంకొకటి ఉంటే మనం ఉండం. ఇంకొటి ఉన్నప్పుడు మనం స్వేచ్ఛగా మొహమాటం లేకుండా ఉంటాం. ఆ ఇంకొకటి పువ్వు, పక్కింటివాళ్లు, సువాసన, జ్ఞాపకం. మనందరికీ ఇంకొకటే కావాలి. ఇంకొకదానితోనే మనల్ని మనం ఐక్యం చేసుకుంటాం. ఇంకొకటే ముఖ్యం, మనం కాదు. ఇంకొక్కటే మన స్వప్నం; లేచిన తరవాత మనం ఉన్నస్థితిలో మనం ఉంటాం. ఉన్నస్థితి మరణం లేనిది. కాని ఉన్న స్థితిని మనం అంతం చెయ్యాలనుకుంటాం. అంతం చెయ్యాలనే కోరికలో నుంచే కొనసాగేది పుడుతుంది. కొనసాగేదానికెప్పుడూ మరణరహితమైన దేమిటో తెలియదు.

"నాకు తెలుసును నేనీవిధంగా జీవన్మరణం లాంటి బ్రతుకు ఇంక

బ్రతకలేనని. మీరనేదేమిటో నాకర్థం అయిందో లేదో నాకు నిశ్చయంగా తెలియదు. ఏదీ గ్రహించలేనంతగా చెదిరిపోయి ఉన్నాను."

చెబుతున్నదానిమీదా, మీరు చదువుతున్న దానిమీదా పూర్తిగా శ్రద్ధ చూపించకపోయినప్పటికీ మీకు తెలియకుండానే మీకు ఇష్టం ఉన్నాలేకున్నా ఏదో కొంత మీకు వినిపించి మీలో ప్రవేశించటం మీరు తరుచు గమనించ లేదా? ఆ చెట్లకేసి మీరు ప్రయత్నపూర్వకంగా చూడకపోయినా తరవాత వాటి రూపం హఠాత్తుగా ప్రతి వివరంతోనూ కనిపిస్తుంది - అలా జరగటం ఎప్పుడూ కనిపెట్టలేదా? నిజమే, ఈమధ్య కలిగిన ఆఘాతం వల్ల, మీరు చెదిరిపోయి ఉన్నారు. అయినప్పటికీ, దాన్నుంచి మీరు తేరుకున్న తరవాత, మనం ఇప్పుడు చెబుతున్నది గుర్తుకి వస్తుంది. అప్పుడేమైనా అది సహాయకరంగా ఉండొచ్చు. కాని ముఖ్యంగా మీరు గ్రహించవలసినది - మీరు ఆఘాతం నుంచి బయటపడ్డాక మీ దుఃఖం మరింత తీవ్రమవుతుంది. అప్పుడు మీ దుఃఖం నుంచి మీరు తప్పించుకుపోవాలని కోరుకుంటారు. మీరు తప్పించు కునేందుకు సహాయపడటానికి చాలామందే ఉంటారు. వాళ్లు వీలైనన్ని కారణాలూ, నిర్ణయాలూ తమకు గాని, ఇతరులకు గాని తట్టినవి అందిస్తారు. అన్ని రకాల సహేతుకమైన సమర్థనలూ చేస్తారు. లేదా, మీ అంతట మీరే మీ దుఃఖాన్ని అణచివేసుకుందుకు సంతోషకరమైనదో, అసంతోషకరమైనదో, ఏదో మార్గంలో వెనక్కి తప్పుకోవాలని చూస్తారు. ఇప్పటి వరకూ ఆ సంఘటనకి మరీ సన్నిహితంగా ఉన్నారు. కాని రోజులు గడుస్తున్న కొద్దీ ఏదో రకమైన ఉపశమనం కోసం తపిస్తారు; మతం, విశ్వాసరాహిత్యం, సాంఘిక కార్యకలాపం, లేదా, ఏదో సిద్ధాంతం. కాని తప్పించుకునే మార్గం ఏ రకమైనదైనా, అది దేవుడైనా, తాగుడైనా, దుఃఖం అంటే అర్థం అవకుండా ఆటంకం కలిగిస్తాయి.

దుఃఖాన్ని అర్థం చేసుకోవాలి గాని నిర్లక్ష్యం చేయకూడదు. నిర్లక్ష్యం చేస్తే దుఃఖం కొనసాగేటట్లు చేయటమే. దుఃఖాన్ని నిర్లక్ష్యం చేయటమంటే దాన్నుంచి పారిపోవటమే. దుఃఖాన్ని అర్థం చేసుకోవటానికి ఆచరణాత్మకమైన, ప్రయోగాత్మకమైన పద్ధతి అవసరం. ప్రయోగం చేయటమంటే ఒక నిశ్చిత ఫలితం కోసం ప్రయత్నించటం కాదు. నిశ్చిత ఫలితం కోసం ప్రయత్నిస్తే

ప్రయోగం చేయటం సాధ్యంకాదు. మీకు కావలసినదేదో మీకు తెలిసినప్పుడు దాన్ని అనుసరించటం ప్రయోగం చేయటం కాదు. దుఃఖాన్ని తప్పించుకుందామని మీరనుకుంటే, అంటే దాన్ని నిందిస్తే, అప్పుడు దాని సంపూర్ణ క్రియని మీరు అర్థం చేసుకోరు. దుఃఖాన్ని దాటవెయ్యటానికి ప్రయత్నిస్తున్నప్పుడు మీరు ఆలోచించేదల్లా దాన్ని ఎలా తప్పించుకోవాలా అనే. దుఃఖాన్ని అర్థం చేసుకోవాలంటే దాన్ని సమర్థించటానికిగాని తప్పించుకోవటానికి గాని ఏవిధమైన చర్యా కావాలని తీసుకోకూడదు. మనస్సు పూర్తిగా అనాసక్తంగా, నిశ్శబ్దంగా గమనిస్తూ ఉంటే ఏవిధమైన సందేహం లేకుండా దుఃఖం తేటతెల్లం కావటాన్ని అర్థం చేసుకోవచ్చు. మనస్సు ఏదైనా ఆశకి గాని, నిర్ణయానికి గాని, జ్ఞాపకానికి గాని కట్టుపడి ఉంటే దుఃఖం యొక్క గాథని అర్థం చేసుకోలేదు. ఉన్నస్థితి యొక్క త్వరితగతిని అనుసరించటానికి మనస్సు స్వేచ్ఛగా ఉండాలి. స్వేచ్ఛ ఆఖరున ఉండవలసినది కాదు, ఆరంభంలోనే ఉండాలి.

"ఈ దుఃఖం అంతటికీ అర్థం ఏమిటి?"

దుఃఖం సంఘర్షణకి - సుఖదుఃఖాల సంఘర్షణకి సూచన కాదా? అజ్ఞానాన్ని తెలియజేసేది కాదా దుఃఖం? అజ్ఞానం అంటే యథార్థాల గురించి వివరాలు తెలిసి ఉండకపోవటం కాదు. అజ్ఞానం అంటే తనలో మొత్తం ఏం జరుగుతున్నదీ తెలుసుకోకపోవటమే. తన రీతులను అర్థం చేసుకోనంత వరకూ దుఃఖం ఉండి తీరుతుంది. తన పద్ధతులను సంబంధ వ్యవహారాల్లో తీసుకునే చర్యల్లోనే కనుక్కోవాలి.

"కాని నా సంబంధం అంతమైపోతుంది కదా."

సంబంధానికి అంతం ఉండదు. ఒక ప్రత్యేక సంబంధం అంతమైపోవచ్చు. కాని సంబంధం అంతం కాదు. ఉండటమంటేనే సంబంధంతో ఉండటం. ఏదీ ఒంటరిగా ఉండలేదు. ఒక ప్రత్యేక సంబంధం ద్వారా మనల్ని మనం విడిగా ఉంచుకోవటానికి ప్రయత్నించినప్పటికీ, ఆ విడిగా ఉంచుకున్న ప్రతిసారీ దుఃఖం కలగటం అనివార్యం అవుతుంది. దుఃఖమంటే విడిగా ఉంచుకోవటమనే ప్రక్రియే.

"జీవితం మళ్లీ ఎప్పట్లా ఉంటుందా?"

నిన్నటి ఆనందం మళ్లీ ఇవ్వాళ సంభవం అవుతుందా? ఈ రోజున ఆనందం లేనప్పుడే మళ్లీ సంభవం అవాలనే కోరిక పుడుతుంది. ఈ రోజు శూన్యంగా ఉంటే గతం వైపుగాని, భవిష్యత్తు వైపుగాని చూస్తాం. మళ్లీ సంభవం అవాలని కోరటం కొనసాగింపుకోసమే. కొనసాగేదానిలో ఎప్పుడూ కొత్తదనం ఉండదు. ఆనందం గతంలోనూ భవిష్యత్తులోనూ ఉండేది కాదు. ప్రస్తుతం జరిగే దాంట్లో మాత్రమే ఉంటుంది.

## 85. అనుభూతి, ఆనందం

మేము సముద్రంపైన బాగా ఎత్తులో ఉన్నాం. ఇంజన్ల చప్పుడులో గాలిగొట్టం చేసే రొదలో మాట్లాడటం కష్టమవుతోంది. అదీకాక, కొంతమంది కాలేజి కుర్రాళ్లు ఆ ద్వీపంలో జరగబోయే క్రీడా సమావేశానికి వెడుతున్నారు. వారిలో ఒకతని దగ్గర "బాన్జో" ఉంది. దానిమీద ఎన్నోగంటలసేపు వాయిస్తూ పాడాడు. తక్కిన వాళ్ళని పురికొల్పగా, వాళ్లంతా కలిసి పాడారు. "బాన్జో" ఉన్న కుర్రవాడి గొంతు బాగుంది. అవి "క్రూనర్లూ", "కౌబోయ్"లూ పాడేవీ, "జాజ్" సంగీతమూను. అంతా బాగా పాడారు అచ్చు గ్రామఫోను రికార్డులో లాగే. అదొక చిత్రమైన గుంపు. వాళ్లు ప్రస్తుతం గురించే ఆలోచిస్తారు. ఆ క్షణంలో ఆనందించటం తప్ప వాళ్లకింకో ఆలోచన ఉండదు. రేపులో అన్నీ సమస్యలే - ఉద్యోగం, వివాహం, వృద్ధాప్యం, మరణం. కాని, ఇక్కడ సముద్రం పైన, ఎత్తున అమెరికన్ పాటలూ, సచిత్రపత్రికలూ. నల్లని మబ్బుల్లోని మెరుపునీ వాళ్లు పట్టించుకోలేదు. సముద్రంతో బాటు వంపు తిరిగిన నేలని గాని ఎండలో దూరంగా కనిపిస్తున్న ఊరుని గాని చూడలేదు వాళ్లు.

ద్వీపం ఇప్పుడు సరిగ్గా మా క్రింద ఉంది. పచ్చగా మెరుస్తోంది, వానలో ప్రక్షాళితమై. ఆకాశం మీంచి చూస్తే ప్రతీదీ ఎంత పరిశుభ్రంగానూ, తీర్చిదిద్దినట్లూ కనిపిస్తుంది! అన్నిటికన్నా ఎత్తైన కొండ అణగిపోయినట్లుగా ఉంది. తెల్లని అలల్లో చలనం లేదు. చేపలు పట్టే మట్టిరంగు పడవ ఒకటి తెరచాపలు వేసుకుని హడావిడిపడుతోంది. తుఫాను రాకముందే

చేరుకోవాలని. త్వరలోనే సురక్షితంగా చేరుకుంటుంది, రేవు దగ్గరలోనే కనిపిస్తోంది. చుట్టుతూ క్రిందికి వచ్చిన నది సముద్రంలోకి వచ్చింది - మన్ను రంగూ, బంగారు వన్నే కలిసినట్లుంది. అంత ఎత్తునుంచి నదికిరు వైపులా ఏం జరుగుతుందో చూడవచ్చు. భవిష్యత్తు మరుగుపడిలేదు, మలుపు అవతల ఉన్నప్పటికీ. ఎత్తులో గతంగాని భవిష్యత్తుగాని ఉండదు. వంపు తిరిగిన స్థలం విత్తనం నాటే సమయాన్ని గాని, ఫలం అందుకునే సమయాన్ని గాని దాచి ఉంచలేదు.

పక్కసీట్లో ఉన్నాయన జీవితంలోని కష్టాలగురించి మాట్లాడటం మొదలు పెట్టాడు. తన ఉద్యోగం గురించీ, నిత్యం ప్రయాణం చెయ్యటం గురించీ, తన కుటుంబం లెక్క చెయ్యకపోవటం గురించీ, నేటి రాజకీయాల నిష్ప్రయోజనాన్ని గురించీ నిష్ఠురంగా మాట్లాడాడు. ఎక్కడికో దూరం వెడుతున్నాడు. ఇల్లు వదిలివెడుతున్నందుకు కొంత విచారిస్తున్నట్లుగా ఉన్నాడు. చెబుతున్నకొద్దీ ఆయన మరింత గంభీరంగా అయి, ప్రపంచం గురించీ, ముఖ్యంగా తన గురించీ, తన కుటుంబం గురించీ అంతకంతకు మరింత వ్యాకులపడుతున్నాడు.

"ఇదంతా వదిలేసి ఎక్కడికైనా ప్రశాంతమైన చోటుకి వెళ్లిపోవాలనీ, ఏదో కొద్దిగా పనిచేసుకుని సుఖంగా ఉండాలనీ ఉంది. నా జీవితంలో ఇంత వరకు సుఖపడ్డాననుకోను. సుఖం అంటే ఏమిటో ఎరగను. ఏదో జీవిస్తాం, పుట్టిస్తాం, పనిచేస్తాం, చచ్చిపోతాం - జంతువుల్లాగే. నాలో ఉత్సాహం అంతా పోయింది - డబ్బు సంపాదించటం తప్ప. అది కూడా విసుగెత్తిపోతోంది. నా ఉద్యోగం నేను బాగానే నిర్వహిస్తాను. మంచి జీతం సంపాదిస్తున్నా. కాని ఇదంతా ఎందుకోసమో ఏమీ అర్థం కాదు నాకు. నాకు ఆనందంగా ఉండాలని ఉంది. నేనేం చెయ్యగలను? మీ ఉద్దేశం ఏమిటి?"

అర్థం చేసుకోవటానికిది చాలా క్లిష్టమైన విషయం. గంభీర సంభాషణకిది అనువైన స్థలంకాదు.

"నా కింక మరో సమయం దొరకదని నా భయం. దిగీ దిగగానే నేను వెళ్లిపోవాలి మళ్లీ. నేను గంభీరంగా ఉన్నట్లు అనిపించకపోవచ్చు. కాని నాలో అక్కడక్కడ గంభీరమైన అంశాలు లేకపోలేదు. ఉన్న చిక్కంతా అవన్నీ

ఒకచోట కూడనట్లుండటమే. మనస్సులో గంభీరంగానే ఉంటాను. మా నాన్న గారూ, మా పెద్దవాళ్లూ అంతా చిత్తశుద్ధికి పేరుపొందినవారే. కాని ప్రస్తుత ఆర్థిక పరిస్థితుల వల్ల నేను పూర్తిగా గంభీరంగా ఉండాలంటే కుదరనివ్వటం లేదు. దాన్నుంచి బయటకు కొట్టుకొచ్చాను. మళ్లీ దాంట్లోకే వెళ్లాలని ఉంది. ఈ అజ్ఞానాన్ని మరిచిపోవాలనుకుంటున్నాను. నేను బలహీనతతో పరిస్థితుల గురించి సణుగుతూ ఉండొచ్చు. అయినా కానీ, నేను నిజంగా ఆనందంగా ఉండాలని కోరుతున్నాను."

అనుభూతి ఒకటీ, ఆనందం మరొకటీ. అనుభూతి ఎప్పుడూ మరింత అనుభూతిని కోరుతుంది. అంతకంతకు దాని పరిధి విశాలమవుతుంది. సుఖానుభూతులకు అంతంలేదు. వాటి సంఖ్య పెరుగుతూ ఉంటుంది, కాని అవి సఫలం కావటంలోనే అసంతృప్తి ఉంటుందెప్పుడూ. ఇంకా కావాలనే కోరిక ఉంటుందెప్పుడూ. ఇంకా ఎక్కువ కోరటానికి అంతుండదు. అనుభూతీ, అసంతృప్తీ వేరుకాలేనివి. .ఎందువల్లనంటే, ఇంకా ఎక్కువ కావాలనే కోరిక వాటిని ఒకచోట బంధించి ఉంచుతుంది. అనుభూతి అంటే ఇంకా ఎక్కువ కావాలని కాని, తక్కువ కావాలని కాని కోరటం. అనుభూతి పరిపూర్ణం కావటంలోనే ఇంకా కావాలనే కోరిక ఉద్భవిస్తుంది. అంటే, ఉన్నదానితో అనునిత్యం అసంతృప్తి పడటమే. ఉన్నదానికీ, ఉండబోయేదానికీ మధ్య సంఘర్షణ ఉంటుంది. అనుభూతి ఎప్పుడూ అసంతృప్తే. అనుభూతికి మత సంబంధమైన దుస్తులు వేయవచ్చు, కాని ఇంకా ఉన్నట్లుగానే ఉంటుందది : మానసికమైనదిగా, సంఘర్షణగా, భయంగా. శారీరకమైన అనుభూతులు ఎప్పుడూ ఇంకా కావాలని గోలపెడతాయి. వాటికి ఆటంకం కలిగినప్పుడు, కోపం, అసూయ, ద్వేషం కలుగుతుంది. ద్వేషంలో ఆనందం ఉంటుంది. ఈర్ష్య తృప్తినిస్తుంది. ఒక అనుభూతికి అడ్డుతగిలితే అది తెచ్చే నిస్పృహవల్ల కలిగే వైరుధ్యంలోనే సంతృప్తి దొరుకుతుంది.

అనుభూతి ఎప్పటికీ ప్రతిక్రియే. అది ఒక ప్రతిక్రియ నుంచి మరొక ప్రతిక్రియకు తిరుగాడుతూ ఉంటుంది. తిరుగాడేది మనస్సు. మనస్సే అనుభూతి. మనస్సు అనుభూతులకి - సంతోషదాయకమైన వాటికీ, అసంతోష కరమైన వాటికీ నిలయం. అనుభవం అంతా ప్రతిక్రియే. మనస్సు అంటే

జ్ఞాపకం, అంటే అదీ ప్రతిక్రియే కదా. ప్రతిక్రియని, అంటే అనుభూతిని తృప్తిపరచటానికి సాధ్యం కాదు. ప్రతిక్రియ ఎప్పుడూ తృప్తిగా ఉండదు. ప్రతిక్రియ ఎప్పుడూ లేని స్థితిలోనే ఉంటుంది. లేనిది ఎన్నటికీ ఉండలేదు. అనుభూతికి తృప్తి అనేది తెలియదు. అనుభూతీ, ప్రతిక్రియా ఎప్పుడూ సంఘర్షణని పెంపొందిస్తాయి. సంఘర్షణే మరింత అనుభూతి అవుతుంది. గందరగోళం గందరగోళాన్ని పుట్టిస్తుంది. మనస్సు యొక్క కార్యకలాపం, దానియొక్క అన్ని రకాల స్థాయిల్లోనూ, అనుభూతిని పెంపొందింపజేయటమే. దాని పెరుగుదలకి ఆటంకం కలిగినప్పుడు వైరుధ్యంలోనే తృప్తి పొందుతుంది. అనుభూతీ, ప్రతిక్రియా - రెండు విరుద్ధమైన వాటి మధ్య జరిగే సంఘర్షణ. ప్రతిఘటనా, స్వీకారం, లొంగిపోవటం, తిరస్కరించటం - వీటి సంఘర్షణలో సంతృప్తి ఉంది, ఆ సంతృప్తి మరింత సంతృప్తి కోసం నిత్యం ప్రయత్నిస్తూనే ఉంటుంది.

మనస్సు ఆనందాన్ని కనుక్కోలేదు. ఆనందం అనుభూతి లాగ వెతికితే దొరికేది కాదు. అనుభూతి మళ్లీ మళ్లీ దొరుకుతుంది, ఎందుకంటే, అది ఎప్పుడూ పోతూనే ఉంటుంది. కాని ఆనందం దొరకటం సాధ్యంకాదు. జ్ఞాపకం ఉన్న ఆనందం అనుభూతి మాత్రమే - ప్రస్తుతాన్ని సమర్థిస్తూగాని, వ్యతిరేకిస్తూగాని కలిగే ప్రతిక్రియ. జరిగిపోయినది ఆనందం కాదు. అంతమైన ఆనందానుభవం అనుభూతి, ఎందువల్లనంటే, జ్ఞాపకం అంటే గతం, గతం అంటే అనుభూతి కనుక. ఆనందం అనుభూతి కాదు.

మీరెప్పుడైనా ఆనందంగా ఉన్నట్లు తెలుసునా?

"కచ్చితంగా తెలుసును, దేవుడి దయవల్ల. లేకపోతే, ఆనందంగా ఉండటం నాకు తెలిసేదే కాదు."

మీకు తెలిసినదీ, మీరు ఆనందం అంటున్నదీ అనుభవం యొక్క అనుభూతి మాత్రమే నిశ్చయంగా. అది ఆనందం కాదు. మీకు తెలిసినది గతం. ప్రస్తుతం కాదు. గతం అంటే అనుభూతి, ప్రతిక్రియ, జ్ఞాపకం. మీరు ఆనందంగా ఉన్నట్లు మీకు జ్ఞాపకం. అయితే, ఆనందం అంటే ఏమిటో మీరు చెప్పగలరా? మీరు గుర్తుకి తెచ్చుకోగలరు. కాని, అది కాలేదు. గుర్తింపు

ఆనందం కాదు. ఆనందం గురించి తెలియటం ఆనందం కాదు. గుర్తింపు జ్ఞాపకం యొక్క ప్రతిక్రియ. అనేక జ్ఞాపకాలూ, అనుభవాలూ కలగాపులగం అయిన మనస్సు ఎప్పటికైనా ఆనందంగా ఉండగలదా? అనుభవించటానికి గుర్తింపే ఆటంకమవుతుంది.

మీరు ఆనందంగా ఉన్నారని మీరు తెలుసుకున్నప్పుడు ఆనందం ఉంటుందా? ఆనందం ఉన్నప్పుడు మీకు తెలుస్తుందా? సంఘర్షణతోనే చైతన్యం వస్తుంది, ఇంకా కావాలనే గుర్తింపులోని సంఘర్షణతో. ఇంకా కావాలనే గుర్తింపు కాదు ఆనందం. సంఘర్షణ ఉన్న చోట ఆనందం ఉండదు. మనస్సు ఉన్నచోట సంఘర్షణ ఉంటుంది. ఆలోచన అన్ని స్థాయిల్లోనూ జ్ఞాపకం యొక్క ప్రతిక్రియే. అందుచేత ఆలోచన తప్పనిసరిగా సంఘర్షణని పెంపొందిస్తుంది. ఆలోచన అంటే అనుభూతి. అనుభూతి ఆనందం కాదు. అనుభూతులు ఎప్పుడూ తృప్తికోసం ప్రయత్నిస్తాయి. లక్ష్యం అనుభూతి. కాని ఆనందం లక్ష్యం కాదు. దాన్ని వెతికి పట్టుకోవటానికి కుదరదు.

"అయితే, అనుభూతులు ఎలా అంతమవుతాయి?"

అనుభూతిని అంతం చేయటమంటే మరణాన్ని ఆహ్వానించటమే. కోరికలను అణచిపెట్టటం మరొక అనుభూతి. కోరికలను అణచిపెట్టటం వల్ల శారీరకంగా గాని, మానసికంగా గాని సున్నితత్వాన్ని నాశనం చేయటం అవుతుంది కాని అనుభూతి కాదు. తన్ను తాను అణగద్రొక్కుకునే ఆలోచన మరింత అనుభూతిని కోరుతుందంతే - ఆలోచనే అనుభూతి కనుక. అనుభూతి అనుభూతిని అంతం చెయ్యలేదు. ఇతర స్థాయిల్లో వేరే అనుభూతులు ఉండవచ్చు, అంతేకాని, అనుభూతికి అంతమనేది ఉండదు. అనుభూతిని నాశనం చెయ్యటమంటే సున్నితత్వం లేకుండా ఉండటం, మరణించటం, చూడకుండా ఉండటం, వాసన పీల్చకుండా ఉండటం, స్మరించకుండా ఉండటం, అంటే, వేరుగా ఉండటం. మన సమస్య పూర్తిగా వేరు, కాదా? ఆలోచన ఎన్నటికీ ఆనందాన్ని తీసుకురాలేదు. అది అనుభూతుల్ని జ్ఞాపకం తెచ్చుకోగలదు. ఎందుకంటే ఆలోచన అనుభూతి కనుక. అది ఆనందాన్ని పెంచలేదు, సృష్టించలేదు, దాన్ని క్రమంగా చేరుకోలేదు. ఆలోచన దానికి తెలిసిన దానివైపుకే పోగలదు. కాని, ఆనందం

తెలిసినది కాదు. తెలిసినది అనుభూతి. ఏం చేసినా సరే, ఆలోచన ఆనందం కాలేదు. ఆనందాన్ని వెతికిపట్టుకోలేదు. ఆలోచనకి తన నిర్మాణం గురించీ, తన కదలిక గురించీ మాత్రమే తెలుసును. ఆలోచన తన్నుతాను అంతం చేసుకోవటానికి ప్రయత్నం చేసిందంతే, తాను మరింత విజయవంతం అవటానికీ, లక్ష్యాన్ని చేరుకోవటానికీ, మరింత సంతృప్తినిచ్చే గమ్యాన్ని చేరుకోవటానికీ మాత్రమే. ఇంకా ఎక్కువ అనేది జ్ఞానం, ఆనందంకాదు. ఆలోచన తన పద్ధతులన్నీ తెలుసుకోవాలి, దాని కపటవంచనలన్నిటినీ తెలుసుకోవాలి. తన్ను గురించి తాను ఏవిధమైన కోరికా - ఉండాలనిగాని, ఉండకూడదనిగాని లేకుండా తెలుసుకోవటంలో మనస్సు పని చెయ్యని స్థితికి వస్తుంది. పనిచెయ్యకుండా ఉండటం మరణం కాదు. ఆలోచన పూర్తిగా పనిచెయ్యకుండా ఉండటం మరణం కాదు. ఆలోచన పూర్తిగా పనిచెయ్యకుండా అనాసక్తంగా, అప్రమత్తతతో ఉండటం. అది ఉత్తమస్థితిలో ఉండే సున్నితత్వం. మనస్సు అన్నిస్థాయిల్లోనూ ఏమీ పనిచెయ్యకుండా ఉన్నప్పుడే ఏదైనా క్రియ జరుగుతుంది. మనస్సు యొక్క కార్యకలాపాలన్నీ అనుభూతులూ, ప్రేరేపణకీ, ప్రభావానికీ ప్రతిక్రియలూ మాత్రమే, అంచేత క్రియకానే కాదు. మనస్సు ఏవిధమైన కార్యకలాపం లేకుండా ఉన్నప్పుడే క్రియ జరుగుతుంది. ఈ క్రియకి కారణం ఉండదు. అప్పుడే ఆనందం ఉంటుంది.

## 86. అసత్యాన్ని అసత్యమని గ్రహించటం

ఆ సాయంకాలం రమణీయంగా ఉంది. వరిచేల వెనక జ్వాలారుణ ఆకాశం. పొడుగ్గా సన్నగా ఉన్న కొబ్బరి చెట్లు గాలికి ఊగుతున్నాయి. బస్సు నిండా జనంతో కొండ ఎక్కుతూ ఎంతో చప్పుడు చేస్తోంది. ఆ కొండ చుట్టూ ఉంది నది, సముద్రానికి చేరే దారిలో. పశువులు బలిసి ఉన్నాయి. మొక్కలు దట్టంగా ఉన్నాయి. పువ్వులు లెక్కలేనన్ని ఉన్నాయి. బొద్దుగా ఉన్న చిన్న కుర్రాళ్లు పొలంలో ఆడుకుంటున్నారు. చిన్నపిల్లలు ఆశ్చర్యపోతూ చూస్తున్నారు. దగ్గరలోనే ఒక చిన్నగుడి ఉంది. విగ్రహం ముందు ఎవరో దీపం వెలిగిస్తున్నారు. విడిగా ఉన్న ఒక ఇంట్లో సాయంకాలపు ప్రార్థనలు జరుగు

తున్నాయి. గదిలో దీపం వెలిగించి ఉంది కాని, అంత ప్రకాశవంతంగా లేదు. ఇంటిల్లిపాదీ అక్కడికి చేరారు. అందరూ తమ ప్రార్థనల్లో ఆనందంగా ఉన్నట్లున్నారు. రోడ్డు మధ్యగా ఒక కుక్క గాఢంగా నిద్రపోతోంది. సైకిలు మీద పోతున్న ఒకతను దాన్ని చుట్టివెళ్లాడు. ఇప్పుడు చీకటి పడుతోంది. నిశ్శబ్దంగా నడిచివెళ్లేవాళ్ల ముఖాలమీద మిణుగురు పురుగుల వెలుగుపడు తోంది. ఒకటి ఒకావిడ తల్లో చిక్కుకుని, ఆవిడ తల సన్నగా వెలుగుతోంది.

మనం సహజంగా ఎంత దయగా ఉంటాం, ముఖ్యంగా పట్టణాలకి దూరంగా పొలాల్లోనూ, చిన్న ఊళ్లలోనూ! తక్కువ చదువుకున్న వాళ్ల మధ్య జీవితం ఆత్మీయంగా ఉంటుంది. వృద్ధిలోకి రావాలనే 'వాంఛాజ్వరం' ఇంకా వ్యాపించలేదు. పిల్లవాడు మీకేసి చూసి చిరునవ్వు నవ్వుతాడు. ముసలావిడ తెల్లబోతుంది. మనిషి సందేహిస్తూ పక్కనుంచి వెడతాడు. గుంపుగా ఉన్నవాళ్లు గట్టిగా మాట్లాడుకోవటం ఆపేసి ఆశ్చర్యంతో కూడిన ఆసక్తితో చూడటానికిటు తిరుగుతారు. ఆడమనిషి మీరు దాటి వెళ్లేవరకూ ఆగుతుంది. మనలో ఒకరి గురించి ఒకరికి ఎంత స్వల్పంగా తెలిసి ఉంటుందో మనకి తెలుసు, కాని, మనం అర్థం చేసుకోము. మనకి తెలుసు, కాని ఇంకొకరితో సంపర్కం ఉండదు. మన గురించి మనకే తెలియదు. ఇంక ఇంకొకరు ఎలా తెలుస్తారు? ఇంకొకర్ని ఎన్నటికీ తెలుసుకోలేము. ఇంకొకరితో సంపర్కం మాత్రం పెట్టుకోగలం. చనిపోయిన వారిని గురించి తెలుసుకోగలం, కాని జీవించి ఉన్నవారి గురించి ఎన్నటికీ తెలుసుకోలేం. మనకి తెలిసినది మరణించిన గతం, జీవించి ఉన్నదికాదు. చనిపోయిన వాటిని మనలోనే పాతిపెట్టుకోవాలి. మనకి చెట్లపేర్లూ, పక్షులపేర్లూ, దుకాణాలపేర్లూ తెలుసును. కాని, మన గురించి మనకి ఏమీ తెలియదు - ఏవో కొన్ని మాటలూ, కోరికలూ మినహాయించి. మనదగ్గర వివరాలూ, నిర్ణయాలూ ఉంటాయి, ఎన్నిటి గురించో; కాని ఆనందం ఉండదు. నిర్జీవం కానట్టి శాంతి ఉండదు. మన జీవితాలు మందకొడిగా శూన్యంగా ఉంటాయి, లేదా, మనల్ని గుడ్డివాళ్లను చేసేటన్ని మాటలతో, కార్యకలాపాలతో నిండి ఉంటాయి. జ్ఞానం వివేకం కాదు. వివేకం లేనిదే శాంతి ఉండదు, ఆనందం ఉండదు.

ఆయన చిన్న వయస్సులోనే ఉన్నాడు. ఏదో ప్రొఫెసరు. అసంతృప్తిగా,

ఆందోళనపడుతూ, బాధ్యతల భారంతో ఉన్నాడు. తన సమస్యల గురించి మనషిని నిస్సత్తువగా చేసే వాటిని గురించి చెప్పటం మొదలుపెట్టాడు. బాగా చదువుకున్నవాడినేనన్నాడు - అంటే, చదవటం ఎలాగో తెలుసుకుని ఉండటం, పుస్తకాల్లోంచి వివరాలు సేకరించటం. ఎన్నో సంవత్సరాల నుంచీ పొగ తాగటం మానెయ్యటానికి ప్రయత్నిస్తున్నాడుట. కాని, ఎంతకీ పూర్తిగా మానెయ్యలేకపోయాడుట. చాలా ఖరీదు, పైగా తెలివితక్కువది, అందుకని మానెయ్యాలని కోరుతున్నాడుట. మానెయ్యటానికి చెయ్యగలిగిన ప్రతీదీ చేశాడుట, కాని మళ్లీ మొదలు పెట్టేవాడుట. ఇది ఆయనకున్న సమస్యల్లో ఒకటి. ఆయన తీవ్రంగా, అస్థిమితంగా, బక్కపలచగా ఉన్నాడు.

దేన్నైనా నిందిస్తే దాన్ని అర్థం చేసుకోగలమా? దాన్ని అవతలికి తోసెయ్యటం, దాన్ని అంగీకరించకపోవటం సులభమే. కాని ఆనందించటమైనా, అంగీకరించటమైనా సమస్యని తప్పించుకోవటమే అవుతుంది. పసిపాపని నిందించి అవతలికి తోసెయ్యటం మీకు ఇబ్బంది కలిగించకుండా ఉండటానికే. కాని పసిపాప అలాగే ఉంటుంది. నిందించటం అంటే లెక్క చెయ్యకపోవటం, శ్రద్ధ చూపించకపోవటం. నిందించటం వల్ల అవగాహన అవటం కుదరదు.

"పొగ తాగుతున్నందుకు నన్ను నేను ఎన్నోసార్లు నిందించుకున్నాను. నిందించకుండా ఉండటం కష్టం."

అవును. నిందించకుండా ఉండటం కష్టమే. మనల్ని ప్రభావితం చేసినది - కాదనటం, సమర్థించటం, పోల్చటం, వదులుకోవటం - వీటిమీద ఆధారపడింది. దీని ప్రభావంతోనే మనం ఏ సమస్యనైనా సమీపిస్తాం. ఈ ప్రభావమే సమస్యనీ, సంఘర్షణనీ పెంపొందిస్తుంది. పొగ తాగటం గురించి సహేతుకంగా ఒక నిర్ణయానికి రావటానికి ప్రయత్నించారు మీరు. దాన్ని తెలివితక్కువది అన్నప్పుడు, దాన్ని గురించి అంతా యోచించి, అది తెలివి తక్కువపని అనే నిర్ణయానికి వచ్చారు. కాని, ఆ సహేతుక నిర్ణయం మీరు మానేసేటట్లు చెయ్యలేదు. సమస్యకి కారణం తెలుసుకోగానే దాన్నుంచి విముక్తి పొందాలనుకుంటాం. కాని తెలుసుకోవటం వివరాలను మాత్రమే - మాటల్లోనే నిర్ణయానికి రావటం. ఈ జ్ఞానం సమస్య అవగాహన అవటానికి

ఆటంకం కలిగిస్తుంది నిశ్చయంగా. సమస్యకి కారణం తెలుసుకోవటం, సమస్యని అర్థం చేసుకోవటం - రెండూ పూర్తిగా వేరువేరు విషయాలు.

"ఎవరైనా సమస్యని ఏవిధంగా సమీపించగలరు?"

అదే మనం కనుక్కోబోతున్నాం. ఏది అసత్య మార్గమో కనుక్కున్నప్పుడు మనకి తెలిసేది ఒక్కటే అసలైన మార్గం. అసత్యాన్ని అర్థం చేసుకోవటమే సత్యాన్ని కనుగొనటం. అసత్యాన్ని అసత్యంగా గ్రహించటం కఠినం. అసత్యాన్ని పోల్చటం ద్వారా, ఆలోచన యొక్క కొలమానం ద్వారా చూస్తాం. అసత్యాన్ని అసత్యంగా ఆలోచనా ప్రక్రియ ద్వారా చూడటం సాధ్యమేనా? ఆలోచన కూడా ప్రభావితమైనదే కాబట్టి అది కూడా అసత్యమైనదే కాదా?

"ఆలోచన ద్వారా కాకుండా అసత్యం అసత్యమని ఎలా తెలుసుకోగలం?"

ఇదే మనకున్న చిక్కంతా, కాదా? సమస్యని పరిష్కరించటానికి ఆలోచనని ఉపయోగిస్తే, దానికి తగినసాధనాన్ని వినియోగించటం లేదు నిశ్చయంగా. ఆలోచన అనేదే గతం నుంచీ, అనుభవం నుంచీ తయారైనది. అనుభవం ఎప్పుడూ గతానికి చెందినదే. అసత్యాన్ని అసత్యంగా గ్రహించటానికి ఆలోచన ఒక గతించిన ప్రక్రియ అని తెలుసుకోవాలి. ఆలోచన ఎప్పుడూ స్వేచ్ఛగా ఉండదు. దేన్నైనా కనుక్కోవటానికి స్వేచ్ఛ ఉండాలి, ఆలోచన నుంచి విముక్తి కలగాలి.

"మీరనేది నాకు సరిగ్గా అర్థం కాలేదు."

మీ సమస్యల్లో ఒకటి పొగతాగటం. దాన్ని నిందిస్తూ దాన్ని గురించి సహేతుకంగా నిర్ణయానికొచ్చారు. ఈ పద్ధతి అసత్యమైనది. ఇది అసత్యమైనదని ఎలా కనుక్కుంటారు? నిజంగా ఆలోచన ద్వారా కాదు, ఆ సమస్యని మీరు ఎలా సమీపిస్తున్నారనే దాన్ని అనాసక్తంగా, జాగ్రత్తగా గమనించాలి. అనాసక్తంగా, జాగ్రత్తగా గమనించటానికి ఆలోచనతో అవసరం ఉండదు. అంతేకాక, ఆలోచన పనిచేస్తున్నట్లయితే, అనాసక్తత ఉండటమే కుదరదు. ఆలోచన పని చేసేది నిందించటానికి గాని, సమర్థించటానికి గాని పోల్చటానికి గాని, అంగీకరించటానికి గాని మాత్రమే. ఈ ప్రక్రియని అనాసక్తంగా,

జాగ్రత్తగా గమనిస్తున్నట్లయితే ఉన్నస్థితిని గ్రహించటం జరుగుతుంది.

"అవును, గ్రహించాను. కాని, ఇది పొగతాగటానికి ఎలా వర్తిస్తుంది?"

ఇద్దరం కలిసి ప్రయత్నిద్దాం కనుక్కోవటానికి - ఈ పొగ తాగటం అనే సమస్యని నిందించటం, పోల్చటం మొదలైనవి చెయ్యకుండా పరిశీలించ గలమేమో. సమస్యని మళ్లీ కొత్తగా పరిశీలించగలమా - గతం నీడ దానిపైన పడకుండా? ఏవిధమైన ప్రతిక్రియా లేకుండా చూడటం అత్యంత కష్టం, కాదా? దాన్ని అనాసక్తంగా తెలుసుకోలేకపోతున్నట్లుగా ఉంది, ఎప్పుడూ గతం నుంచి ఏదో ఒక ప్రతిక్రియ ఉంటోంది. సమస్య కొత్తదన్నట్లుగా గమనించటం మనకెంత అసాధ్యమో చూస్తే ఆసక్తికరంగా ఉంటుంది. మనతో బాటు మన గత ప్రయత్నాలనూ, నిర్ణయాలనూ, ఉద్దేశాలనూ మోసుకువెడతాం. ఈ తెరల్లోంచి తప్ప మనం సమస్యని చూడలేము.

ఏ సమస్య అయినా ఎప్పుడూ పాతది కాదు. కాని దాన్ని మనం పాత సూత్రాలతో సమీపిస్తాం. అదే సమస్య మనకి అవగాహన కాకుండా ప్రతిబంధక మవుతుంది. ఈ ప్రతిక్రియలను అనాసక్తంగా అవలోకించండి. ఊరికే అనాసక్తంగా వాటిని తెలుసుకుని ఉండండి. అవి సమస్యని పరిష్కరించ లేవని గ్రహించండి. సమస్య నిజమైనది. అది వాస్తవమైనది. కాని, దాన్ని సమీపించే పద్ధతి తగినట్లు ఉండదు. ఉన్నదానికి తగిన ప్రతిక్రియ లేకపోతే సంఘర్షణ బయలుదేరుతుంది. సంఘర్షణే సమస్య. ఈ మొత్తం ప్రక్రియ అవగాహన అయితే, మీ పొగ తాగటం గురించి మీరు తగిన చర్య తీసుకుంటారని మీరే తెలుసుకుంటారు.

## 87. భద్రత

చిన్న కాలవ మెల్లిగా ప్రవహిస్తోంది వరిచేల చుట్టూ ఉన్న దారిపక్క నుంచి. కలువపువ్వులు దాన్నిండా ఉన్నాయి. అవి ముదురు ఊదారంగులో, మధ్యన బంగారపు రంగుతో ఉన్నాయి. నీటికిపైన స్పష్టంగా ఉన్నాయి. వాటి సువాసన వాటి దగ్గర వరకే ఉంది. అవి ఎంతో అందంగా ఉన్నాయి. ఆకాశం

మబ్బు కమ్మి ఉంది. జల్లుపడటం మొదలుపెట్టింది. మబ్బుల్లోంచి ఉరుము లొస్తున్నాయి. మెరుపు ఇంకా దూరంలో ఉంది. కాని మేము తలదాచుకున్న చెట్టు దగ్గరికి సమీపిస్తోంది. దట్టంగా వాన కురవటం మొదలు పెట్టింది. కలువ ఆకులమీద నీటి చుక్కలు పోగవుతున్నాయి. నీటిచుక్కలు మరీ పెద్దవైనప్పుడు ఆకుల మీంచి క్రిందికి జారి పోతున్నాయి, కాని అంతలోనే మళ్లీ నీటి చుక్కలు పోగవుతున్నాయి. మెరుపు ఇప్పుడు చెట్టుమీదకి వచ్చింది. పశువులు భయపడి తాళ్లు వదిలించుకోవటానికి గింజుకుంటున్నాయి. నల్లని దూడ ఒకటి తడిసిపోయి ఒణుకుతూ హృదయ విదారకంగా అరుస్తోంది. దాని తాడు తెంపేసుకుని దగ్గరలో ఉన్న ఒక గుడిసె వైపుకి పరుగెత్తింది. కలువ పువ్వులు గట్టిగా ముడుచుకుంటున్నాయి ముంచుకొస్తున్న చీకట్లు తమ హృదయాల్లోకి చొరబడకుండా. వాటి బంగారు హృదయాలు కనిపించాలంటే కలువరేకుల్ని చింపాల్సి ఉంటుంది. మళ్లీ సూర్యుడు వచ్చేవరకూ అలాగే గట్టిగా ముడుచుకుని ఉంటాయి. వాటి నిద్రలో కూడా అవి అందంగా ఉన్నాయి. మెరుపు ఊరువైపుకి సాగుతోంది. ఇప్పుడు బాగా చీకటి పడింది. కాలవ గొణుగుడు మాత్రమే వినిపిస్తోంది.

ఆ దారి గుండా ఊరుదాటితే రోడ్డు వస్తుంది. అక్కణ్ణించి మళ్లీ మేము చప్పుళ్లతో నిండిన పట్నానికి తిరిగి వెళ్లాం.

అతడు యువకుడు. ఇరవై ఏళ్లప్రాంతంలో ఉన్నాడు. బాగా పుష్టిగా ఉన్నాడు. కొంత ప్రయాణాలవీ చేసినవాడు. కాలేజీలో చదువుకున్నాడు. మనస్తిమితం లేకుండా ఉన్నాడు. అతని కన్నుల్లో ఆదుర్దా కనబడుతోంది. అప్పటికే ఆలస్యం అయింది. అయినా మాట్లాడాలనుకుంటున్నాడు. ఎవరైనా అతని మనస్సుని పరిశోధించాలని కోరుతున్నాడు. తన గురించి తాను ఎంతో మామూలుగా ఏవిధమైన సంకోచం, నటనా లేకుండా బయట పెట్టుకున్నాడు. అతని సమస్య స్పష్టమైంది, కాని అతనికి కాదు. అతనింకా తడుముకుంటూ వెతుకుతూనే ఉన్నాడు.

ఉన్నదాన్ని మనం వినం, కనుక్కోం. మన ఊహల్నీ ఉద్దేశాల్నీ ఇంకో దానిమీద రుద్దుతాం. ఇంకోదాన్ని మన ఆలోచనా విధానంలోకి ఇరికించ టానికి ప్రయత్నిస్తాం. ఉన్నస్థితికంటె మన ఆలోచనలూ, నిర్ణయాలూ మనకి

అంత ముఖ్యం. ఉన్నస్థితి ఎప్పుడూ ఎంతో మామూలుగా ఉంటుంది. కాని, మనమే గందరగోళంగా ఉంటాం. మామూలుగా ఉన్నదాన్ని గందరగోళం చేసి అందులోపడి దారి తప్పుతాం. ఎక్కువవుతున్న మన గందరగోళం ధ్వనినే మనం వింటాం. వినటానికి మనం స్వేచ్ఛగా ఉండాలి. ఏవిధమైన పరధ్యానం ఉండకూడదని కాదు. ఆలోచించటమే ఒక విధమైన పరధ్యానం. నిశ్శబ్దంగా ఉండేలా స్వేచ్ఛగా ఉండాలి మనం. అప్పుడే స్వేచ్ఛగా వినటానికి సాధ్యం.

అతనింకా చెబుతున్నాడు - నిద్రపడుతూ ఉండగా ఉలిక్కిపడి లేచి కూర్చుంటాడట వెర్రిభయంతో. అప్పుడు గది రూపురేఖలు మారిపోతాయిట. గోడలు క్రింద పడి ఉంటాయట. పైన ఇంటికప్పు ఉండదుట. నేల మాయమై పోతుందిట. భయపడిపోతూ చెమటలు కక్కుకుంటాడుట. ఇలా ఎన్నో సంవత్సరాల నుంచీ జరుగుతోందిట.

దేనికి భయపడుతున్నారు?

"నాకు తెలియదు. కాని భయంతో మెలుకువొచ్చినప్పుడు మా అక్క దగ్గరికో, మానాన్నగారి దగ్గరికో, మా అమ్మదగ్గరికో వెళ్లేవాడిని. వాళ్లతో కాసేపు మాట్లాడేవాడిని స్తిమితపడటానికి. ఆ తరవాత నిద్రపోయేవాడిని. వాళ్లు అర్థం చేసుకుంటారు. కాని నాకు ఇరవై ఏళ్లుదాటాయి. సిగ్గుగా ఉంటోంది."

భవిష్యత్తు గురించి ఆదుర్దాపడుతున్నారా?

"అవును, ఒక విధంగా. మాకు డబ్బున్నప్పటికీ, భవిష్యత్తు గురించి ఆదుర్దాగానే ఉంది."

ఎందుచేత?

"నాకు వివాహం చేసుకుని నాకాబోయే భార్యని సుఖపెట్టాలని ఉంది."

భవిష్యత్తు గురించి ఆదుర్దాపడటం ఎందుకు? మీరు ఇంకా చిన్నవారు. మీరు పనిచేసి ఆమెకి కావలసినవన్నీ సమకూర్చవచ్చు. అదే వ్యాపకం పెట్టుకోవటం దేనికి? సంఘంలో మీ పరపతి పోతుందని భయపడుతున్నారా?

"కొంతవరకు. మాకు కారుంది. కొంత ఆస్తీ, పరపతీ ఉన్నాయి.

సహజంగా ఇవన్నీ పోగొట్టుకోవాలని లేదు నాకు. అదే నా భయానికి కారణం కావచ్చు. కాని ఇంతే కాదు. అసలు ఉండనేమోనన్న భయం. భయంతో మెలుకువొచ్చినప్పుడు నేను దిక్కు తెలియనట్లూ, నేనేమీ కానట్లూ, ముక్కలై పోతున్నట్లూ ఉంటుంది."

అయినా, కొత్త ప్రభుత్వం రావచ్చు. మీ ఆస్తి పోగొట్టుకోవచ్చు, మీ కున్న వన్నీ పోగొట్టుకోవచ్చు. మీరింకా బాగా చిన్నవారు. మీరు ఎప్పుడైనా పనిచేసు కోవచ్చు. కోట్లమంది తమకున్న ప్రాపంచిక వస్తువుల్ని పోగొట్టుకుంటున్నారు. మీరు కూడా దాన్ని ఎదుర్కోవలసి రావచ్చు. ప్రపంచంలో ఉన్నవాటిని పంచు కోవాలిగాని ప్రత్యేకంగా సొంతం చేసుకోకూడదు. మీ వయస్సులోనే అంత దాచుకునేలా ఉండటం దేనికి? పోతుందని ఎందుకంత భయం?

"చూడండి, నేను ఒకానొక అమ్మాయిని పెళ్లి చేసుకోవాలను కుంటున్నాను. దానికేమీ అడ్డురాకూడదని నా ఆందోళన. ఏదీ అడ్డురాక పోవచ్చు. కాని మేమిద్దరం ఒకర్ని విడిచి ఒకరు ఉండలేం. ఇది కూడా నా భయానికి కారణమై ఉండొచ్చు."

అదే మీ భయానికి కారణమా? మీరు ఆమెని వివాహం చేసుకోవ టానికి ఏవిధమైన ఆటంకం కలగకపోవచ్చు నంటున్నారు. మరి భయం దేనికి?

"నిజమే, మేము ఎప్పుడనుకుంటే అప్పుడు వివాహం చేసుకోవచ్చు. నా భయానికి అది కారణం అవటానికి వీల్లేదు, అధమం ఇప్పట్లో. నా భయమంతా నేను ఇలా ఉండనేమోననీ, నా వ్యక్తిత్వాన్నీ, నాపేరునీ పోగొట్టు కుంటానేమోననీ నిజంగా భయపడుతున్నానేమో."

మీపేరు గురించీ, ఆస్తీ మొదలైన వాటి గురించీ లెక్కచెయ్యక పోయినా, అప్పటికీ భయపడతారా? వ్యక్తిత్వానికి అర్థం ఏమిటి? పేరుతోనూ, ఆస్తితోనూ, ఒక వ్యక్తితోనూ, అభిప్రాయాలతోనూ మమేకమై ఉండటమే. ఏదో ఒక దానితో సంబంధం ఉండి ఉండటం, ఇదనీ, అదనీ గుర్తుపట్టేటట్లుగ ఉండటం, ఒక సంఘం, ఒక దేశం, అలాంటిదేదో ముద్రవేసి ఉండటం. ఆ ముద్ర పోతుందని భయపడుతున్నారు, అంతేనా?

"అవును. లేకపోతే నేనేమిటింక? అవును, అదే."

అందుచేత మీకున్న ఆస్తిపాస్తులే మీరు. మీపేరు, పరపతి, మీ కారు, ఇతర ఆస్తి, మీరు పెళ్లిచేసుకోబోయే అమ్మాయి, మీరు పైకి రావాలని ఉన్న ఆకాంక్షలు - ఇవే మీరు. ఇవీ, ఇంకా కొన్ని లక్షణాలూ, విలువలూ కలిస్తే "నేను" అని మీరు చెప్పుకునేదవుతుంది. అది పోతుందని భయం మీకు. అన్నిటితో బాటూ అవీ పోయే అవకాశం ఎప్పుడూ ఉంటుంది. యుద్ధం రావచ్చు. విప్లవంగాని, ప్రభుత్వంలో వామపక్షం వైపుకి మార్పుగాని రావచ్చు. ఇవన్నీ మీకులేకుండా పోయేట్లు ఏదైనా జరగవచ్చు. ఇప్పుడు కాకపోతే రేపు. కాని, భద్రత లేదని భయపడటం దేనికి? భద్రత లేకపోవటమనేది ప్రకృతి సిద్ధం కాదా? రక్షణ లేకుండా ఉండకుండా మీరు గోడల్ని కట్టుకున్నారు మిమ్మల్ని రక్షించుకునేలా. ఈ గోడల్ని పడగొట్టనూ వచ్చు, పడిపోతాయి కూడా. కొంత కాలం వరకూ దాన్ని తప్పించుకోవచ్చు. కాని భద్రత లేకుండా పోయే ప్రమాదం ఎప్పుడూ ఉంటుంది. ఉన్నస్థితిని తప్పించుకోలేరు. భద్రత లేకపోవట మనేది ఉంది - మీకిష్టం ఉన్నా లేకపోయినా. దాని అర్థం - అందు కోసం అన్నీ వదులుకోవాలని కాదు. దాన్ని అంగీకరించటమో, కాదనటమో కాదు. అయినా మీరు చిన్నవారు. భద్రత లేకపోవటం గురించి భయపడటం ఎందుకు?

"ఇప్పుడు మీరీవిధంగా చెబుతూంటే, భద్రత లేకపోవటం గురించి నాకు భయమనిపించటంలేదు. నిజానికి, పనిచెయ్యటానికి నాకభ్యంతరం లేదు. నా ఉద్యోగంలో నేను రోజుకి ఎనిమిది గంటలు పనిచేస్తాను. అది నాకు ప్రత్యేకం ఇష్టం లేకపోయినా, ఎలాగో గడుపుకోగలను. ఆస్తీ, కారూ మొదలైనవి పోతాయనే భయం లేదు నాకు. ఎప్పుడు కావాలనుకుంటే నేనూ నా స్నేహితురాలూ పెళ్లి చేసుకోగలం. నాకు భయంకలిగించేది ఏదీ కాదని గ్రహించానిప్పుడు. అయితే మరింకేమిటి?"

కనుక్కుందాం. నేను చెప్పగలనేమో. కాని అది మీరు కనుక్కున్నట్లే వదు. అది కేవలం మాటలస్థాయిలోనే ఉంటుంది. అది ఉత్తి నిరుపయోగం. మీరు కనుక్కుంటే అది మీరు అనుభవం పొందినట్లవుతుంది. అదే ముఖ్యం. ఇద్దరం కలిసి కనుక్కుందాం.

మీరు పోగొట్టుకుంటారని భయపడేవి ఇవేమీ కానట్లయితేనూ, బాహ్యంగా భద్రత లేకపోవటం గురించి మీరు భయపడటం లేదన్నట్లయితేనూ, మరి దేన్ని గురించి ఆదుర్దాపడుతున్నారు? వెంటనే సమాధానం చెప్పెయ్యకండి. ఊరికే వినండి. కనుక్కోవటానికి జాగ్రత్తగా గమనించండి. భౌతిక భద్రత లేకపోవటం వల్ల భయపడటం లేదని మీకు నిశ్చయంగా తెలుసునా? అలాంటి విషయమై నిశ్చయంగా తెలుసుకోగలిగినంతవరకూ మీరు భయపడటం లేదని చెబుతున్నారు. ఇది మాటల్లో నొక్కి చెప్పటమే కానట్లయితే, మరి దేన్ని గురించి భయపడుతున్నారు?

"భౌతికంగా భద్రత ఉండదని నేను భయపడటం లేదని నిశ్చయంగా తెలుసును నాకు. మేము వివాహం చేసుకుని ఏది కావాలంటే అది పొందగలం. కేవలం వస్తువులు పోవటం గురించే కాక వేరే దేన్ని గురించో భయపడుతున్నాను. అదేమిటి?"

"తెలుసుకుందాం. కాని మెల్లిగా విచారిద్దాం. మీరు నిజంగా తెలుసుకోవాలనుకుంటున్నారా, లేదా?"

"నిజంగానే అనుకుంటున్నాను, ముఖ్యంగా ఇంతవరకూ మనం వచ్చినమీదట. నేను భయపడుతున్నది దేని గురించి?

దాన్ని కనుక్కోవాలంటే మనం నిశ్శబ్దంగా జాగ్రత్తగా గమనించాలి తొందర పడకుండా. భౌతికంగా భద్రత లేకపోవటం గురించి మీరు భయపడటం లేదన్నట్లయితే, ఆంతరంగిక భద్రత ఉండదని భయపడుతున్నారా? మీరు పెట్టుకున్న లక్ష్యాన్ని సాధించలేమోనని భయపడుతున్నారా? జవాబు చెప్పొద్దు, ఊరికే వినండి. గొప్పవాడిగా అవలేకపోతానేమోనని భయపడుతున్నారా? మీకేదైనా మత సంబంధమైన ఆదర్శం ఉండి ఉండొచ్చు. దాని ప్రకారం జీవించలేకపోతారేమోననీ, దాన్ని సాధించలేకపోతారేమోననీ అనిపిస్తోందా? ఆ విషయంలో ఒక విధమైన నిరాశ, తప్పుచేస్తున్నాననే భావం, నిస్పృహా కలుగుతున్నాయా?

"మీరు సరిగ్గా చెప్పారు. కొన్ని సంవత్సరాల క్రిందట, నేను కుర్రవాడిగా ఉన్నప్పుడు మీ ప్రసంగం విన్నప్పటినుంచీ, నిజం చెప్పాలంటే, మీలా

ఉండాలనే నా ఆదర్శం. ధార్మికంగా ఉండటం మా రక్తంలో ఉంది. నేను కూడా అలా ఉండగలననుకున్నాను. కాని దాని దరిదాపులకి కూడా చేరలేమోనని లోలోపల ఎప్పుడూ భయం ఉండేది."

మెల్లిగా పరిశీలిద్దాం. బాహ్యంగా భద్రత ఉండదని మీరు భయపడక పోతున్నప్పటికీ, ఆంతరంగికంగా భద్రత ఉండదేమోనని మీ భయం. ఇంకో మనిషి బాహ్యంగా పేరు ప్రఖ్యాతులతో, డబ్బూ మొదలైన వాటితో సురక్షితంగా ఉండేటట్లు చేసుకుంటాడు. మీరు ఒక ఆదర్శం ద్వారా అంతర్గతంగా భద్రత కోరుతున్నారు. ఆ ఆదర్శం ప్రకారం మీరు అవలేనేమో ననుకుంటున్నారు. ఒక ఆదర్శం ప్రకారం అవాలనిగాని, ఆదర్శాన్ని సాధించాలనిగాని ఎందుకు కోరుకుంటున్నారు? సురక్షితంగా ఉండటానికీ, క్షేమంగా ఉన్నట్లు అనుకోవటానికీ మాత్రమేనా? ఈ ఆశయాన్ని మీరు ఆదర్శం అంటున్నారు. మీరు క్షేమంగా ఉండాలనుకుంటున్నారు. మీకు భద్రత కావాలి, అంతేనా?

"మీరిప్పుడు సూచించినట్లు, సరిగ్గా అదే."

దీన్ని మీరిప్పుడు కనుక్కున్నారు. కనుక్కోలేదూ? అయితే, ఇంకా ముందుకి సాగుదాం. బాహ్యరక్షణలోని వెలితిని స్పష్టంగా గ్రహించారు మీరు, కాని ఒక ఆదర్శం ద్వారా అంతర్గత రక్షణకోసం అన్వేషించటంలోని అసత్యాన్ని కూడా గ్రహిస్తున్నారా? ఆదర్శమే ఆశ్రయం - డబ్బుకి బదులుగా. దీన్ని నిజంగా గ్రహిస్తున్నారా?

"అవును, నిజంగానే గ్రహించాను."

అయితే మీరు ఉన్నట్లుగానే ఉండండి. ఆదర్శం యొక్క అసత్యాన్ని గ్రహించినప్పుడు దానంతటదే పడిపోతుంది. ఉన్నది ఉన్నట్లుగానే ఉంటారు మీరు. అక్కణ్ణించి ఉన్న స్థితిని అర్థం చేసుకోవటం మొదలుపెట్టండి - కాని ఒక ప్రత్యేక లక్ష్యం వైపుకి కాదు, ఎందుకంటే, లక్ష్యం ఎప్పుడూ ఉన్నస్థితి నుంచి దూరంగానే ఉంటుంది. ఉన్నస్థితి మీరే, ఒక ప్రత్యేక సమయంలో గాని, ఒక మానసిక స్థితిలో గాని కాదు. మీరు క్షణక్షణానికీ ఉన్నట్లుగానే. మిమ్మల్ని మీరు నిందించుకోకండి, మీరు చూసిన దానితో ఆశ వదులుకునేట్లుగా అవకండి. ఉన్నదాని గతిని వ్యాఖ్యానించకుండా జాగ్రత్తగా గమనించండి.

ఇది శ్రమదాయకమైనది. కాని అందులో ఆనందం ఉంటుంది. స్వేచ్ఛగా ఉన్న వారికే ఆనందం ఉంటుంది. ఉన్నస్థితి అనే సత్యంతోబాటే స్వేచ్ఛ ఉంటుంది.

## 88. పని

ఎవ్వరితోనూ కలవకుండా, దేనిలోనూ విశ్వాసం లేనట్లుగా ఉన్న ఆయన ప్రభుత్వ యంత్రాంగంలో ఏదో మంత్రి. ఎవరో తీసుకొస్తే వచ్చాడు. బహుశా స్నేహితుడు ఈడ్చుకొచ్చి ఉంటాడు. తను అక్కడ ఉన్నందుకు తనే ఆశ్చర్యబోతున్నట్లున్నాడు. ఆ స్నేహితుడు ఏదో మాట్లాడటానికి వస్తూ ఆయన్ని తన కూడా తీసుకువచ్చి ఉంటాడని తెలుస్తూనే ఉంది. తన సమస్య గురించి ఆయన కూడా వినాలని తీసుకొచ్చి ఉంటాడు. మంత్రి కుతూహలంగా, ఉన్నతస్థాయిలో ఉన్నట్లుగా ఉన్నాడు. ఆజానుబాహుడు, చురుకుగా గమనిస్తాడు. ధారాళంగా మాట్లాడగలడు. జీవితంలో సాధించవలసింది సాధించాడు. ఇప్పుడు స్తిమితపడుతున్నాడు. ప్రయాణం చెయ్యటం ఒకటి, చేరటం మరొకటి. ప్రయాణం చెయ్యటమంటే నిత్యం చేరుతూ ఉండటం. మళ్లీ ప్రయాణం లేకుండా చేసుకోవటమంటే మరణమే. మనం ఎంత సులభంగా తృప్తిపడిపోతాం, ఎంత త్వరగా అసంతృప్తి తృప్తి పొందుతుంది! మనందరికీ ఏదో విధమైన ఆశ్రయం కావాలి, అన్ని రకాల సంఘర్షణ నుంచీ తప్పించుకునే ఆశ్రయం కావాలి. సాధారణంగా మనకి దొరుకుతుంది. గడుసువాళ్లు కూడా తెలివి తక్కువ వాళ్లలాగే తమ ఆశ్రయాన్ని తాము కనుక్కుని, దాంట్లో జాగ్రత్తగా కనిపెట్టిచూస్తూ ఉంటారు.

“ఎన్నో సంవత్సరాల నుంచీ నా సమస్యని అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తూనే ఉన్నాను. కాని ఇంతవరకు దాన్ని ఆమూలంగా తెలుసుకోలేక పోయాను. నేను చేసే పనిలో ఎప్పుడూ వైరుధ్యాన్ని తెచ్చుకున్నాను. నేను సహాయపడటానికి ప్రయత్నించిన వాళ్లలోనే శత్రుత్వం ఎలాగో తలదూర్చేది. కొందరికి సహాయం చెయ్యటంతోనే మరికొందరి వ్యతిరేకతకి బీజం వేసేవాడిని. ఒక చేత్తో ఇచ్చి మరో దాంతో గాయపరిచినట్లుండేది. ఇలా ఎన్ని సంవత్స రాలుగా జరుగుతోందో నాకు గుర్తు కూడా లేదు. ఇప్పుడు నేను ఏదో ఒక

నిర్ణయం తీసుకుని వ్యవహరించవలసిన పరిస్థితి ఏర్పడింది. నాకు ఎవ్వరికీ హాని కలుగజెయ్యాలని లేదు. నాకేం చెయ్యాలో తోచటం లేదు."

ఏది ఎక్కువ ముఖ్యం? హాని కలిగించకుండా ఉండటమా, శత్రుత్వం ఏర్పడకుండా చేయటమా, లేక ఏదో ఒకపని చెయ్యటమా?

"నేను పనిచేసేటప్పుడు కొందరికి హాని కలిగిస్తాను. పనిలో మునిగి పోయేటటువంటి వాళ్లలో నేను ఒకణ్ణి. నేను ఏదైనా చేపడితే అది ముగించి తీరాలనుకుంటాను. నేనెప్పుడూ అంతే. నేను సమర్థుణ్ణేననుకుంటాను. అసమర్థత చూస్తే నాకసహ్యం. ఎంతైనా, ఏదో ఒకరకమైన సంఘసేవ చెయ్యటానికి పూనుకున్నప్పుడు దాన్ని పూర్తిగా నెరవేర్చాలి కదా. సమర్థతలేని వాళ్లకీ, బద్ధకస్తులకీ సహజంగా హాని కలిగి, వాళ్లు విరోధులవుతారు. ఇతరులకు సహాయం చేసే పని ముఖ్యం. అవసరమైన వాళ్లకు సహాయ పడటంలో దానికడ్డం వచ్చేవాళ్లని గాయపరుస్తాను. కాని ఎవరికీ హాని కలిగించటం నాకిష్టంలేదు. ఈ విషయమై ఏదో చేసితీరాలని గ్రహించాను."

మీకు ఏది ముఖ్యం : పనిచెయ్యటమా, లేక ఇతరులకు హాని కలిగించటమా?

"అంత బాధని చూసినప్పుడు పరివర్తన తీసుకురావటానికి ఉద్యమిస్తాం. ఆ పనిచేసేటప్పుడు కొందరికి హాని చెయ్యటం జరుగుతుంది - ఎంతో అయిష్టంగానే అయినా."

కొంతమందిని రక్షించటంలో, మరి కొంతమంది నాశనమవుతారు. ఒకదేశం మరోదేశాన్ని నష్టపరిచి తాను నిలబడుతుంది. ఆధ్యాత్మికులమని చెప్పుకునే వారు పరివర్తన తీసుకురావాలనే ఆత్రుతతో కొందర్ని రక్షించి మరికొందర్ని నాశనం చేస్తారు. వారు ఆశీర్వచనాలూ ఇస్తారు, శాపాలూ ఇస్తారు. మనం ఎప్పుడూ కొందరి మీద దయ చూపించి మరి కొందరితో నిర్దయగా ఉంటాం. ఎందువల్ల?

మీకు ఏది ముఖ్యం : పనిచెయ్యటమా, ఇతరులకు హాని కలిగించకుండా ఉండటమా?

"ఎంతైనా, కొంతమందికి హాని కలిగించాలి - బద్ధకస్తులకీ,

అసమర్థులకీ, స్వార్థపరులకీ. ఇది తప్పనిసరి అనిపిస్తుంది. మీ ప్రసంగాలతో మీరు గాయపరచారా? ఒక ధనవంతుణ్ణి నేనెరుగుదును. మీరు ధనవంతుల గురించి అన్నదానికి ఆయన చాలా బాధపడ్డాడు."

నేను ఎవరినీ గాయపరచాలని అనుకోను. ఒక పనిచేస్తున్నప్పుడు ఎవరైనా గాయపడితే, నా ప్రకారం ఆ పని మానెయ్యాలి. నాకే పనీ లేదు. పరివర్తన తీసుకొచ్చేందుకుగాని, విప్లవం తీసుకొచ్చేందుకుగాని ఏవిధమైన పథకాలూ లేవు. నాకు పని కాదు మొదట, ఇతరులకు హాని కలిగించ కూడదన్నదే. అన్నదానివల్ల ఆ ధనవంతుడు గాయపడి ఉంటే, ఆయన నా వల్ల గాయపడలేదు. ఉన్నస్థితిలోని సత్యం మూలాన్ని. అది ఆయనకు నచ్చదు. ఆయన బయట పడిపోవటం ఆయన కిష్టంలేదు. ఒకరిని బయట పెట్టటం నా ఉద్దేశం కాదు. ఉన్నదానిలోని సత్యం మూలాన్ని ఎవరైనా తాత్కాలికంగా బయటపడిపోయి, తాను చూచిన దానికి కోపం తెచ్చుకుని, దానికి ఇతరులను నిందిస్తారు. కాని అది యథార్థం నుంచి పారిపోవటం మాత్రమే. యథార్థం చూసి కోపగించుకోవటం తెలివితక్కువతనం. కోపంతో యథార్థాన్ని తప్పించుకోవటం సాధారణంగా ఆలోచించకుండా చూపే ప్రతిక్రియ.

కాని, మీరు నా ప్రశ్నకి సమాధానం చెప్పలేదు. ఏది ముఖ్యం - పని చెయ్యటమా, ఇతరులకు హాని కలిగించకుండా ఉండటమా?

"పని జరిగి తీరాలి. మీరలా అనుకోరా?" అని మంత్రిగారు మధ్యలో అన్నారు.

ఎందుకు జరిగితీరాలి? కొంతమందికి లాభం కలిగించటంలో మరికొందరిని నాశనం చేస్తే దానికి విలువ ఏముంది? మీ దేశాన్ని మీరు రక్షించుకోవచ్చు, కాని ఇంకొకదాన్ని మీస్వలాభానికి ఉపయోగించుకోవచ్చు. మీ దేశం గురించీ, మీపార్టీ గురించీ, మీ సిద్ధాంతం గురించీ మీకెందుకంత విచారం? మీ పనితో మీరు ఎందుకు ఐక్యం అవుతారు? పనికి ఎందుకంత ప్రాముఖ్యం?

"మనం పని చెయ్యాలి, ఏదో ఒకటి చేస్తూ ఉండాలి. లేదా, చనిపోవటమే నయం. ఇల్లు కాలిపోతుంటే మౌలిక విషయాల గురించి

ఆలోచిస్తూ ఉండలేం.''

కేవలం ఏదో ఒక పని చేస్తూ ఉండటానికి మౌలిక విషయాలు సమస్య కావు. వారికి కావలసినదల్లా పైపైకి లాభదాయకంగా ఉండి, తీవ్రమైన హాని కలిగించే కార్యకలాపం మాత్రమే. కాని మీ స్నేహితుణ్ణి ఒకటి అడగనిస్తారా? ఒక రకమైన పని మీకెందుకంత ముఖ్యం? దానిమీద అంత మమకారం దేనికి?

''ఓ, నాకే తెలియదు. కాని దానివల్ల నాకు ఎంతో ఆనందం కలుగుతుంది.''

అందుచేత మీరు నిజంగా ఆసక్తి చూపిస్తున్నది ఆ పనిలో కాదు, దానివల్ల మీకు లాభించేదానిలోనే. దాని వల్ల మీరు డబ్బు చేసుకోలేక పోవచ్చు. కాని దానివల్ల ఆనందం పొందుతారు. తన పార్టీని గాని దేశాన్నిగాని రక్షించటంలో మరొకరు అధికారాన్నీ, పదవినీ, పరపతినీ పొందినట్లే మీ పనిలో మీరు సంతోషాన్ని పొందుతారు. మరొకరు తన రక్షకుడికీ, గురువుకీ తన ప్రభువుకీ సేవచేసి ఎంతో తృప్తిని పొంది దాన్ని వరం అన్నట్లు గానే మీరు చేసే సేవ అనే దాంట్లో తృప్తిని పొందుతున్నారు. మీ సొంత ఆనందమే అన్నిటికన్నా ముఖ్యం. మీరుచేసే ఆ పనివల్ల మీరు కోరిన దాన్ని పొందుతున్నారు. మీకు నిజంగా మీరు సహాయపడే మనుషులమీద ఆసక్తి లేదు. వాళ్లు మీ ఆనందాని కొక సాధనం మాత్రమే. సహజంగా అసమర్థులైన వాళ్లూ, మీ దారికి అడ్డు నిలిచిన వాళ్లూ గాయపడతారు. ఎందువల్లనంటే, పని ముఖ్యం. ఆ పనిలోనే మీ ఆనందం ఉంది. ఇది నిర్దాక్షిణ్యమైన యథార్థం. కాని, దాన్ని మనం గడుసుగా సేవ, దేశం, శాంతి, దైవం, అలాంటి ఉన్నత పదాలతో కప్పి పుచ్చుతాం.

అందుచేత, చెప్పాలంటే, మీకు నిజంగా అభ్యంతరం లేదు వాళ్లకి హాని కలిగించటం - మీకు ఆనందాన్నిచ్చే పని సమర్థవంతంగా జరగకుండా అడ్డుపడే వారికి. ఒక పనిలో మీకు ఆనందం దొరుకుతుంది. ఆ పని ఏదైనా, మీరే అది. ఆనందం పొందటంలోనే మీకు ఆసక్తి, ఆపని మీకు సాధనంగా అవుతుంది. అందువల్ల ఆ పని చాలా ముఖ్యమవుతుంది. అదికాక, మీరు

ఎంతో సమర్థులు, దయాదాక్షిణ్యాలు లేనివారు, మీకు ఆనందాన్నిచ్చే దానికోసం అధికారం చెలాయిస్తారు. అందువల్ల హాని కలిగించటానికీ, శత్రుత్వం పెంపొందించుకోవటానికీ, మీకభ్యంతరం లేదు.

"నేను అవిధంగా ఇంతకు ముందెప్పుడూ చూడలేదు. కాని, అది పరిపూర్ణ సత్యం. కాని దాని గురించి నేనేం చెయ్యాలి?"

ఇంత సాధారణమైన సత్యాన్ని గ్రహించటానికి మీకు ఇన్ని సంవత్సరాలు ఎందుకు పట్టిందో చూడటం కూడా ముఖ్యం కాదా?

"మీరన్నట్లు, నా పని అయే దాకా నేను ఎవరికి హాని కలిగించినా లెక్క చెయ్యలేదు. నిజంగా, సాధారణంగా నేను అనుకున్న ప్రకారం సాధిస్తాను, నేను ఎప్పుడూ సమర్థవంతంగా, సూటిగా ఉంటాను కాబట్టి - దాన్నే మీరు దయాదాక్షిణ్యాలు లేకపోవటం అంటున్నారు. మీరన్నది పూర్తిగా నిజం. కాని ఇప్పుడు నేనేం చెయ్యాలి?"

ఇంత మామూలు సత్యాన్ని గ్రహించటానికి అన్ని సంవత్సరాలు తీసుకున్నారు - మీరింతవరకూ దాన్ని గ్రహించటానికి ఇష్టపడలేదు కనుక. దాన్ని గ్రహించటంలో మీరు ఉన్న పునాదినే ఎదుర్కొంటున్నారు. మీరు ఆనందం కోసం ప్రయత్నించి, పొందారు. కాని దానివల్ల ఎప్పుడూ సంఘర్షణా, వైరుధ్యం కలిగాయి. ఇప్పుడు బహుశా మొదటిసారి మీ గురించిన యథార్థాలను మీ ఎదురుగా చూస్తున్నారు. మీరేం చెయ్యాలి? పనిచెయ్యటానికి మరో విధానం లేదా? ఆనందంగా ఉండి పనిచెయ్యటానికి వీల్లేదా - పనిలో ఆనందాన్ని వెతుక్కునే బదులు? పనిని గాని, ప్రజల్ని గాని ఒక లక్ష్యానికి సాధనంగా ఉపయోగించుకుంటున్నప్పుడు, నిజానికి మనకి అనుబంధం ఏర్పడదు - పనితో గాని, ప్రజలతో గాని సంపర్కం ఉండదు. అప్పుడు మనకి ప్రేమించటం చేతకాదు. ప్రేమ ఒక లక్ష్యానికి సాధనం కాదు. అదే అనంతమైనది. నేను మిమ్మల్ని ఉపయోగించుకుని, మీరు నన్ను ఉపయోగించుకుని, దాన్ని సంబంధం అంటాం సాధారణంగా. మనం ఒకరికొకరం మరో దానికి సాధనంగా మాత్రమే ముఖ్యమవుతాం. అందుచేత మనం ఒకరికొకరం ముఖ్యం కానేకాదు. ఈ పరస్పరం వినియోగించుకోవటం నుంచే సంఘర్షణా, వైరుధ్యం బయలుదేరుతున్నాయి. అందుచేత మీరు ఏం చెయ్యాలి?

సమాధానాన్ని ఇంకొకరి నుంచి ఆశించేందుకు బదులు మనిద్దరం కలిసే కనుక్కుందాం. దాన్ని మీరే పరిశీలించి కనుక్కున్నట్లయితే అది మీరు అనుభవం పొందినట్లవుతుంది. అప్పుడది నిజమైనదవుతుంది, కేవలం నిశ్చయమో, నిర్ణయమో, మాటల్లో చెప్పిన సమాధానమో కాదు.

"అయితే నా సమస్య ఏమిటి?"

ఈ విధంగా అనలేమా? ప్రశ్నకి తక్షణం అనాలోచితంగా మీ మొట్ట మొదటి ప్రతిక్రియ ఏమిటి? పని ముందొస్తుందా? అది కాకపోతే మరేది?

"మీరేం చెప్పబోతున్నారో గ్రహించటం మొదలు పెట్టాను. నా మొట్టమొదటి స్పందన విభ్రాంతి చెందటం. ఇన్ని సంవత్సరాలుగా నేను చేసే పని ఎలా చేస్తున్నానో గ్రహించి నిర్ఘాంతపోయాను. మీరన్నట్లు, ఉన్నదాన్ని ఎదురుగా చూడటం ఇదే మొదటిసారి. అది చాలా సంతోషకరంగా లేదని మాత్రం గట్టిగా చెప్పగలను. ఇంకా ముందుకు పోగలిగితే బహుశా ఏది ముఖ్యమో గ్రహించగలుగుతానేమో. అప్పుడు సహజంగా తరవాత పని జరుగుతుంది. కాని పని ముఖ్యమా, ఇంకోటేదైనా ముఖ్యమా అన్నది మాత్రం నాకింకా స్పష్టం కావటం లేదు."

ఎందుకు స్పష్టం కావటం లేదు? స్పష్టం కావటానికి సహాయం కావాలా, లేక గ్రహించటానికి ఇష్టపడటం కావాలా? గ్రహించకుండా ఉండాలనే కోరిక క్రమంగా కొంతకాలానికి మాయమై పోతుందా? మీకు స్పష్టం కాకపోవటానికి కారణం మీరు యథార్థాన్ని గ్రహించటానికి ఇష్టపడటం లేదన్నది ప్రాథమిక సత్యం కాదా? స్పష్టం కావటం మీకు ఎందుకు ఇష్టం లేదంటే, అది మీ దైనందిన జీవనవిధానాన్నే తలక్రిందులు చేస్తుందని. మీరు ఇచ్ఛా పూర్వకంగానే ముందుకి నెట్టుతున్నారని తెలుసుకుంటే మీకు వెంటనే స్పష్టం అవదూ? ఇలా తప్పించుకోవటం వల్లనే గందరగోళం ఏర్పడుతుంది.

"ఇప్పుడంతా స్పష్టమవుతోంది నాకు. నేనేం చెయ్యాలన్నది అప్రస్తుతం. బహుశా నేను చేసే పనినే ఇంకా చెయ్యవచ్చు, కాని పూర్తిగా వేరే దృష్టితో చూద్దాం."

★ ★ ★